సరస్వతీ గ్రంథమండలి :

# వ్యాసరత్నావళి

(భాషావిషయక, సారస్వత వ్యాసములు)


శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రి





పబ్లిషర్సు : అద్దేపల్లి అండ్ కో

సరస్వతీ పవర్ ప్రెస్

రాజమహేంద్రవరము

# VYĀSA RATNĀVALI

(Essays on Telugu Language and Literature)

by

MALLADI SURYANARAYANA SASTRY

First Edition - August 1963 - Price Rs. 8-00





Publishers: ADDEPALLY & Co

SARASWATHI POWER PRESS

RAJAHMUNDRY (A. P.) India

## ప్రకాశక విజ్ఞప్తి

ఆధునిక పండిత కవులలో శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారి పేరు సుప్రసిద్ధమైనది. ఆయన ఆంధ్రభవిష్యపురాణాది పద్యగ్రంథములు, లౌకిక వాఙ్మయ చరిత్రాది వాఙ్మయ గ్రంథములు, దశరూపకా ద్యలంకార గ్రంథములు, పెక్కులు రచించి పేరుగన్న వారు. చిరకాలము ప్రభుత్వకళాశాలలో పండితస్థానము నలంకరించుటయే కాక, ఆంధ్ర విశ్వవిద్యాలయమున పండితులై బహుశిష్యులను తీర్చిదిద్దిన ఆచార్యులు.

శ్రీ సూర్యనారాయణశాస్త్రిగారు ఆంధ్రపత్రిక, ఆంధ్ర శిల్పి, ఇంద్రావతి, తరణి, భారతి, రెడ్డిరాణి, షష్టిపూర్తి సంచిక మున్నగు పత్రికలలో ప్రకటించిన వ్యాసములు బహు సంఖ్యాకముగా నున్నవి. ఇందు భాషావిషయకములు, సారస్వత విషయకములు నగు వ్యాసము లున్నవి. ఆంధ్రభాషను గూర్చి, ఆంధ్రభాషా ప్రాచీన స్వరూపమును గూర్చి, భాషా సంప్రదాయమును గూర్చి శ్రీ శాస్త్రి గారు సువిపులముగా ననేక విషయము లీవ్యాసములలో జర్చించి

యున్నారు. ప్రసిద్ధ సంస్కృత నాటకములగు అభిజ్ఞాన శాకుంతలము, ఉత్తరరామ చరితము, స్వప్నవాసవదత్తములపై సుదీర్ఘ విమర్శనములు చేసియున్నారు. మఱియు, నాటకము - శిల్పము - మంత్రశక్తి - వివాహము - హిందూమతము - ధర్మము - మున్నగు బహు విషయములపై శాస్త్రిగారు కూలంకషముగా చర్చించిన వ్యాసములిందు ప్రచురింపబడినవి. ఈ వ్యాసములు ప్రథమమున ప్రచురించిన పత్రికలకు కృతజ్ఞత తెలుపుకొనుచున్నాము.

ఈ వ్యాసరత్నావళిని తెలుగు పాఠకలోకము ఆదరింపగలదని ఆశించుచున్నాము.

రాజమహేంద్రవరము<br>
శోభకృత్ శ్రావణ<br>
శు॥ ౧౧ శి గురువారం

ప్రకాశకులు<br>
1 ఆగష్టు 1963

# వ్యాసానుక్రమణిక

## ప్రథమ భాగము

### భాషావిషయక వ్యాసములు :



### కావ్య జిజ్ఞాస



## ద్వితీయ భాగము

### సారస్వత వ్యాసములు

# వ్యాసరత్నావళి

ప్రథమ భాగము

## భాషావిషయక వ్యాసములు

## కావ్యజిజ్ఞాస

ద్వితీయ భాగము

## సారస్వత వ్యాసములు

# వాగ్దేవీ స్తుతి

శ్రీరాజరాజ నరేంద్రు మందిరమున
        నఖిలాంగ సౌష్ఠవం బలరఁ బెరిఁగి,
మన్మసిద్ధి మహీశు మణిసౌధములయందు
        భాగ్యభోగ్యంబులఁ బరిఢవిల్లి,
దక్షిణాధీశు ముత్యాల మండపమునఁ
        గనకాభిషేక యోగంబు గాంచి.
శ్రీకృష్ణరాయలసిరిఁ గూడి పల్లకీ
        లేనుంగు లెక్కి యూరేగి మెఱసి,
పేర్మి నంద్యాల కృష్ణభూవిభుని నగర
ధగధగాయిత నూతన తారహార
మఱుత ధరియించి విబుధలోకార్చ లందు
నాంధ్రవాగ్దేవి యైశ్వర్య మభినుతింతు.

రామాయణంబు పారాయణంబును
        వీనులారంగ నాసక్తి నాలకించి,
హరివంశ ముత్తరహరివంశ మిరుగేల
        నాసతోఁ గొని కన్నులారఁ గాంచి
భాగవతంబునా భవ్యదివ్యఫలంబు
        హాయిగా మనసార నారగించి,
కాళహస్తీశ్వరు ఘనత నాకర్ణించి
        వసుపాండురంగాదివార్త లెంచి
భద్ర గౌరన శంకరప్రముఖులొసఁగు
పూజలంగొని, మూర్కొని వైజయంతి,
విజయలీలలు చూచుచు వేడ్కమీఱు
నాంధ్రవాగ్దేవి వైభవ మభినుతింతు.

# ఆంధ్రభాష

"దృష్టంకి మపి లోకేఽస్మి న్ననిర్దోషం ననిర్గుణం,
ఆవృణుధ్వమతో దోషాన్ వివృణుధ్వంగుణాన్ బుధాః"

* "భాషవ్యక్తాయాంవాచి" యను భాషధాత్వర్థము చేతను, "భాష్యతఇతి" యను వ్యుత్పత్తిచేతను లోకముచే నుచ్చరింపబడుచున్న స్పష్టోచ్చారణముగల శబ్దజాలమునకే భాషయని పేరు వచ్చినట్లు తెలియుచున్నది. అనఁగా నొకరి అభిప్రాయ మింకొకరికిఁ దెలియుటకై జనసంఘ మేర్పఱుచుకొనిన వాగ్రూపములైన గుర్తులే భాష యని చెప్పవచ్చును. మొట్టమొదట వాగ్రూపముగా నుండుటయుఁ గాలక్రమమున లేఖ్యాకృతి నొందుటయు భాషకు స్వాభావికము. ఇట్టి భాష యొక్కొక్క దేశంబున నొక్కొక్క విధముగా నుండుటచే దానికాయా దేశనామము వచ్చినదనుట యెల్లరకును దెల్లమే! అట్లే ఆంధ్రులకు నివాసమై యాంధ్రమైన మన దేశమందు వ్యవహరింపఁబడు భాష కాంధ్రభాష యనుపేరు వచ్చినది. దీనికిఁ ద్రిలింగదేశ వ్యవహార సిద్ధంబగు దేశ్యము మూలముగానున్నను దద్భవాత్మకమగు సంస్కృత భాషాసాహాయ్యమును జెంది యున్నతస్థితికి వచ్చుటచే నీభాషకు వికృతియని పేరుగలిగినది. ఎల్ల హిందూదేశ భాషలకు నందును ద్రావిడ భాషలకును భరతఖండము చేసికొన్న యనంత పుణ్యరాశియో యనఁదగు సంస్కృతభాష స్వహస్తపరహస్తముల బెంచిన తల్లియగుననుట సర్వవిదితమైన స్వభావోక్తియే కాని, యతిశయోక్తిగాదు. కావుననే మనభాష తల్లివలెనే సత్కావ్య సంతానమును గని "దేశభాషలందుఁ దెలుగు లెస్స" యను మహారాజోక్తికి నిలయమై యఖండయశస్సు గాంచుచున్నది. దీని కంతకును

* ఇది పరిధావి సంవత్సరమునఁ జెన్నపురిలో జరిగిన యాంధ్రసాహిత్య పరిషత్ప్రథమ వార్షిక సభలోఁ జదువఁబడిన వ్యాసము.

గారణము సంస్కృతమే స్వభాషగాఁ గలిగి తత్కావ్యరత్నసంప దతో వెడలివచ్చిన యార్యు లీదేశమున నతిప్రాచీనకాలము క్రిందటనే స్థిరముపడుటయని వేఱుగాఁ జెప్పనక్కఱలేదు. ఆర్యు లీదేశమునకు రాకము న్నీభాషలో నిపుడు తద్భవములుగాఁ జేరి వ్యవహరింపఁబడు చున్న "మట్టి, గోడ, కత్తి, గొడ్డలి, కంబము, బల్ల, దివ్వె, కుండ, కడవ, అద్దము, ప్రొద్దు, తాడు, ఈత, పాలు, పువ్వు, పండు, మేఁక, కాకి" యనునివి మొదలుగా నిత్య వ్యవహారములో నుండఁ దగిన యనేక శబ్దంబులకు సమానార్థకంబులగు దేశ్యపదంబు లీదేశ భాషలో నున్నట్లే కనఁబడవు. మఱియు నొక్క పదార్థమును దెలుపు పద మొక్కటియే యుండుటయు నట్టివాని యర్థములనే తెలుపు తద్భవ పదములు చేరినవెనుకఁగూడ వానియర్థము నెఱుంగఁ జాలని యప్పటి వారిచే నాతద్భవదేశ్యములు రెండును గలిసి యొక్క యర్థమునందే నిరర్థకముగా "అగ్గినిప్పు, బట్టగుడ్డ, కట్టెపుల్లలు, కడముంత, బల్ల చెక్క" అను నివ్విధముగా నిప్పటికి నట్లే హీనజాతుల వ్యవహరింపఁ బడుటయుఁ దుదకు స్త్రీ పురుష సామాన్యవాచకమగు మనుష్య శబ్ద మునకు నింద్యగ్రామ్య రూపముగా "మనిషి" యను పదము చేరు వఱకు నిం దట్టిపదమే కనపడకుండుటయుఁ జూడఁగా నిపుడు దేశ్యమని మనము వ్యవహరించుకొనుచున్న భాషలోఁగూడ మనము స్థూల బుద్ధితో గ్రహించుటకు వలను పడకుండఁగా మాఱిపోయిన తద్భవ పదములే యధికముగా నుండుననియు, నట్టి యీభాష మొదట గ్రాంథికస్థితిలోనికి రాఁదగిన స్వతంత్రభాషగాక యార్యుల యవలంబ నంబువలననే క్రమముగా వృద్ధిలోనికివచ్చి గ్రాంథికావస్థను జెందిన దనియు, మనము గ్రహింపవచ్చును.

ఏ భాషయైనను వ్యావహారిక దశనుండి గ్రాంథికావస్థకు వచ్చు నపుడు తొలుఁదొల్త బద్యకావ్య రూపముగా బయలు వెడలుట నైజము. దీనినే భాషకు ఛందోలక్షణ స్థితి యందురు. ఇది యథేచ్ఛ

సంభాషణ లేఖనంబులకు సరిపడక, నియమబద్ధంబై సర్వజన సామాన్యంబుగాక సంపూర్ణ లౌకికజ్ఞానంబుగల యతి ప్రతిభావంతుల వాక్కులకు వశ్యమై విలసిల్లును.; ఇదియే వ్యావహారిక భాషనుండి గ్రాంథిక భాష వేఱగుటకుఁ గారణము. మనభాష నిట్టి స్థితికిఁ దెచ్చుటలో నంతకుమున్ను గొందఱు కవులు లేకపోలేదు గాని మొత్తము మీఁద నన్నయభట్టారకుఁడే మార్గదర్శకుఁడగు మహర్షి యని చెప్పవచ్చును. ఏ మహామహుఁ డాంధ్రభాషా మహాసౌధంబున కనశ్వరంబును, నసదృశంబును, బలవత్తరంబును నగు భారతరూపంబైన పునాది వేసెనో, యప్రతిహతంబుగ వేఁగి దేశంబునేలిన సకలైశ్వర్య సంపన్నుఁడగు రాజరాజనరేంద్రుఁ డెవ్వని వాక్కులకు వశ్యుఁడై యాంధ్రభాషా పోషకుఁడను యశఃకాయంబున నిప్పటికిని జీవించి యుండెనో యట్టి విపుల శబ్దశాసనుఁడే యాంధ్రకవితకుఁ గన్నతండ్రియని చెప్పనొప్పును. ఈ ప్రసంగంబున సత్కవికృత్యంబు నిక్రింది కల్హాణ పండిత వాక్యంబులచేఁ గొంచెము ప్రశంసించి ప్రకృత మనుసరింతము.

1. "కోఽన్యః కాలమతిక్రాంతం నేతుం ప్రత్యక్షతాం క్షమః ।
కవిప్రజాపతీన్ త్యక్త్వా రమ్యనిర్మాణశాలినః ॥

2. భుజవనతరుచ్ఛాయాం యేషాం నిషేవ్య మహౌజసాం
జలధిరశనా మేదిన్యాసీ దసావకుతోభయా
స్మృతిమపి న తే యాంతి క్ష్మాపా వినా యదనుగ్రహం
ప్రకృతిమహతే కుర్మస్తస్మై నమః కవికర్మణే ॥

3 యేఽవ్యాసన్ద్విభకుంభశాయితపదా యేఽపిశ్రియం లేభిరే
యేషామప్యవసన్పురా యువతయో గేహేష్వహశ్చంద్రికాః ।
తాన్ లోకోఽయమవైతి లోకతిలకాన్ స్వప్నేఽప్యజాతానివ
భ్రాత స్సత్కవికృత్య! కిం స్తుతిశతై రంధం జగత్త్వాం వినా ॥

(అర్థసంగ్రహము) రమ్యనిర్మాణ సమర్థులగు కవి బ్రహ్మలుగా యతిక్ర

మించిన కాలంబును దృష్టిగోచరంబుఁ గావింప నెవ్వఁడు సమర్థుఁడగును? దేని యనుగ్రహంబు లేక యభయప్రదబుగాఁ జతురబ్ధిపరీత మహీతలంబు నేలిన చక్రవర్తులుగూడ స్మరణకు రాఁజాలరో యట్టి కవికృత్యమునకు నమస్కరించెదను. ఓయన్నా, సత్కవికృత్యమా! నీయనుగ్రహంబు లేని కారణంబున సకలైశ్వర్యముల ననుభవించిన వారేమైనను, ననేక పూర్వరాజులు పుట్టిన ట్లే లోకమునకుఁ దెలియకుండఁగఁ బోయిరి. నిన్నేమని నుతింతును? నీవు లేనిచో జగమంతయు నంధప్రాయం బగును.

ఈషద్వైషమ్యముగా మూఁడువంతుల తత్సమపదంబులును, ఒకవంతు తద్భవ దేశ్యపదంబులునుగల యీనన్నపార్యుని కవిత్వముంబట్టి చూడఁగా నంతకుఁ బూర్వము చిరకాలము క్రిందట నుండియే సంస్కృత భాషతో మనభాషకు నిరంతర సంబంధము గలిగియున్నట్లును, అదియే కావ్యనిర్మాణంబున, నుభయభాషాభిజ్ఞులఁ బ్రోత్సాహ పఱచినట్లును దెలియుచున్నది. కావునసే ౬ వర్ణంబుల మాత్రము దానధికమయ్యెను, ౩౧ వర్ణంబుల సంస్కృతంబును సరిగాఁబోలి, ౧౯ వర్ణంబులను దానినుండి తెచ్చికొని, సంపూర్ణతం జెందిన యాంధ్రభాష, వర్ణసమామ్నాయంబున దానితో నేకీభవించిన ట్లే యెల్లవిధంబుల ఛందోవ్యాకరణ లక్షణంబులను, సకలకావ్యాలంకార లక్షణంబులను, దాని ననుకరించి, కావ్యస్థితికివచ్చి శ్రావ్యమై, సరసమై, మనోహరమై, విశ్రాంతిఁ జెందియున్న తల్లిని, నిరంతరము స్మరింపఁజేయుచు, ౧౧ వ శతాబ్దము మొదలుగా నేఁటివఱకును లోకవిఖ్యాతి గాంచుచున్నది. ఈవిషయంబునఁ దత్సమ సంబంధము చేతనే యీభాష కావ్యస్థితికి వచ్చిన దననేల? అచ్చ తెలుఁగు కబ్బములు మాత్రములేవా?” యని యాక్షేపము రావచ్చునుగాని, యాతత్సమ గ్రంథములకుఁ బూర్వ మాచ్ఛికకావ్యములే కనరాకపోవుటయు, ౧౬ వ శతాబ్దము మధ్య భాగములోని పొన్నిగంటి తెలగన్న రచించిన యయాతి చరిత్రము

మొదలుగాఁ దరువాత వెడలిన యల్ప సంఖ్యాకంబులైనను దద్భవ సాహాయ్యము నొందినవిగా నుండుటయు నా రెండుమూఁడైనను సర్వ జన సమ్మతంబులై విఖ్యాతిం గాంచకుండుటయుఁజూడఁ దప్పక దత్సమ సంబంధముచేతనే యిది సరసకావ్యస్థితికి వచ్చినదనుట విశ్వాసపాత్రము గాకపోదు. ఇందులకుఁ గృష్ణదేవరాయల కాలమందలి మాదయ గారిమల్లన్న రాజశేఖర చరిత్రంబునఁ జెప్పిన యీ క్రింది పద్యము ప్రబలాధారముగాఁ గలదు.

"సరససంస్కృతపుష్పగుచ్ఛప్రభూత
మగు తెనుంగను నెత్తావిక ఖిల దిశలఁ
దరువమాన సుకవిత్రయవిశేష
చతురవాచానిరూఢి కంజలిమొనర్తు॥

## పద్య కవిత్వము

ఇందు, మనభాష గీర్వాణభాషాసామ్యమును బుడికి పుచ్చుకొనెనని యెల్లరకును దెలియును. అపారంబగు సంస్కృత వాఙ్మయంబున దశ కుమార చరితాదులు నాలుగైదు వచన కావ్యములు దక్కఁ దక్కిన వెల్లఁ బద్యకావ్యంబులే యగుటచే వానిం జదివియుఁ, గనియు, వినియు, నాంధ్రీకరింప, ననుకరింపఁబూనిన పూర్వకవులందఱు, పద్య కవిత్వము, కల్పనాచాతుర్యమున కనువుగా నుండుననియో, చదువ నింపుగా వినసొంపుగా నుండుననియో తమ్ముఁ బోషించువారి యను మతినో, గతానుగతికన్యాయంబుగఁ బద్యకావ్యసాగరముం దుదముట్టఁ జూచిరి గాని, గద్యకావ్యరచనకుఁ గడంగరైరి. మఱియు దండికవికృత దశకుమార చరితంబును, విష్ణుశర్మకృత పంచతంత్రంబును, దెలిఁగింపఁ బూనిన కేతననారాయణకవులు గూడ వానిని బద్యములుగా మార్చిరి గాని సరిగా నాంధ్రీకరింపరైరి. ఇంతయేల? సర్వజనోప యోగముగా సులభవచనముగాఁ దెల్గున వ్రాయఁదగిన, ధర్మశాస్త్రము, గణితశాస్త్రము, కావ్యలక్షణాదులు, నిఘంటువులును, గూడ సంస్కృ

తానుసరణముగాఁ బద్యకావ్యములుగానే రచింపఁబడుటయు దిక్కన మొదలగు కొందఱు నిర్వచనముగానే కావ్యములు వ్రాయుటయుఁ జూడ మన పూర్వకవులకుఁ బద్యకవిత్వమన్న నెంత ప్రీతియో గద్య కవిత్వమన్న నంత యరుచి యని తెల్లమగుచున్నది.

ఈ పద్యకవిత్వము మొదట నాంధ్రీకరణమై, పిదప సంస్కృతీకరణమై, తరువాత ననుకరణమై, తుదకు స్వకపోలకల్పనంబై, క్రమక్రమంబుగ నభ్యున్నతస్థితికి వచ్చిన ట్లాయామహాకవుల కావ్యపరంపరయే చాటు చున్నది - ఇందు :—

ఆంధ్రీకరణము : "మక్కీమక్కీ" యట్లుండక, సంస్కృత సమంబు గాఁ దెలిఁగించినచోఁ బునరుక్త్యాది దోషంబులను, గథాంశంబున కభ్యంతరంబు గలిగించు విస్తృతవర్ణనంబులను, జనరంజకంబుగానుండ దని, మూలకథనుమాత్ర మతిక్రమింపక స్వేచ్ఛగా భారతంబున దెలిఁగించిన కవిత్రయము మార్గమునే యనుసరించి తరువాతి కవుల రామాయణ మార్కండేయ పురాణ విష్ణుపురాణ, వరాహపురాణ హరివంశ భాగవతాదులయందుఁ బ్రశస్తిని గాంచినది. ఈవిషయంబునఁ గవిత్రయము తరువాత నాంధ్రీకరణ మందేమి స్వకపోలకల్పనమందేమి నిరంకుశుండై పెక్కు గ్రంథముల రచియించి రాయలయొద్దఁ గవిసార్వ భౌమ బిరుదంబు గాంచి వేంకటగిరి మహీపాలకుఁడగు సింగభూపాలు నాదరంబు వడసి నిరుపమాన యశస్సును గాంచిన వాఁడును, పెద్దనా దుల ప్రబంధ నిర్మాణంబునకు రాచబాట వేసిన సుకవితా శైలి గలవాఁడు నగు శ్రీనాథుఁ డెంతయు లోకంబునకు వంద్యుఁడని నమ్మఁ దగును. ఈతని శైలి తరువాతి కవులకు సరిగా ననుకరింప నసాధ్య మైనది గాని లేకున్న నైషధముఁబోలిన తక్కిన సంస్కృత మహా కావ్యములఁ దెలిఁగింపఁ బూనినచో నాంధ్రభాష మహాభాగ్య మింకను వర్ణింపనగునా ?

విపులీకరణము: అనఁగా సుప్రసిద్ధ పురాణములలోని కథను గ్రహించి దానిని సరసకల్పనంబున నలంకరించి వ్రాయుట. ఈ కృత్యంబునకుఁ గడఁగిన వారిలో నాంధ్రకవితా పితామహుఁడగు పెద్దనార్యుఁడే మొదటివాఁడని విశ్వసింపవచ్చును. ఇందుల కీతనికి మున్ను మనుచరిత్రఁబోలిన ప్రబంధములు నిర్మించినవారు లేకుండుటయు, నీతని తరువాతివా రీతని ధోరణినే యనుసరించి యనేక ప్రబంధములు రచించుటయు నిదర్శనములుగాఁ గలవు. స్వభావవర్ణనమం దధికచాతుర్యముగల యీతని సత్కవిత్వము లోకమున కెంత మూలధనముగా నున్నదో వేఱుగాఁ జెప్పనక్కఱలేదు. ఈ యంశంబున నీమార్గంబునకు గ్రొత్తవన్నె దెచ్చి సరసకల్పనంబులను, రమ్యవర్ణనంబులను శృంగార వైరాగ్యంబు లొక్కవిధముగా మనస్సునకు నాటునట్లు కవికర్ణరసాయనంబు రచించిన సంకుసాల నృసింహకవి ప్రబంధ కవితా పోషకుఁడని చెప్పవచ్చును.

అనుకరణము: [illegible]ను మనుచరిత్ర ననుకరించి వసుచరిత్ర వ్రాసిన రామరాజభూష[illegible] ఘనుఁడు. ఇతఁడు సరసశ్లేషయమకాది శబ్దాలంకారంబులను, బ[illegible]కాచిత్స్వరసౌచిత్యంబులను, నసమానంబగు కవిత్వము చెప్పి యసంఖ్య[illegible]క[illegible]లకుఁ గల్పనావర్ణనాతిశయ మార్గము చూపినవాఁడు. [illegible]నువసుచరిత్రలనే యనుకరించి వ్రాయఁబూనిన శక్తిన క[illegible]లె[illegible]ని మించి యధికంబుగాఁ దమ కావ్యంబులఁ బురవర్ణనాది[illegible] పర్వావయవ వర్ణనంబులను జంద్ర కందర్పాద్యుపాలంభనము[illegible] [illegible]పలంభశృంగారమును నతిశయోత్ప్రేక్షాద్యలంకార ప్రధా[illegible] [illegible]న్నంట వర్ణించుచు వచ్చిరి. ఇక్కారణంబుననే పూర్వకావ్య[illegible] వివిధత్వము లేకపోవుటయు, విసుఁగు పుట్టునట్లుగా శృం[illegible]మే ప్రధానంబుగా నుండుటయు, స్వభావవర్ణనమంతరించుట[illegible] [illegible] లోపములు తటస్థించినవని మనము తలంచుచుంటిమి. [illegible], దారాశశాంకవిజయము మొదలుగాఁగల

నాలుగైదు ప్రబంధములలో మాత్రము శృంగారరసము కొంచె మధిక ముగా వర్ణింపఁబడినదిగాని, మిగిలిన గ్రంథములలో నది యంతగా మితిమీఱి లేదనియు, నాశృంగార భాగంబులలోనే యందం దుపయోగింపఁబడిన—

1. "కలంచునే సతుల మాయల్ ధీరచిత్తంబులన్ మనుచరిత్రము.
2. జ్ఞాతిశ్చే దనలేన కిమ్మనెడి వాచారూఢి సత్యంబుగన్ వసుచరిత్రము.
3. రాజై పుట్టుట రక్షిమాత్ర ఫలమే రాజౌట దోషార్థమే వసుచరిత్రము
4. ఉద్ధతుల మధ్యమునఁ బేద కుండఁదరమె. కవికర్ణ.
5. క్షితినిటుగాదె యొక్కొకనికిన్ నడుమంత్రపుఁ గల్మిగల్గినన్. విజయ
6. ఎక్కడిసత్య మేడ వల పెక్కడి నేమము వారకాంతలకున్. వైజ.
7. మొదల రోయింతులకు రొక్క ముడుపుఁగాక
నీసదాచార మేలయ్య దాసరయ్య ? వైజయ.
8. పతికిఁ గీడౌట బంట్ల పాపంబుగాదె ? —— —— పాండురంగ.
9. నిందల్ సేయఁగానేల ? నా ! తనువే నిత్యము
ప్రాణమేమి ధ్రువమే ? తర్కింపుఁడీ యీదెసన్. సాంబోపా.
10. పేరలుకం జెందిన యట్టికాంత లుచితవ్యాపారముల్ నేర్తురే.
పారి.
11. కలుగదుగదా ? వివేకంబు కాముకులకు. పురూరవశ్చరిత్ర.
12. చక్కఁదనమె గుణంబుగా సంస్మరించుఁ
గాని, వ్యభిచారదోషంబు గాంచఁడయ్యె
నజ్ఞుడనఁ బ్రాజ్ఞుడన నెవ్వఁ డవని నింక ? పురూరవశ్చరిత్ర.
13. పృథివి నధర్మికెన్నఁ బరపీడయె యుత్తమ లాభమెప్పుడున్
14. "నహి మాయావినా మసంభావ్య మస్తి" యఁటం
చున్ బుధులాడుమాట మదిఁ జింతింపంగ బాంకేలగున్. ప్రభావతీ.

అను నివి మొదలుగా నసంఖ్యాకంబులగు నర్థాంతరన్యాసంబులు, లోకోక్తులు, స్వభావోక్తులును, లోకానుభవంబును, నీతినిబోధించుచు

నాయాగ్రంథముల రత్నములవలెఁ బ్రకాశించుచున్నవనియు మనకుఁ దెలియకపోలేదు. పైఁజెప్పిన తారాశశాంకవిజయాదులుగూడ ౧౭వ శతాబ్దము పూర్వమందున్న శ్రీకృష్ణ రామచంద్రాది కవులు, సంస్కృతమున రచించిన తారాశశాంక రసికజనరంజనాదుల పరిపూర్ణ విపులీకరణంబులే యైనను శృంగార రసవిషయంబున మనభాష సంస్కృతభాషను మించినట్లున్నదని చెప్పవచ్చును. ఎట్లైనను సమగ్రముగా నెల్లజాతులయందు, విద్యయంకురింపక, దేశమనాగరికతం జెందియున్న యక్కాలంబున, భాషాజ్ఞానంబుగల బ్రాహ్మణజాతిలోఁ జాలమంది వేదవేదాంగప్రియులై కలిమిలేములఁ బాటింపక ప్రపంచముతో నిమిత్తములేక "పంచమేఽహని షష్ఠేవా శాకంపచతి స్వేగృహే" యనునట్లు జీవించుచు నాముష్మికపరాయణులై సంస్కృతభాషా మత గ్రంథములతోనే కాలము వెళ్లబుచ్చినవారగుటచేతను, నైహలౌకికపరాయణులగు కొందఱు మాత్రమే సంస్కృత సహాయంబున నాంధ్రభాషాభివృద్ధికై పాటుపడినవారగుటచేతను, వారైనను దఱచుగా నుదరపోషణార్థమై కేవల భోగపరాయణులగు భూస్వాములను, ధనాఢ్యులను నాశ్రయించి జీవింపఁ దగిన వారగుటచేతను నట్టివారి చిత్తములను రంజింపఁ జేయుటకై కొందఱును, వారినిఁ జూచి యింకఁ గొందఱు నివ్విధముగాఁ బ్రకృతి జ్ఞానంబునకై పాటుపడక, యందఱు నొక్కవిధముగా శృంగారరస ప్రబంధములనే క్రమముగా రచించుచు వచ్చిరి గాని, యప్పటి దేశకాలపాత్రముల పరిస్థితులను, యదార్థ తత్త్వంబును, లోకజ్ఞానమును బోధించు వివిధ విషయక గ్రంథములను, రచింపఁ బ్రయత్నింపరైరి యనియు దీనికంతకును కారణము దేశముయొక్క యనాగరకతయే యనియు నూహింపవచ్చును. దేశ మట్టి స్థితిలో నుండుట చేతనే మన భాషయెన్ని శతాబ్దంబులకైన గద్య స్థితిలోనికి రాకపోవుటయు, నట్లది రాకపోవుటచేతనే, దేశోపయోగంబులై స్వభావసిద్ధంబులగు వివిధ

విషయములను దెలుపు చక్కని గ్రంథములు జనింపకుండుటయు నను నన్యోన్యాశ్రయ దోషంబున దేశంబును భాషయుఁగూడ నొక్క విధముగానే చిరకాలము మునుఁగుచుఁ దేలుచుఁ వచ్చినవి. ఏమైనఁ గానిండు. ఆకావ్యంబు లన్నియు నాధునికుల సాహిత్యసంపదలకు రత్నపేటికలై తాదృశగ్రంథంబు లింక భాషలోఁ బుట్టఁబో వను నంతటి చక్కని శైలిలో మాత్ర మున్నవని సంతసింప వచ్చును.

స్వకపోలకల్పనము. "జగమెఱిఁగిన బ్రాహ్మణునకు జందెం బేలా?" యనున ట్లతిప్రతిభాసాధ్యంబై సుకవితానికషోపలంబగు నిమ్మహాకార్యంబునకు ముందుగా నడుము గట్టుకొనినవాఁడు, ఉభయ కవితా సార్వభౌముఁడగు పింగళి సూరనార్యుఁడని వేఱుగాఁ జెప్ప నక్కరలేదు. అత్యద్భుత కథాసన్నివేశంబగు నీతని కళాపూర్ణోద యము మున్మాఱు చదివినంగాని బుద్ధి గోచరంబు గాదనుటకంటె నీతని కల్పనాచాతుర్యమునుగూర్చి వచింపనక్కఱలేదు. ఈ కావ్యం బునకు సాటియైన దీతని ప్రభావతీప్రద్యుమ్న మేగాని యింకొకండు లేదనుటకంటె నితఁ డాంధ్రవాఙ్మయంబునకుఁ గావించిన మహోప కారమును నుతింపనక్కఱలేదు. ఈతని యీ రెండు కావ్యములతో నన్నయభట్టారకుఁడు, గట్టనారంభించిన యాంధ్రభాషామహాసౌధము, పూ ర్తియైనదని చెప్పుటయు నతిశయోక్తిగాదు. ఎవ్వని సులభకవితా శైలి యనుకరింప నసాధ్యంబై నదయ్యె నర్వాచీనులకుఁ బద్యకవిత్వం బున నాదరంబు గలిగించెనో యాసూరనార్యుఁడు కల్పనావర్ణనా రసంబులఁ ద్రొక్కని త్రోవలేదు. ఇతఁడు తనకావ్యంబుల నుపయో గించిన మనోహరంబులగు లోకోక్తులు న్యాయంబులు నొక్కశతంబు కంటె నధికముగాఁగలవని చెప్పవచ్చును. వానినుండి రుచి చూపు టకు నాలు గైదుదాహరించెదను.—

"వసుధ మానిసిఁబోలు మానిసు [illegible] లేరే?"

"నాదు సంపదకు దిక్కగుచున్ మగమొల్కనీకిఁకన్ । బుట్టునో

యంటిమే నితని పోఁడిమి గంటిమవట్టిగొడ్డు తాకట్టితెఁ
డెంతయున్న."

"నీపల్కున్ మనోవర్తనం। బును నేకంబగునేని నాలుకతుదన్
ముక్కంటి కొమ్మా విలాసిని ? యేనమ్మెద...... .."

"ఘుట్టకుటీ ప్రభాతమనఁగా నిదివో పరికించి చూడఁగన్ .."

"గోముఖ వ్యాఘ్రమున నిట్టివాఁడు సుమ్ము."

"ఎంతుఁ బెరఁటిచెట్టు మందుగాదు."

"ఓడల బండ్లువచ్చు బండ్లోడలవచ్చు."

"వసుధ నెందైనఁ జండాల వాటిలోన, బ్రాహ్మణ గృహంబు
వెదకుట భ్రాంతిగాదె?"

మఱి యి నితని కవిత్వము శిరీషకుసుమపేశలంబుగా నుండుటయే
గాక వ్యర్థాంశంబుల వృథా కాలము పుచ్చక, కథాభాగంబును విస్త
రింపఁజే యునదియై, సద్భావగర్భితంబై మనోహరంబుగా నుండును.
ఇట్లీతని పద్యకవిత్వమత్యున్నతస్థితికి రాఁగా నీతని తరువాతి కవు
లీతని వంటి వారనుగల పూర్వుల గ్రంథములనే యథాసంభవముగా
ననుకరించుచు ౧౫ వ శతకము మధ్యభాగమువఱకు నుత్తమ కావ్య
ములనే రచించుచు వచ్చిరి; గాని మున్ను చెప్పినట్లుగా వైవిధ్య
మును మార్గము చూపరైరి. ఎట్లైన నివ్విధంబుగాఁ జతుర్విధంబుగా
విజృంభించు పద్యకవిత్వము సకలరసంబులకు, నలంకారంబులకును,
సంపూర్ణ కాలంబునకును, ఛందోవ్యాకరణ జ్ఞానంబునకును, నీతికిని
నాకరంబై యాంధ్రలోకంబు నుద్ధరింపఁజేయుచున్న దనుటలో
సందేహము లేదు.

## పూర్వ కవిత వ్యాప్తి

ఉపరి సారస్వతమును బట్టిచూడఁగా, ౧౧ వ శతాబ్ది మొదలు
లుగాఁ ౧౫ శతాబ్ది తుదవఱకునుగల 5 శతాబ్దములలోను భార

తము మొదలుగాఁ బురాణములును, గణిత గ్రంథములును, ఛందో
వ్యాకరణ గ్రంథములును, నలంకార కావ్యంబులును, సాహిత్యప్రబం
ధములను గలిసి 22 ను, కవులు రచించినవి 35 కంటె నధికముగాఁ
గనఁబడకుండుటచే నపు డాంధ్రభాష మిక్కిలి బాల్యదశలో నున్న
దని తెలియుచున్నది. దీనిం బట్టిచూడఁగా నూటేసి యేండ్ల కేడేసి
గ్రంథముల చొప్పున గిట్టిన యాకాలంబున మనదేశమందు విద్యాభి
వృద్ధియు, నాగరకతయు నెట్లుండునో వేఱుగా నాలోచింప నక్కఱ
లేదు. పిదప ౧౫ మొదలుగా ౧౬ తుద వఱకునుగల రెండు శతాబ్ద
ముల యందును నాంధ్రభాషాపోషకుఁడును, బ్రజాపాలకుఁడును నగు
శ్రీకృష్ణదేవరాయల కాలము మొదలుగాఁ గొంచె మెచ్చు తక్కువగా
౮౦ మంది కవులు రచించిన ప్రబంధములు నూటికంటె నధికముగా
నున్నవి. ఇదియే భాషకు వర్ధమానదశ. ఈ దశలో వెడలిన కృతులే
భాషకుఁ బుష్టిని గలిగించి యిప్పటికిని లోకంబున నుత్తమ యశస్సు
గాంచుచున్నవి. తరువాత ౧౭ వ శతాబ్దము మొదలుగా ౧౯ వ
శతాబ్దిలోఁ జాలవఱకు సీసడుమనున్న కాలంబున నీషద్వైషమ్య
ముగా ౧౪౦ మంది కవులు ౨౦౦ కంటె నధికముగాఁ బ్రబంధములు
రచించిరి. ఇది భాషయొక్క యౌవనదశ యని చెప్పవచ్చును. కాని
తరువాతఁ గూడఁ బెక్కు కావ్యములు బయలుదేరినను గాళిదాసు
మొదలుగా భవభూతివఱకునుగల మహాకవుల కావ్యనాటకాదులే
యిప్పటికిని గూడ సంస్కృతభాషలోఁ బఠన పాఠన వ్యవహారంబున
నెట్లు ప్రసిద్ధిఁగాంచుచున్నవో యట్లే యాంధ్రభాషలోఁ గూడ,
మున్ను చెప్పినట్టి బాల్యవర్ధమాన దశలలోఁ బుట్టిన కావ్యములే
యిప్పటికిని లోకప్రసిద్ధిని గాంచుచున్నవి గాని యీమూఁడవ దశ
లోని కావ్యములకు మాత్ర మట్టి విశేషవ్యాప్తి రాలేదు. ఆంధ్ర
లోకము చేసికొన్న యభాగ్యమో యన వీనిలోఁ గొన్ని పేరుగూడ
లేకుండఁగఁ బోవుటయుఁ, గొన్ని నామమాత్రావశిష్టంబులగుటయు,

మఱికొన్ని యిప్పటికినిగూడ నముద్రితంబులగుటయు ననులోపములు చాలవఱకు సంప్రాప్తంబులై యున్నను, ప్రకటితంబులై యున్నవాని లోనైనఁ బెక్కు కావ్యములు శైలియందుఁగాని, సారస్యమందుఁగాని, వెనుకటి వానినిఁ బోలకుండుటచేతనే యివి తమకాలంబునఁగాని పిదపఁగాని, ప్రసిద్ధికి రాలేదనియు, నందుచే నీదశలో వెడలినవి భాష కంత పుష్టిని గలిగించునవి గావనియుఁ దలంపవచ్చును. ఎట్లయినను, ఇప్పుడు చెప్పిన యీమూఁడు దశలను బట్టిచూడఁగా నడుమ నడుమ, దేశారిష్టంబులెన్ని సంభవించినను, మన భాష యొకదశకంటె నింకొకఁ దశలోఁ గ్రమక్రమముగా వృద్ధినిబొందుచునే వచ్చినట్లు తెలియవచ్చును. ఇవ్విధముగాఁ బూర్వకవులు దేశభాషను గ్రమముగాఁ బోషించుచు వచ్చిన తరువాతఁ బ్రకృతంబున మనభాష యెట్టి స్థితికి మాఱినదో యాలోచింతము.

## వచన కవిత్వము

భాషయొక్క మూఁడవదశలో, వచన భారతము, వచన రామాయణము, జైమినిభారతవచనము, శ్రీరంగమాహాత్మ్యము, వేదాంత సార సంగ్రహము, హాలాస్య మాహాత్మ్యము మొదలుగాఁ గొన్ని వచనకావ్యములు పుట్టినట్లు తెలియుచున్నది గాని వీనికి నేఁటికిని గూడ లోకమున వ్యాప్తిలేదు. పిదప నీ గద్యరచనమున మొదటి దియు నుత్తమంబు నైన నీతిచంద్రిక పూర్వభాగంబును రచించిన చిన్నయసూరియే యగ్రగణ్యుఁడని మన మెఱుంగుదుము. ఇతఁడు తాను రచించిన బాలవ్యాకరణమునకు లక్ష్యగ్రంథముగాఁ బాఠశాలల లోని విద్యార్థులకు భాషాజ్ఞానము క్రమముగా వృద్ధియగునట్లుగాఁ దన వచనశైలిని గూడఁ బెంచి నీతిచంద్రికలోఁ జాతుర్యముఁ జూపిన పండితుఁడు. తరువాత నీతని శైలినే యనుసరించి మిగిలిన సంధి విగ్రహతంత్రముల రచించియుఁ గొన్ని నాటకంబు లాంధ్రీకరించియు, నాంగ్లేయ గ్రంథముల సులభశైలిని దెలిఁగించియు స్వాయముగాఁ

గొన్ని కల్పించియు, విద్యార్థులకు, స్త్రీలకుఁ గూడ నుపయోగించునట్లు పెక్కు **కావ్యములు** రచించి యాంధ్ర**భాష**కుఁగల వచనలోపమును దీర్ప సమకట్టిన శ్రీ వీరేశలింగముపంతుల వారెంతయు నాంధ్ర లోకంబునకు శ్లాఘ్యులు. మఱియు వీరు రచించిన శాస్త్ర చరిత్ర గ్రంథములకు సహాయముగా విజ్ఞానచంద్రికాగ్రంథమాల నుండి ప్రకృతి, జంతు, రసాయ నారోగ్యాది శాస్త్ర గ్రంథములు వెడలినవై లోకోపకారము గావించుచున్నవి.

## నాటక కవిత్వము

శ్రావ్యములు, పాఠ్యములు, దృశ్యములు, నని కావ్యములు త్రివిధముగా సంస్కృతభాషలోఁ బ్రసిద్ధములై యుండఁగా వాని నాంధ్రీకరింప ననుకరింపఁ బూనిన మన పూర్వులెవ్వరును గాళిదాసాదుల ప్రసిద్ధరూపకంబులఁ దెలిఁగించి కాని, వాని ననుసరించి కల్పించి కాని తెలుఁగులో నాటకములు వ్రాసియుండలేదు. కొందఱు శాకుంతలము, మాలతీమాధవము, చిత్రభారతము మొదలుగాఁగల సంస్కృత నాటకంబుల కథల ననుసరించి పద్యకావ్యములు రచించిరి గాని వానిని నాటకములుగా మార్పనైరి. పోనిండు. ఆ కాలమున సంస్కృతములోఁ గూడ నాటకరచనము లేదేమో యని యాలోచింతమన్నఁ బ్రబోధ చంద్రోదయము, సంకల్ప సూర్యోదయము, ప్రసన్న రాఘవముఁ, జైతన్య చంద్రోదయము మొదలుగాఁగల రూపకములు ౧౨వ శతాబ్దము మొదలుగాఁ దరువాతనే జనించినట్లు కనుపడుచున్నది. "వీ రన్యదేశీయులు. ఆంధ్ర కవులకు సమకాలికులగు నాంధ్రదేశీయ సంస్కృత కవులెవ్వరును, నాటకములు రచింపలేదేమో" యని యూహింతమన్నను, ఆంధ్ర రాజుల సభలకేగుచు నాంధ్రకవుల సహవాసము చేసిన కాంచీనివాసుఁడగు వేంకటాధ్వరి, ప్రద్యుమ్నానంద నాటకమును, ఆంధ్ర దేశస్థుఁడగు వారణాసి ధర్మ

సూరి, నరకాసురవ్యాయోగమును, ఇంకను గొందఱు గొన్ని నాటకంబులను, రచించినట్లు కనుపడుటచే మనకవుల కాలంబునఁ గూడ సంస్కృతనాటకంబులు మన దేశమున, వెడలినట్లే కనుపడు చున్నది. ఇంకనో, మహామహోపాధ్యాయభట్టార బిరుదాంకితుఁడగు నెలకూచి బాలసరస్వతికవి, రాఘవయాదవ పాండవీయమునందుఁ జెప్పికొనిన "కవిసమీహితరంగ కౌముదీనామ నాటకవిధాన ప్రతిష్ఠా ఘనుండ" అనుదానింబట్టి యాతఁడు రంగకౌముదీనాటకము రచించి నట్లు తెలియుచున్నది గాని, దానిశైలి యెట్లున్నదో తెలియుట కొక్క పద్యమైన లోకంబున వ్యాపింపకపోవుట గూడ నాంధ్రభాష యొక్క దుర్దశయే యని తలఁపవచ్చును ఏది యేమైనను బూర్వ కాలమునఁ దెలుఁగులో నాటకములు లేకపోవుటయు ఛందోవ్యాకరణ కావ్యాలంకారంబులకుఁ దెలుఁగులో లక్షణంబులు రచించిన వారి నాటకంబులకు, లక్షణము వ్రాయకుండుటయుఁ జూడ మొన్న మొన్నటివఱకుఁ గూడ మన దేశమున నాటకప్రదర్శన వ్యవహారము గాని, రాజులకుఁ గవులకుఁ బ్రజలకు నాటకములయందు, రుచిగాని, లేదనియు నెక్కడనైనను న్న సేవిజయనగర మహారాజుల వంటివారో సంస్కృతనాటక సమాజమునే క్వాచిత్కముగాఁ గూర్చుచు వచ్చి రనియుఁ దెలియుచున్నది. తరువాత ననఁగా ముప్పది నలువది సంవత్సరముల నుండి హిందీ పార్సి నాటకసంఘములు, దేశమంతట సంచార మొనరించిన పిదప మనవారు సంస్కృతము నుండి తెలిఁ గించియు, పూరాణనాటకంబున ననుకరించియు మన భాషలో నాటక లోపంబును దీర్పఁజొచ్చిరి. అట్టి యీనాటక కవిత్వ మిప్పు డొక్క మాఱుగాఁ దెలుఁగు బాషలో నొక సముద్రము వలెఁ బ్రవహించు చున్నదని చెప్పవచ్చును.

## పత్రికలు — కల్పితకథలు — (Novels)

ఇవ్విధంబుగా శ్రావ్య, పాఠ్య, దృశ్యప్రబంధములతో వృద్ధి నొందుచున్న మన భాష యాంగ్లేయ భాషా సంబంధ విశేషంబునఁ

పత్రికలు, కల్పితకథలు నను నూతనాలంకారములు ధరించి వన్నె కెక్క నారంభించినది. ఈపత్రికలు గ్రామపుర దేశ విషయకంబులగు వార్తలను, సంఘముయొక్క దురాచార సదాచారములను రాజకీయ వ్యవహారములను దెల్పుటయేకాక లోకజ్ఞానదాయకంబులగు వివిధాంశములను భాషావిషయక ప్రసంగములను సులభముగాఁ దెల్పుట కనువగు చక్కని వ్యాసములతో నుండి జ్ఞానాభివృద్ధి నొసంగుచు నాంధ్రలోక మలంకరించు చున్నవి. మఱియు వీనిమూలముగా సర్వజనసామాన్యముగా భాషయం దభిరుచి గలుగుటయు నేదోయొక విషయముంగూర్చి పదిపంక్తులు వ్రాయఁదగు సామర్థ్యము గలుగుటయు నను నుపకారంబులుగూడ లోకమునకు లభించుచున్నవి. పెక్కేల? ఇవి లేని కాలమందలి మన దేశస్థితిని విచారించినచో నిపుడు వీనివలనఁ గలుగు లాభములన్నియు దేటపడఁగలవు. కాని, ఇవి ప్రయత్నంబున నాంగ్లేయ పత్రికల ననుసరించినవే యైనను ప్రకటనంబున మాత్రము వీసమంతైన వానింబోలక పట్టుమని పదిసంవత్సరములైన నడవక, ధైర్యస్థైర్యములు లేక యెన్నో వారపత్రిక మాసపత్రికలడుగంటినవని మన మెఱుఁగుదుము. దీనికి "ఒకరే పని చేసిన నింకొకరుగూడ వేలము వెఱ్ఱిగా నక్కార్యము చేయుటయే మనవారికి స్వాభావికమగుటయుఁ బత్రిక నారంభించు నపుడున్న యావేశము వెంటనే క్రుంగుటయు" నను దోషంబులు గారణంబులుగా నున్నవి వీనిమూలముగా భాషాభివర్ధన సాధనంబులగు పత్రికలకుఁగూడ హాని సంభవించుట యెల్లరు నెఱింగిన యదియే. కావున గార్యనిర్వహణదక్షులగు లేఖకులఁ గూర్చికొని దృఢప్రయత్నంబునఁ బత్రికల కొనసాగింతురనియు, నట్టి పత్రికలను భాషాభిమానులాదరింతురనియు, నిదియే భాషాభివృద్ధికిఁ గారణమనియుఁ దలంచెదను.

కల్పితకథలు:—ఆంగ్లేయ భాషయొక్క సంపర్క విశేషంబున వచ్చిన యీకథారచనము భాషయొక్క వర్ధమానదశ దెలుపుచున్నది.

ఆరంభ దశలోనున్న యివి కాలక్రమమున నాంగ్లేయ కథాపుస్తక ములవలెనే యభివృద్ధిని గాంచఁగలవని యూహింపనగును. సంస్కృతి భాషలో వీనిం బోలినవి కథాఖ్యాయికలను పేరఁ గాదంబరీ వాసవ దత్తాదులు, కనఁబడుచున్నవి గాని, యవి యమానుషంబులగు నద్భుతప్రసంగములఁ దెలుపుచున్నవిగాని నైజముగాలేవు. తెలుఁగులో నిట్టిది పద్యకావ్యమగు కళాపూర్ణోదయము గలదు గాని యదియు నత్యద్భుతంబుగానే యున్నది. ఈకథ లిట్లు జరిగియుండునని తలం చుట కనువుగానుండి, తత్కాలమందలి దురాచార సదాచారములను గథాపాత్రముల మూలముగాఁ దెల్పుచు, నయోగ్యతకు నపజయం బును, యోగ్యతకు జయంబును, సూచించు నభిప్రాయముల ధ్రువపఱ చుచుఁ జదివినకొలఁది నాసక్తిని గలిగించు కథా చమత్కారము గలిగి, యొకసారి చదివి విడువఁదగినట్లుగా నుండక యెన్నిసారులైనఁ జదువ నింపు పుట్టించు కథగలిగి, నీతి బోధకంబుగా, నాతిమృదుకఠి నముగానుండు శైలిగలిగియుండుట యీకల్పిత కథా కావ్యములకు లక్షణమై యుండనోపు. మఱియు నిట్టి కావ్యముల సారస్యము గ్రహిం చుట భాషలోఁ గొంచెము పరిజ్ఞానముగల వారికేగాక విద్యాభ్యాస దశలో నుండు బాలురకుఁగాని పామరులకుఁగాని స్త్రీలకుఁగాని, శక్యముగాదని స్పష్టమగుటచే వీని రచన శైలిగూడ గథాసందర్భ మునుబట్టి యర్థముచేసికొనఁ దగినట్లుగాఁ గ్రమక్రమముగా భాషాజ్ఞాన మభివృద్ధిపరచు శబ్దజాలముతో నిండి యుండవలయును గాని కావ్య మంతయు వెదకిన నూఱు పదముల కంటె నధికముగా లేవనునట్లుగా నుండఁగూడదని తలంచెదను. భాషాగరిమ లేని కావ్యమునకు, స్థైర్యమును గౌరవమును గలుగునా? —

## అధునిక భాషాస్థితి — వ్యాకరణము

రాజావలంబనము లేక యేభాషయు వృద్ధికి రాఁజాలదు. దేశ భాషాపరిజ్ఞాన ముండినంగాని యన్యదేశభాషలలో సంపూర్ణజ్ఞానము

కలుగఁజాలదు. ఇందులకుఁ (దార్కాణముగా) మన దొరతనము వారు మధ్యమోత్తమహూణ పాఠశాలలో నాంగ్లేయభాషతోఁ దుల్యముగాఁ బ్రాధాన్యము గలిగించి యాంధ్రభాష నింతవఱకును గూడఁ బరిపాలించుచు వచ్చిరి. కావుననే భాషయొక్క సారస్యమును లోకమెఱుంగుటయుఁ బూర్వకవుల సత్కావ్యములు గొన్ని లోకమున వ్యాపించుటయు నాధునికులుగూడఁ గొందఱు ప్రోత్సాహము గలిగి గ్రంథములు వ్రాయుటయు నను సల్లక్షణంబులు భాషకు సంభవించినవి.

మున్ను చెప్పినట్లుగా శ్రీరాజరాజనరేంద్రుని కాలమునుండి శ్రీకృష్ణ రాయల కాలము వఱకు నప్పటినుండి కొంతకాలము క్రిందటి వఱకును గూడ మహారాజరాజ సామంతుల యాదరంబు వలననే క్రమ క్రమముగా నభివృద్ధి నొందుచు నిప్పటికి మనభాష కవిసంఖ్యను గ్రంథసంఖ్యను గూడ విశేషముగాఁ గాంచి "దేశభాషలందు దెలుఁగు లెస్స" యను కృష్ణదేవరాయల వచనంబును మిక్కిలి సార్థకముచేయు చున్నదని మనము దెలిసికొంటిమి. ఇందులకుఁ దగినట్లుగా హిందూ దేశము నందలి ముఖ్యభాషలలో నొకటి యగునిది జనసంఖ్యను బట్టి దేశభాషలలో మూఁడవదియై రెండు కోట్లకంటె నధికమగు జన సంఘముచే వ్యవహరింపఁబడుచుఁ బ్రశస్తిని గాంచుచున్న దనియు, మన మెఱుంగుదుము. ఇఁక మున్నున్ను లేని కావ్యరత్నంబుల నిపు డిపుడు సేకరించుకొనుచు, నెల్లలోపంబులఁ దీర్చుకొని మనభాష యింకను, దేశభాషలనెల్ల మించఁదగియున్నదనియు "దండ్రిచే నుపేక్షింపఁబడిన తల్లినిఁ బోషించుట పుత్రుల కర్తవ్యకృత్యమైనట్లు"గా నిట్టిదశలో దొర తనము వారిచేఁ గొంచె ముపేక్షింపఁబడిన మన తల్లిభాషను బోషింపఁ దత్పుత్రులమగు మనకు విధేయకృత్యమనియు మన మెఱుంగ వలయును.

సంస్కృతము మొదలుగాఁ గల యాద్యభాషలవలెఁగాక యెల్ల దేశభాషలును వ్యావహారికమనియు, గ్రాంథికమనియు రెండు తెఱం

గుల నొప్పుచున్నవి. ఈవ్యావహారికము గ్రామ్యమనియు, నీగ్రాంథి
కము దేశ్యమనియు మన భాషలోఁ బూర్వులచే వ్యవహరింపఁబడుచు
నేఁటివఱకు నట్లే వచ్చుచున్నవి. అట్టి యీగ్రామ్యము, శబ్దదూష్యము
నర్థదూష్యమునని రెండువిధంబుల శాస్త్రవిరుద్ధమైనట్లుగా లక్షణ
కర్తలచే నిర్ణయింపఁబడి కావ్యకర్తలచే బరిత్యజింపఁబడి యిప్పటి
వఱకును సంభాషణ వ్యవహారంబుననే యుపయోగింపఁబడు చున్నది.
ఈవ్యవహారమైన నాంధ్రదేశ మంతట నొక్కవిధముగానే యున్న
దేమో చూతమన్న నొక మండలమునందున్న ట్లింకొక మండలము
నందును, నొకజాతియందున్న ట్లింకొక జాతియందు నుండక వేఱు
వేఱుగ నున్నది. ఇంతేకాక యాయామండలంబులకు సమీప
మందున్న యితరదేశముల యందలి పదములతోఁ గలయుచున్న
యీవ్యావహారిక భాషయొక్క మండలములోని వానిమాట లింకొక
మండలములోని దానికిఁ గ్రొత్తయగునట్లుగా నుండి వింతవింత యర్థ
ములను గలిగించుచు హాస్యకరముగా నున్నది. ఇందులకీ క్రిందఁజూపిన
కొన్ని మాట లుదాహరణములు కాఁజాలును. “ఉన్నాది; ఉంది,
ఉండాది; ఆడుపోయేను; నేనుగపో, కాలింది చూసేవా; గుంటున్నాది
జాస్తిగాఉంది. నాబొక్కు వాడు దొబ్బేడు” మొదలగునవి. నీచజాతుల
యందలి గ్రామ్య మింతకంటె వ్రాయుటకే కాక వినుటకుఁగూడ
నసహ్యకరముగా నుండునని మన మెఱిఁగినదియే. ఇంతయేల? సమానార్థ
మిచ్చు, దేశ్యపదములే యొకచోటివారి వింకొకచోటివారికిఁ గ్రొత్తవగు
చున్నవిచూడుఁడు? “(చాలఁ, లావు, సేన, మస్తు” ‘కాని, డబ్బు,
దుడ్డు. బొట్టు” మొదలగునవి. వీనికే పూర్వకావ్యంబులఁ బ్రయోగము
మృగ్యముగా నున్నదన, నింక గ్రామ్యము గతి చెప్పనేల? అపార్థం
బును, నీచార్థంబును, వివిధార్థంబులను, దెల్పు నానావిధంబైన, యీ
వ్యావహారిక భాష నింద్య మగుటచేతనే గ్రామ్యంబైనను దీనిని
బూర్వులు, నింద్యగ్రామ్య మనింద్యగ్రామ్యము నని రెండువిధములుగ

నాశ్చర్యమేమున్నది? ఇట్టి దురవస్థ యీకాలంబున మనభాషకు మెల్లగా సంప్రాప్తమగుచున్నది. దీనివలన నింత త్వరలో సంభవించు మహాప్రమాద మేమియు లేకున్న నీయవస్థయే కొంతకాలము సాగెనేని కాలము గడచిన కొలదిని భాష మర్యాదలెల్ల నశించి రాఁబోవు తరమువారికి భారతాది సద్గ్రంథముల పేళ్ళైనఁ దెలియక పోవునేమో యని మాత్రము సంశయము పొడముచున్నది. సంస్కృత నాటకంబుల బ్రాకృతంబువలెనే యాంధ్రనాటకంబులలోను ప్రహసనములలోను నీచపాత్రములకు గ్రామ్యభాష నుపయోగించుటయందును, దాని ననుసరించి గ్రంథమామూలాగ్రముగా నీచభాషలోనే వ్రాయుట యందును, గలయనౌచిత్యమును, భాషాపారస్య మెఱింగిన విద్వల్లోకమే చర్చించుకొనఁ గలదు. కావున సత్కావ్య రచనయందు సామర్థ్యము గల కవు లట్టి గ్రంథములు రచించి మాతృభాషకు హాని కలిగింప కుందురుగాక.

## ఆంధ్ర వాఙ్మయయాభివృద్ధికిఁ జేయవలసిన కృత్యములు

పైని చెప్పినట్లుగా నాధునికులు దృఢయత్నముతోఁ బెక్కు కావ్యములు రచించుచుండిరి. ఆంధ్రదేశమందలి మహారాజులు, రాజులు, జమీందారులును భాషాభిమానమును బూని యథావకాశంబుగఁ గవులకుఁ బ్రోత్సాహ మొసఁగుచుండిరి. హూణ భాషాప్రవీణులై యుత్తమపదవుల యందున్న యాంధ్రదేశీయులు పరమోత్సాహముతో భాషాభివృద్ధికిఁ బాటుబడుచుండిరి. దేశంబున స్త్రీలకును, పామరజనంబునకునుగూడ విద్యయం దభిరుచి హెచ్చుచుండెను. అంతకంటె భాష కౌన్నత్యము రాఁదగిన సమయము రాఁబోదు. కావున నీసమయముననే యాంధ్రవాఙ్మయంబునకుఁగల లోపంబులను దీర్చి విద్యాభిమానులు ప్రయత్నింపవలయును.

ఏ గీర్వాణభాష యాధారముగా నాంధ్రభాష యింతవరకును విస్తరిల్లెనో దానినుండి యింకను, మార్చఁదగిన మహాకవుల యుత్తమ

కావ్యంబు లనేకములు గలవు. అట్టివానిని జక్కని శైలిలో, బద్య గద్యాత్మకంబుగ నాంధ్రీకరింపవలయును.

సంస్కృతభాష నెప్పటికిని మాఱుత్రోవఁ బడకుండఁగఁ గాచునట్టి శబ్దానుశాసనమువలె నాంధ్రభాషకుఁ జాలినంత వ్యాకరణములేదు. ఇది మిక్కిలి లోపముగాఁ గనఁబడుచున్నది.

ఈయున్న యాంధ్రశబ్ద చింతామణి, అథర్వణకారికలు, బాల వ్యాకరణముగూడ నొక్క స్థితిలోనే యున్నవిగాని శబ్దజాలమంతయు వశపఱచుకొనుటకుఁ దగినట్లుగాఁ గాని భాషాజిజ్ఞాసువులకు సుబోధకముగాఁ లేవు. కావున నిపుడు తెలుఁగులోనున్న వ్యాకరణ గ్రంథములను ప్రయోగశరణంబులగు భారతాది సద్గ్రంథములను, నాధారముగాఁ జేసికొని యెల్లప్రకరణంబులను, సిద్ధాంత కౌముదిని బోలు నట్లుగా విపులముగా ధాతుపాఠాదికమును జేర్చి సుబోధకమగు శైలితో నొక యాంధ్ర కౌముదిని రచింప వలయును. *

సంస్కృతంబున శబ్దకల్పద్రుమమువలె నాంధ్రంబున నెల్ల శబ్దముల కాదర్శముగా సవ్యుత్పత్తికముగా సోదాహరణముగా నొక మహా నిఘంటువును నిర్మింపవలయును.

సంస్కృతంబు ననుసరించి కొన్ని యలంకార గ్రంథములు తెలుఁగులో నున్నవిగాని కేవల పద్యాత్మకంబులగు వానిశైలి కేవలాంధ్ర భాషా జిజ్ఞాసువులకు సులభంబుగా లేదు.

కావున నెల్ల కావ్యాలంకార లక్షణంబులు కరతలామలక మగు నట్లుగా నెల్లవిధములఁ గావ్యప్రకాశికం బోలిన యలంకార గ్రంథ మొకటి మనభాష కత్యావశ్యకము. మఱియుఁ దెలుఁగులో నాటక లక్షణము బొత్తిగాలేదు. కావున నిప్పటిభాషకుఁ దగినట్లుగాఁ గొన్ని మార్పులఁ గావించి దశరూపకంబు నాంధ్రీకరింపవలయును.

---

* ఈ యభిప్రాయము మనసున నుంచుకొనియే ఆంధ్రభాషాను శాసనమును దశరూపకమును రచియించితిని

సంస్కృతములో వలెనే మనభాషలోఁ గూడ దేశ చరిత్ర యొకటియును లేదు. కావున దేశ జ్ఞానదాయకంబులగు చరిత్రగ్రంథము లావశ్యకములు. మఱియుఁ బ్రపంచ జ్ఞానదాయకంబులగు ప్రకృతి రసాయన జంతువృక్షారోగ్యశాస్త్రంబుల నింకను మిగిలియున్న గ్రంథముల నతిసులభముగా నాంధ్రీకరించుటయు సంస్కృతంబున నధికముగానున్న జ్యోతిశాస్త్రంబు, నాంగ్లేయుల జ్యోతిశ్శాస్త్ర గ్రంథములతో సరిపుచ్చి యాంధ్రీకరించుటయునను విషయంబులు ముఖ్యంబులు. మఱియు నందలి పరిభాషల కొఱకు నిఘంటువు గూడఁ గావలయును. జనసంఘము నభివృద్ధికిఁ దెచ్చు నెల్ల కృషి కర్మతంత్రములను దెల్పు గ్రంథములు నత్యంతావశ్యకములు.

ఓ యాంధ్ర భాషాభిమానులారా! ఈ వ్యాస మాద్యంతము నాయెఱింగినకొలఁది నేవో కొన్ని విషయంబులను గూర్చి వ్రాసినాఁడను. ఇందలి దోషంబులను మన్నించి, గుణముల నుద్ధరింపఁ బ్రార్థించెదను. మఱియు నందందు బూర్వగ్రంథములను నాధునికములను సందర్భానుసారముగాఁ గొన్నిటినిమాత్రము పేర్కొంటిని. ఇంత మాత్రమున నవియే యుదాహరింపఁ దగినవనియు మిగిలినవి గావనియు నా యభిప్రాయముగాదు. గ్రంథవిస్తరభీతిచే నెల్లవానిం బేర్కొన లేదనియు, నన్ని కావ్యములయందుఁ గూడ నాయాగుణంబు లధికముగాఁ గలవనియు విన్నవించెదను. మఱియు నిపుడు భాషలోఁ గావలసిన గ్రంథములనుగూర్చి నేను జెప్పిన విషయ మొక్కనికి సాధ్యమగునది గాదనియుఁ, బెక్కండ్రు విద్వాంసులుగూడి చేయఁదగినది యనియు నిట్టి మహాకార్యము ప్రభువుల యాదరంబునను, విద్యాధికుల ప్రయత్నంబునను గాదగినది యనియు విన్నవించుచు నింతటితో దీనిని ముగించెదను *

* ఈవ్యాసము వ్రాయునాటి నా యాశయములు కొన్ని యిటీవల మాఱినవి.

# ఆంధ్రము —
# దాని ప్రాచీన స్వరూపము *

మనము భాషాపరముగా వాడుకొనుచున్న – ఆంధ్రము – తెలుఁగు లేక తెనుఁగు – అను పేళ్లెపు డెట్లు వచ్చినవను విషయ మెందఱో చర్చించియున్నారు. తర్కించి యున్నారు ఇపుడా విచారణ యావశ్యక మని నాకుఁ దెలిసినంతలో నిశ్చితార్థము తెలుపుచున్నాను.

శాలివాహన శకారంభమునకుఁ బూర్వము ౧౫౦౦ సంవత్సరముల క్రిందట నెపుడో యావిర్భవించిన మైతరేయ బ్రాహ్మణము సప్తమ పంచికా తృతీయాధ్యాయములోని శౌనశ్శేఫాఖ్యానమునుబట్టి విశ్వామిత్రుని పుత్త్రుల సంతతివా రతని శాపముచే——ఆంధ్రులు——పుండ్రులు——శబరులు—— పుళిందులు——మూతిబులు— అనెడి పంచవిధ నీచజాతి విశేషులై నట్లు తెలియుచున్నది.[1] అట్లు శాపహతులైన వారిలోఁ గ్రమముగా దక్షిణాపథమునకు వచ్చిన యంధ్రజాతివారికి నివాసమైన యీ జనపదము 'ఆంధ్ర' మను పేరుగాంచినది. శా. శ. పూర్వము పదమూఁడవ శతాబ్దిలోని రామాయణము దేశపరమైన 'అంధ్ర' శబ్దమును బేర్కొన్నది.[2] భారత సభాపర్వము దక్షిణదిగ్విజయ వర్ణనలో దేశరాజపరమైన 'ఆంధ్ర' శబ్దములను బేర్కొన్నది. దీనినిబట్టి తొలుత నార్యులలోనివారై శాపవశమున నీచవృత్తులపాలై యనార్యులైన యంధ్రులనెడి యొక జాతివారికి నివాసమగుటంబట్టి మనదేశ మంధ్రమైనదని తెలియనయ్యెడిఁ గాని, కేవలము వారి భాషయే యీదేశమందలి భాష యనుటకు మాత్రము వీలులేదు. వారు వచ్చునప్పటి కీదేశము నిర్జనారణ్యముగాదు. తెలంగాను

---

* ఇది 15 సంవత్సరముల క్రిందట, ఆంధ్రసర్వస్వములోఁ బ్రకటించబడినది

1 చూ. మదీయ, సంస్కృత వాఙ్మయ చరిత్ర. ప్ర భా. 241–42 పుట.

2 రా. కిష్కి. "తథైవాంధ్రాంశ్చ పుండ్రాంశ్చ చోళాన్ పాండ్యా సకేరళాన్".

లనెడి వారప్పటికే యీ దేశమున నెలకొని యున్నారు. వారిని బట్టియే యీ దేశమునకును, భాషకును, దెలుంగనెడి పేరు వచ్చి యున్నది. ఆ తెలుంగంతకు మున్నెప్పుడో మూలద్రవిడము నుండి విడివడి వచ్చి యిందు స్థిరపడిన శుద్ధదేశ్యమనుట సత్యదూరము కానేరదు. అట్టి యనాదియైన దేశ్యమును, ఇచ్చటికి వచ్చిన యంధ్రుల ప్రాకృతమును మిళితమైన భాషయే మన యిప్పటి భాష మూడు వంతులలో రెండు వంతులు, అనఁగా తద్భవదేశ్యములు. మఱియు, ఆర్యావర్తనమున నుండి దక్షిణాపథమునకు వలసవచ్చిన యార్యులీ దేశమున స్థిరపడుటచే వారి సంస్కృతభాషనుండి వర్ణలోపాదులు చెందిన తద్భవ పదజాలమే కాక, యపారమైన శబ్దజాలము తత్సమముగా నిందు ప్రవేశించినది. దానిచేఁ దత్సమ తద్భవ దేశ్యాత్మకమై యిందలి భాష మఱింత పుష్టి గాంచినది. ఆ స్థితి, శా. శ. పూర్వము వేయేండ్లకు వెనుకటి కనవచ్చును.

ఇట్లు త్రివిధమైన యీభాష కాదిమవాసుల పేరవచ్చిన 'తెలుఁ'గనెడి పేరును, తరువాత వచ్చిన వారిపేర వెలసిన "అంధ్ర" సంజ్ఞయు వ్యవహారమున స్థిరపడి యీ రెండును గ్రమముగాఁ బర్యాయము లైనవి. ఇందు తెలుఁగు క్రమముగాఁ దెనుఁగైనది. అంధ్రము క్రమముగా నాంధ్రమైనది. ఇది భాషా సంజ్ఞల తత్త్వమైనను, ఇందు మతభేదములు లేకపోలేదు. అందు, ఆంధ్ర వంశ్యరాజుల పరిపాలనము వలన దేశమునకును భాషకును, ఆంధ్ర మనెడి పేరు వచ్చినదను నిస్సారవాదముంగూర్చి చర్చింపఁ బనిలేదు గాని, త్రిలింగ శబ్దమునుండి తెలుఁగు పుట్టినదను మతము హెచ్చుగా వ్యాపించుటం బట్టి దానిని గూర్చి యించుక చర్చింపవలసి యున్నది.

ఈ దేశమునకు, త్రిలింగ మనెడి మఱియొక పేరు పురాణాదులఁ గనవచ్చుచున్నది. కాని, రామాయణ భారతము లీ పేరెందును వాడక పోవుటంబట్టి, ఆంధ్ర సంజ్ఞకంటె నిది మిక్కిలి యర్వాచీన

మగుట తెల్లము. ఆర్యులీ దేశమునకు వచ్చి యిందలి త్రిలింగ క్షేత్రములను దర్శించి యిది పుణ్యభూమియను భావము ప్రకటించుచుఁ బెట్టిన యీపేరు క్షేత్రమహత్త్వ ప్రశంసా పరమై స్కాంద బ్రహ్మాండ పురాణముల కెక్కినది[1] దానిని బట్టి సారస్వతము నందు "త్రిలింగ దేశము, త్రైలింగులు" అనెడి మాటలు ప్రవేశించినవి కాని, ఆంధ్ర సంజ్ఞవలెనే త్రిలింగ సంజ్ఞ దేశపరముగా జనసామాన్యమున వ్యాపించినది కాదని మాత్రము చెప్పవచ్చును. అందుచే నీ శబ్దము వాడుకలో వికారము చెంది దేశపరముగాను భాషాపరముగాను, తెలుఁగైనదని తలంచుట యంత యుక్తియుక్తముగాఁ గనఁబడుకున్నది. పంచ ద్రావిడులను ప్రత్యేకించి చెప్పు సందర్భమున స్కాందమును గొన్ని ధర్మశాస్త్ర గ్రంథములును, ఇందలి బ్రాహ్మణులను మాత్రము త్రైలింగులని పేర్కొన్నవిగాని, ఆంధ్రదేశమందలి యెల్ల జనసంఘమునకు నీపేరు వాడలేదు. తత్త్వమిదియైనను, కొందరు త్రిలింగ శబ్దభవము తెలుఁగని వ్రాయకపోలేదు. అందు విన్నకోట పెద్దనార్యుడు—

క. ధర శ్రీపర్వత కాళే
శ్వర దాక్షారామ సంజ్ఞ వఱలఁ ద్రిలింగా
కరమగుట నంధ్రదేశం
బరుదారఁ ద్రిలింగ దేశమనఁ జనుఁ గృతులన్.

గీ. తత్త్రిలింగ పదము తద్భవం బగుటచేఁ
దెలుఁగు దేశమనఁగఁ దేటపడియె,
వెనుకఁ దెనుఁగు దేశమని యంద్రు కొందఱ
బ్భాష పంచగతులఁ బరగుచుండు.

---

1 "శ్రీశైల భీమ కాళేశ మహేంద్రగిరి సంయుతమ్,
ప్రాకారం సుమహత్కృత్వా త్రీణిద్వారాణి చాకరోత్.
అవసత్తత్ర మునిభి ర్యుతో గోదావరీ తటే,...
తత్కాల ప్రభృతి క్షేత్రం త్రిలింగ మితి విశ్రుతమ్". బ్ర.
"కర్ణాటా శ్చైవ త్రైలింగా ఘూర్జరా రాష్ట్రవాసినః" స్కాం.

అని కావ్యాలంకార చూడామణిలోఁ జెప్పియున్నాఁడు. ఇట్లే మఱికొందఱు లాక్షణికులును నిర్వచించి యున్నారు. కాని, పెద్ద నార్యుఁడు తెలుఁగు తద్భవమనుట భ్రాంతిమూలకమని యతని మాటలనే తెలియఁగలదు — అతని నాఁటికి భాషాదేశపరముగా - అంధ్రము, తెలుఁగు — అను మాటలు వాడుకలో నున్నట్లు త్రిలింగశబ్దము వాడుకలో లేదని మొదటిపద్యమే తెలుపుచున్నది. "అంధ్రమని ప్రసిద్ధి గాంచిన యీ దేశము, త్రిలింగముల కాకరమగుటచేఁ త్రిలింగ దేశమని కృతులలోఁ జెప్పఁబడుచున్నది" అను భావమే త్రిలింగశబ్దము భాషాదేశపరముగా జనసామాన్యము వాడుకలో లేదనియు, కృతుల యందు మాత్రమే యున్నదనియు స్పష్టపఱుచుచున్నది. నిజముగా నిది యట్టిదే యైనచో 'త్రిలింగ దేశ మనఁబడుచుండెన్" అనురీతి నిది వాడుకలో స్థిరపడినదను భావము విశదమగునట్లు పెద్దనవ్రాసియుండును గాని "త్రిలింగదేశమనఁ జనుఁ గృతులన్" అనుచు నిది కృతుల యందుమాత్రమే కనఁబడుచున్నదని వ్రాసియుండఁడు. దీనినిబట్టి ప్రజలందఱును దేశపరముగా వాడుచున్న 'తెలుఁగు' పదము, దేశపరముగాఁ గృతులలోఁ గనబడుచున్న త్రిలింగపదమునుండి పుట్టినదనుకొని యతఁడట్లు వ్రాసెనేకాని, తత్త్వము పరిశీలించలేదు. వాడుకలోలేని త్రిలింగపదము తెలుఁగుగా మాఱుట పొసఁగదు. ఇది లాక్షణికులు కల్పించిన తద్భవపదము. వారు మనభాషకు 'వికృతి' యనుపేరు కల్పించిరి. అది యెందైన వాడుకలోనున్నదా! అట్లే, ఇది పుణ్యభూమి యనుటకై యీ దేశమునకుఁ బౌరాణికులు పెట్టిన త్రిలింగ సంజ్ఞ మున్ను వాడుకలోఁ బ్రవేశించలేదు. అందుచేఁ బెద్దనాదులు, దేశపరమైన 'తెలుఁగు' తద్భవమనియు, అదియే భాషాపరముగాఁ గూడ మాఱి తెనుఁగు తెలుఁగునైనదనియుఁ జెప్పినది భ్రాంతిమూలకమని విశ్వసింపఁ దగును. దీనినిబట్టి, త్రినగశబ్దభవము తెనుఁగనెడి వాద మత్యంతము నిరాకరమనుట స్పష్టము. అయితే, దేశమునకును భాషకును, తెనుఁగను పే రెట్లువచ్చినది? —

ఈ విషయమునఁ బ్రకరణాదియందు సూచించిన దానినే మఱి కొంచెము విశదీకరించుచున్నాను — మహారాష్ట్రదేశమునకును గర్ణాట దేశమునకును సంబంధించిన నిజాము రాజ్యములోని భూభాగము కొంత 'తెలంగానా' అని పూర్వము పిలువఁబడెడిది. అందు నివసించిన వారినిబట్టి యాప్రదేశమున కాపేరువచ్చెనో, ఆప్రదేశమును బట్టి యందలి వారికి 'తెలంగాను' లనెడి పేరువచ్చెనో నిశ్చయించి చెప్పుటకుఁ బ్రబలములైన యాధారములు లభింప లేదు. కాని, ఆప్రదేశము తెలంగాణ మగుటయు, అందలివారు తెలుఁగువారగుటయు సత్యము. తొలుత నాభాగమున నున్నవారై తరువాతఁ గృష్ణా గోదావర్యాది నదీ తీరములకు వచ్చిన బ్రాహ్మణులు "తెలగాణ్యు" లనుపేర నిపుడాంధ్రదేశ మెల్లెడలఁ గనవచ్చుటంబట్టి దేశముపేరనే యాబ్రాహ్మణశాఖ వెలసినదనియు "తెలగా" లనెడి శూద్రజాతి యాదేశముపేరనే వెలసి దేశమంతట వ్యాపించినదనియు భావించుట సత్యదూరము కానేరదు. కావున నందలిజాతుల వాడుకలోనున్న భాష దేశముపేర 'తెలంగాణ' మసియు, ఆశబ్దమే క్రమముగా, తెలుంగు-తెలుఁగు-తెనుఁగు అయినదనియు విశ్వసింపవచ్చును. అది తొలుత, తెలంగాణములోనిదయ్యు నందలివారితోఁ దరువాతఁ ద్రిలింగ మనఁబడెడి యాంధ్రభూమిని బ్రవేశించి తనపేరట్లే నిలుపుకొన్నది. అందుచే భాషాదేశపరమైన తెలుఁగు శబ్దము త్రిలింగశబ్దభవముగాక శుద్ధదేశ్యమగు ననుటయే సముచితము. దీని రూపాంతరమైన 'తెనుఁగు' శబ్దము నన్నయభట్టారకుని నాఁటికే భాషలో స్థిరపడిన ట్లీక్రిందిది స్పష్టము చేయుచున్నది.

క. జననుత కృష్ణద్వైపా
యనముని వృషభాభిహిత మహాభారత బ
ద్ధనిరూపితార్థ మేర్పడఁ
దెనుఁగున రచియింపు మధిక ధీయుక్తి మెయిన్.

ఇదంతయుఁ బరిశీలింపఁగా దేశమునకును భాషకును వచ్చిన 'తెలుఁగు' సంజ్ఞ స్కాందాదులలోని త్రిలింగ సంజ్ఞ కంటెఁ బూర్వ మనియే తోఁచుచున్నది. ఇఁక వికృతిసంజ్ఞను గూర్చి యొకింత.

## వి కృ తి

ఇది కేవలము లాక్షణికులు కల్పించినది. ఈ పేరు తెలుఁగునకే కాదు ప్రాకృతమునకును లక్షణకర్తలు వాడియున్నారు. సంస్కృతము ప్రకృతి యనియు దాని వికృతి ప్రాకృతియనియు భాషాప్రదీపము వక్కాణించినది. అనఁగా, ప్రకృతి నుండి పుట్టిన వికృతిభాష ప్రాకృతి యనఁబడినదనుట.[1] తొల్లి, మహారాష్ట్రాది దేశములందు వాడుకలో నున్న సంస్కృత శబ్దజాలము వర్ణలోపాదులను జెంది యా దేశముల పేరఁ బ్రాకృతీ సంజ్ఞను జెందినది. వాటి కన్నిటికిని మాతృకయైన ప్రకృతి యొకటేయైనను, తద్వికృతులు మాత్రము వికారభేదములతో నానా విధములైనవి. వాటివలెనే గౌడలాటాది దేశములలోఁ గూడ ప్రకృతికి వికృతులై స్థిరపడిన భాషలును బ్రాకృతములే యనఁబడిన వని దండ్యాచార్యుఁడు చెప్పెను.[2] తొల్లి యట్లు సంస్కృతంబు నుండి పుట్టి దేశము నలుగడల వ్యాపించిన ప్రాకృతము దేశభేదమున నెతెంత రూపభేదమును జెంది మరాటీ గుజరాతీ మొదలగు దేశభాష

1. ప్రకృతిః సంస్కృతా భాషా వికృతిః ప్రాకృతీ భవేత్
షడ్విధేయం, ప్రాకృతీచ శౌరసేనీచ మాగధీ,
పైశాచీ చూళికా పైశా చ్యపభ్రంశ ఇతి క్రమాత్.
మహారాష్ట్రోద్భవా భాషా ప్రాకృతీ పరికీర్త్యతే
శూరసేనోద్భవా భాషా శౌరసేనీతి గీయతే
ప్రచక్షతే మాగధీంతాం యా భాషా మగధోద్భవా
పిశాచదేశ సంభూతం పైశాచీద్వితయం భవేత్
ఆభీరాదిక జాం భాషా మపభ్రంశం ప్రచక్షతే.

2. శౌరసేనీవ గౌడీ చ లాటీ చాన్యా పితాదృశీ
యాతి ప్రాకృత మిత్యేవం వ్యవహారేషు సన్నిధిమ్.

లైనవి. అట్టి సంస్కృతములకును మన తెలుఁగునకు గల సంబంధ మెట్టిదో; దీనికి వికృతి సంజ్ఞ లాక్షణికులు కల్పించుట యెంతవఱకు సముచితమో, చూతము.

## సంస్కృత ప్రాకృతములు – తెలుఁగు

సంస్కృత ప్రాకృతముల వికారమగుటచే నాంధ్రభాష వికృతి యైనదని చింతామణ్యాదులు తెల్పినవి.[1] అందుకుఁ గారణము తత్పూర్వము లయిన నన్నయభట్టాది రచనలయందును[2] దమనాఁటికి వాడుకలోను దత్సమ తద్భవ శబ్దజాల మధికముగాఁ గనవచ్చుటయే.

పూర్వ మునీశ్వరులు దేనిని సంస్కృతమనిరో, దానిని వారికంటెను బూర్వులు దైవీ వాక్కనఁగా దేవభాష యనెడివారు.[3] అదే ఋగాద్యామ్నాయ రూపముదాల్చి వేదము ఛందస్సు నను పేళ్ళు దాల్చినది. అట్లు వేదములందు గనవచ్చు శబ్దజాలమే లోకుల వాడుకలోఁ గూడ నుండి యించించుక మాఱుచువచ్చి లోకముభాష యను పేళ్ళు గాంచినది. అదియే భరతఖండము నలుగడల వ్యాపించి రూపభేదము నొందుచు నాయా దేశనామములఁ దొలుత నాఱు తెఱఁగులై ప్రాకృతమైనది. ఆయా సమయములందు దొలుతటి లౌకికభాష హెచ్చుగా మాఱుచుండుట కనిపెట్టి పాణిని శాకటాయను లకుఁ బూర్వులును వారును నియమము లేర్పఱచి దానిని సంస్కరించి వ్యాకరణబద్ధము గావించిరి. అందుచే లోకము లేక భాష యనఁబడు తొలుతటి శబ్దజాలము సంస్కృతమను పేరు గాంచినది. దానంజేసి ప్రాకృతములకు మాతృక లోక మనుటకంటె సంస్కృత మనుటయే లాక్షణిక లోకమున హెచ్చినది. కానిఁ యీ సంస్కృత ప్రాకృత

---

1. ఆద్య ప్రకృతిః ప్రకృతిశ్చాద్యే, ఏషా తయోర్భవేద్వికృతిః.
2. ఆంధ్ర శబ్ద చింతామణి భారతకర్త నన్నయార్యుఁడు రచియించిన దను ప్రవాదము విశ్వసనీయము కాదు.
3. సంస్కృతీనామ దైవీ వాగిత్యాఖ్యాతా మనీషిభిః, — దండి.

ములు రెంటికిని గూడ మూల ప్రకృతి లోకమనుట నిజము. దానికే కొందఱు లాక్షణికులు ప్రకృతమను పేరుపెట్టి దానినుండి పుట్టిన దేశ భాషలకుఁ బ్రాకృతము లను పేరుపెట్టిరి. ఇట్లు పుట్టిన ప్రాకృతము లలో నేది యాంధ్రమునకు ద్వితీయ ప్రకృతి యనుట యిపుడు విచారణీయము.

ఇందాది[1] పదమువలనను, ద్రవిడ సాహచర్యమును బట్టియు[2] స్కాంద వచనమును బట్టియు, మహారాష్ట్ర ఘూర్జర కర్ణాట త్రిలింగ ములు గ్రాహ్యము లగునని తెలియుచున్నను మొదటి రెండు దేశము లందును గ్రమముగాఁ బ్రాకృతాపభ్రంశములు విస్తరించినవని మున్నే భాషాప్రదీప వచనమునఁ దెలిసికొంటిమి గావున నిఁకఁ బంచద్రవిడ దేశములలో ద్రవిడ కర్ణాట త్రిలింగ భాషలకే పైశాచీ సంబంధము గలదని మన మెఱుఁగవలసియున్నది. కాని యీ రెండు పైశాచు లలో నేది యేయే దేశములం దాకాలమున వ్యాపించెనో యిపుడు వివరింపరాదు. సరిగదా యివి హిందూదేశములోఁ గొంచె మించు మించుగా సగపాలాక్రమించినట్లు గానవచ్చుటంజేసి మరాటి గుజ రాతి యనినట్లుగా వీని యిప్పటి నామము లివి యనికూడఁ జెప్ప నలవిగాదు. అయిన నివి తమచేఁ బెంపొందిన భాసలతోఁ గలసి మెలసి యయ్యా దేశభాషల నామముల నొందినవనుట సాజము. కావునఁ బై వివరణ వచనమును బట్టి పైశాచీభాషాసంపర్కము గలవి తమిళము కన్నడము తెలుఁగు ననెడి మూఁడే యని తెలియ నగును.

పై ప్రసంగంబున మరాటి గుజరాతి తమిళము కన్నడము తెలుఁగు నను నివి పంచద్రావిడ భాషలని పూర్వుల పరిగణనము

1. ఈ యాది పదముచే భాషా సంబంధాదికమును బట్టి చేరదేశముగూడ గ్రాహ్యమని తోఁచుచున్నది.

2. కర్ణాటాశ్చైవ త్రైలింగా ఘూర్జరా రాష్ట్రవాసినః
ద్రావిడా ద్రావిడాః పంచవింధ్య దక్షిణ వాసినః.

గానవచ్చుచున్నను గొంద ఱిపుడు తమిళము మలయాళము కన్నడము తులువము[1] తెలుఁగు నను వాని నట్లు గణించుచున్నారు. ఇందు మొదటి పక్షమున వింధ్యాద్రికి దక్షిణముగా నున్న మహారాష్ట్రాది దేశముల యందలి వారికిఁ బంచద్రావిడులని పేరు గలుగుటంజేసి వారి భాషల కాపేరు వచ్చినదనెడి యుక్తికిఁ దగినట్లుగా, రెండవ పక్షమందును దగిన యుపపత్తి లేకపోలేదు. పాండ్యచోళ ద్రవిడ దేశములకుఁ జేరియే తొంటి చేర (ఇప్పటి మలబారు, కొచ్చి, తిరువాన్కూరు) దేశ మున్నది. దీనిలోని భాగములగు కేరళతులువ దేశములందుఁ గ్రమముగా మళయాళము తులువమును వాడుకలో నున్నవి. ఇందు మొదటిదానికిఁ దమిళముతోను రెండవదానికిఁ గన్నడముతోను నెక్కుడు సంబంధ ముండుటంజేసి తమిళ కన్నడములకుఁ బ్రకృతియయిన పైశాచియే వానికిని బ్రకృతియై యుండు ననుట విశ్వాసపాత్రము గాకపోదు. కావునఁ బ్రాకృతమయిన మరాటియు నపభ్రంశమయిన గుజరాతియుఁ బైశాచి తోడి ద్రవిడ కర్ణాట త్రిలింగములును జేరి పంచద్రావిడము లయినవనుట కంటె నొక్క పైశాచియే ప్రకృతిగాఁగల తమిళ మళయాళములు తులువ కన్నడములు తెలుఁగు ననునవి పంచద్రావిడము లనుటయు నుచిత తరముగానే కన్పట్టును.

పై విచారణమున ద్రావిడ భాషా విభాగముతోఁ దెలుఁగునకు ద్వితీయ ప్రకృతి యయినది పైశాచనామక ప్రాకృతమని తేలినది. కాని యిది హిందూదేశమునం దుత్తర దక్షిణములఁ జాలవఱకు వ్యాపించినదనుట కింతకుమున్ను దెల్పిన యాంధ్రలాక్షణికుల వచనము లనే కాక యన్యుల వ్రాఁతలను గూడఁ బ్రమాణముగాఁ గైకొని యిది మన భాషకు సహాయపడిన మార్గమును బూర్తిగా నెఱుంగుటకై దీనింగూర్చి సాధ్యమైనంత వివరించుట కర్తవ్య మగుచున్నది.

1. ఇది యీ యైదింటిలో మిక్కిలి కట్టకడపటి దగుటచే ద్రావిడ భాషలు నాలుగే యని కొందఱ మతము.

## పైశాచీ ప్రాకృతము

ఆంధ్రుఁడు కృష్ణాతీరవాసియుఁ బ్రాకృత లాక్షణికుఁడునగు చెరుకూరి లక్ష్మీధరశాస్త్రి తన షడ్భాషాచంద్రికలోఁ బైశాచి వాడుకలో నున్న దేశములను గణించుచుఁ బూర్వోక్త వివరణములోని కొన్ని దేశములకు బదులుగా సింహళము టిబెటు దేశములను లెక్కించెను. మార్కండేయుడను మఱియొక విద్వాంసుఁడు పాండ్యగౌడ మాగధ పాంచాల కేకయ శౌరసేన దాక్షిణాత్య ద్రావిడ శబర భాషలు దీని సాహాయ్యమును జెందినవనియుఁ గ్రీగీతలు గలవాని యందలిది మంచిదనియు వక్కాణించెను. రామతర్క వాగీశుఁడు హేమచంద్రుఁడు మున్నగు లక్షణకర్తలు గూడ నిట్లే యిది పెక్కు దేశభాషలకుఁ బ్రాపయినదను నభిప్రాయము దెల్పిరి. స్టైన్కోనో యను విదేశీయుఁడు వింధ్యాద్రికిఁ బూర్వ దక్షిణముల నిది విశేషముగా వ్యాపించినదనియుఁ గేకయ దేశములోని పైశాచితోఁ బెక్కు విషయములఁ బాలీభాష కలియుచున్నదనియు వచియించెను. వీరందఱు గూడ ముఖ్యముగాఁ గేకయ దేశమునందుఁ బైశాచీ వ్యవహారము నంగీకరించుటం బట్టియు, మార్కండేయ పండితుఁడు పైశాచి కేకయ గాంధారములఁ బుట్టినదని నొక్కి వక్కాణించుటంబట్టియు, గ్రియర్సన్ అను నాంగ్లపండితుఁడు హిందూదేశము వాయవ్య భాగమున నిది తొలుతజన్మించి క్రమముగా నందందు వ్యాపించి యుండుననియు, నిప్పటికిని పంజాబు ఆఫ్గనిస్థానముల నడుమ దీని చిహ్నములు గనవచ్చుననియు విశదీకరించెను.[1] కాల్డువెల్లను మఱియొక విమర్శకుఁడు ద్రావిడభాషల యుత్పత్తినిగూర్చి వ్రాయుచుఁ బైశాచీ ప్రాకృత సంబంధముగల యుత్తర దక్షిణ హిందూదేశ భాషలు పెక్కింటిలోఁ బంచద్రావిడ భాషలకు మాతృకయిన ప్రాచీన

1. R. G. Bhandarkar commemoration Volume.

ద్రవిడభాష యొకటియని వ్రాసెను.[1] మఱియుఁ బ్రాకృత మందలి పింగళచ్ఛందస్సు ననుసరించి కన్నడమున ఛందోఽంబుధి యను గ్రంథమును నిర్మించిన నాగవర్మ యను ప్రాచీనకవి ప్రాకృతా ప్రభ్రంశ పైశాచికలనుండి తమిళము తెలుఁగు కన్నడము మున్నగు పెక్కు బాసలు వెడలినట్లు నుడివెను.[2]

ఇట్లు మార్కండేయుఁడు మగధ శూరసేన దేశముల యందుఁ గూడఁ బైశాచియే వ్యాపించిన దనియు నందు శౌరసేని యుత్తమమనియు వ్రాక్రుచ్చుటచేతను నాగవర్మ ప్రాకృతా పభ్రంశ పైశాచికలు మూఁడే యెల్ల దేశభాషలకుఁ బ్రకృతులని వర్ణించుట చేతను మాగధీశౌరసేనులు పైశాచికా రూపాంతరములై యాపేరుల నిటీవల లెక్కకు వచ్చినవనియుఁ బైశాచియొక్కటియే పరిశుద్ధాపరిశుద్ధ భేదమున రెండయినదనియుఁ గావునఁ దొలుత సంస్కృతమునుండి వేఱుపడిన ప్రాకృతములు ప్రాకృతాపభ్రంశ పైశాచికలు మూఁడేయనియుఁ దోఁచుచున్నది. ఏమయిన నేమి? దీనివలనఁ గూడఁ బ్రాకృతములలో దీనికిఁ బ్రాముఖ్యము గలదనియుఁ బెక్కు బాసలకుఁ బ్రాపయిన యిది. దాక్షిణాత్యములలో ద్రావిడ కర్ణాటాంధ్రములకు దాది యగుట సత్యమనియు స్పష్టమయినది.

ఈపైశాచి యుత్తరదేశమున మిక్కిలి ప్రాచీన కాలముననందే కావ్యములనుగాంచి పొంగడ్తగాంచిన దనుటకుఁ[3] బ్రతిష్ఠానపుర రాజగు సాతవాహనుని సభలోనివాఁడును క్రీస్తుశకము మొదటి శతాబ్దిలోనివాఁడునగు గుణాఢ్యమహాకవి రచియించిన బృహత్కథ మంచి తార్కాణముగాఁ గన్పట్టుచున్నది. పంచతంత్ర కాందంబరీ రత్నావళ్యాది

---

1. Comparative Grammar of the Dravidian Languages.
2. సంస్కృతం ప్రాకృత మపభ్రంశం పైశాచిక మెంబమూఱుపరే భాషగళోళ్ పుట్టున ద్రవిడాంధ్ర కర్ణాటకాది షట్పంచాశత్సర్వ విషయ భాషాజాతి గళక్కుం. నాగవర్మ క్రీ. శ. 950 ప్రాంతమువాఁడు.
3. చంద్రవంశరాజుల రాజధానియగు నిది గంగా యమునా సంగమస్థలమున నుండెడిదఁట.

కథారత్నంబులకుఁ బేటికయగు [1] నిది తొలుత నేడులక్షల గ్రంథముతో జన్మించి తుదకు లక్షగ్రంథమున జీవించెనని దానిని గథాసరిత్సాగర మనుపేర సంస్కృతమునకు మార్చిన సోమనాథభట్టు తెలిపియుండెను. ద్రావిడ భాషలకు బాసటయైనట్టు తెలియుచున్న యీభాష యిట్లే దక్షిణమునఁగూడఁ వ్యవహారమందుండి కవి వాక్కులకు వశ్యమయిన దనుటకుఁ దనకు సహాధ్యాయుఁడైన నారాయణభట్టును వర్ణించిన నన్నయభట్టారకుని యీక్రింది శ్లోకము ప్రమాణ మగుచున్నది.

" ...అభవదనుష్ఠిత జగదుప కరణో నారాయణ స్తనయః యస్సంస్కృత కర్ణాట ప్రాకృత పైశాచి కాంధ్రభాషా సుకవి రాజ శేఖర ఇతి ప్రథితస్సుకవిత్వ విభవేన"

దీనింబట్టి యీపైశాచి మనదేశమునఁ బ్రాకిన దనుటయే కాక యాంధ్రకర్ణాట భాషలు పెరిఁగి పెద్దవై కావ్యరచనా స్థితికి వచ్చు దనుకఁగూడ నిందలి పండితుల నాశ్రయించి యిందు వసియించిన దనుటయు విదిత మగుచున్నది. ఇట్లే ప్రయత్నించినచో నింకను గొన్ని నిదర్శనము లెఱుఁగ వచ్చును గాని యార్యులతోనే యిది వింధ్య దక్షిణభాగమున కరుదెంచిన దనుటకును దీని తోడ్పాటు ద్రవిడ భాషలకుఁ గలదనుటకును ప్రమాణములుగా మన మిపుడు చదివిన విద్వాంసుల వ్రాఁతలు విశ్వసనీయములు గాకపోవు, గావున మనబాసకు ద్వితీయ ప్రకృతియయిన దీ పైశాచీ ప్రాకృతమే యని నమ్మఁదగి యున్నది. అయినను దొంటియమ్యాఱు ప్రాకృతముల నిజస్వరూప మిపుడు వ్యవహారమున లోపించుటచేతను మగధ, శూరసేన దేశముల యందు వ్యాపించినదిగూడ బైశాచియే యని పూర్వ ప్రమాణికులు గొందఱు వ్రాసినను మాగధి శౌరసేని యనెడివిగూడ వేఱుగా

1. తథైవచ గుణాఢ్యేన పైశాచ్యా భాషయాతయా
నిబద్ధా సప్తభిర్వర్షైర్గ్రంథ లక్షాణిసప్తసా...
అథోవాచ సతం భూపం గుణాఢ్యస్సాతవాహనః
రాజన్ షడ్గ్రంథ లక్షాణి మయాదగ్ధాని షట్కథాః
లక్షమేక మిదంత్వేతైక థైకా సైవ గృహ్యతాం.

లెక్కకు వచ్చుటచేతను ముఖ్యముగాఁ బైశాచిలో వ్రాయఁబడిన గ్రంథము లిపుడు మృగ్యము లగుటచేతను దద్భవగణనమునందు మన లాక్షణికు లొక్క పైశాచీభవములనే కాక యిది ప్రాకృతభవము, ఇది మాగధీభవము, ఇది శౌరసేనీభవము నానన్నిటినిగూడ స్మరించుచు మనబాసకు ద్వితీయ ప్రకృతియయినది ప్రాకృతమని యాతింటిని దెలుపు నా పద ముపయోగించుటచేతను వానిలో నేది ప్రకృతి యన్నను ఫల మిప్పుడు సమానమే యగుటచేతను మనమిఁక దానిచర్చ [1] విడిచి మన పూర్వుల మార్గమునే యనుసరించి ద్వితీయ ప్రకృతి సందర్భమున సమూహవాచకమయిన ప్రాకృతపదమునే యిఁకముందు వ్యవహరించికొందము.

ఇట్లింతదనుక దేని మొదలెట్టుంగ నాసించి వెదక నారంభించితిమో యయ్యాంధ్రమునకుఁ బ్రాపులయిన సంస్కృత ప్రాకృతముల నిజరూప మొకించుక తెలియఁ గలిగితిమి. ఇఁక దీని తొలి రూపమయిన దేశ్యముయొక్క స్వరూప మించుక తెలియ నుద్యమింతము.

## ప్రాచీన దేశ్య స్వరూపము

ఈవిషయంబున సంస్కృత ప్రాకృతముల యాలంబనంబునఁ బెరిగి పెద్దవియైన యితరభాషలవలెఁ దెలుఁగును వాని చెలిమికలిమి వన్నె గాంచినది గాని మొదలులేనిది గాదని మున్నె చదివియుంటిమి గావున దత్సమతద్భవవ్యతిరిక్తమయిన యామూలభాషయే దేశ్యమని యిపుడు మరల స్మరింపనగును. దీనినే మన [2] పూర్వలాక్షణికులు [3] లోక

---

1 విశ్వాసమునకై పైశాచీభవ శబ్దములు గొన్ని తద్భవ ప్రకరణమునఁ జూపఁబడును.

2. సిద్ధిర్లోకాద్ధ్యశ్యా లోకో౽నన్యాదృశశ్చ నిత్యశ్చ. ప్రకృతి స్స్యాజాత్రజ్ఞా తుల్యాతుసమా ప్రవాహినీ దేశ్యా అ. ౧౧. సమ్యగ్బల సత్త్వాత్ప్రౌఢ త్వాద్గృహీత త్వాచ్చసురిభిః వికృ. వివే.

(మంచి మొదలుగలది దేశ్యమందు రూఢమైనది)

3, నన్నయాదుల వ్యాకరణముల యందుఁ బ్రశంసింపఁబడిన

వ్యవహారసిద్ధము దేశ్యమని నిర్వచించిరి. ఏకరీతిగా నెడతెగకుండఁగఁ బ్రవాహరూపముగా వచ్చుచున్న వాడుకలోనున్న శబ్దజాలము దేశ్య మనఁబడునని దాని యర్థము. తత్సమతద్భవములకు వేఱుగా లక్షణములు వ్రాసి వెంటనే వానితో సమానముగా దీని లక్షణమును వ్రాసిన యాపూర్వులు తమనాఁటికి త్రిలింగ దేశమున వాడుకలోనున్న శబ్దజాల మొక దేశ్యభాషగాఁ బరిగణింపఁదగిన స్థితిలో నున్నదనియు దద్భవాదిపదముల కలయికలేక యిది చిరకాలము నుండి వ్యవహారయోగ్యముగా నల్లే వచ్చుచున్నదనియు స్పష్టపఱచి యొక విధముగా దీని ప్రాచీన స్వరూప మెఱుకపరచిరనియే సంతసింతము. కాని యిట్లనుట దీనినొక స్వతంత్రభాషగాఁ జెప్పికొనుటయే కావునఁ దద్భవాదుల విడిచిన కేవల దేశ్యము గ్రంథ రచనకుఁ గాని జనుల వాడుకకుఁ గాని చాలినంతగా నిపు డున్నదా లేక మున్నుండెడిదా యని యొక యాక్షేపము వెంటనే సిద్ధమగును. సత్యమే. తగినంత పదసముదాయమున్నఁగాని లోకవ్యవహారము జరుగదు. లోక వ్యవహారము సర్వతోముఖ మగుచున్నఁగాని పదసముదాయము పెరుఁగదు. ఇట్లీ రెండు నొకదాని సాయమునకై యొకటి మిక్కిలి యక్కఱపడెడి యిట్టి క్లిష్టావస్థ యే స్వతంత్ర దేశ్యమున కయినను మొట్టమొదటఁ దప్పదు. అట్టియెడ నిది యెట్లుపుట్టి యెట్లు పెరిగినదో మన పూర్వులా చెప్పలేదు; మనకా సరియైన యాధారములు లేవు. కావున మన మిపుడు దేనిని మూలదేశ్య మనుకొనుచున్నామో యందుఁ దెలియకుండఁగా మాఱిపోయిన తద్భవములు కొన్నియు దమిళము నుండి వచ్చిన పదములు గొన్నియుఁ గలిసి యున్నవని యిప్పటివారు గొందఱు తలంచుచుండుటచేఁ బై పూర్వపక్షమునకుఁ దగిన యుత్తరమిచ్చుట తేలికగా దేలెడి పనిగాదు. సరిగదా? వారు తలంచునట్లు వానిని విడఁదీయ మొదలిడినచోఁ దక్కిన దేశ్య మొక భాషయనియు వవ్యహార దక్షమయినదనియుఁ జెప్పికొనుటకే వలనుపడదు. అందుకై పై రెండు

తెలుంగుల మాట లిందున్నవా లేవా యని విమర్శించుట ముందు
ముఖ్యము.

హైందవుల సకల దేశభాషలకును వాని కాద్యప్రకృతిగా నిపుడు
కనంబడెడి సంస్కృత భాషకును గల సంబంధమును వానివాని యుత్ప
త్తిని జాలవఱకుఁ జర్చించి మనకొక దారి చూపినవారు పాశ్చాత్యులు-
అందుఁ గొందఱు ప్రపంచమందలి యెల్ల భాషలకును జన్మస్థాన
మాసియా ఖండముయొక్క మధ్యభాగమనియుఁ దానినుండి యొకా
నొకప్పుడు రెండుభాషా శాఖలు రెండుతెన్నుల బయలు వెడలిన
వనియుఁ జెప్పుచు, నొకదానికిఁ జేరినట్లుగాఁ గనంబడు భాషల నన్ని
టిని హైందవ యూరపు భాషావర్గముగాను, రెండవదానికి సంబంధించి
నట్లు కనంబడువానిని సిధియను భాషావర్గముగాను నిరూపించిరి. అందు
మొదటివర్గములో సంస్కృతమును, రెండవవర్గములో ద్రావిడభాష
లును జేరియున్నవని కొందఱి మతము. ద్రావిడభాషలు సిధియను
వర్గలోనివి గావని మఱికొందఱి మతము. దీనింగూర్చి వారివారిచర్చలు
వేర్వేఱుగానున్నను ద్రావిడ భాషల కన్నిటికి నొక మాతృభాష
యుండి యుండుననెడి ప్రధానాంశమున నేకీభవించుటచే వారి వాద
ములతో మనకిపుడు పనిలేదు. అందలి సారాంశమే మన మిందుఁ
గనుఁగొందము.[1] తనకుఁ బూర్వులు సమకాలికులు నగు నితర విమ
ర్శకుల వ్రాఁతలను గూడఁ గ్రోడీకరించుచు ద్రావిడభాషల పరస్పర
సంబంధమును విర్శించిన కాల్డువెల్లను పాశ్చాత్య పండితుఁడు వీనికి
మూలమయిన యొక భాష యుండుననియు, నది ద్రవిడభాష యనఁ
దగి యున్నదనియుఁ దెలుపుచు, నయ్యది పైశాచీ ప్రాకృతము
వ్యాపించిన పెక్కు దేశభాషలలో నొకటిగాఁ గనంబడుచున్నను
సంస్కృత ప్రాకృతముల సాహాయ్య మక్కఱలేని స్వతంత్రము సంపూ
ర్ణము నయిన భాషయై యుండుననుట నిక్కమని తమిళము తెలుఁగు

1 Comparative Grammar.

కన్నడము మున్నగువానిలోనికి వచ్చిన కొన్ని స్వతంత్ర ద్రవిడ పదముల నుదాహరించి నిర్ధరించుచుఁ బైఁగా ద్రవిడపదములే కొన్ని సంస్కృతమునఁ గలిసియున్నవని చూపియుండెను. 'గ్రీయర్సన్' అనెడి యింకొక పాశ్చాత్య విమర్శకుఁడు ద్రవిడ భాషావర్గములో బ్రాహ్వీ మున్నగు మఱికొన్ని భాషలను జేర్చుచు, నది హైందవార్య దేవ భాషావర్గముతో సంబంధము లేనిదనియుఁ గొందఱు తలంచునట్లు మూండ భాషావర్గముతోఁ గూడ సంబంధము లేనిదనియు నిరూపించి ద్రావిడ భాషలలోని స్వాతంత్ర్య బోధకములగు చిహ్నములతో వాని మాతృకయగు ద్రవిడభాషను నిరూపించిన వాడయ్యె.[1] అది యేదో యొక వర్గమునకుఁ జేరుఁగాక. సంస్కృతముతో సంబంధములేని యది స్వతంత్ర భాష యగుననుటయే యొక విశేషము. ఆ మాతృ భాషకుఁ దొలుత నేపే రుండెడిదో గాని మన యార్యులవలన దానికి ద్రవిడభాష యనుపేరు గలిగినదని యూహించుట సరిగాకపోదు. ఇందులకు వింధ్యగిరికి దక్షిణముగా నుత్కలదేశము వఱకుఁగల భూ భాగమంతయు ద్రవిడ దేశమనియు నందున్నవారు ద్రావిడులనియుఁ జెప్పుచున్న మన పురాణములే శరణము. ఈప్రదేశము క్రమముగా నైదు చీలికలగుటకును వానికి మహారాష్ట్రము, ఘూర్జరము, కర్ణాట కము, ఆంధ్రము, ద్రవిడము ననెడి సంకేతములు గలుగుటకును మన యార్యులే కారణమనుట తెల్లము. కాని మొదటి నాలుగు చీలికలు బైవిధముగా వేఱు పేళ్లుదాల్చి తమ తొంటిద్రవిడ నామమును బూర్తిగా విడచినవి గాని కడపటిదగు ద్రవిడఖండము, తరువాతఁ బాండ్య చోళచేర మండలము లనుపేర వేఱుపడియుఁ నప్పటికి నిప్ప టికిఁగూడ ముఖ్యముగాఁ బాండ్యచోళ మండల వాసులద్వారా, తన పూర్వ ద్రవిడనామము నట్లే కాపాడుకొనుచు వచ్చుచున్నది. ఇంను మొదటి నాల్గు దేశములలో నున్న బ్రాహ్మణులు మాత్ర మిప్పటికిని

---

1 Imperial Gazetter.

డాము [1] పంచద్రావిడులలోని వారమను చెప్పికొనుట గలదుగాని యితరజాతుల వారికీ మాటయే వర్తింపకున్నది. ఇందలి భాషలును, దమ మాతృ ద్రవిడమును మఱచిపోయినవనియే చెప్పవచ్చును. ఇంక మధురాది మండలములలోని వారో తమ్మును దమభాషను గూడ ద్రవిడనామమున వ్యవహరించికొనుట మనము వినుచునేయున్నారము. అందును బ్రాహ్మణవిపక్షయందు ద్రావిడులుగాక వేఱు పేర్లు గలిగిన యితర జాతులవార లిపుడిపుడు నాగరకత హెచ్చినకొలందిని దమ్ము గూడ ద్రావిడులమని చెప్పికొనుచున్నట్లు వినికిగలదు గాని దేశమున కిప్పటికి వాడుకలోనున్న ద్రవిడ నామమును బట్టి వారట్లు చెప్పికొనుట యుక్తము గాకపోదు. కావుని నెట్లయినఁ బంచద్రావిడ భాషలకు మాతృకయయిన యీప్రాచీన ద్రవిడభాషకుఁ బ్రథమ నివాస మీ ద్రవిడ ఖండమే. కాని [2]మరాటీ గుజరాతి భాషలు సంస్కృత ప్రాకృత జన్యములగుట, బంచద్రావిడ భాషలకు సంబంధించినవిగావని కొందఱ మతమయినట్లు మున్ను తెలియుటచేఁ బై యూహకు భంగము వచ్చునన్న మాట నిజమే కాని వానికంటె సహసంబంధము గల వానిసంఖ్య యధికముగుటం జేసి యీరెంటి నటుంచి కొంచెము దగ్గఱదగ్గఱగా నున్న మూఁడుభాషల కాశ్రయమయిన దొకటియుండ వలయుననుట నిశ్చయమే కావున బూర్వోక్తవిమర్శకులు దలంచినట్లది మన యుద్దిష్టమయిన ప్రాచీన ద్రవిడ భాషయే యని గ్రహింతము.

---

1 బ్రాహ్మణులకు ద్రావిడు లనెడి యీసంజ్ఞ ద్రవిడదేశమున నివసించిన వారగుటచే వచ్చినది గాని ద్రవిడులనెడి జాతికి సంబంధించిన వారగుటచే వచ్చినది గాదు. ఇది మహారాష్ట్ర కర్ణాట కాంధ్రాది విశేష సంజ్ఞలవంటిది. ఇట్లే బ్రాహ్మణులలో రెండవజాతికిఁ బంచగౌడు లనెడి సామాన్య సంజ్ఞ గలదు. కావున వీరే ఇందలి తొంటి ద్రవిడులనియు, వీరి సంస్కృత ప్రాకృతమువలననే యీదేశభాష ఉదయించినదనియు భ్రాంతి పడరాదు. దీనికిని ఇందలి తొల్లిటి వారికినిగూడ ద్రవిడ సంజ్ఞ యీ ద్రావిడుల మూలపురుషులు పెట్టినదనుట స్పష్టము.

2 ఇవి దేశ సంబంధమునఁ బంచద్రావిడములలోనివయినను భాషాసంబంధమున వానిలోఁ జేరవని చాలమంది యాశయము.

ఈ మూలద్రవిడభాష నుండి క్రీస్తుశక ప్రారంభమునకు మిక్కిలి పురాతన కాలమందే తమిళము (అఱవము తెలుఁగు విడిపోయిన వనియుఁ దరువాత వాని వెనువెంటనే కన్నడము విడివడినదనియుఁ, బిదపఁ గొంత కాలమునకుఁ దమిళము చేయూఁత నంది మళయాళమును, గన్నడము పొందునఁ దులువమును, వెడలినవనియు భాషా సాంప్రదాయవేత్తలు తలఁచుచున్నారు. కన్నడము వికారమై మిక్కిలి నవీనముగాఁ దలయెత్తిన కుడగుకూడ ద్రావిడ భాషలోనిదే యని కొంద అభిప్రాయపడి యున్నారు. ఏది యెట్లున్నను మూలద్రవిడము నుండి వచ్చిన వీనిలో మొదటి మూఁడే ముఖ్యములు గావున వీనిలోని సమానపదములఁ గొన్నిటిని సంస్కృత శబ్దములతోఁ బోల్చి చర్చించి వీనికొక మాతృక గలదనెడి వాదమును, అది సంస్కృతము నుండి పుట్టినది కాదను వాదమును స్థిరపఱచికొందము. ఇందులకు ముందుగా వ్యాకరణ విశేషాంశంబుల వీనికిని సంస్కృతమునకును గల భేదములలో ముఖ్యములయిన కొన్నిటి నిట్లరయఁదగును.[1]

౧ ఒకదానియందున్న కొన్ని యక్షరము లింకొక దానియందు లేకుండుట యెల్ల భాషలకు సమాన ధర్మమే కాని వర్ణసమామ్నాయమున నన్నిటిని మించిన సంస్కృతమందు లేని 'ఱ' శకటరేఫము వంటి వింత వర్ణము మూలద్రవిడములో మాత్రమే యున్నది. దాని పలుకుబడి ద్రావిడభాషలలోఁ గ్రమముగా వేఱయినది.

౨ స్త్రీ పురుషులనుగాక యితరములను దెల్పుశబ్దము లన్నియు ద్రావిడ భాషలలో నపుంసక లింగములు. అం దీనియమములేదు

---

1 ఇందు భాషలకు గుర్తులీవిధముగా నుండును.

సం—సంస్కృతము. తె—తెలుఁగు.

ద్ర—మూలద్రవిడభాష. క—కన్నడము.

ద్రా—తెలుఁగు, కన్నడము, తమిళము. త—తమిళము

మఱియు మూఁడేసి చొప్పున వరుసగా నుదహరింపఁబడిన వానిలో మొదటిది తెలుఁగనియు రెండవది కన్నడమనియు మూఁడవది తమిళమనియు, ఒక్కటియే యుదాహరింపఁబడినచో నది మూడింటియందు సమానమనియు గ్రహింపఁదగును

సరిగదా ? స్త్రీ పురుష తిర్యగ్జడ వాచకముల లింగములు తాఱుమా రగుట కూడఁ గలదు. కావున నర్థమునుబట్టి లింగము గలుగు విషయ మున ముఖ్యముగా నివి దానితో వేఱగుచున్నవి చూపుడుఁ. సంస్కృతమున 'దారాః, గృహాః, వృక్షః' ఇవి పుంలింగములు. వీని యర్థములిచ్చు పదములు వీనిలో "ఇల్లాలు, ఇల్లాళ్, ఇల్లాళ్, ఇల్లు, ఇల్, ఇల్; ప్రమాను, మర, మరం; అనునవి. ఇందు మొదటిది స్త్రీ లింగము. తరువాతివి నపుంసక లింగములు. వ్యాకరణ కావ్యాను కూల్యములకై మన లాక్షణికులు ప్రథమావిభక్తి యేకవచనము లోపించెడి శబ్దములను స్త్రీసమములనుగా వ్యవహరించిరిగాని యవి స్త్రీలింగములు గావు.

3 అందు నామవాచకములమీఁద వచ్చు విభక్తి ప్రత్యయములు మాఱుటయు లింగమునుబట్టి మాఱుటయు గలదు. వీనిలో నట్లులేదు. చూపుడు, ఇందుల కన్నిటిలోను ప్రథమ ద్వితీయ తృతీయా విభక్తుల యేకవచన రూపములు మాత్రము చూపఁబడును.

| | | | |
|---|---|---|---|
| సం | సు<br>రామః | అమ్<br>రామం | ఆ<br>రామేణ |
| | సీతా | సీతాం | సీతయా |
| తె | డు, ము, వు<br>ఒడయఁడు<br>అక్క | ని, ను<br>ఒడయుని<br>అక్కను | చేతన్, తోడన్<br>ఒడయుని చేతన్<br>అక్కతోడన్ |
| క | ఉ, అం<br>ఒడెయ<br>అక్క | అన్ను, అమ్<br>ఒడెయన్ను<br>అక్కన్ను | ఇంరం, ఇందె<br>ఒడెయిందం<br>అక్కయిందె |
| త | అన్, ఆన్, ఆళ్<br>ఉడయవన్<br>అక్కాళ్ | ఐ<br>ఉడయవనై<br>అక్కైయై | ఆల్<br>ఉడయవనాల్<br>అక్కైయాల్ |

పైని జూపిన విధముగా సంస్కృత విభక్తి ప్రత్యయములు మాఱు

టయు ద్రావిడభాషా విభక్తి ప్రత్యయములు మాఱకపోవుటయు నిక్కి నస్పష్టత కనఁదగును.

౪ ప్రథమపురుష క్రియాపదములనుబట్టి కర్తృవాచకముల లింగము వీనిలోఁ దెలియును. అందు దెలియదు. ఎట్లనఁగా ?

| కర్త | సం | తె | క | త |
|---|---|---|---|---|
| పుం | వాంఛతి | కోరుచున్నాఁడు | కోరుత్తానె | కోరుకిరాన్ |
| స్త్రీ | వాంఛతి | కోరుచున్నది | కోరుత్తాళె | కోరుకిరాళ్ |

ఇంకను మనవారే 'అది కోరుచున్నది' యని స్త్రీని దిర్యగ్జడము లలోఁ జేర్చిరిగాని యఱవవారు మాత్రము స్త్రీయెడ 'కోరుకిరాళు' అనియు జడాదులయెడఁ 'కోరికిరతు' అనియుఁ గ్రియలకు రూపభేద మును గల్పించుకొని యున్నారు. కన్నడములోఁగూడ జడవాచకము కర్తృపదమయిన యెడల 'కోరుత్తదె' అని ప్రయోగింపఁబడును.

౫ అందు వ్యతిరేకార్థమునఁ గ్రియాపదములకు 'న' కారము చేరును. వీనిలో గ్రియారూపములకే వ్యతిరేకార్థక శక్తిగలదు. ఇది మఱియు ముఖ్యమయిన భేదము.

| | సం | తె | క | త |
|---|---|---|---|---|
| పుం | నవాంఛతి | [1] కోరడు | కోరను | కోరాన్ |
| స్త్రీ | నవాంఛతి | కోరదు | కోరళు | కోరాళ్ |

౬ కర్మార్థక క్రియలు తఱచుగా నందుఁ గానవచ్చును. వీనిలోఁ గానరావు. అందుఁ గర్త్రర్థక ప్రయోగమునకంటెఁ గర్మార్థకప్రయో గమే సుగమముగా నుండును. 'వాఁడు చదువుచున్నాఁడు' అనెడి యర్థము నందే సంస్కృతమున 'తేనపఠ్యతే' యని పండితులు ప్రయో గింతురు. ద్రావిడ భాషలలో వాడుకలో నిట్టి ప్రయోగములు [వాని చేతఁ జదువఁబడుచున్నది] లేవు. సంస్కృత పారీణులయిన మన పూర్వ లాక్షణికులు పాణినీయ పద్ధతి నాంధ్రవ్యాకరణము నిర్మించి

1. ఈ క్రియను గూర్చి 'దేశ్యము' అను శీర్షిక క్రింద గ్రంథమున వివరింపఁబడును.

రనుటకు[2] ధాతువులకుఁ గర్మార్థంబునఁ బహు ధాతు వనుబంధముగా వచ్చునని వ్రాయుటయు నొక యుదాహరణముగాఁ గలదు. ఇట్లే పరిశీలించినచో నామక్రియా విశేషణ ధాతుజ విశేషణాదుల యెడ దానికిని వీనికిని బెక్కు భేదములు గనుఁగొనవచ్చును. ఇఁక వ్యాకరణ ప్రసంగమునిట్లుంచి వీనికిని దానికిని శబ్దజాలము నెడ సామ్య మున్నదా లేదా యని కొన్ని ముఖ్యపదముల నుదాహరించి చూతము.

| | తె | క | త | సం ఇంకను |
|---|---|---|---|---|
| | తల | తల | తలై | శిరః |
| | కన్ను | కణ్ణు | కణ్ | నేత్రం |
| | కై | కై | కై | కరః |
| | ముక్కు | ముక్ | మూక్కు | నాసికా |
| | పల్లు | పల్లు | పల్ | దంతః |
| | ఒడలు | ఒడలు | ఉడల్ | శరీరం |
| | తోలు | తోవల్ | తోల్ | చర్మ |
| | అప్ప( అబ్బ) | అప్ప | అప్ప | పితా |
| | అమ్మ | అమ్మ | అమ్మాళ్ | అంబా |
| | అన్న | అణ్ణ | అణ్ణన్ | భ్రాతా |
| | తమ్ముఁడు | తమ్మ | తంబి | అనుజః |
| | మామ | మామ | మామన్ | మాతులః |
| | అత్త | అత్తె | అత్తై | శ్వశ్రూః |
| | పేరు | పేర్ | పెసల్ | నామ |
| 2) | నీరు | నీర్ | నీర్ | నీరం |
| (3) | మన్ను | మణ్ణు | మణ్ | మృత్ |
| | నేల | నెల | నిలం | భూమి |

2. కర్మణ్యనుబంధస్స్యాత్ పతిధాతుః కర్తృవచ్చ తద్విధయః ఆం.

| | తె | క | త | సం ఇంకను |
|---|---|---|---|---|
| | ఊరు | ఊర్ | ఊర్ | గ్రామః |
| | పొలం | పొల | పులం | క్షేత్రం |
| | పులు | పులు | పులు | తృణం |
| | ఆవు | ఆవు | ఆ | గౌః |
| | పాలు | పాల్ | పాల్ | పయః |
| | నెయ్యి | నెయ్ | నేయ్ | ఘృతం |
| | మల | మల | మలై | పర్వతః |
| | పులి | పులి | పులి | పుండరీకః |
| | విల్లు | బిల్లు | విల్ | ధనుః |
| (5) | పూవు | పూ | పూ | పుష్పం |
| (6) | కాకి | కాగి, కాగె | కాక్కాయి, కాక్కై | కాకః |
| (6) | కోడి | కోళి | కోళి | కుక్కుటః |
| | ఒండు | ఒన్దు | ఒన్దు | ఏకః |
| | నూఱు | నూఱు | నూఱు | శతం |

ఇట్లే నిఘంటువులను జక్కగాఁ బరిశీలించినచో సంఖ్యావాచక శబ్దములన్నియును గృహములందును వివిధ వృత్తులయందును వాడుకొను మాటలును జంతువులను జడపదార్థములను దెల్పు పదములను ధాతువులోను మన యీమూఁడు భాషలయందును బాటింపరాని భేదముతో సమానముగా నున్నవి గొన్ని వందలుండును. ద్రావిడ భాషలలో బహుపదములకు సామ్యము గలదనెడి యీయభిప్రాయమున,

1, 2, 3, 4, 5, 6 తద్భవములుగా మనవారు పరిగణించిన యీ యాఱును మూలద్రవిడము నుండి వచ్చినవని తెలుపుటకే యిం దుదాహరింపఁ బడినవి. ఇట్టివి పెక్కు గలవు.

కాల్డువెల్లు పండితుఁడును మళయాళ నిఘంటువును బ్రకటించిన గుండర్టు పండితుఁడును, కన్నడ నిఘంటువును సమకూర్చిన కిట్టెలు పండితుఁడును గూడ నేకీభవించియున్నారు. ఇంకను మూఁడు భాషలును జక్కఁగా దెలిసిన పండితులు వీనిలో సమానపదములను విడఁదీయ మొద లిడినచోఁ గొన్ని వేలుండును. మఱియు, దొల్లిట ద్రవిడభాష నుండి వీనిలోనికి వచ్చిన శబ్దజాలములో నిసుమంతయుఁ బోలిక లేకుండఁగా మాఱిపోయిన శబ్దము లెన్ని వేలుండునో యూహింపఁదగినవే కాని చెప్పదగినదిగాదు. కావునఁ బై పట్టికలోఁ జూపిన యీమూఁడు భాషలలోని సమాన పదములు వాని ప్రక్కనున్న సంస్కృతపదము లతో నిసుమంతయు సంబంధింపకుండుటయే మూలద్రవిడము స్వతంత్ర మనుటకుఁ జాలును. కాని యీసందర్భమునఁ గొందఱు తద్భవములని తలంచెడి యీమూఁడింటిలోని కొన్ని పదములనుగూర్చి యించుక చర్చింపవలసి యున్నది.

ఒకవేళ నొకవస్తువును బోధించు పద మొకటియే యుండిన నుండ వచ్చును గాని వారు నిచ్చలుగనుచున్న వానికిఁ బేళ్లులేవనుట యసం గతము. పై పట్టికలోని "పూవు, కాకి, కోడి" యను పదములు 'పుష్పము, కాకము, కుక్కుటము' అనెడి సంస్కృత పదముల వలనఁ బుట్టినవని మన తద్భవ నిర్ణాయకుల మతము.

ఆ వస్తువులను జెప్పునపుడు మనదేశమందలి వారే కాక ద్రవిడ కర్ణాటక దేశముల వారు గూడ నాబాలగోపాల మెల్లరును బై పదములనే వాడుట యనాదిగా వచ్చునదిగాని నేఁటిదిగాదు. వీనికిఁ బర్యాయ పదములుగూడ సుప్రసిద్ధములయినవి లేవనుట సాహసము గాదు. అట్టియెడ వీనినిగూడ (ఇట్టి వనేకములు గలవు) తద్భవము లలోఁ జేర్చినచో నిముఁడు బాసలకును దల్లియయిన మూలద్రవిడ భాషను మాటలాడు తొల్లింటి ద్రవిడులు, మనయార్యులు తమతోఁ బుష్పమును, కాకములను, కుక్కుటములను దెచ్చి వారికిఁజూపి వాని

పేళ్లు చెప్పునందాక 'పూవు, కాకి, కోడి' లేకుండఁగానే యున్నారని చెప్పవలసివచ్చునుగదా! 'కాకా' యని కూయుపక్షికి, కాకి లేక కాక్కాయి యనియు, కోకో యని కూయుపక్షికి, కోడి లేక కోళి యనియుఁ బేళ్లు పెట్టుకొనకుండుటకు వారు మాత్రము నోరు వాయి లేనివారా? సంస్కృతమున మాత్రము వీని కింతకంటెఁ గనబడు గొప్ప వ్యుత్పత్తులేమున్నవి? మఱియుఁ బూవు శబ్దము తద్భవమను టకై పూచు ధాతువు పుష్పించు ధాతువు నుండి పుట్టినదనెడి భ్రాంతి మన నిఘంటువులకుఁ గలిగినది గాని యీపూశబ్దము తమిళ కన్నడ ములలో శుద్ధదేశ్యముగానే యున్నది. ఇట్లనుట మూలద్రవిడమందుఁ గాని ద్రావిడభాషలలోఁ గాని తద్భవములు లేవని చెప్పుటగాదు.

పైని దెలిపిన విషయములనుబట్టి తెలుఁగు తమిళము కన్నడము మొదలగు ద్రావిడ భాషలకు మాతృకయైన మూలద్రవిడభాష స్వతంత్రముగా నొకటి యుండెడిదనియు, దానినుండి విడిపోయిన యీ ద్రావిడభాషలలోఁ బైశాచీ ప్రాకృత శబ్దము లెక్కువగాఁ గలిసిన వనియు విదితమగును. కాని, మూలద్రవిడ మందలి శబ్దజాలమంతయు గుర్తు తెలియకుండఁగా మాఱిపోయిన ప్రాకృత పదజాలమేయనియు దానినుండి విడిపోయిన ద్రావిడభాషల శబ్దజాలము వికృతమేయనియు నొకవాదము లేకపోలేదు. ఆ వాదమునకుఁ గొన్ని యాధారము లున్నను, సంపూర్ణముగా మూలద్రవిడముగాని ద్రావిడ భాషలుగాని వికృతులేయని నిర్ణయించుట మాత్ర మెన్నటికిని సాధ్యపడదు. అందుచే నా చర్చవిడిచి తత్సమ తద్భవములకు వేఱయిన తెలుఁగు శబ్దజాలము శుద్ధదేశ్యమనియు దానికి సంస్కృత ప్రాకృతములతో నెట్టి సంబంధము లేదనియు విశ్వసింతము. మఱియు నదియే పైశాచీ ప్రాకృతముతోఁ గలసి మెలసి వర్తించి దేశీయుల నాడుకలో రూప భేదము నొందుచుఁ గ్రమముగా దమిళ కన్నడములకు వేఱయిన దనియు భావింతము. అదే మన తొంటి తెలుఁగు. కాని,

ఆ శబ్దజాలము తెలుఁగువారి వాడుకకుఁ దగినంత యుండెడిదా యని సంశయించుటకుఁ గాని, నేఁటి తద్భవకోశ నిఘంటువులనుబట్టి యింతే యున్నదని నిర్ణయించుటకుఁ గాని యవకాశము లేదు. ఏమనఁగా మూలద్రవిడము నుండి విడివడి వచ్చిన దేశ్య శబ్దజాల మంతయు నట్లే నిలచియుండలేదు. ఇచ్చటికి వచ్చిన యార్యుల ప్రాకృత పదము లిందు వాడుకలో హెచ్చుగా వ్యాపించుటచేఁ దెలుఁగు దేశ్యపదము లసంఖ్యాకముగా నంతరించినవనుట కెంతో యాధారము కలదు. ఇందుకుఁ గొన్ని యుదాహరణములు.

మన్ను-మట్టి-గోడ-కత్తి-గొడ్డలి-దివ్వె-తాడు-ప్రొద్దు-ఈఁత-మేఁక మొదలైన బహుశబ్దములు తద్భవములే యని నమ్మినచో నిత్యవ్యవహారమున నుండఁదగిన యీ శబ్దముల యర్థములు తెల్పు దేశ్యములులేవని చెప్పవలెనో, లోపించె ననవలెనో యూహింపుఁడు. ఇంతయేల ? స్త్రీ పురుష సామాన్యవాచకమైన మనుష్య శబ్దార్థమున మానిసి యను తద్భవమే గతియయ్యెఁ గదా ? ఇట్లు వికృతరూపము సిద్ధముకాఁగా దీనికి లాక్షణికులు వికృతి యను పేరు పెట్టిరి గాని వేఱుకాదు. దీనిని బట్టి తద్భవప్రాచుర్యమున దేశ్యము కొంత మఱుగుపడిన దనుట తెల్లము. ఇట్లు కొంత శబ్దజాల మడుగంటినను, ఆర్యుల సంస్కృత ప్రాకృతముల చెలిమిచే దేశ్యము పుష్టిగాంచి వన్నెకెక్కినదనిమాత్ర మంగీకరింపక తప్పదు. అదియే యిది యాంధ్రమను పేరు గాంచుటకు మొదలు.

# తద్భవ దేశ్య స్వరూపము*

సంస్కృత ప్రాకృతముల వలనఁ బుట్టిన పదములు తద్భవములు. అనఁగా "వర్ణలోప వర్ణాగమ వర్ణవ్యత్యయములను శాస్త్రప్రకారము పొంది వ్యవహరింపఁబడు శబ్దములు తద్భవము" లని లాక్షణికుల మతము. లాక్షణికులు కొందఱీ తద్భవ లక్షణ సందర్భమున సిరి - వెన్నుఁడు - జాజి - చందమామ మొదలగు కొన్ని శబ్దముల నుదాహరించిరిగాని యెల్ల వికృతి పదములకుఁ దగిన ప్రత్యేక నిఘంటువు లేదు. ఇటీవలఁ గేతనాప్పకవిసూరనాదుల సూచనల ననుసరించి శబ్దరత్నాకర నిఘంటు కర్తలగు శ్రీ సీతారామాచార్యులుగారు మిక్కిలి శ్రమచేసి యెల్ల తద్భవముల నొక్కచోఁ గూర్చి వైకృత దీపిక యనుపేర నొక కోశమును బ్రకటించిరి. సుమారు ౩౩౦౦ పదములను జూపుచున్న యిది భాషకు మహోపకారక మనుటకు సంశయము లేదు. కాని యందలి కొన్ని పదములు మాత్రము సంశయాస్పదములుగా నున్నవి. అట్టి పదములు రెండుమూఁడయిన నిపు డుదాహరింపఁ బూనుట సందర్భమును బట్టి తద్భవతత్త్వమును దెలుపుటకే కాని యాంధ్రలోకమునకు శబ్దరత్నాకరమును సమర్పించి దేశ భాషకు మహోపకారము గావించిన శ్రీ సీతారామాచార్యుల వారి వైకృతదీపికను విమర్శించుటకుఁ గాదని ముందుగా వారిని కృతజ్ఞతాపూర్వక వందనములతో స్మరించుచుఁ దద్భవస్వరూపము నించుక తెలిపెదను.

తొల్లి యార్యులకుఁ బ్రాకృతము గృహభాష యగుటచేతను, దేశమునఁ జాలకాల మది రాజకీయభాష యగుటచేతను దఱచుగా నందలి పదములు సమయ సందర్భములనుబట్టి వాడుకలోఁ బ్రవేశిం

---

* ఇది నా యాంధ్రవాఙ్మయములోని తద్భవదేశ్య ప్రకరణముల సంగ్రహము.

చుట నైజము. మఱియు నార్యులకు సంస్కృత మభిమానభాష యగుటచేఁ దదభిజ్ఞులు మాటలాడునపుడు సంస్కృతపదములు గొన్ని వాడుకలో దొరలుటయు సహజమే. అట్లు దొర్లివచ్చి యీ దేశ్యమునఁ జొచ్చిన యయ్యాపదము లప్పటిలోకుల నోళ్ళలోఁ బడి యుచ్చారణ వైషమ్యమునఁ బల్లటీలు గొట్టికొట్టి తుదకెట్లో కొన్ని మార్పులతో స్థిరపడఁగా వానినే మన ప్రాచీనులు తద్భవములనుగా వ్యవహరించిరని తెలిసికొనవచ్చును. అట్లు వాడుకలోనికి వచ్చిన యయ్యాసంస్కృత ప్రాకృత పదములు వారివారికిఁ దఱచుగా నోటికి వచ్చెడివై యుండును గాని యేమేదిన్యాది నిఘంటువులలోనో మూలమూలల నుండెడివై యుండవనుటయు, నాశబ్దము లపు డేయర్థముల వాడఁబడుచుండెనో యా యర్థములే వాని వికృతరూపముల నంటి యుండుననుటయు యుక్తము గాని రూపము మాఱినంతనే యర్థము గూడ మాఱుననుట యంత యుక్తియుక్తము గాదు. మఱియు నేదయిన నొకవస్తువును దెలిపెడిమాట వాడుకలో నొకటి లేక రెండుండును గాని నిఘంటువులలోని దాని పర్యాయపదము లన్నియు నుండవుగదా? లోకములో నెందయిన నీ పేరేమి? యని యడుగుటకు నీ నామధేయ మేమని యడుగువారు గొంద ఱుందురు గాని యిప్పట్టున సంజ్ఞ, అభిధానము, ఆఖ్య, అభిఖ్య, ఆహ్వాయము మున్నగు నామపర్యాయము లన్నియుఁ బ్రయోగించు వారుందురా? ఇట్టియెడఁ గొన్ని తద్భవముల గతి యెట్లున్నదో చూడుఁడు!

సంస్కృతమున ఖరు శబ్దమొకటి కలదు. దీనికి ధవళ తురగ శంభు దంతగర్వము లర్థములఁట. దీనిని నామలింగాను శాసనకారుఁ డెఱుఁగఁడు. దీనినుండి కోఱ గుఱ్ఱము పుట్టినవఁట. దంతదంష్ట్రల కభేదము పాటించికొన్నను ధవళ శంభు గర్వార్థములను దెలుపు పదము లింకను దీనినుండి పుట్టలేదు. పై రెండు పదములందును శకట రేఫ మున్నది. ఈ శబ్దములను దద్భవములనుట, "శకటరేఫము

తత్సమ తద్భవములందు లే" దనెడి కొందఱు వైయాకరణుల మత మును నిరాకరించి గురురేఫము తద్భవములం గూడం గలదనెడి స్వమతమును బలపఱచుకొనుట కుపయోగించునేమో కాని యీఖురు శబ్దము గుఱ్ఱమును కోఱను దెలుపుట కెపుడయిన వాడుకలోనికి వచ్చుట నైజమగునేమో యాలోచింపుఁడు. ఈ యర్థముల వాడం దగినవియు సర్వసామాన్యముగా సర్వత్ర యుపయోగింపబడుచున్న వియు నగు అశ్వతురగాదులు దంత దంష్ట్రాదులు నగు పదము లనే కము లుండఁగా, నే నానార్థరత్నమాలనో చంకం బెట్టుకొనిపోయి గుఱ్ఱమును కోఱను గూడం జెప్పవలసి వచ్చినపు డీ యనేకార్థము లను దెలుపు ఖురు శబ్దమును బ్రయోగించువాం డొకఁడేని యేకాల మున నుండు ననుట నమ్మఁదగి యుండునా? ఇదిగాక పెక్కువస్తువుల నొక్కటే పదము తెలుపుట వాడుకలో సహజమయినదా? ఇఁక వాడుకలోనికీ పదము రాకపోయినచో గూఢార్థకోశములను వెదకి ఖురు శబ్దమును సంపాదించి దానినుండి గుఱ్ఱము కోఱలను బూర్వు లెవరో పనిలేక పుట్టించి యుండురనుట యుక్తమగునా? కావున దీనింబట్టి దేశ్యములయిన కోఱ గుఱ్ఱములను దద్భవము లనుటకై వైకృతదీపిక ఖురు శబ్దమును సంపాదించినదో లేక యే యమర పద పారిజాతములోనో యిది వెలసిన తరువాతనే యవి దేశమున నుద యించినవో యూహింపుఁడు. ఇఁక దీని నిట్లుంచి యింతకంటెను వింత యయిన యింకొక దానిం జూతము.

కుండ శబ్దము త్రిలింగమైన గీర్వాణపదము. దీనికి వంటకుండ, జారజుఁడు, నిప్పులగుండము నని సుప్రసిద్ధము లయిన యర్థములు గలవు. ఇంకను గొన్ని యర్థము లందందుం గలవు గాని యమర కోశము దీని మొదటి రెండర్థములనే యెఱుఁగును. వైకృత దీపికలో దీనినుండి పుట్టిన పదములు కుండ – గుండము – గుండు – గుంట – గుంత – గుట్ట – కొండ – కుంట అను నెనిమిది. పై సంస్కృతపదము

రూపాంతరమయిన కుండికాశబ్దము వలన గుండిగ పుట్టి యుండే
యున్నది. ఇట్టియెడఁ దద్భవము ప్రకృత్యర్థము కంటె భిన్నార్థమును
గూడఁ దెల్పుననెడి మహారాజసూత్ర మాధారముగా నున్నపు డెల్ల
విధములఁ బైవానిం బోలిన గండ - గండి - గిండి - గుండ - గొండి -
గంటు - గట్టి - గట్టు - గిట్ట - కుంటెన - కొండిక - మున్నగు వానింగూడ
దీనినుండి పుట్టినట్లుగానే నిరూపించినచో వీనికై యితర ప్రకృతులను
వెదకెడి యావశ్యకతయు లేకపోవును. తద్భవభారము నొకతట్టు కుండ
శబ్దమే యాఁపి యుండును గాని యివిమాత్రము దీనినుండి తప్పి వేఱు
చోట్లఁ బుట్టినవి. చూచితిరా! ఇన్ని యర్థముల నొక్క కుండపదము
వాడఁబడె ననుటకంటె వింత వేఱుండునా? ఇట్లల్పమయిన యక్షర
సామ్యమునే యాఁతగాఁ గొని తద్భవ మర్థాంతరమును దెల్పు ననెడి
సూత్రమునే చేతఁగొన్నచో నాంధ్రదేశ్యపదము లన్నియుఁ దద్భవము
లగుటయే కాదు లోకములోని సకల భాషాపదములు సంస్కృత
భవము లనుట కాటంక ముండునా? ఇట్లే వైకృతదీపికలోని సంస్కృత
తద్భవపదములను బరిశీలించినచో దాదాపుగా నాలుగైదు వందల
దేశ్యపదము లయినఁ దద్భవములుగా మాఱినట్లు కనఁబడక పోవు.
ఆ పదము లన్నియు శబ్దరత్నాకరమునఁ గూడ వైకృతములుగానే
నిరూపింపఁబడి యున్నవి. కావునఁ దద్భవ వివక్షయందు వ్యవహార
యోగ్యత, అక్షరసామ్యము, అర్థసంబంధమును ప్రధానము లగు నని
తలంపవలయును గాని తోఁకను జూచినంతనే పులి యనునట్లుగా
నయినదియుఁ గానిదియుఁ దద్భవమని తలంపరాదు. ప్రకృత్యర్థము
నకు నాలుగామడ దూరమున నున్నవియు శకటరేఫము గలవియు
సర్వజన సామాన్యముగా వ్యవహారమున నుండక సుప్రసిద్ధ సంస్కృత
భాషాగ్రంథములలోఁ గూడ లేక యే నిఘంటువులలోనో మాఱు
మూలల నుండు పదములతో నించుక యర్థవర్ణసామ్య ముండియు
నుండనట్లుగాఁ గనఁబడునవియు నగు తెలుఁగు పదములు తద్భవము

లని భ్రాంతిపడరాదు. ఇట్లు చెప్పుటచే నన్నియు దేశ్యములే యన వచ్చు నని యాక్షేపింపరాదు. పై ప్రసంగము ననుసరించి యుక్తి యుక్తములై నిర్బాధకములై కనఁబడు కొమరుఁడు, పయనము, గోనము, దేవళము, చక్కెర, రాతిరి, కన్నియ మున్నగువాని నెవరు తద్భవము లనరు? వైకృతదీపికలోని అంతః=అందము, భీతః=బీద, భరః=పరువు, ఉరః=ఱొమ్ము, కుండలం=గుండ్రము, మొదలుగాఁ గలవాని నెవరు తద్భవము లని నమ్మెదురు. ఇందు లోపల ననెడి యర్థమిచ్చు "అంతర్" అనెడి రేఫాంతావ్యయమునుండి కాని, నాశము, తుద, కడపటిది యను నర్థములిచ్చు 'అంత' శబ్దమునుండి కాని 'అందము' పుట్టె ననుట హాస్యాస్పదము గదా? ఇఁక నమర సింహుఁడు గూడ నెఱుఁగని సౌందర్యార్థకమయిన యంత శబ్ద మెందయినఁ గలదేమో యనుకొందము. అది యంద మను నర్థమున వాడుకకు రాఁదగి యున్నదా? కానిచో దీని కంద మను వికృత రూప మెట్లువచ్చును? ఇఁకఁ దక్కినవాని యౌచిత్యమును బాఠకులే విమర్శింతురుగాక.

ఇపుడు స్వార్థమును విడిచి వాణిజ్యమనెడి యర్థమున వర్తకశబ్దము మెల్లగా వాడుకలోఁ బ్రవేశించి యిప్పటి గ్రంథములఁ బ్రాఁకుచుండ లేదా? అక్షయ శబ్దార్థమును విడిచి "అక్కజము" పూర్వగ్రంథ ముల నాశ్చర్యార్థములఁ బ్రయోగింపఁ బడలేదా? కావునఁ దద్భవ మర్థాంతరద్యోతకము గాఁగూడదను నియమ మెక్కడిదియని యాక్షే పము రావచ్చును. సత్యమే. వర్తకమువంటి తత్సమపదము లిట్లు ప్రవేశించుట యెంతవఱ కర్హమో ప్రాజ్ఞలోకమే నిర్ణయించుకొనుఁ గాక! ఇఁకనో యర్థాంతరరూఢము లయిన తద్భవములు గొన్ని భాషలో లేవనుటకై యీప్రసంగ మెత్తినదిగాదు. అట్టిపదములును గావ్యంబుల లెక్కకెన్నో గానరావు. ఒకవేళఁ బెక్కులున్నవని యంగీకరింపఁ దగియున్నను నవి పేద, కత్తె మున్నగు వానివలెఁ

బ్రకృతి భావమునకుఁగూడ దూరముగా నున్నట్లుగానరావు. మఱి యర్థమునవచ్చు కర్త్రియను బ్రత్యయము కర్తృశబ్దమునుండి పుట్టినదని నమ్మువారికిఁ జెప్పఁజాలను గాని ప్రకృతికి శుద్ధవిపరీతములు విస్మయజనకములు నగునట్టి తద్భవములందు విశేషించి కానరావు. అట్లున్నచో నట్టివి తద్భవములు గావనియే చెప్పవచ్చును. కావునఁ దద్భవము ప్రకృత్యర్థమున కించుక యొడముగాఁ గూడ నుండుననుటకుఁ బ్రయోగఁములు గొన్ని లభించినంత మాత్రమున నయినవానిని గానివానిని గూడ దద్భవము లనరాదనుటకే యింత చెప్పవలసి వచ్చినది గాని మన బాసకు మేలొనగూర్చిన తద్భవములను దేశ్యములని సాధించుటకై కాదని యూహింపఁదగును. మఱియుఁ బూర్వలక్షణకర్తలే యీ తద్భవదేశ్య నిర్ణయమునఁ బొరపడి యున్నారనుటకుఁ గూడ నొక నిదర్శన మరయుఁడు. మంచెల్ల వాసుదేవకవి తన వైకృతచంద్రికలోఁ బైశాచీభవములను జూపుచు నందు నెలవు, పైరు, శబ్దములను గూడఁ జేర్చెను. ఇవి శబ్దరత్నాకరమున దేశ్యములుగా నున్నవి. ఇట్లే కేతన, అప్పకవి మున్నగువారుగూడఁ దద్భవములుగా నిరూపించినవానిని మఱికొందఱు దేశ్యములనుటయు వారు దేశ్యములన్న వానిని మఱికొందఱు తద్భవము లనుటయుఁగూడఁ గలదు. కావునఁ బ్రకృత్యర్థాదులను మున్ను చెప్పినట్లుగాఁ జక్కఁగాఁ బరిశీలించి తద్భవ నిర్ణయము సేయుట యుచితమని నా యభిప్రాయము.

ఇఁక దేశ్యస్వరూపమునుగూర్చి మిక్కిలి విపులముగా వ్రాయఁబడి యున్నది గాని వ్యవధి చాలకపోవుటచే నాప్రకరణము కడపటి మాటలను మాత్రమిపుడు విన్నవించుచున్నాను.

దేశ్యమును గూర్చి తన వికృతి వివేకమున నథర్వణాచార్యుఁ డిట్లు ప్రశంసించి యున్నాడు :—

“ భాషేయ మనితా దేశ్యాత్రత్ర చిత్రస్వభావయుక్
తచ్చిత్రతాతు ద్రష్టవ్యా పూజ్యపాద సుభాషితే ”.

ఈ సుభాషితము దేశ్యరీతి కావ్యమైనను లేక లక్షణ గ్రంథమైనను నందు మనోహరమయిన దేశ్య ప్రసంగ ముండుననుట కనుమానము లేదు. అయిననేమి ! సుభాషితమున దేశ్యచిత్రత చూడుఁ డనెడి యథర్వణుని యుపదేశమునఁ గూడ మన కిపుడు చందమామ ఘుటి కయే నిజమైనది. కాని యతడు భావనుండి వేఱుచేసి దేశ్యము నిట్లు పొగడుటచే నిది తప్పక కావ్యరచనకుఁ గూడఁ దగినంతటిదై యుండు ననెడి యభిప్రాయము మాత్రము సిద్ధపడకపోదు.

ఇట్టి దేశ్యమునఁ గొంచె మెచ్చుగా మూఁడువేల పదము లుండునని యిప్పటి శబ్దరత్నాకరాదుల వలనఁ దెలియం గలదు. అంతరించిన వెన్నుండునో యూహింపఁజాలము. మన్ను, మట్టి, పొలము, మేఁక, పిల్ల, గొఱ్ఱె, కాకి, మున్నగుపదములు తద్భవము లనియే మనము విశ్వసించినచో సర్వజన వ్యవహారమున నుండఁదగిన యీపదముల స్థానములలోని దేశ్యపదములు పోయినట్లే కదా ! ఇంత యేల ? మానవజాతి సామాన్య వాచకపదము దేశ్యమునఁ గానరాదు. మానిసి యనెడి తద్భవమే యిందులకు గతియయినది. దీనిచే నైన దేశ్యములు గొన్ని యడుగంటినవని తెలియకపోవునా ? ఇందుల కొక యుదాహరణ మరయుఁడు. అమ్మ - నీరు - ఇవి తద్భవము లనియే యొప్పికొందము. ఇందు మొదటిది దేశమంతట నాబాలగోపాలము వాడుకలో నున్నను దేశ్యమయిన తల్లిగూడ మిగిలియున్నది. కాని నీటిని దెల్పు దేశ్యపద మేది ; అపుడు వారు చూడనివానికిఁ బేర్లెట్లు వచ్చు ననుకొందమన్నను నీరు చూడని ప్రాచీనదేశీయు లుండిరా ? ఆగ్గి, నిప్పు మొదలగువానిలో, అగ్గిని నిప్పు, బట్టను గుడ్డ, కడవను ముంత, యంటికొని వచ్చినట్లుగా నీటితోఁ గొట్టుకొని వచ్చిన దేశ్య పదమే కానరాదు. దీనింబట్టి చూడఁగాఁ దద్భవములు దేశమున నలమికొను కాలమున నార్యులవలెనే యిందలి పాత కాఁపులును

వానినే వాడుచువచ్చుటంజేసి కొన్ని దేశ్యములు మెల్లమెల్లగా జాతి యుండునని తోఁపక మానదు. కావున లోక వ్యవహారమున కత్యంతా వశ్యకము లయిన విషయములలో నెందెందుఁ దద్భవపదము మాత్రమే కనఁబడుచున్నదో యందందు ముందున్న దేశ్యపదము లోపించి యుండునని యూహించుటకు ముందుగా నది తద్భవమగునా కాదా యని విమర్శించుట మాత్ర మత్యావశ్యకము.

ఇది యిట్లుండ దేశ్యములో నన్యదేశ్యములు గొన్ని కలిసి యున్న వని యర్వాచీన లక్షణముల వలనఁ దెలియుచున్నది. అందు కావు తవరలవంటి యనాంధ్రవర్ణయుక్తములు, సుమారు, సెబాసు మున్నగు నాంధ్రవర్ణయుక్తములును స్పష్టములే కాన వాని చర్చతోఁ బనిలేదు. ఇఁకఁ దావిమోవిఁబోలిన యాంధ్రవర్ణ యుక్తములను గుఱించి ప్రశంసింపవలసి యున్నది. వాగనుశాసనాదు లన్యదేశ్య ప్రశంసచేసినట్లు కానరాదు, గాని, వారి తరువాతివారు వేని నన్యదేశ్యములనుగాఁ బరిగణించిరో యవి భారతములోఁ గనఁబడుచునే యున్నవి. కావున నట్టివి భారతరచనకుఁ బూర్వమే భాషలోఁ జేరినవనుట నిక్కము. కాని యన్యదేశ్యము లనఁగా నేవో యాలోచింతము. కేతనకవి,

ఆ. తత్సమంబు నాఁగఁ దద్భవంబన నచ్చ,
తెలుఁగునాఁగ దేశి తెనుఁగునాఁగ
గ్రామ్యభాష నాఁగఁగల వైదు తెలుఁగులు,
వేఱువేఱ వాని విస్తరింతు.

అని ప్రతినసలిపి యచ్చతెలుఁగు దేశితెనుఁగు భేదమున దేశ్యమును విభజించి యెల్లరకుఁ దెలియుపలుకు లచ్చతెలుఁగు లనియుఁ గొందఱకు మాత్రము తెలియు తెఱఁగుఁ బలుకులు - దేశి తెలుఁగులనియు నిర్వచించి దేశితెలుఁగునకు నూఱు పదము లుదాహరించి యున్నాఁడు. అప్పకవియును గేతన యభిప్రాయమున కనుగుణముగానే దేశ్యమును ద్వివిధముగా విభజించి

గీ. ఆంధ్ర దేశ పురస్థాయులైన సకల,
జనములకును మఱుంగు లేశంబు లేక
తేట తెల్లమిగాఁ బల్కు మాటలెల్ల,
నవని శుద్ధాంధ్ర దేశ్యంబులనఁ గబరఁగు.

క. కేశవ ! యాంధ్రులు నానా,
దేశంబుల యందునిలిచి తెలుఁగులె తత్త
ద్దేశోక్తులంటఁ బలిగిన,
నాశబ్దము లన్య దేశజాంధ్రము లయ్యెన్.

అనుచుఁ దద్భేదంబులకు లక్షణములు వ్రాసి రెండవజాతివానికి రమా రమి యఱువదిపదము లుదాహరించెను. ఇం దీతని రెండు లక్షణము లను వాని యుదాహరణములను బరిశీలించినచోఁ గేతనాప్పకవు లేకాభి ప్రాయు లైనట్లు స్పష్టపడఁగలదు. ఇందులకు వీరిరువురు నుదాహ రించిన వెలఁది, తొయ్యలి, చెలి, బోటి, కౌను, వెన్ను, తావి, మోవి, మొదలగుపదముల యేకీభావమే ప్రమాణము. దీనివలనఁ నాంధ్రవర్ణ యుక్తములయిన యన్య దేశ్యము లనఁగా నితరభాషలనుండి యిందుఁ గలిసిన పదములు గావనియు, వీరు చెప్పినట్లుగా నితర దేశములఁ గొంత కాలము నివసించి యిం దరుదెంచిన తెలుఁగువారి తెలుఁగు మాట లనియు నవియే యిందలివారికిఁ గ్రొత్తవియై కొందఱకు మాత్రమే తెలిసెడి తెఱఁగుఁ బలుకులైన దేశి తెలుఁగు లనియు గ్రహింపనగును. అన్య దేశ్యతత్త్వ మిట్టిదగుటయే వాగనుశాసనాదులు దీని ప్రశంశ యెత్తకపోవుటకుఁ గారణమయినది. ఇట్లాంధ్ర దేశ్యములో నన్య దేశ్య మంతర్భూతమయినదే కాని వేఱుగాదని తెలిసికొన్నను మన మింత టితో నీప్రసంగము దాఁటలేదు. ఏమనఁగా ; పైని జెప్పినట్లుగాఁ గేతనకవి చూపిన దేశి తెలుఁగులోని ఉవిద, వేనలి, నాన మున్నగు వానిని, అప్పకవి చూపిన యన్యద్దేశ్యాంధ్రముల లోని బవరము, దురము, వేసవి మున్నగువానిని మన వైకృతదీపికా శబ్ద రత్నాకర

ములు తద్భవములనుగా జూపుచున్నవి. మరలఁ జూచితిరా? తద్భవ మహత్త్వ మెంతవఱకుఁ బోయినదో! ఇవి దేశ్యములని వారిమాట నమ్మఁదగునో తద్భవములని వీరిమాట నమ్మఁదగునో విద్వల్లోకమే నిర్ణయించికొనుఁగాక. కావునఁ బరిశీలింపక వర్ణీయాక్షర సామ్య మాత్రమున నయినవానిని గానివానిని గూడఁ దద్భవము లనరా దనియు, నాంధ్రవర్ణయుక్తములని లాక్షణికులు చూపిన వన్నియు నన్యదేశ భాషలలోనివిగాక యితర దేశములనుండి వచ్చిన యాంధ్రుల తెలుఁగు పలుకులేయనియు విశ్వసింపఁదగునని నాయభిప్రాయము.

అట్లు కానిచో మనభాష సగము తత్సమపదముల క్రిందను గొంచెము తక్కువగా సగము తద్భవముల క్రిందను దక్కినది యన్య దేశ్యముల క్రిందను బోఁగాఁ ద్రిలింగ దేశ్యము మొదటికే మోసము వచ్చునుగదా!

కావున నోభాషాభిమానులారా! వ్రాల తేలికయు వీనులవిం దగు నుడికారమును దేనె లొలుకు పలుకుబడియు గలిగి, యెల్లదేశ భాషలందు లెస్స యనిపించుకొనునట్లుగా నెల్ల సుగుణ సంపదయందును దేవవాణి నోటినుండి యూడిపడినట్లుగాఁ దత్సమ తద్భవముల సహాయ్యమును గాంచి యేడవ శతాబ్దినాటికే గ్రాంథిక స్థితికి వచ్చి నట్లుగాఁ గానవచ్చుచున్న మన త్రిలింగ దేశభాష యొక స్వతంత్ర భాషయనియుఁ గాలకర్మవశమునఁ గొంతకాల మడుగంటియుఁ బిదప సంస్కృత ప్రాకృత భాషల చెలిమిచేఁ గౌరవస్థితికి వచ్చినదనియు, నీ సత్యము నాధారముగాఁ జేసికొని యేదో యిసుమంత పోలికయున్నను లేకున్నను గూడ నిందలి పదముల నెల్లఁ దద్భవములనుగాఁ బరిగ ణించుట యుచితము గాదనియుఁ, దద్భవములను, నన్యదేశ్యములను నిర్ణయించు పట్టునఁ బరస్పర విరుద్ధములుగా నున్న పూర్వలాక్షణికుల వ్రాఁతలనే కేవలము విశ్వసింపక యర్థ సందర్భాదులఁ బరిశీలింప వలయు ననియు మనవి చేయుచున్నాఁడను.

# ఆంధ్ర భాషా సంప్రదాయము

## "భాషేయ మమితా దేశ్యా తత్ర చిత్రస్వభావయుక్"

వ్యక్తవాక్కు భాష. అనఁగా ఒకరి యభిప్రాయ మొకరికిఁ దెలియుటకై మానవు లేర్పఱచుకొని విస్పష్టముగా నుచ్చరించునట్టి వాగ్రూపములైన గుర్తులు. అది యొక్కొక్క దేశమువారి కొక్కొక్క విధముగా నుండి, ఆ దేశీయుల పేర దేశభాష యగును. అట్టిదే ఆంధ్ర భాష.

ఆర్యులు రాకపూర్వము తెలుఁగునాట ననాదిగా నున్న పాఁత కాఁపుల వాడుకలో నున్నమాటలును, ఆర్యులు వచ్చినతరువాత నందు ప్రవేశించిన సంస్కృత ప్రాకృత శబ్దములును, కలిసి ఆంధ్ర మనుపేర మనభాష యేర్పడినది. ఇది సుమారు రెండువేలయేళ్ల క్రిందటిమాట. అయితే నేమి? నాఁటి తెలుఁ గిట్లుండునని, ఊహించవలసినదే కాని దానికి నిదర్శన మేమియు కనఁబడదు. కనఁబడినంతలో నాఁటి వర్ణక్రమాదికము కొంచెము తెలుపుట కెనిమిదో శతాబ్ది కీవలఁ బుట్టిన కొన్ని శాసనములు తోడ్పడుచున్నవి కాని, అవి మనయుద్దిష్టార్థము విశదీకరింపజాలవు. అందుచేఁ బూర్వగ్రంథములే శరణము. అందు మొదట గణింపఁదగినది భారతము. అదైనా పుట్టినది పుట్టినట్టుగా దొరికితే యెంతో సంతోషించియుందుము కాని, అట్టి భాగ్యము పట్టలేదు. లభించిన ప్రాఁతప్రతులలోని వివిధములైన పాఠాంతరములు చూడఁగా, లేఖకుల యవివేక ప్రమాదాది దోషములవల్ల గ్రంథకర్తల ప్రయోగము లనేకములు మాఱిపోయినట్లు స్పష్ట మగుచున్నది. దీనికిఁదోడు ముద్రణములలోఁ గ్రమక్రమముగా మఱికొన్ని ప్రయోగములు మాఱువేషము వేసినవి. ఇందుకుఁ గారణములు రెండే. భారతమున కెంతో తరువాతఁ బుట్టినను, ఆంధ్ర

శబ్దచింతామణి బాలవ్యాకరణ సూత్రములకు విరుద్ధముగాఁ గనఁబడిన వాటికర్మ మొకటి. ఆంధ్రభాషా సంప్రదాయ మెఱుఁగని యఱవ తెలుఁగువారు పాఠపరిష్కర్త లగుట మఱియొకటి. ఆ వ్యాకరణ ములు శాసింపని ప్రయోగము లుండ రాదనెడి పరిష్కర్తల శాస నము సుమారు ముప్పది నలుబది యేళ్ళక్రిందటఁ బుట్టినదే కాని, అంతకు ముందున్నట్లు కనఁబడదుగాని, అంతకు వెనుకటి ముద్రణము లకు మఱికొన్ని యనర్థములు పట్టినవి. ఏలాగైతే నేమి! ఇప్పటి ముద్రితాముద్రిత భారతములోని కొన్ని ప్రయోగములు కవిత్ర యమువారి నోళ్లనుండి పుట్టినవి కావు. ఈదురవస్థ భారతమునకే కాదు. చెన్నపురిలో ముద్రింపఁబడిన ప్రబంధముల కన్నిటికిని బట్టి నది. ఇది యిట్లుండనీ! వ్యాకరణముల మాట కొంచెము మాలో చింతము.

నన్నయార్యుని పర్వత్రయి కాతని భాషాసవిమర్శజ్ఞానమే లక్ష ణము. నన్నెచోడ తిక్కనాది కవీంద్రులు కొందఱి కతని రచనము లక్షణము లక్ష్యమునై దారిచూపినది. వారి సవిమర్శ వ్యవహార భాషాజ్ఞానమును వారికిఁ దోడ్పడినది. తిక్కన సమకాలికుఁడు కేత నార్యుఁడు తరువాత నాంధ్రపద్యరూపమున నాంధ్రభాషాభూషణ మనుపేరఁ జిన్నవ్యాకరణము రచియించెను. అది, ఆంధ్రభాషాబహిరా కార మదిగోయని చూపించిన యసమగ్రలక్షణము. అధర్వణుని లక్షణ మంతకంటె నించుక విపులమై భాషా సాంప్రదాయముపై నొకింత దృష్టి నిలిపినదిగాని కాలకర్మవశమున దానికి వ్యాప్తి కలిగినది కాదు. ఆంధ్రశబ్దచింతామణి పాణినీయపద్ధతి ననుసరించినను, దాని వలెఁ గవిప్రయుక్తశిష్టవ్యవహృత శబ్దములకుఁ దా ననుశాసనము గాక నిరంకుశమైన ప్రభుశాసనమైనది. అది పైలక్షణముల కంటె హెచ్చుగా నన్నివిషయములు స్పృశించిన దైనను దననాఁటికి లభిం చిన యనేక శబ్దములకు గతి కల్పించినది కాలేదు. అయినను సంస్కృత

శ్లోక నిబద్ధమైన యాలక్షణము దేశమందలి సంస్కృతాభిజ్ఞుల యాదరమునఁ బఠనపాఠ వ్యవహారమునఁ జక్కఁగా వ్యాప్తిని గాంచి నది. బాలవ్యాకరణము పుట్టువఱకును దెలుఁగున కదే వ్యాకరణ మనవచ్చును. పిదపఁ జెప్పఁదగినది దాని వ్యాఖ్యానమైన యహోబల పండితీయము. కాని, అది సంస్కృతభాషలో వ్రాయఁబడినది. అక్క డక్కడమాత్ర మించుక వ్యాపించినది. ఇంకను మఱికొన్ని కలవు గాని, పిదప గణింపఁదగినది బాలవ్యాకరణమే. తెలుఁగున మంచి పద్ధతిని వ్రాయఁబడిన తెలుఁగు వ్యాకరణ మిదే. ఇది యుదయించిన ముహూ ర్తము మంచిది. ఇది పుట్టినంతనే తననాఁ డంతమాత్రపు వ్యాకరణము లేకపోవుట చేతను, ఆంగ్లపాఠశాలలలోని తెలుఁగు విద్యార్థులకు ముఖ్య పాఠ్యగ్రంథమగుటచేతను, విషయముచేతనుగూడఁ బ్రశస్తి గాంచి, నేఁటివఱకును దేశమున విశేషవ్యాప్తి గాంచుచున్నది. ఇపు డాంధ్రదేశమందున్న పండితు లందఱును ముందు దానిని జదివి తరువాతఁ గావలసినఁ జింతామణ్యాదులు చూచినవా రనుట సత్యము. అందుచే మన కందఱికినిగూడఁ బ్రాథమిక భాషాజ్ఞాన ముపదేశించిన దానికి మ్రొక్కవలసినదే. కాని, చిన్నయసూరి లోకజ్ఞుఁడును నన్న యాది పూర్వమహాకవుల గ్రంథములు శ్రద్ధగాఁ జదివినవాఁడు నయ్యుఁ దన కాలమునకు భాష పలుతెఱంగుల మాఱుచువచ్చిన విషయము తెలిసిన వాఁడయ్యు నేకారణముచేతనో పూర్వమహాకవుల యనేక ప్రయోగముల కనుశాసనము చేయక, పైఁగా వారి ప్రయోగములు కొన్ని యసాధువు లని కంఠోక్తిగాఁ జెప్పి కవిత్రయమువారి ప్రయో గములు గూడఁ గొన్ని యసాధువులని తోఁచునట్లు సూత్రముల సూచించి వ్యాకరణకర్తముఖ్యకర్తవ్యమును జక్కఁగా నిర్వహింపలేదని విచారింపవలసి వచ్చినది. నిజముగా నతఁడే పూర్వశిష్టప్రయోగ దృష్టితోఁ బాణినికాత్యాయనుల మార్గ మనుసరించెనేని యీ మధ్య కాలమున భాష కిట్టి దుర్గతి పట్టకపోవును. కాని, భగవంతుఁ డతని

కాబుద్ధి పుట్టించలేదు. వ్యాకరణము లీ తీరున నున్నపుడు నిజమైన భాషా సంప్రదాయము దేశీయులకు, దెలియలేదన్న, దప్పేమి? ఇఁక నీ విషయ మిట్లుంచి ముందు చూతము.

ఏదేశమం దయినా, పండితపామరు లందఱు "భాష ముందు పుట్టినది, వ్యాకరణము తరువాతఁ బుట్టినది" అని యేకగ్రీవముగా నంగీకరింతురు. వాడుకలో నున్న దేశభాష కాలక్రమమునఁ దప్పక మాఱుచుండు నని విశ్వసింతురు. కాని, మన యాంధ్రులలో మాత్రము కొందఱీ మాటలు చెవిని బెట్టరు. కావ్యయజ్ఞమందు సుశబ్దచాగపశ్వాలంభము చేయునట్టి వైదిక కర్మనిష్ఠులైన యామహావిద్వాంసులు వ్యాకరణ మపౌరుషేయము నిత్యమునైన వేదమనియు, దానివల్లనే భాషాసృష్టియైనదనియుఁ ద్రికరణ శుద్ధిగా నమ్మెదురు. వారి మతములో, ఆంధ్రశబ్దచింతామణి మంత్రము. అహోబల పండితీయము బ్రాహ్మణము. బాలవ్యాకరణము కల్పసూత్రము. అంతే. తక్కిన సూత్రగ్రంథమంతా కల్పితము, పౌరుషేయము, కావున నది కావ్యకర్మాచరణమున నుపాదేయము కాదని ఢంకా మీద దెబ్బ కొట్టి, చెప్పెదురు. అంతే కాని 'ఇది యసమగ్రము. ఇందు లేనివిషయములు పూర్వుల ప్రయోగపద్ధతినిబట్టియు గ్రహించవలెను' అని వారికిఁ దోఁచదు ఇతరులు చెప్పినా వినరు. వారు పట్టినకుందేటికి మూఁడే కాళ్లు. అట్లని వారు, తమ వేదశ్రౌతములకు, కట్టుపడి యుంటే బాగానే ఉండును. అట్లుండక, ఎందును బొందని ప్రయోగసృష్టి యారంభించిరి. దానితో సంఘము రెండు చీలికలైనది. ఆరెండు పక్షములకు యుద్ధమారంభమైనది. అది నేఁటికిని జరుగుచునే యున్నది కాని, మొదట మూఁడు నాలుగేళ్ళు నిరంతరము పోరు జరుగునప్పటికి రెండు పక్షముల వారికిని గాళ్ళు చల్ల పడినవి. ఆపోరు వర్ణనాతీతము. దాని కేమి కాని, ఏదో స్వలాభ మపేక్షించి మొదట గ్రాంథిక భాషావాదము కృత్రిమమని చేతా వాతా

చెప్పుచు, వ్యావహారిక భాషాధ్వజము బుజాన వేసికొని, ఊరూర నూరేగిన యిద్దఱు ముగ్గురు, తమపని తీరిన వెంటనే రెండోపక్షము వల్ల లాభము కోరి బాజా మార్చి వీరగ్రాంథిక వేషము వేసిరి. వ్యావహారిక భాషావాద మసంగత మనుచు గొంతెత్తి గ్రాంథిక భాషావాదము ఘోషించిన పెక్కండ్రు తిరిగి వ్యావహారిక భాషా పక్షమునం జేరిరి. రెండు పక్షములలోని మంచి చెడ్డలు పరామర్శిం చిన కొందఱుభయపక్షములకు సంధి చేయ యత్నించిరి. అయిన నేమి? గ్రాంథిక భాషావాదులు సర్వస్వము పోయినా సరేకాని సంధి కొప్పుకొందురా? అబ్బే! పైగా సంధి కుద్యమించిన వారిని దూషింప మొదలుపెట్టిరి. చివర కీ మహాసంగ్రామమువల్ల సంభవించిన దేమం దురా? వినండి. మొదట భాషావిషయమున రెండు పక్షములే కాని, యిపుడు రెండు వందల పక్షము లేర్పడినవి. ఎవరి సంప్రదాయము వారిదే. ఎవరి ప్రయోగములు వారివే. ఎవరి వ్యాకరణము వారిదే. ఎవరి యిష్టము వారిదే. హద్దు లేదు. ఆజ్ఞ లేదు, ఆం లేదు, ఊం లేదు - తన సారస్వతమునకు సంభవించిన యీ గ్రహచార దోష మును బట్టి, ఆంధ్రభాష తన్నుం దా మఱచిపోయి గంగ వెఱ్ఱులెత్తి నట్లు గంతులేయుచున్నది. ఇపు డెవరి నేమంటే యేమిలాభమున్నదో, ఆలోచించండి. ఇంతెందుకు ?—

'నా చెప్పినదే వేద' మని వాదించే పరిషత్పత్రిక వంటి గొప్ప మాస పత్రికయు, మాది మడికట్టుకొన్న భాష యని యభిమానము వహించే పరిషత్సభాధ్యక్షులవంటి మహాపండితులును, మేము భాషకు మార్గదర్శకుల మనే వీరగ్రాంథిక భాషావాదులును, భాషాసంప్రదాయ మునకును వ్యాకరణమునకును, పంగనామము పెట్టి తమ యిష్టము వచ్చినట్లు నూతన శబ్దరూప సృష్టి చేయుచుండఁగా, ఎవరో దిన వార మాస పత్రికలలోను నవలలలోను నాటకములలోను వ్రాయునది యథేష్టముగా నున్నదని విమర్శింపనేల? ఇపు డట్టివారి యమూల్య

ప్రయోగాలన్నీ చూపడమంటే, ఎలుఁగుబంటికి తంటసము వేయుడమే. అందుచే మచ్చు కేవో నాలుగు మాటలు చూపుచున్నాను.

'ఆంగీరస - దీనినంతయు - అచ్చోటునకు - ఈ ప్రదర్శనమును విరమించుచున్నాను - కన్పడు - కలహామునకుఁ గాలుదువ్వెదవా - ఇక్కడకు - కల్లుదేరు నెపంబు - నలుబది ఈరెంటికి నొక్కరినే కర్తలుగా తొమ్మండ్రుగురు - పైనఁజెప్పిన - రమణుని దోడితేరుటకు - తెలుపఁగ వైతివి - మీరుచెప్పిరి - చెప్పుకొనియైన తర్వాత - ఔపదు - చాల్చాలు - శోభస్కరము - చక్కగా - (ఇది 'చక్కఁగా' అనుదానిని తప్పుల జాబితాలోఁజేర్చి తాను ఒప్పుల జాబితాలోఁ జేరినది) ఇట్టి వెన్ని ? రామా రామా! పదులా? వందలా? వేలు, వేలకు వేయు. వ్రాయడ మివరితరము? చో టెక్కడిది? - సరే కాని, వీటిలో నొకటైనా పూర్వగ్రంథములలో నున్నదా? ఏ వ్యాకరణమైనా వీటిని సమర్థించఁగలదా? వీటిలో నూటికి నాలుగయినా, బజారు తెలుఁగులోఁగూడఁ గనఁబడవు గదా! ఆహా! ఇదెక్కడి ప్రయోగ సృష్టి? అటు గ్రాంథికము కాదు, ఇటు వ్యావహారికము కాదు. ఆడది కాదు, మొగవాఁడు కాఁడు, కొజ్జా యున్నట్లున్నది. ఈ యవస్థకు వచ్చిన తెలుఁగున కొక సంప్రదాయ మేమిటి? ఐనా, ప్రారంభించినాము గనుకఁ గొంచెము ముచ్చటింతము.

—సత్కావ్యము నిర్మింపం గడంగిన ప్రతిభాశాలి యెవ్వండేని తెలుంగు సంస్కృతముంబోని దేవవాణి యగుఁగాని దేశభాషగా నొప్పునే యనునంతటి గౌరవాతిశయం బెసఁగ మెసఁగఁ బదునొకండగు శతాబ్దిం దొలుఁదొల్త నాంధ్రభూమి నవతరించిన నన్నపార్యు పర్వత్రయిం బాడసూపు తొలినుడుల నొండెఁ, గాదేని కవిరాక్షసుం డానతిచ్చిన కరణిం గవిత్రయంబు నాంధ్రమహాభారతంబునం దలసూపు తెలుంగు నుడువుల నొండెం గరంబు గోర్కిమైఁ బరికించి కలతెఱంగెఱింగి యంద పద్యం బేని గద్యం బేని రచియించుట ప్రాచీనపద్ధతి -

అట్టి సామర్థ్య మలవడనిచోఁ బదుమూఁడవ శతాబ్ది పుట్టిన నాఁటం
గోలెఁ బందొమ్మిదో శతాబ్దిదాఁకా గల కవిచంద్రులు కవిరాక్షసుని
మాట జవదాఁట వెఱచుచునే తమనాఁటి దేశ్యవైచిత్ర్య మంతా
కాకపోయినా, కొంతయైన నెట్లో తరువాతి కవులకుఁ దెలియఁజేయ
డపుఁ దలంపుతోను, పాఠకులు జిహ్వా కింపుగాఁ జవిచూచి దేశ్య
సుధారస బిందువు లాస్వాదించి బళీ యని తమ కవిత్వమును సన్నుతి
చేతురుగాక యనే కుతూహలముతోను, కాలక్రమమునఁ బ్రయో
గించుచు వచ్చిన తేటతెలుఁగు పలుకుల వైచిత్రిని మనసార నోరూర
నారగించియు, వారి ప్రయోగములను జూచి మధ్య మధ్యఁ గొందఱు
వ్యాకరణ కర్తలు చేసిన యనుశాసనములు గాంచియు, తెలిసీ తెలి
యని మాట లుపయోగించక ప్రవాహమున కెదురీఁదక సరళముగాఁ
గవిత్వము చెప్పుట యర్వాచీన పద్ధతి - అదీ చేత కాకపోతే, ఇపుడు
గ్రాంథికభాషలో పుస్తకాలు వ్రాసి వాటిని పాఠశాలలలోను కళా
శాలలలోను పాఠ్యగ్రంథములనుగా పెట్టించుకొను సుఖవృత్తికి మరగిన
సర్వ వర్ణముల విదుషీమణి విద్వచ్ఛిరోమణులవలె శబ్దరత్నాకర సేవ
చేయుచునే అరసున్న శకటరేఫలు మొత్తముమీద ప్రతిపుటలోను
కనబడేలాగున అక్కడక్కడ చల్లి, బాలవ్యాకరణ పారాయణ
చేయుచునే విభక్తులు కారకములు సమాసములు క్రియలు తాఱు
మాఱు చేసి, అయ్యవారిని చేయబోయి కోతిని చేసినట్లు పుస్తకాలు
వ్రాయక, పూర్వకవుల కావ్యములలో గాని శిష్టవ్యవహారములో
గాని లేని స్వకపోలకల్పిత శబ్దరూపములను ప్రయోగించక, బాగా
తెలిసినయెడల సాధ్యములైన అరసున్నలు బండిఱాలు సంధులు
పాటించి, తెలియకపోతే ఆ త్రిమూర్తులకు ఒక్క నమస్కారము
చేసి, దేశాభివృద్ధి కుపకరించులాగున పండిత పామర సాధారణమగు
శైలిలో ఇంతకుపూర్వము లేనివీ ఇపుడు కావలసినవీ ఏవో, అట్టి
గ్రంథాలు రచియించుట నవీనపద్ధతి - ఇఁకనో, శ్రావ్యములైన గ్రాంథి

కములు గాక హృద్యములైన వ్యావహారికములు గాక, ఉభయ భ్రష్టములు కురూపములు నైన యపశబ్దము లుపయోగించి—

— ఆమె బ్రహ్మరాక్షసిని యయ్యెనని మీరానతిచ్చిరి. మీరు దేశభాష నిట్లు పరిత్యజింపఁ జేయబడిరా? చేతులారా నోరారాఁ దాము భాషాసేవ సేసితిరిగదా! ఏది, మీచేయి నిటు దెండు - మీ మిత్రు నిచటకు రప్పించినపుడు మఱలివత్తును - రంగనాథుఁడు సీతకు మూర్ఛను వర్ణింపక యాప్రదర్శనమును విరమించెను. రావణుఁడు సీత నట్లు ప్రేలుటచూచి వేఁడి నిట్టూర్పులు తీయుచు నూరుతి గంపెడుకోపముతో నిక్కడకువచ్చి యిట్లూరకుండుట తగవా? - వీని కన్నిఁటి కేమి? వారల కొపడి వచ్చెదను - ఆపాదమస్తకము వఱకు నాపైన నయిష్టము పుట్టినది. గౌరవాధిక్యత లేదు. నిన్నువలవని దానిని దోడి తేరుటకు నొల్లఁగవేని రెండు వేవురు మందితోఁ బోరు నకు నే తేరుము. నే నూరునకుఁ బోయి వెనుదీక రావుటకుఁ జూతు.

అనురీతిని గ్రంథములు రచియించుట యే పద్ధతియో యూహింప వలసినదే కాని చెప్పవలసినది కాదు. దీనిని స్మరింపనేల? పోనిండు.

పైనిజెప్పిన మూఁడు పద్ధతులలో మొదటి రెండు పద్ధతులను నేను రచియించిన యాంధ్రభాషానుశాసనము సప్రయోగముగా సప్రమాణ ముగా నిరూపించి యున్నది. వివరములు దానివల్లఁ దెలియఁగలవు. ఇఁక నిట్లు కాలక్రమ ప్రాప్తములైన త్రివిధ పద్ధతులకు నాధార భూతమైన భాషాసంప్రదాయ మెట్టిదో కనుఁగొందము.

సంప్రదాయ శబ్దమునకు గురుపరంపరాగతమైన యుపదేశమని యర్థము. అది యిక్కడ, కాలక్రమమున వాడుకలో మాఱిన శబ్దార్థములకు సంబంధించిన దగుటచే భాషావిషయకమై నన్నయ తిక్కన శ్రీనాథాది మహాకవి గురుపరంపరవల్ల వచ్చిన యుపదేశము గావున భాషాసంప్రదాయ మనఁబడినది.

ఆంధ్రు లందఱు నొక జాతివారు కారు. ఒక చోటివారు కారు.

పై నుండి వచ్చిన చతుర్వర్ణములవారు కొందఱు. ఇం దున్న కొన్ని జాతులవారు కొందఱు. అట్లే, ఆంధ్రభాషలోని శబ్దము లన్నియు నొక తెగకుఁ జెందినవి కావు. తొలుత మూల ద్రవిడము నుండి వచ్చినవి కొన్ని. తరువాత సంస్కృత ప్రాకృతముల నుండి చేరినవి కొన్ని, పిదప హిందూస్తానీ మొదలగు భాషలనుండి సంక్రమించినవి కొన్ని; అందుచేతనే ఇట్టి బహువిధ శబ్దములఁ బుష్టి చెందిన యాంధ్రమును నాఁటినుండి నేఁటిదాఁకా తెలుఁగు దేశములోని వివిధ జాతులవారును సమానముగానే వాడుకొనుచున్నారు. కాని, ఇది యెన్నఁడును ప్రత్యేక మొకరి సొత్తు గాలేదు. ఇది దేశభాషల ధర్మమే కదా! కావుననే తొల్లి కొత్తగా వచ్చినవారి సంస్కృత ప్రాకృత శబ్దము లనేకములు క్రమముగా వాడుకలోఁ బ్రవేశించి యిందలి వారి నోళ్ళలోఁ బడి యుచ్చారణ వైకల్యమున వికృత రూపములు తాల్చినను, అవి నింద్యములై భాషనుండి బహిష్కృతములు గాక, ఆర్యుల యాదరమునకుఁ బాత్రములై భాషలో నొక స్థాన మాక్రమించినవి. అగ్గి - జూదము - సిరి - సింగారము - మొకము - కన్నియ - మొదలగునవియే తరువాతఁ దద్భవము లనఁబడినవి. బ్రాహ్మణుఁ డెవఁడైన 'అగ్గి' యని యుచ్చరించునా? అయితే నేమి? దానిమీఁద బూర్వుఁ డెవఁడైన నిరసనభావము చూపెనా? కవు లందరును దానిని వాడిరికదా! ఇట్లు మాఱినవి సంస్కృత ప్రాకృత శబ్దములేనా? శుద్ధదేశ్యములు వందలు వేలు వివిధములుగా మాఱి వాడుకలో నుండుటయే కాదు, పూర్వకావ్యములఁ బ్రవేశించినవి. అట్టివెల్ల చూపుట సముద్రమున కేతా మెత్తుటయే కావున మచ్చుకుఁ గొన్ని :—

౧. నన్నయకుఁ బూర్వము మూలద్రవిడభాషా సంప్రదాయమును బట్టి సిర్బిందువులై శాసనములఁ గనవచ్చు - కట్టెఇచ్చు -

మల్లణ్డు - ఇన్దు - మొదలగునవి. నన్నయనాఁటికి కట్టించు మల్లండు - ఇందు - అను విధమున సబిందువు లైనవి.

౨. నన్నయనాఁటి దీర్ఘముల మీఁది ఖండ బిందువులతోడి - వాఁడు - వీఁడు - ప్రాఁత - ఇత్యాదులు నన్నెచోడాదుల కృతులలో దాక్షిణాత్య సంప్రదాయమునుబట్టి, వాండు - వీండు - ప్రాంత - అను విధముననే నిలిచినవి.

3. నన్నయనాఁటికే, ఒకండ్రు - చూడుము - కావలయును - చనునే - చెప్పుము - ఇత్యాదిబహురూపములు - ఒకళ్ళు - చూ - కావలెను - చన్నే - చెప్పుము - అనువిధమున మాఱి నవి. ఈ మాఱినవాటి నతఁ డుపయోగించెను. తిక్కనాదులు వాటిని శిరసావహించిరి.

౪. నన్నయ 'కన్నియ' తిక్కన 'కన్నె' అతని 'కూతుఁలు' ఇతని 'కూతుండ్రు' వారు 'వచ్చినవాడఁను - వచ్చినాఁడ' ననఁగానే శంభుదాసుఁడు 'వచ్చినా' నన్నాఁడు. వారిద్దఱును 'వెడలుదు' రనుట తెలిసికొనే యితఁడును శ్రీనాథాదులును 'వెళ్ళిరి' అనిరి. వీరి 'వలనఁ' గానిది పెద్దన 'వల్ల' నైనది. కవిత్రయమువారి "అల్లురు చేతురో" చేయరో సందేహము కాని, తిక్కన పెద్ద లందఱి 'అల్లుండ్రుచేతు' రనుట స్పష్టము. వీరందఱును 'ఇంకను దనుకనుదాఁక' నంటే మిగిలిన మహాకవు లనేకులు 'ఇంకా ఎందాఁక' ఈమాటలన్నారు. భారతము 'మూఁడు నెలలు' అనఁగా, కాదుకాదు 'రెన్నెల్లు' అని రామాయణాదులు, 'ఆర్నె' ల్లని కాశీఖండాదులు గోలపెట్టినవి. ఇంత యేల? నన్నయ తిక్కనల గసడదవా దేశపద్ధతి యెఱ్ఱనాదుల నాఁ డెగిరిపోయినది. వారి ఈన్,' ఈయన్, ఇయ్యన్ - ఇవ్వన్ - అను రీతిని బైకి వచ్చినది. వారు పదుమూఁడగు మాసమంటే,

అప్పకవి పందొమ్మిదో ఛంద మన్నాఁడు. వారు చేయు వాఁడంటే, రామలింగాదులు వందమంది కలసి దాఁటేవాఁడు, అనే భావంబు, అనేటివాఁడు, అనురీతిని మీఁదికివచ్చిరి. అయ్యా! దేశ్యవైచిత్రి చూపవలె నంటే యిక్కడ స్థలము చాలదు కాని, ఈసందర్భమున నొక వింతమాత్రము చెప్ప వలసియున్నది.

దేశభాషలు మాఱుచుండుటయు, మాఱినశబ్దజాలము నాయా సమయములఁ గవులు వాడుటయు, ఆప్రయోగములను జూచి వ్యాకరణ కర్తలు వానికి గతి కలిగించుటయు నైజమై యుండఁగా ఆమార్గ మించుక సూచించిన యాథర్వణాంధ్ర రత్నాకరాది లక్షణముల నణఁగఁద్రొక్కి బాలవ్యాకరణము పైకి వచ్చుటచేతను, సంస్కృతాంధ్ర పండితు లాంధ్రశబ్దచింతామణి ప్రాభవము నుగ్గడించి తద్విరుద్ధములగు ప్రయోగము లంగీకరింపఁదగినవి కావని తలంచుటచేతను, సర్వవిధ ముల దానినే యనుసరించిన దనఁదగిన బాలవ్యాకరణ మాయభిప్రా యమును బలపఱుచుటచేతను. మునిత్రయ మనదగిన కవిత్రయము వారుగూడఁ గానివా రైపోయినారు. ఇందుకు నిదర్శనము;—

నన్నయార్యుఁడు 'కావలయును' వంటి ప్రయోగము లే యెక్కువగా వాడినను, తననాఁడు దేశమున మిక్కిలి వాడుకలో నుండుటచేతనే 'కావలెను' అనురూపమునుగూడ వాడెను. దానిని శిరసావహించిన తిక్కనార్యుఁడు 'కూఁతులు' అనురూపమునుకూడ వాడినను, తననాఁటికి మాఱి శ్రావ్యమగుచున్న 'కూతుండ్రు' రూప మును వాడెను. సోమనాథ శ్రీనాథాదులు 'చేయుదురు' అనుదాని నెక్కువగాఁ బ్రయోగించినను, తమనాఁటికిఁ బరిశుద్ధమైన 'చేతురు' రూపముగూడ నుపయోగించిరి. చిన్నయసూరి వీటి నసాధువులనుగా జేయఁగా, అఱవ తెలుఁగు పరిష్కర్త లుత్తమకావ్యములలోని పై ప్రయోగము లన్నిటికి సున్నచుట్టిరి. అకటా! చూచితిరా తెలుఁగు నకుఁ బట్టిన దౌర్భాగ్యము!

అదేమోకాని, గ్రాంథిక భాషావాదులమనుకొనువారి కందటి కిని దీర్ఘాంత దేశ్యశబ్దములంటే మంట. ఏమీలేదు వ్యాకరణములు నవలా నేజాలకోరీలను మాత్రమే చూపినవి. తక్కినవాటిని జూప లేదు. సాహేబు కలుపుతీతకథవలె మనవా రామూఁడుమాటలు పట్టుకొని తక్కిన దీర్ఘాంతములన్నీ, అసాధువు లనుకొన్నారు. అంతే కాని, వ్యాకరణము లెప్పటివి; భాషకవి యెంతటివి? తిక్కనాది మహాకవుల కృతు లెప్పటివి? వారి విజ్ఞాన మెట్టిది? అవి చెప్పనివానిని తప్పులన్న వానిని తప్పు లనవలసిన దేనా? అని, యాలోచించిరా? ఆలోచన మెందుకు. ఆసూత్రలవిత్రము పుచ్చుకొని కనబడ్డ దేశ్యదీర్ఘాలు కోసివేయడమే వారిపని. సహజదీర్ఘములే కాక, వర్ణలోపాదులవల్లఁ గాని సంధివశమునఁగాని వచ్చినవైనను వారికిఁ గిటవు. ఇందు కొన్ని:

తిక్కనార్యుఁడు - నరపతి నమ్మినమ్మక పనిగొనునది - యని ప్రయోగింపఁగా (శాంతి. 2-35) అది కొంతకాలము ముద్రణములలో నున్న ట్లేయుండి మటుమాయమైనది, వావిళ్ళవారి ధర్మమా యని మరల 1915లో దృగ్గోచరమైనది. ఇట్టివికాక మఱికొన్ని విధము లయిన దీర్ఘాంతప్రయోగములు తెలుఁగు జీవద్భాషయని తెలుపు టకో యన నైషధ జైమినిభారత ప్రబోధచంద్రోదయ వైజయంతీ విలాస కవిచింతామణి కాళహస్తీశ్వరశతకాదులందు - వినీఫినని - చాలా - కూడా - ఇంకా - దాఁకా - చూచినా - అంతా - వెన్నా మీఁగడ - ఇత్యాదిరూపముల వీనులవిందై ప్రత్యక్షమగుచున్నవి.

- ఇట్లు ప్రయోగము లున్నవని యెఱుఁగుదురు. వారు మహాకవు లనియు నెఱుఁగుదురు. తామును ఇట్టి ప్రయోగములున్న గ్రంథములను బ్రకటించుచున్నారు - అయితే నేమి? ఇవి గ్రాహ్యములని గ్రాంథికభాషావాదుల మనుకొనువారు తలంతురా? - వారి మతములో నిదంతా లక్కగేదె. పూర్వగ్రంథములలోని యిట్టి సరస ప్రయోగము లంగీకరింపనివారి గ్రాంథికభాషాభిమాన మెట్టిదో చిత్తగించవలెను.

ఒక గ్రంథకర్త 'కిటికీ' ఉండగూడదని యూహించి, దానిపై కమ్మి, పూడఁగొట్టి కిటికి చేసిపెట్టెను. ఇట్టిది మరియొకటి చేసి దీని బహు వచనరూపమూ సంప్రదాయవేత్త ప్రయోగించు లోపలనిది యూధార ముగా రెండు బస్తల ధాన్యము - మూఁడు సీసల నూనియుఁ - వారిద్దరు రెండు కురిచుల మీఁద గూరుచుండిరి. ఇత్యాది ప్రయోగరాజము లుదయింపక పోవునా? పాఠకోత్తములారా! ఇది కేవల గ్రాంథిక భాషావాదుల మనుకొనువారి రచనలను నిందించుట యని తలంచ వద్దు. మన సోదరులు పూజ్యులైన పూర్వమహాకవుల ప్రయోగ ములు నింద్యగ్రామ్యము లని నిరసించి వారియెడ నపరాధము చేసిన వారగుటయే కాక, ఆంధ్రసరస్వతికి దుర్భాష లంటఁ గట్టుచున్నారే యని విషాదము తప్ప మఱేమియుఁ గాదు. దీని కేమి! ముందు చూతము.

ఆంధ్రము జీవభాష గాని మృతభాష కాదని తలంచినచో దీని సంప్రదాయము సులభముగా గోచరించును. జీవభాష జీవనది వంటిది. కావుననే 'ప్రవాహినీ దేశ్యా' అని పెద్దలనిరి. నది యొకచోటి నుండి యొకచోటికి సదా ప్రవహించునట్లే, భాష యొకనోటినుండి యొక చెవికి సర్వదా పోవుచుండును. అది ప్రవహించు ప్రదేశ భేదమును బట్టి దాని గుణరూపము లించుక మారునట్లే, ఇది వ్యాపించు మండలభేదమును బట్టి దీనిశబ్దార్థము లించుక మాఱు చుండును. అందు పాఁతనీటిని గ్రొత్తనీరు తోసివేయునట్లే, ఇందు పాఁతశబ్దములను గ్రొత్తశబ్దములు తోసివేయును. అది వేఱువేఱు ప్రదేశములనుండి వచ్చు వాఁగులను వెల్లువలను జేర్చుకొనునట్లే, ఇది యన్యజాతుల నుండి వచ్చు శబ్దములను జేర్చుకొనును. అది తన్నాశ్ర యించు వారికిఁ 'ప్రాణాధారము జీవనాధారము, నగునట్లే, ఇది తన్నా శ్రయించు వారికి జ్ఞానాధారము జీవనాధారము నగును. వే యేల? దానివలె నిదియును, పావనమై వంద్యమై వెలయును. కాని, ఒక

మాట. అందలి నీరు రెప్పపాటులో వడిగాఁ బోయివచ్చునట్లిందలి శబ్దము లంతలోనే పోయి యంతలోనే రావు. ఇవి మాఱుటకుఁ గొన్ని సంవత్సరములు పట్టును. ఇంతే భేదము. ఇఁకనో—

నదికి గట్టువలెనే భాషకు వ్యాకరణము రక్షకము. కాని, ఒక మాట. నది పుట్టినపు డున్నట్లే యెపుడును సన్నముగా నుండదు. క్రమక్రమముగా విశాల మగుచుండును. వడిగాఁ బ్రవహించు స్వభావము కలయది మొదట నేర్పడిన గట్లమధ్యనే ప్రవహింపదు. అటు నిటు గట్లు దొలిచియు, తెగఁగొట్టియు, ఆవలికి నీవలికిఁ బోవుచుండును. అప్పుడు నదీరక్షకులు వెనుకటి గట్లు తప్పించి, ఆవల మరల గట్లు పోయుదురు. అట్లే, జీవభాష పుట్టిననాఁ డున్నట్లే యుండక పెరుగుచుండును. మొదట నేర్పడిన చిన్నవ్యాకరణమునకు లొంగక దానిని దాఁటిపోవుచుండును. అప్పుడు మరల భాషాసంప్రదాయవేత్తలు దాని పెంపునుబట్టి వ్యాకరణము నిర్మింతురు. నదీరక్షకులు మొదటి గట్లతోనే విశాలమగుచున్న నది నెట్లాఁపలేరో, భాషారక్షకులు నట్లే తొంటి వ్యాకరణముతోనే పెరుగుచున్న భాష నాఁపలేరు. గట్లు తెగితే తెగనీ, నేరు పోతే పోనీ! నిలచిన నీరే చాలు నని వా రెట్లూరకుండరాదో అట్లే వీరును వ్యాకరణము చాలకపోతే పోనీ! శబ్దములు పాడయితే పాడుకానీ! లొంగియున్న శబ్దములే చాలునని యూరకుండ రాదు. ఆపక్షమందు నీపక్షమందును గూడ నట్లూరకుండుట దేశమునకు హానికరమే. దీనిని బట్టి నదివలెనే భాషయు మాఱుచుండుననియు, దాని గట్లవలెనే దీని వ్యాకరణమును దగినట్లు లేర్పడుచుండవలె ననియుఁ దెలియఁగలదు. ఈ సందర్భమున నదిలోని ప్రతి బిందువును పానీయమైనట్లు వాడుక భాషలోని ప్రతి శబ్దమును గ్రంథమున నుపాధేయమేనాయని శంకించవద్దు. దప్పిగొన్నవారు నదీజల మైతేమాత్రము ముఱికిగానున్నను, నలకలతో నున్నను తేర్చుకొనియో వడపోసుకొనియో తాగుదురు

కాని, యట్లే తాగుదురా? అట్లే కావ్యము వ్రాయ నపేక్షించు వారు, వినుటకుఁ గాని చదువుటకుఁ గాని యనువుగా నుండని శబ్దము లను వ్యాకరణ జ్ఞానమున సవరించుకొని యుపయోగించుకొందురు. దీనికి విచారమేల? కాలానుసరణముగాఁ - ప్రయోగానుసరణముగా మాఱిన వ్యాకరణము చేయు సహాయ మదేకదా! ఈపట్టున కొందఱు శాస్త్రప్రయోగములకు విరోధము సంభవించినపుడు శాస్త్రమే బలవత్తరమనెడి నిర్ణయమునుబట్టి శాస్త్రవిరుద్ధమైనది మహాకవి ప్రయోగమైనను సమ్మతము గాదందురు. కాని, ఆనిర్ణయ మన్యవిషయకము. జీవద్భాషల కది సమన్వయింపఁ దగదు. అట్ల యిన, వ్యాకరణము ప్రయోగశరణమనియు, వైయాకరణులు ప్రయో గశరణులనియు బోధించిన సూచార్య వచనములకు గతి యేమి?

మఱికొందఱు ప్రయోగశబ్దము కవి ప్రయోగపరమే కాని, శిష్ట ప్రయోగపరము కాదందురు. అదియును సమీచీనముకాదు. అట్ల యిన శిష్టప్రయుక్తము లయిన లౌకిక శబ్దముల కనుశాసనము గావిం చిన మునిత్రయము మాట యేమి? కావున జీవద్భాషల విషయమున మహాకవి ప్రయోగము శిష్టసమ్మతమైనచో నది వ్యాకరణ విరుద్ధ మైనను గ్రాహ్యమే యనియు, శిష్టప్రయుక్తమగు సముచిత శబ్దరూపము గూడ గ్రాహ్యమే యనియుఁ బూర్వాచారమతమునఁ దెలియనగును. అట్టి వైయాకరణ సంప్రదాయమునకుఁ దొలఁగిన వ్యాకరణము దేశ భాషా వ్యాకరణ మనఁదగునా? పోనిండు. ఇప్పు డీశాస్త్రచర్చ యెందుకు? మహాకవి ప్రయోగములే గ్రాహ్యము లని యంగీకరిం తము. అట్లయిన, బాల వ్యాకరణము తన కభిమతమయిన భారత ప్రయోగములు కొన్ని స్వీకరించి సూత్రములు రచియించి, అందలి ప్రయోగములనే మఱికొన్నిటిని గ్రహింపక విడుచుటయు, మఱికొన్ని టిని నిషేధించుటయు సముచితమా?

అథర్వణాచార్యులు ఘోషించుచున్నను, ఆముక్తమాల్యదాదులు

గోలపెట్టుచున్నను వినిపించుకొనక, తత్సమాకారమునకు సంధి లేదనుటకు భారతము కావలసి వచ్చినది గాని, రాతిరెల్ల - తెలివొందె - ఇత్యాదులు భారతమునఁ గనఁబడుచున్నను, ఇకార సంధులలో నామవాచకముల యికారమునకు సంధి విధించుట కది పనికివచ్చినది కాదా? తత్సమసంధులు, ఇకారసంధులు వందల కొలఁది ప్రత్యక్షమగుచుండ నవి క్వాచిత్కములైనవా? ఇట్టి నిరంకుశత్వమున కెన్నెని యుదాహరణములు కలవు. అవి యన్నియు నాయాంధ్రభాషానుశాసనమునఁ జూపఁబడినవి. వానినందు చిత్తగింపుఁడు.

ఆంధ్రభాషాభిమానులారా? ఈవిషయ మపార మగాధము. ఇట్లు పది మాటలతోఁ దేలునదికాదు. కావున నింతవఱకుఁ జేసిన చర్చను బట్టి, ఆంధ్రభాషా సంప్రదాయ విజ్ఞానమునకుఁ గాలక్రమమున సంభవించిన భాష లోని మార్పులను దెలియజేఁయు నన్నయ తిక్కన యెఱ్ఱన సోమన శ్రీనాథాది మహాకవుల కృతులలో బహువిధ ప్రయోగ పరంపరయే శరణమనుట విశ్వసింతురు గాక యని మనవి చేయుచు వ్యాసము ముగించుచున్నాను.

# ఆ-ఈ-ఏ శబ్దముల విచారణ

పై సర్వనామ రూపములు మూఁడును స్వతంత్ర ప్రయోగము లేని విశేషణములని కొందఱనిరి. ఈమూఁడును ద్రావిడ భాషలకు మాతృకయగు మూలద్రవిడములోని సర్వనామ ప్రాతిపదికములు. వీటినుండి వచ్చిన మహతీవాచక రూపములు, అవళ్-ఇవళ్-ఎవళ్, ఇవి తమిళమునఁ గలవు. మనభాషలో మహతినికి అమహత్తునకుఁ గూడ అది-ఇది-ఎది-అను రూపములే చెల్లుచున్నవి. శబ్దస్వరూపము తెలియుటకై మహద్రూపములు మాత్రమే చూపుచున్నాను.

| ౧ | ౨ | ౩ | ౪ | ౫ | ౬ | ౭ | ౮ |
|---|---|---|---|---|---|---|---|
| ఆ | వ్ | అన్ | అవన్ | అవణ్ణు | వాండు | వాఁడు | ఆఁడు |
| ఈ | వ్ | అన్ | ఇవన్ | ఇవణ్ణు | వీండు | వీఁడు | ఈఁడు |
| ఏ | వ్ | అన్ | ఎవన్ | ఎవణ్ణు | వేండు | వేఁడు | ఏఁడు |
| | | | | | *ఎవండు | *ఎవఁడు | |

పై వాటిలో ౧ - గుర్తుకలవి మూలద్రవిడ ప్రతిపాదికములు. ౨ - గుర్తుగలది సంధిలో వచ్చిన వకారము. ౩ - గుర్తుకలది ప్రథమైకవచన ప్రత్యయము. ౪ - గుర్తుకలవి ప్రథమైకవచనాంత రూపములు. వీటిమీఁద తెలుఁగు 'డు' ప్రత్యయము చేరుటచే ౫ - గుర్తుగల రూపములు సిద్ధించినవి. వీటిలోని మొదటి యచ్చులు పలుకుబడిలోఁ గ్రమముగా వకారములమీఁదఁ బ్రవేశించి దీర్ఘము లగుటచేతను నకారములు నిండుసున్న లగుటచేతను ౬ - గుర్తు గల రూపములైనవి. వీటిలోని నిండుసున్నలు క్రమముగా వాడుకలో ననునాసికోచ్చారణ సూచకములైన యరసున్న లగుటచే (ఇపు డట్టి యుచ్చారణము పోయిన దనవచ్చును) ౭ - గుర్తుగల రూపము లైనవి. వీటిలోని మొదటివకారము కొందఱి పలుకుబడిలో లోపించుటచే ౮-గుర్తుగల రూపములు సంభవించినవి. పువ్వు గుర్తుగల

రెండు శబ్దములును ఎవఁడుయొక్క చిన్న మార్పు తోడి రూపము, లని తెలియుచున్నది గదా!

పై ప్రాతిపదికములమీఁదనే 'ది' ప్రత్యయము చేరునపుడు ఆ — ఈ — లు నిత్యముగాను, ఏ — వైకల్పికముగాను హ్రస్వమగుటచే అది — ఇది — ఎది — ఏది — అనురూపము లగును.

అఁడు - ఈఁడు - శబ్దములు పూర్వకావ్యములలో స్వతంత్రములై కనరావు గాని తెలుఁగు దేశ మంతటను చదువు రానివారి వాడుకలో వినవచ్చును. శిష్టులవాడుకలో లేకున్నను ఏఁడు శబ్ద మెట్లో పూర్వ గ్రంథముల కెక్కి సాధువైనది.

శబ్దరత్నాకరకారులు ఏ, వాఁడు - అను రెండు శబ్దములు కలిసి ఏవాఁడు - ఎవ్వాఁడు - ఎవఁడు మున్నగు రూపములకు మాఱినట్లు చెప్పియున్నారు. ఇది భాషాసాంప్రదాయ సమ్మత మయ్యేనేని ఆ - ఈ - ఏ - శబ్దములు 'తాను' శబ్దముతోఁ గలిసి హ్రస్వములై తాను' లోని దీర్ఘము కూడా హ్రస్వము కాగాఁ, అతను - ఇతను - ఎతను - అను రూపములకు మాఱిన వనియు అవియే, నువర్ణస్థానమును డువర్ణక మాక్రమింపఁగా, అతఁడు - ఇతఁడు - ఎతఁడు - అను రూపములకుఁ దరువాత మాఱి యుండుననియు జెప్పుటకూడా భాషా సంప్రదాయ సమ్మతమగునని తోఁచుచున్నది.

# గసడదవ - గజడదబ

గసడదవ, గజడదబాదేశముల సాంప్రదాయమునుగూర్చి నా యాంధ్రభాషానుశాసనమున కొంత తెలిపి యున్నాను. సంప్రదాయమందును, నేటిరచనలయందును దృష్టినిలిపి వీటి స్వరూప స్వభావముల నిపుడు మఱికొంత విశదీకరించుచున్నాను.

వర్ణాదేశ వర్ణాగమాదులవల్లను సంధులవల్లను కలిగేమార్పు లెల్ల భాషలలో నున్నవే; కాని మనభాషకే వచ్చినవి కావు. సంస్కృతమున కలిగిన యట్టిమార్పు లది వ్యవహారమునుండి తొలగిన పిదప నట్లే స్థిరపడినవి. దేశభాషలందు పాతమార్పు లట్లుండ క్రొత్త మార్పులు కలుగుచున్నవి. ప్రాకృతము తొలుత నొకటి యైనా ఆయా దేశములలో వ్యాపించి యాఱువిధములుగా మారినవి. ఆ యారు నాదినున్నట్లున్నవా? మరల మారినవి, మారుచున్నవి. మొదట స్వతంత్రమయ్యు పిదప పైశాచీప్రాకృతమునకు చెందిన మూలద్రవిడ భాష యట్లే కొంతమారినది. దానినుండి విడిపోయి వచ్చి యిచ్చట స్థిరపడి తెలుగను పేరొందిన మనదేశ్యము నట్లే యార్యులభాష యగు ప్రాకృతముతో చేసిన చెలిమిచేతను, కాలక్రమమున వాడుకలో సంభవించిన యుచ్చారణ భేదముచేతను మార్పుకాంచినది. మాఱుచున్నది. ఇంకా మాఱును. ఈవిషయము కాదనువా రుండబోరు. తొల్లిటి దేశ్య మట్లే చెక్కు చెదరక యున్న దనువారు నుండబోరు. సంస్కృత ప్రాకృత శబ్దముల కలయికచే తెలుగు మిక్కిలి పెరిగి కావ్యరచన స్థితికి వచ్చునప్పటికి పూర్వ మిందు, మార్పులు లేకపోవు గాని, యవి మనకిపుడు గోచరింపవు. తరువాత నీభాషలో కలుగుచు వచ్చిన పెక్కు శబ్దముల రూప భేదాదు లాయాకవుల కావ్యములలో గోచరించుచునే యున్నవి. కాని యిక్కడ నొకమాట జనుల వాడుకలో వినవచ్చు కొన్ని శబ్దములును విశేషించి క్రియాపదముల రూపభేదములు నట్లే

కావ్యముల కెక్కెనని మాత్రము తలంపరాదు. సాధూచ్చారణమును శబ్దముల నిజస్వరూపమును పాటించి కొందఱుకవులు వాటి కుచిత రీతిని మెఱుగు పెట్టి ప్రయోగించుచు వచ్చిరి. ఇందుకు తన నాటికి గాసట బీసటగా నున్న శబ్దజాలమును తన కవిత్వ శంఖమున పోసి పావనము కావించి సహజసౌష్ఠవముతోడి శబ్దసౌందర్యమును సాధ్య మైనంత వఱకు చూపిన నన్నయార్యుని యుద్యమమే నిదర్శనము. "ఇతరు లక్షరరమ్యత నాదరింప" నని యత డన్నమాటల భావ మదే. తాను "విపుల శబ్దశాసను" ననుకొనుటకు కారణ మదే. "దీని సమానార్థకమ — వాగనుశాసనశ మెట్లో యాంధ్రశబ్దచింతా మణిలో తత్కర్తృపరముగా ప్రవేశింపగా దానిని చూచి తదర్వాచీను లావిపులశబ్దశాసనుడే యీ వాగనుశాసనుడు, నన్నయార్యుడే దీని కర్త యని లోకమునకు చాటిరి గాని, ఆంధ్రశబ్దచింతామణి నన్న యార్యుడు రచియించినది కాదనుట ముమ్మాటికి నిజము. చింతామణి ముందు రచించి తరువాత నతడు భారతము తెనిగించె ననుట హాస్యా స్పదము." అపు డింకా కొందఱికి యున్న యాభ్రాంతి తొలగుగాక యని ప్రసక్తానుప్రసక్తిగా నీరెండుమాట లిందు వ్రాసితిని—

అట్లు మొదటినుండియు భాషలో కలుగుచున్న మార్పులలో గసడదవాదేశ మొకటి. ఇది మిక్కిలి చిత్రమైనది. నన్నయార్యునికి పూర్వమే యిది యున్న దనుటకు యుద్ధమల్లుని శాసనములో - ఒండు పోటు - ఇందు ప్రత్యక్షమై - అనురూపములతో నిది ప్రత్యక్షమగు చున్నది. అంతేకాదు. వాక్యమునడుమ సంధివశమున వచ్చిన యీ యాదేశముతోడి శబ్దములను వాక్యాదియందే నిలిపెడి యలవా టీనాటిపామరజాతులలో కలదనుటకు కూడ నవకాశము కలదు. అక్షరాస్యులు కాని నేటి పామరుల పలుకుబడిలో కొంతమార్పు కని పించినా, చాలావఱకది వంశపారంపర్యముగా వచ్చుచున్న తొంటి వాసనయే యనవచ్చునుగదా! ఇందుకు, సాప - సదర - సీస - సాదు-

సూరు; సాగు - సావడి - డెక్కి—డెక్కి - దొలిచినకత్తి - గానుగుచెట్టు మొదలైనవి వుదాహరణములు. వీటిలో కడపటి యైదు నన్నే శిష్టుల వాడుకలోనికి వచ్చి కృతుల కెక్కినవి. అందు చాప, చావడి మొదటి రూపము లని యెఱిఁగినవా రెందఱో యుండరు. సాప - సద రేత్యాదులు శిష్టులు వాడరు గనుక నన్నే గ్రంథముల కెక్కలేదు. ఇంక ఆడు సెట్టికాఁడు. దిమ్మ దిరిగింది. కొమ్మగూలింది, వంటి మాట లీనాఁ డున్నట్లే యిందలి ప్రాఁత కాఁపులవాడుకలో నున్నవని నమ్ముట కేమి? దానంజేసి యీ యాదేశము నాఁటి యార్యులకును పట్టుపడఁగా నదియే శాసనములకును కావ్యములకును నెక్కిన దనుట దీని మొదటి సాంప్రదాయము. తరువాత కాలక్రమమున నిది మార్పు చెందఁగా తదనుగుణముగా కవులు ప్రయోగించుటయు లాక్షణికు లాయామార్పు లెఱింగి నిత్యవైకల్పిక బహుళాదిభేదమున విధించుటయు దీనితరువాతి సాంప్రదాయము. ఏవో కొన్నిచోట్లతప్ప నెల్లెడ నిది రుచింపకపోవుట వాడుకలో కనిపెట్టి లక్షణములను గూడా గణింపని యర్వాచీన కవులవల్ల నిది దెబ్బలు తిని తిని యిపుడు ప్రాణావశిష్టముగా నున్నది. ఇది దీని మూడవ సంప్రదాయము. అట నట్టి, ఎందువోయెదు, ఇటుసూపి, అనురీతి నిపు డెవ్వరైనా పలుకుచున్నారా? వ్రాయుచున్నారా? సౌమిత్రి సిన్నవాడు-రాముడు పట్టాభిరాముడు. ఆ పిల్లగోడలు. రెండు వాటలువాడు. అది డేకుచెట్టు. అని, యిపుడు ప్రయోగించిన వినువారికి రోతపుట్టదా? అట్టియెడ దీనినింకా పట్టుకు పెనుగులాడుటెందుకు? ఇది తీసివేసినచో భాషకున్న యొకవికారము తప్పును. సహజసౌందర్యము దక్కును. కావున దీనికి స్వస్తి చెప్పవలసినదే. పద్యరచనలో నెందేని ప్రాసకోసము దీని నెవడైనా స్మరించునేమో కాని, వచనరచనలో దీని యుపయోగము వీసమెత్తులేదు. కొంచెముగా, గకారాదేశమును మిక్కిలి తక్కువగా దకారాదేశమును వాడుకలో స్థిరపడి చెవికింపుగా నున్నమాట నిజము. అవి

పొమ్మన్నను పోవు. అందును 'కాస్'' లోని క కారమునకు గా దేశము తప్పనిసరి - సరిగా - తిన్నగా - వడిగా - ఇత్యాదులు. వాడుగాని నీవు గాని రండు. ఇట్లు చేయుదురు గాక. తల్లిదండ్రులు, కూరగాయలు యిత్యాదులు కొన్ని శ్రుతిరమ్యములే. రాక పోకలు, అందచందము లిత్యాదులందు దీనిపేరు కనపడదు. అందుచే వాడుకలో స్థిరపడినట్లే దీనిని వాడదగును గాని కల్పించరాదని నా మతము. నా యనుశాసన మందు దీనిని వైకల్పికముగాను బహుళముగాను విధించియున్నాను. ఆయభిప్రాయము నిప్పటి పాఠకలోకమును నే డావశ్యకములైన రచన లను భావించి మార్చుకొన్నాను. కావున పాఠకులకు పదాద్యక్షరము తెలియకుండా చేసే గసడదవా దేశము త్యాజ్యమే. ఇంక —

గజడదబా దేశము :- దీని జీవితముకూడా వింతదైనదే. దీనిని ద్రుతకార్యమందురు. ని, ను అనునవి ద్రుతములు. ఇవి తుద నుండు శబ్దము ద్రుతప్రకృతికములు. వాటిమీది పరుషములకు పైవర్ణములు క్రమముగా నా దేశములగును. ఇది యీ యాదేశము స్వభావము. ఇది యంతయు లాక్షణికమతము.

యుద్ధమల్లుని శాసనము నాటికి కళలుగా నున్న-ఎందు-అందు ఇందు-మొదలగు కొన్నింటిని తరువాత మనవారు ద్రుతాంతములను చేసినా, ద్రుతప్రకృతికశబ్దములు కళలవలెనే భాషలో మొట్టమొదటి నుండియు నున్నవే కాని, పైని చూపిన లక్షణమతమునుబట్టి యుండ దగిన ద్రుతకార్యములు మాత్రము వాడుకలో కనబడవు. ఇపు డెక్కడా యీ యాదేశము లోకుల మాటలలో వినరాదు. కావున పూర్వము కూడా లే దనియే నమ్మవచ్చును. చెప్పబోక - చెయ్యబోక కొట్టబోయెదు-ఇత్యాది మాండలికములు కొన్నిటను; ఊరబంది-ఊర బిచ్చిక-తలబ్రాలు-ఇత్యాది సమాసములు కొన్నిటను ద్రుతకార్యము కనవచ్చుచున్నదని, ఇదే లాక్షణికులకు పరమప్రమాణమనుకో రాదు. పొందామర-పెందలకడ-కస్తికటి-ఇత్యాదులు కొన్నిటినివిడదీసి.

అందలి నువర్ణమునకు లేని ద్రుతత్వము తెచ్చిపెట్టి యిది ద్రుతకార్యమను
కొనుచున్నాము కాని, ఇంతకంటె ఆశబ్దముల పుట్టుకయే యట్టిదని
భావించుట మేలు. అందుచే శబ్దసిద్ధికి లోకమే ప్రమాణమని లాక్షణికు
లన్నా, యీయా దేశమునకు వాడుక ప్రమాణమని నొక్కి వక్కాణించు
టకు వీలులేదు. దానంజేసి, సృష్టింజేసి, జ్ఞానముంబట్టి, గండుంగోయిల
కమ్మందావి ఇత్యాదిరూపములు వాడుకలో నెందైన వినవచ్చునా?
లోకములో శిష్టులు కూడా నీకు కనబడలేదా? 'నాతో చెప్పావా?
నీకంటె టక్కరి లేదురా? వాడికి తెలియదు. ఎక్కడికి పోతావు?'
అనువిధముగా మాటలాడుదురనుట స్పష్టము కదా? అయితే
యిది వైయాకరణుల కెట్లు వచ్చినది? పూర్వకవులు కొన్ని శబ్దరూప
ములు చిత్రించినట్లే గణ యతి ప్రాసల కెక్కువ యనుకూలించునట్లు
ద్రుతమును చిత్రించుచు వచ్చుటచే లభించినది. పరిశీలించువారికి దీని
నిజమైనసంప్రదాయ మిదేయని తోచకపోదు. ఎందైనాపామరులనోట
నీళ్ళుజల్లి, తలుపుజేరలాగి ఇత్యాదిగా ద్రుతములేని యీయా దేశము
వినవచ్చును గాని ద్రుతమున్నచోట వినరాదు. ఇంకా బాగాపరిశీలిం
చినచో అనగూడదు. చెప్పదలచినది చూడబోతే ఒప్పజెప్పిఅను రీతిని
తుమున్నంతా వ్యయములమీద నీ కార్యము తప్పక కనవచ్చును
గాని, ద్రుతాంత విభక్తులమీద నసలే కనబడదు. వ్యవహార సిద్ధ
మైనది పొమ్మన్నా పోదు. అట్లు సిద్ధము కానిదానిని తెచ్చిపెట్టుకో
నేల? వ్యాకరణ మెఱుగని పాఠకులకు శబ్దావ్యక్షర మేదో తెలియ
కుండా చేయు దీనిని విడిచిపెట్టిన భాషకు హాని యేమి? పద్య కావ్య
రచయిత లిష్టమైతే దీని నుపయోగించుకోవచ్చును గాని వచన రచ
యితలకు దీనితో పనియేమి? నేటి రచనలు చూడండి. 'ఈ ద్రుత
కార్యము లక్షణోక్తముగా నెందైన కనబడుచున్నదా? ఇపుడు దేశా
భ్యుదయము నపేక్షించి అందఱికిని తెలియునట్లు మన భాషలో
వ్రాయవలసిన బహువిధ విజ్ఞాన విషయకము లైన గ్రంథము లెన్నో

యున్నవి. వాటిని రచించువారు మన వ్యాకరణము చదివి యీ యాదేశము యథోక్తముగా చేయుచు పుస్తకములు వ్రాసినా చదువుకొనే సాధారణ పాఠకులకు పదాద్యక్షర భ్రాంతి కలుగదా ? రాజులకు వారులే కన్నులని యరసున్న వేసి వ్రాసినా అపార్థమే ముందు తోచును కదా ! "నీకు దొరక దన్నట్లు నీకు తప్పదంటే శ్రుతిరమ్యము కాదా ? ఎందు కింక ? కాలమును బట్టియు 'ప్రయోగ శరణం వ్యాకరణ' మ్మను సూక్తినిబట్టియు, ఇపుడీ యాదేశము కూడా త్యాజ్యమనియే నా మతము. ఇపుడీ రెండాదేశములనుగూర్చి నేను చెప్పినది సిద్ధ కథనము గాని నా స్వంతము కాదు. నేటి రచయితల వాడుకయు లోకుల వాడుకయు, ఇందుకు ప్రమాణము. వైయాకరణుడును లోకము ననుసరింపవలెను గదా !

# తెలుగులో వ్యవహారము

స్వరాజ్యం ధర్మమా అని నేటి కీమాట ఫుట్టింది. తూర్పుగోదావరి జిల్లాలో ఆచరణలోనికి వచ్చింది. రమారమి నూటేళ్లకు మళ్ళీ మన మాతృభాష రాజకీయ కార్యాలయాలలో ప్రవేశించడమనేది గొప్ప యోగమే. ఇందుకు ప్రభుత్వమును ప్రశంసిస్తూ, ఈవిషయమును గూర్చి యించుక ముచ్చటించుకొందము.

సాధారణంగా గ్రాంథికభాషకు వ్యావహారికభాష కొంచెం దూరంగా ఉంటుం దన్నమాట స్పష్టమే కాని, సుమారు నాలుగువందల సంవత్సరములు మన దేశము విజాతీయ ప్రభుత్వముల పాల్పడియుండుటచే పర భాషలతో చెలిమి సలుపుతు వచ్చిన మన నేటి వాడుక తెలుగు మన ప్రాచీనభాషకు బాగా దూరంగా ఉన్నదనీ, నేడు దేశము నలుగడల బయులు వెడలుచున్న రకరకాల రచనలలోని వాడుకభాషకుకూడా రాజకీయ కార్యాలయములలో వాడబడు తెలుగు మరీ దూరముగా నుండుననీ ముం దనుకొని యీ విషయం చర్చించుట యుక్తము.

నేటి వాడుక తెలుగు సర్వతోముఖము, బహువిధ వ్యాపారపర తంత్రము అయినా, ససాకల్యము కాదు కాని, దీని దూరదృష్టియు దూరాలోచనమును దీనికట్టి సంపూర్ణస్థితిని తేకపోవు. ప్రపంచములోని యేభాషయు భాషాంతరముతో సహవాసము చేయకుండా అభివృద్ధికి రాలేదు. దేనిమాటో మనకెందుకు? హిందూదేశభాషలకెల్ల తల్లి యనదగు సంస్కృతమే అక్క-అనుబట్టి భాషాంతరపదములు కొన్ని స్వీకరించుకొన్నది. అట్టియెడ మన తెలుగు తన యభివృద్ధికై యితర భాషలనుండి యావశ్యకములైన శబ్దములను గ్రహించినదన్న తప్పేమి? ఇంకా కావలసిన శబ్దజాలమునంతను స్వీకరింప దీని కవకా

శము చిక్కలేదుగాని, అట్టిది లభించినచో మన భాష యింతకు రెట్టింపై యుండును. ఇక నట్టి స్థితి రాగలదు.

మొట్టమొదట మన శుద్ధదేశ్యమునకు సంస్కృత ప్రాకృతము లెట్టివో, తరువాత హిందూస్థానీ యాంగ్లము లట్టివి. తొలుత నాటి నుండి గ్రహించినట్లే పిదప వీటినుండి పదములను గ్రహించినది. అటు కొన్ని ఒరియా పదములను, ఇటు కొన్ని తమిళకన్నడ పదములను గైకొన్నది. తప్పదు, అది భాషల స్వభావము. జాత్యభ్యుదయమునకు భాషాభివృద్ధి మూలముకదా! వాడుకలో నెక్కువగాను, పుస్తకాలలో మిక్కిలి తక్కువగాను హిందూస్తానీ పదా లెన్నో కలిసిపోయినవి. అందు కొన్ని "ఇవి యన్యదేశ్యములు కావు తెలుగులే," అని ప్రజ లనుకోదగినంతగా మన భాషలో నైక్యమందినవి. కాగితం - కలం - సిరా - దస్తూరి - గుమాస్తా - ఖరీదు - ఖర్చు - ఇత్యాదులు వందలు; తహసీల్దారు - సిరస్తాదారు - హుజూరు - హుకుం - మంజూరు - ఖైదు - ఖాళీ - కామందు - కులాసా - ఇత్యాదులు సుమారు వెయ్యిపదములు తెలుగులో మిళితమైనవి. ఇట్లే ఇంగ్లీషు మాటలు వందలుగా మన భాషలో చేరినవి. వీటి ప్రవేశము చిత్రమైనది. ఆ యర్థములయందుపయోగింపదగిన తెలుగు పదాలు సిద్ధముగానున్నను, వాటినికూడా గెంటివేసి ముందు సిద్ధమైన వనేకము లున్నవి. చదువు కొన్నవారేకాదు, చదువురాని స్త్రీ పురుషులుకూడా నిత్యము వాడు చున్న యట్టి యాంగ్లపదము లెన్నో సర్వత్ర శ్రుతి గోచరమగును. ఈ యభ్యాసమిప్పుడు తప్పించుటకు గాని, నియమించుటకు గాని శక్యము కాని స్థితికి వచ్చినది. హిందూస్తానీ శబ్దములవలెనే యివియు కొన్ని రూపమున నించుక మార్పు చెందియు, చెందకయుకూడా దేశమంతటా వాడుకలో స్థిరపడినవి. ఇందుకు కొన్నికొన్ని యుదాహరణములు :

ఆఫీసు - రోడ్డు - రైలు - స్టేషను - టిక్కెట్టు - పోలీసు-స్కూలు

షైము - కోటు - కోర్టు — జడ్జీ - ప్లీడరు ఇత్యాదులు వందలువందలు. వీటికి సరియైన పదములున్నా, లేకపోయినా, వీటిని తెలుగునుండి తొలగించలేము. ఫర్లాంగు - మైలు - లాకు - డాము - కలెక్టరు - పెన్సిలు - బిల్లు - సర్వే - ఇంజినీరు ఇట్టి వెన్నో! వీటికి సమానార్థక పదములను మనము కల్పించినా, వాటిని వాడేవా రుండరు. చాలా కాలము క్రిందట 'కలెక్టరు' అనుటకు, మండలకరగ్రాహి యని యొకరు ప్రయోగించిరి. దీనివి మఱెవ్వరును వాడలేదుగాని, ఇది సమానార్థకమా? ఇంతకంటె మండలగ్రాహి యనుట సముచిత మని పించునేమో! పెన్సలు కొకరు సీసపుకణిక యన్నారు. ఇది యీ జన్మలో వాడుకలోనికి వచ్చునా? వాడుకయనగా ప్రజలనోళ్ల లోబడి నలిగిపోవడం. అట్లు స్థిరపడినదానికి తిరుగుండదు. "అయితే అట్లన్య దేశ్యమిశ్రమమైనది తెలుగేనా" యని యొకరును, అవి తీసివేస్తే వ్రాతలే సాగవని యొకరును, వాటి యర్థమున తెలుగుపదాలు కల్పిస్తే అర్థమే కాకుండా పోతుందని యొకరును సందేహింపక మానరు. కాని, యిట్టి దంతా వాడుక తెలుగే యని యొకమాటతో బదులు చెప్పవచ్చును. ఏ భాషయైనా, తాను చేర్చుకొన్న యన్యదేశ్య శబ్దజాలమునంతను తనదిగానే భావించును. అది భాషల సహజధర్మమే. ఆంగ్లము మన దేశమునకు వచ్చినపిదప హిందూస్తానీ పదముల నెన్నిటిని స్వీకరించి నదో! అందాకా యెందుకు? కూలి - మడ్ — సునాం - మొదలగు పదములను మన తెలుగునుండి తీసికొనలేదా? అంతమాత్రముచే దాని యాంగ్లత్వమునకు హానివచ్చినదా?

పై యుత్తరువు వచ్చిన పిదప కార్యాలయములలోని గుమాస్తాలు కొంచెం తొట్రుపడుచున్నారని నే నెఱుగుదును. ఇది సంధికాలము గనుక, ఆ మాత్రము తడబాటు తప్పదు. ఆంగ్లములో ముందు వాక్యమనుకొని దానిని తెలుగులోనికి దింప యత్నించుట యీ తడ బాటుకు గల కారణములలో మొదటిది. బంధుమిత్రులకు కూడ

తెలుగులో నుత్తరం వ్రాయడ మలవాటు లేకపోవడం రెండవది. రెండుమూడు నెలలలో నొకవిధముగా వీరు సర్దుకొందురేమో గాని, యెట్లయినా, రాజకీయములయిన యన్ని కార్యాలయములలో నున్న వివిధ వ్యవహార మన్నివిధముల పారిభాషికమును స్వభాషా సంప్రదాయమున కతీతమునయి యుండును గావున ఆయా విషయములు నిస్సందేహముగా నందఱి కొక్కరీతి నర్థమగునట్లు వ్రాయుట కొక ప్రమాణగ్రంథ మావశ్యకమని భావింపక తప్పదు. శంకరనారాయణ నిఘంటువు చూచుచు నొకరిద్దఱు తెలుగుపదముల నుపయోగించుట నేను చూచితిని. ఒక గుమాస్తా 'యువర్ కౌంటరు సిగ్నేచరు' అన్నదానికి "మీ రెండవ చేవ్రాలు" అని వ్రాసెను. ఈ విధముగ వివిధ కార్యాలయములలోని గుమాస్తాలును వ్రాయుచుందురని మన మనుకోక తప్పదు. అందుచే 'తెలుగులో వ్యవహారం' అని ప్రభుత్వ మూరుకోక, ఆ వ్యవహారం సార్వత్రికముగా సమానముగా జరుగుట చూడవలసియున్నది. అందుకు కావ్య శబ్దార్థము జ్ఞానముతో సంబంధము లేకుండా, కేవలము వాడుకలో నున్నట్టి యితర భాషలకును, వివిధములయిన వృత్తులకును బహువిధములైన విదేశవస్తువులకును సంబంధించినట్టి శబ్దజాలమునకు సముచితార్థ వివరణముతో "వ్యావహారికాంధ్ర నిఘంటువు" తయారుచేయించి ప్రకటించుట యత్యంతావశ్యమని భావించవలసియున్నది.

అట్టి నిఘంటువుం ప్రకృతము దేశాభ్యుదయమునకు మూలములైన వివిధ శాస్త్రములును తెలుగులో ననువదించుకొనుటకు కూడా ప్రమాణమైనది, కావలెను. ఆ పని ముందు చేయించక యే యే విషయమం దెట్టి గ్రంథము వ్రాయించినా అది తెలుగుదేశమంతటికిని సర్వసాధారణముగా నుపకరించునది కాబోదు. ఇపుడు తెలుగులో ననువదింపబడుచున్న యా యా శాస్త్ర రచనలు పరిశీలించినచో నది స్పష్టపడగలదు.

అందఱిదారీ వేఱూ, ఆంధ్రులదారి వేఱూ, వీరిలో అందఱూ పెద్దలే. అందఱూ అన్నిటికీ అర్హులే. అందుచేతనే మనవా రారంభశూరులే కాని, క్రియాశూరులు కారనిపించుకొనుచున్నారు. ఎక్కడ లేనన్ని కులభేదాభిమానములకు స్వాభిమానములకు స్వార్థపరాయణత్వమునకు ఆంధ్రదేశ మాలవాలమై యున్నది. గుణజ్ఞతకు కొఱతవడి యున్న యీ దేశ మితరవిషయములం దేదారినిపోయి యేమగునో యిపుడు విచారించవలసినది లేదుగాని, ఆబాలగోపాల మాంధ్రజాతి యంతయు బహువిధముల నభివృద్ధిగాంచుటకు వివిధ విషయక విజ్ఞాన మావశ్యకము గావున నందుకు తగిన సాధనము లాలోచించుట ప్రభుత్వము విధి. వాటి కన్నిటికి మూలము వివిధ శాస్త్రములకు సంబంధించిన శీర్షికలతోడి వ్యావహారికాంధ్ర నిఘంటువు.

# శిష్టవ్యవహారం-ప్రమాణం

వేదము, లోకము. అని, శబ్దరాశి ద్వివిధము. ఇందు స్వతః ప్రమాణమైన వేదము మంత్రద్రష్ట లెట్లు దర్శించినారో అట్లే యుండునది గాని మాఱునది కాదు. లోక మట్టిది కాదు. లోక మనగా జనము అది వాడుకొనుచున్న శబ్దజాలమునకును లోకమునే పేరు. ఆర్య లోకము వాడుచు వచ్చిన యిది వేదములోనిదే యైనను వాడుకలో విలక్షణమై మాఱుచు వచ్చుట కారణముగా వైదిక శబ్దజాలముకంటె వేఱై లోకమైనది. దేశభేదమునుబట్టి రూపభేదమును గాంచుచు వచ్చినది. అపుడు శబ్దసంప్రదాయవేత్తలైన మహామును లనియతముగానున్న దీనిని కొంతకొంత నియమించుచు వచ్చిరిగాని, ఆనియమనము చాలకపోవుట కనిపెట్టి కాకటాయనుడా కార్యము చాలా వఱకు సాధించెను. కొంత కాలమున కదియు దీనిని శాసింప సమర్థము గాకపోవుట యెఱిగి పాణిన్యాచార్యుడు మరల సంస్కారానుగుణముగా పరిష్కరించుచు శాసించెను. అట్లనుశాసనము గాంచుచు వచ్చిన యీ లోకమే సంస్కృతము.

పాణిన్యష్టాధ్యాయికి భాష్యముగా శబ్దానుశాసనము నిర్మించిన పతంజలి తననాటి కుత్తర దక్షిణదేశముల రూపాంతరములు చెందుచు వచ్చిన యిందలి పెక్కు శబ్దముల కనుశాసనము గావించుచు నాటి సాధుత్వా సాధుత్వ నిర్ణయమునకు శిష్టవ్యవహారమే ప్రమాణమని వక్కాణించి యున్నాడు. మన కామహర్షి మాట వేదవాక్యము. పైశాచీ ప్రాకృత సాహాయ్యము గాంచి పెంపొందిన మూలద్రవిడ భాష కన్నకూతుళ్ళు ముగ్గురిలో నొకతెయై విడివడి వచ్చినపిదప సంస్కృత ప్రాకృతములతో చెలిమిచేసి యభివృద్ధికి వచ్చిన మనభాషలోని శబ్దముల సాధుత్వా సాధుత్వ నిర్ణయమునకు కూడా శిష్టవ్య

హారము ప్రమాణ మనుకొనుట యెంతయు సముచితమని యా మహాకుని మాటనుబట్టియే విశ్వసింతము. అయితే శిష్టులెవరు? ఇది యే భాష కా భాషయే చేసుకోవలసిన నిర్ణయము. ఆంధ్రము విష యమున—

సంస్కృతాంధ్ర భాషా పాఠకులు శిష్టులు, సంస్కృత పరిచయము కలిగి చక్కని కృషిచేసినవారును శిష్టులు, వాడుకలో కలుగుచున్న శబ్దార్థముల మార్పులను వాటి యౌచిత్యానౌచిత్యములును తెలిసిన వారును తెలియజేసేవారు నగు భాషా సంప్రదాయవేత్తలు శిష్టులు:

దేశభాష లందఱిసొత్తు గాని యొకరిసొత్తు కాదన్న మాట నిజమే కాని, అది ప్రజలు పరస్పరము తమ యభిప్రాయములు తెలుపు కొనుచు మాటలాడుకొనుటకును తమతమపను లెల్ల నెఱవేర్చుకొను టకును చెల్లును గాని మాపలుకుబడియే నిర్దుష్ట మని పట్టుపట్టుటకు చెల్లదు. శబ్దార్థముల మంచిచెడ్డలు కనిపెట్టేశక్తి జనసామాన్యమున కుండదు గదా! అట్లుంటే, ఒక్కొక్కశబ్దము పెక్కురీతుల నెందుకు మారిపోవును? అట్లు మారినా వ్యవహారము సాగిపోవుచున్నదిగదా యని వాడుకభాష యంతయు కావ్యభాష కాదగునా? ఒకడొక వాక్యము తొందరగా మాటాడునపు డొకవిధముగా పలుకును. అతడే ఆమాటలే నిదానించి వ్రాయునపు డంతకంటె నింపుగా నుండునట్లు వ్రాయును. ఆమాటనే బాగా చదువుకొన్నవా డంతకంటె హృద్య మగురీతిని వ్రాయును. ఇదే వాడుకభాషకును కావ్యభాషకును గల భేదము. ఏదేశమందైనాం ఏభాషకైనా, ఈభేదము తప్పదనుట సత్యము. కావుననే శబ్దార్థ తత్త్వజ్ఞుల వాడుకప్రమాణమని పెద్ద లన్నారు. ఆయాకాలమునకు తగినట్లుగా వ్యాకరణము కూడా మాఱుచుండవలెనని సంప్రదాయజ్ఞు లన్నారు. దేశభాషనంతను శాసించుట యెవరికిని శక్యము కాదు కాని, శబ్దస్వరూపము బొత్తిగా చెడిపోకుండ భాషను రక్షించు పనికి వ్యాకరణ మావశ్యకమే. అది

భాషాప్రవాహమున కిరుప్రక్కల నుండు గట్లవంటిది. అది లేదేని గట్లు లేని నదివలె భాషయు చెల్లాచెదరై పోవును. కట్టుబాటు లేని భాష నీతి తప్పిన స్త్రీవలె రోత పుట్టించును. వాడుకలో వికలమైన శబ్దములను పరిష్కారపద్ధతి ననుసరించి ప్రయోగింపక యట్లే ప్రయోగించినచో నట్టిరచన రుచ్యము కాజాలదు. కావ్యమునకు శబ్దార్థములు తనువన్న పెద్దల మాటలో నోటికింపగునట్లు శబ్దములను, మదికింపగు నట్లర్థమును నుండవలెనన్న భావము విదితముకదా ! దీని కింతయేల ? జనసామాన్యము వాడుకలో నున్నశబ్దము లట్లే కావ్యముల కెక్కునని కాని, ఎక్కవలె నని కాని, యెన్నటికిని తలంపరాదు. సాధూచ్చారణమును శబ్దముల నిజస్వరూపమును చెవికింపగునట్లు సాధ్యమగు నంతవఱకు పాటించుటయే కవుల కలవాటు. ఇందుకు, తననాటికి గాసటబీసటగా నున్న శబ్దజాలమును తన కవిత్వశంఖమున పోసి పావనము గావించి సహజసౌష్టవముతోడి శబ్ద సౌందర్యమును సాధ్యమైనంతవఱకు చక్కజేసి మనకు సత్కావ్యభిక్ష పెట్టిన నన్నయార్యుని యుద్యమమే మొదటి నిదర్శనము.

> " సారమతిం గవీంద్రులు ప్రసన్న
> కథా కలితార్థయుక్తిలో
> నారసి మేలు నా, నితరు
> లక్షర రమ్యత నాదరింప—"

అని యత డన్నమాటలలో సర్వజనాదరణపాత్ర మగునది చక్కని పదముల కూర్పన్న భావము విస్పష్టము కాదా ! తాను 'విపులశబ్దశాసనుడ' ననుకొనుటకు కారణమదే. ఈసందర్భమున రెండు మాటలు—దీనికి సమానార్థకమైన వాగనుశాసనశబ్దమెట్లో తరువాత నాంధ్రశబ్ద చింతామణిలో తత్కర్తృపరముగా ప్రవేశింపగా నర్వాచీను "లావిపుల శబ్దశాసనుడే యీ వాగను శాసనుడు, నన్నయార్యుడే

దీనికర్త" యని లోకమునకు చాటి భ్రాంతి కలిగించిరి గాని, ఆ చింతామణి మన నన్నయార్యుడు రచియించినది కాదనుట ముమ్మాటికి నిజము. చింతామణి ముందు నిర్మించి తరువాత నతడు భారతము తెనిగించె ననుట యెంతయు హాస్యాస్పదము—అతడు తన నాటికి వాడుకలో నున్న శబ్దముల సహజ సౌందర్యము మఱుగుపడి పోకుండుట కెట్లు యత్నించెనో అట్లే మనము నేటికి వాడుకలోనున్న శబ్దములను ప్రయోగించుటకు యత్నించుటయు సముచితము. పూర్వకవిశిష్టసంప్రదాయ మదే.

# క్రియా పదాల వాడుక

వెయ్యేండ్ల నాడు క్రియారూపము లెట్లుండెడివో నిర్ణయించుట కితరాధారములు లేకపోయినా, నాటి శాసనములును నన్నయార్యుని రచనయు వాడుకలో నున్నట్లే వాటిని సముచితరీతిని గ్రహించియుండు నని నమ్మకతప్పదు. అవియే కాదు, తిక్కనాదుల కృతులు నట్లేచేసి నవి. కాని క్రియా ప్రయోగమున స్వాతంత్ర్యము చూపలేదు. క్రియా రూపములను కల్పించలేదు. నన్నయార్యుడెఱుగని "జన్మించినారు-చనుదెంచినాఁడను-వచ్చినాను" వంటి క్రియలు వాడుకలో ప్రవేశించి శిష్టసమ్మతము లగుటచేతనే తిక్కన సోమనాదులు క్రమముగా ప్రయోగించినారు కాని వేఱుకాదు. అట్లు వాడుకలో మాఱుచు వచ్చిన క్రియారూపభేదములెన్నో యున్నవి. వాటిలో విచిత్రమైన భవిష్యత్కాలక్రియను గ్రహింతము. అర్వాచీను లేవి భవిష్యత్కాల క్రియారూపములనిరో, చేయగలడు, ఉండగలను, వంటి యారూపము లను భారతకవులెఱుగరు నరి గదా! తెలుగునకు తొలుత వ్యాకర ణము నిర్మించిన కేతనకూడా యెఱుగడు. తరువాతివారు తద్ధర్మార్థ కము లన్న "వచ్చును, చెప్పుదును, తెత్తురు" వంటి రూపములే నాడు భవిష్యదర్థమును తెలుపుచుండెడివి భారతాదు లందున్న "కలడు-కలరు" వంటి రూవములు స్వతంత్రములుగాని యనుబంధ ములుకావు. అవి, ఉండు-చాలు-ధాతువుల యర్థములు తెలుపుచున్నవి. "ఒరులు కలరె కర్ణునోర్వ, ఒరులు శల్యునోర్వ గలరె? నీవు భోగము లనుభవింపగలవు" ఇత్యాదులందాయర్థములు స్పష్టములు. ఇందలి యర్థవిశేషముపై దృష్టి నిలపక-అనుభవింపగలవు- వంటివి భవిష్య త్కాల సూచకము లని భావించి, తరువాత నాంధ్రశబ్ద చింతామణి కారుడు కలానుబంధముతోడి భవిష్యత్కాల క్రియలను నిరూపించి నాడు. చింతామణి, భారతకవి నన్నయార్యుడు రచియించినది కాదను

టకు కల ముఖ్యకారణములలో నిది యొకటి. ఈక్రియావిషయము నాయాంధ్ర భాషానుశాసనమున సవిస్తరముగా నున్నది. ఈక్రియా రూపములు నాడు కాదు, నేడు కూడా కేవలము భవిష్యత్కాలమున బోధించునవిగా వాడుకలో వినరావు. తుమున్నంతములతో కలిసి యున్నట్లు కనబడే-కలను-కలను-వంటి నర్థవిశేషబోధకములైన స్వతంత్రరూపములు కాని యనుబంధములు కావని యర్థసందర్భ మూహించినచో బోధపడును. వాడుకలో భవిష్యదర్థ మిష్టమైనప్పుడు "వాడు చేస్తాడు" అని యందురు. శక్తిని తెలుపునపుడు "వాడు చేయ గలడు గాని, నేను చేయలే" నని యందురు. "ఈపద్యమున కర్థము నీవు చెప్పగలవా? ఆ! చెప్పగలను-" "వాడు రేపటికి రాగలడా? రాలేడు-పోనీ! నీవువస్తావా? వస్తాను" ఇత్యాది సంభాషణ మందీ విషయము విస్పష్టము.

బాగా పరిశీలింపగా-వచ్చును - సేరును - తలతును-వంటి కొన్ని రూపములు పూర్వకృతులలో కొన్ని సందర్భములం దితరకాలము లను కూడా తెలుపుచున్నవి గాని-వస్తాడు-పోతాడు-చూస్తాను-వంటి రూపములొక్క భవిష్యత్కాలమునే తెలుపుచున్న వనుట స్పష్టము. నిజమైనభవిష్యదర్థ క్రియాపదము లివే యనునంత సమర్థములైన యీరూపములు నన్నయాదులనాడు వాడుకలో నున్నవో లేవో చెప్ప జాలముగాని శ్రీనాథునినాటి కివి వాడుకలో నున్న సూచనలు కలవు. అయినా, వీటిని పూర్వకవులు తమ ప్రబంధములందు ప్రయోగించ లేదు. కారణము లాక్షణికులు వీటికి గతి కలిగించక పోవుటయే. కొన్ని కొన్ని శిష్టప్రయోగములను గ్రహించిన సర్వస్వతంత్రుడగు శ్రీనాథుడుకూడా "వస్తూ చూస్తిమి రోస్తిమి" ఇత్యాదిగా వీటికైన ఇతర కాలక్రియాపదము నొక్క చాటువులో వాడినాడు గాని, తన ప్రబంధములలో ప్రయోగించి యుండలేదు. తరువాత, రామస్తవ రాజప్రభు లింగలీలా పట్టాభిరామాయణాదులం దవి నిర్భయముగా

ప్రవేశించినవి. దీనిని బట్టి శిష్టసమ్మతములైన శబ్దముల నిష్టమున్నను లక్షణాతిక్రమ దోషమునకు జంకి పూర్వకవులు వాడలేదనియు తదర్వాచీనకవులందుకు సాహసించుచు వచ్చిరనియు తెలియగలదు. అట్టియెడ, భాష నిరంకుశముగా ప్రవర్తింపఁ జొచ్చిన యీకాలమందు కూడా పూర్వసూత్రములనే పట్టుకొని యెవరు వ్రేలాడుదురు? కావున వచ్చాను, వస్తిని, వస్తున్నాడు, వస్తాడు-వంటి శిష్టవ్యవహార సిద్ధములు గ్రామ్యములని యిపుడంగీకరింపక తప్పదు కాని, ఆశిష్టులే తొందరగా సంధిలో పదాదిహల్లు లోపింపజేసి పలికే-వాడొచ్చాడు, వీడొస్తున్నాడు-వంటి వికృతరూపములు రచన కర్హములు కాజాలవు. వాడుక భాషకు కావ్యభాష దగ్గఱగా నుండదగు నన్న సర్వసామాన్య నియమము భావమిదే. ఇపు డెక్కువగా క్రియాపద ప్రయోగమునందు వైవిధ్యము కనవచ్చుచున్నది. శ్రుతిరమ్యతయు శిష్టసమ్మతియు కనిపెట్టి, ఆయా రూపాంతరములు గ్రహించుట సముచితము. ఇంక—

ద్రుతాంత శబ్దములు భాషలో మొదటినుండియు నున్నవే కాని, ద్రుతకార్యము మాత్రము సార్వత్రికము కాదు. ఊర బిచ్చిక-తలప్రాలు మొదలగు కొన్ని సమస్త పదములందును, అనగూడదు, చెప్పదలచెను, చూడబోయెను, ఒప్పజెప్పి - ఇత్యాది తుమున్నంతావ్యయములమీదను సహజ మన్నట్లు సరళాదేశము కనవచ్చును గాని, ద్రుతాంతము లనబడు విభక్తులమీఁద నీ కార్యము వాడుకలో నెక్కడా కనబడదు. వ్యవహారసిద్ధమైనది పొమ్మన్నా పోదు. కాని దానిని తెచ్చిపెట్టుకోనేల? నన్ను చూడలేదు. నాతో చెప్పలేదు. నీకంటె టక్కరిలేదు. వానివల్ల కాదు. నాకు కనబడలేదు. ఎక్కడికి పోతావు?; నేను పుచ్చుకోను. అనువిధముగా తెలుగువారందఱును మాటలాడుదు రనుట విదితము కదా? ఇక్కడ ద్రుతకార్య మేదీ? నాతో జెప్పలేదనే శిష్టు డొకడేని కలడా? అయితే యిది యెట్లు,

వచ్చినది? ప్రాచీన కవులు కొన్ని శబ్దముల రూపములు చిత్రించినట్లే గణ యతి ప్రాస యానుకూల్యమునకై ద్రుతమును చిత్రించుచు వచ్చిరి. లాక్షణికులు దానికి మఱికొంత మెఱుగుపెట్టిరి. లేకున్న వాడుకలో సరసంపు బలుకు దృష్టింజేసి గండుగోయిల ఇత్యాది వాక్యములు వినవచ్చినవని వారు ప్రయోగించిరా? పూర్వులు వాడుక భాషకు కావ్యభాషను కొంచె మెక్కువదూరము చేసినారనుట కిదియొక దృష్టాంతము. పద్యకావ్యరచయిత క్లిష్టమైతే దీని నుపయోగించుకోవచ్చును గాని వచనరచయితలకు దీనితో పనిలేదు. అందుచే వ్యాకరణ మెఱుగని పాఠకులకు శబ్దాద్యక్షర మేదో తెలియకుండా చేయు ద్రుతకార్యమును విడిచిపెట్టుటయే మేలు. దానివల్ల భాషకు వచ్చే హాని యేమీలేదు. రాజులకు బారులే కన్నులని, అరసున్న చేర్చి వ్రాసినా ముందపార్థము తోచకపోవునా? నీకు దొరకదన్నట్లు, నీకు తప్పదంటే అర్థము చెడిపోవునా? దీని కింత యేల? ఎంతో కాలము బిగిగా నుండే గసడదవాదేశమును క్రమముగా లాక్షణికులే సడలించుచు రాలేదా? దీనిగతియు నంతే. కావున శిష్టవ్యవహారము ప్రమాణ మన్న మాట దీని కక్షరాలా యనువర్తింపవలసినదే. కాని, —

నేటి రచయితలు కొందఱే సంప్రదాయము ననుసరింపక భాషను కలగాపులగం చేయుచున్నారు. అందు కొన్ని రచన లొకసారి చదివి విడువదగినవే యైనా, వాటిలోని భాషకూడా చెవికింపగుపద్ధతి ననుసరించడం ధర్మము. వాడుకభాషలో వ్రాసినది సాధారణ పాఠకులకు సుగమముగా నుండు నన్నమాట కాదను వాడుండడు కాని, అది భాషా గౌరవమునకు భంగకరముగా నుండరాదు. అందుచే శిష్టులు వాడుచున్న మాటలలో కూడా తారతమ్యము పరిశీలించి, యేది చెవుల నింపుపుట్టించునో దానినే వాడుచుండుట యుక్తము. ఇందు కొక్క యుదాహరణము; ఎవ్వరయినా భోంచేసి వెళ్ళు అని సత్వర

ముగా పలికినా, పెద్దలు 'భోజనం చేసి వెళ్లు' అనియే పలుకుదురు. ఈ భేదము కనిపెట్టి శబ్ద స్వరూపము పూర్తిగా మఱుగుపడిపోవు మొదటి ప్రయోగముకన్న శిష్ట సంప్రదాయ సిద్ధమైన రెండవ ప్రయోగమును గ్రహించుటయే సముచితమని భావింపవలెను. ఇట్లే యౌచిత్యానౌచిత్యములను పరిశీలించి సర్వజనసామాన్యముగా నిపు డుపకరించు రచనలయెడ శిష్టుల వాడుకలోని శబ్దముల నుపయో గించుట పాఠకులకు హితమును, భాషకు గౌరవప్రదము నగునని నాయభిప్రాయము.

# సంస్కృతము - రాజభాష

హిందూ దేశమున రాజభాష కాదగినది హిందీయని మొదటి నుండియు చెప్పుచు వచ్చిన గాంధిమహాత్ముడే స్వరాజ్యము లభించుట కించుకముందును, లభించిన తరువాతను హిందూస్తానీ రాజభాష కావలెనన్న నిశ్చితాభిప్రాయ మావిష్కరించెననుట విదితము. కాని అరబ్బీ పార్శీ శబ్దములతో నిండిన హిందూస్తానీ కంటె సంస్కృతసమ సంస్కృతభవ శబ్దజాల మధికముగానున్న హిందీని గ్రహించుటయే యావశ్యక మన్న వాద ముత్తరదేశమం దెక్కువగా లేకపోలేదు. అందుచే నీరెంటిలో నేది నిర్ణీత మగునో యనుకొనుచున్న యీసమ యమున సంస్కృతము ముందుకు వచ్చినది. స్వరాజ్యము సిద్ధించిన యీశుభసమయమున సంస్కృతాభిమానము దేశమున తల యెత్తు చున్నందుకు హైందవుడైనవా డానందింపకపోడు.

విదేశప్రభుత్వమువారును జీవికార్థమై పరభాష నభ్యసించు స్వదే శీయులును తనయం దాదరాభిమానములు చూపకున్నను ప్రాచీన విద్యాభిరతులైన సంస్థానాధీశ్వరులు కొందఱును, వదాన్యులైన శ్రీమం తులు కొందఱును పోషించుచు వచ్చుటచేతను, భరతఖండమం దార్య విద్యాసక్తి సమూలముగా నడుగంటకుండుటచేతను, సంస్కృతము సజీవమై దేశము నెల్లెడ మందగతినైనా సంచరించుచున్న దనుటకు దీని మహాత్త్వమే కారణము. ఇపుడు సర్వతోముఖముగా దీని నభివృద్ధికి తేవలెననియు, పాఠశాలలందు దీని నవశ్యపాఠ్యముగా నిర్ణయింపవలెననియు, దీనినే రాజభాష కావింపవలెననియు వివిధ రాష్ట్రములందలి విద్యాధికులును సమున్నత పదవులందున్న యధికారు లును కొంద ఱత్యుత్సాహముతో నుపన్యసించుటకును దీని నుద్ధరింప నుద్యోగించుటకును దీని మహాత్త్వమే కారణము.

తొలుత సప్తసింధు తీరముల నాశ్రయించి యున్న యార్యజాతి వారి కేది మాతృభాషయో, ఏది లోకము - భాష యను నామముల నార్యావర్త దక్షిణాపథముల వాడుకలో నుండెనో, భరతఖండమున కాజన్మసిద్ధమైన దాని సుప్రసన్న పరిణామమే సంస్కృతము. పాశ్చాత్య పండితులు ఎందఱో యిది నిరుపమానభాష యని నుతించి యుండ జగత్ప్రసిద్ధిగాంచిన దీనిఘనత యిట్టిదని మనము వేఱే వర్ణించు కొననేల ? ఐహికసుఖసాధనమైన వివిధవిజ్ఞానములకును, ఆముష్మిక సాధనమైన తత్త్వజ్ఞానమునకు, నిది పెన్నిధి యని యొకమాట చెప్పిన చాలును.

హిందూదేశమున నాలుగు వేల యేండ్ల క్రిందటివఱకు నిది వాడుక భాషగా నున్న దనుట వాస్తవము. నలుదెసల సంఘము పెరుగుచున్న యాకాలమున నిందలి శబ్దజాలమాయాదేశములవారి యుచ్చారణ వైకల్యమున వికృతరూపములు తాల్చుటయు, ఆ రూపాంతరములే ప్రాకృతములను పేర తక్కిన వర్ణములవారి నాశ్రయించుటయు, దీని నిజరూపము మాత్రము బ్రాహ్మణజాతి నాశ్రయించి నిలుచుటయు సంభవించినది. అట్లు సుమారు వేయిసంవత్సరములుండి పిదప బ్రాహ్మణుల వాడుకనుండియు మెల్లగా దిగజాఱినది. ఈయంశములకు వాల్మీకి పతంజలి మొదలగు మహనీయుల మాటలే ప్రమాణము. ఈ విషయమంతయు నా సంస్కృత వాఙ్మయ చరిత్ర మొదటిసంపుట మున విశదీకరించి యున్నాను. దీనిని బట్టి, ఆదిని కొన్ని వేల సంవత్స రములు హైందవుల వాడుకలోనున్న సంస్కృతమునే యిప్పుడు రాజ భాషగా నొనర్చుట సముచితమని భావింపవచ్చును.

సంస్కృతము క్లిష్టభాష యనెడి ప్రవాద మొకటి కలదు గాని, అది గణనీయము కాదు. నేడు వాడుకలో నున్న హిందీ గుజరాతి తెలుగు కన్నడము మొదలగు భాషలలో సగానికి సగము తత్సమ

ములై యుండగా సంస్కృతపదముల పలుకుబడి హైందవుల కాబాల్య ముగా నలవాటయిన దే యని వేఱుగా చెప్పవలెనా? వేలకొలది యోజనముల దూరమునుండి వచ్చిన యాంగ్లము నవలీలగా నభ్యసించిన హైందవులు తమ ప్రాచీనుల తల్లిభాషయు తమ భాషలకు తల్లియునైన సంస్కృతము నేర్చుకొనుటకు క్లేశపడుదురనుట సరికాదు. స్వరాజ్య ముతో స్వభాష నుద్ధరింపవలెనన్నను, గాంధిమహాత్ముడు కాంక్షించి నట్లు రామరాజ్యము ప్రతిష్ఠించవలెనన్నను, అందుకు సర్వవిధముల సముచితమైనది సంస్కృతము తప్ప వేఱొకటి కాజాలదు.

"దేశమున నెన్ని మార్పులు సంభవించినను చెక్కుచెదరక సాటి లేని సొగసుదనమున విలసిల్లునట్టియు, యూరపుఖండభాషలకు తల్లియైనట్టియు గ్రీకుభాష మార్దవమునకును రోమన్ భాష శక్తికిని కారణమైనట్టియు సంస్కృతభాష నేటికి నష్టప్రాయము కాకుండ హిందూదేశమున గనం బడుట యెంతయు నాశ్చర్యకరము" అని మైలరు దొర ఆశ్చర్యానంద ములతో గావించిన యీస్వభావవర్ణన, మొక్కటియు చాలదా, భారతీ యుల హృదయములందు సంస్కృతమే రాజభాష కావలెనన్న దృఢ సంకల్ప మావిర్భవింపజేయుటకు? భారతీయులు తమ తొల్లిటి కాణాచి యైన యమృతవాణి నాస్వాదించి యుత్తమసారస్వతాంబుధి నోల లాడుటకును, ఆర్యావర్తదక్షిణాపథముల యాంతరంగిక సంబంధము దృఢపడుటకును హైందవరాజ్యము సకలదేశముల గౌరవాదరములకు పాత్రమగుటకును భారతభూమి శాంతికి నిలయమన్న పూర్వయశస్సును పునఃప్రతిష్ఠ గావించుటకును సాధనమైన దొక్క సంస్కృతమే యని సహృదయులు భావింతురుగాక! పరమేశ్వరకృపచేసి నిది రాజభాషయై దేశదేశాంతరముల ఖ్యాతినిగాంచుగాక!

ఈ వ్యాసము రచియించినంతలో వచ్చిన 24 తెదిగల ఆంధ్ర. పత్రికలో ఢిల్లీలో జరిగిన కాంగ్రెసు కార్యవర్గ సమావేశమునందు

"కాంగ్రెసు కార్యక్రమము యావత్తు హిందూస్తానీయందే జరుగవలె నని, రికార్డు యావత్తు నాగర లిపిలో నుండవలెనని" ఉపసంఘము వారు చేసిన సూచనలలో 'మొదటి దంగీకరింపబడినదని, రెండవ దానియెడ మౌనము వహింపబడినది,' అను ప్రకటన మున్నది. దీనిని బట్టి గాంధిమహాత్ముని కోరిక తప్పక నెరవేఱునని గావించుట కవకాశము పూర్తిగా కనబడుచున్నది. కేంద్రప్రభుత్వ మట్టి నిర్ణయమే చేసినచో, అన్నిరాష్ట్రముల ప్రభుత్వమువారును పాఠశాలా కళాశాల లందు సంస్కృతముకూడా అవశ్యపఠనీయ మగునట్లు చేయుదురుగాక!

# కావ్యజిజ్ఞాస
# స్వప్నవాసవదత్త

ఆనాటికి పూర్వము లౌకికభాషలో రూపకరచన లేదనజాలము గాని, నాటిదొకటియు వినరాదు. అందుచే దృశ్యకావ్య సృష్టికర్త భాస మహాకవి యనియె విశ్వసించుచున్నారు. ఇత డిరువది నాలుగు రూపకములు నిర్మించెనని రాజశేఖరాది పూర్వకవుల విశ్వాసము. కాని, ఇతనివని పదుమూడు మాత్రమే నేడు గోచరించుచున్నవి. అందు, ప్రతిజ్ఞా యౌగంధరాయణము, స్వప్నవాసవదత్త, అవిమారకము, ప్రతిమా నాటకము, చారుదత్తము ననునవి గణన కెక్కినవి. ఇంతమాత్రమున నభిషేకాదులు ప్రశంసాపాత్రములు కావని తలంపరాదు — మొత్త మన్నిటిలోను నాటినుండి నేటిదాకా సకల విద్వద్వినుతమైనది స్వప్నవాసవదత్తము. ఈ వ్యాసమున దానిని ప్రధానముగా గ్రహింతము.

## స్వప్న వాసవదత్త

రూపక నిర్మాత ప్రఖ్యాతేతి వృత్తమును సహృదయ రంజకముగా ప్రదర్శన రమ్యముగా మార్చవచ్చును, నూతనాంశములు చేర్చవచ్చును. అని, తరువాతి కవులకు త్రోవ చూపినవాడు భాసుడు. ఇందు కితని భారత రామాయణ కథారూపకములన్నియు సాక్షులు. అట్లే ప్రతిజ్ఞా, వాసవదత్తలలోని ప్రధానేతివృత్తము గుణాఢ్యుని బృహత్కథలోని దయ్యు నితని రచనలో నెక్కువ మార్పుగాంచె ననుట విదితము. అట్లు రసోచితముగా మాఱుటంజేసి యిందలి వస్తువు మిశ్రమైనది.

వస్తుసంగ్రహము :— అరుణి యను శత్రురాజు తన రాజ్య మపహరించిన కాలమున నుదయనుడను వత్సరాజు లావాణక మను

గ్రామమున నివసించి యుండును. ఆ రాజ్యమును మరల తమ కేనికి వశపఱచుటకై యతని ప్రధానమంత్రి యౌగంధరాయణుడు తీవ్రముగా నాలోచించుచుండును. ఉదయనుని రాజ్యము పోవునని చెప్పిన పుష్పక, భద్రాది దైవజ్ఞులే కొలంది కాలమున మగధరాజ పుత్రియు, దర్శక మహారాజు చెల్లెలు నగు పద్మావతి యుదయనునికి భార్య యగు నని చెప్పుటంబట్టి, మంత్రి యా సమయమున కెదురుచూచు చుండును — ఒకనాడు వత్సరాజు వేటకు వెళ్ళినపుడు లావాణకము దగ్ధమగును. ఆ మంటలో పడి వాసవదత్తయు, ఆమెను రక్షింపబోయి యౌగంధరాయణుడును మృతులైనట్లు విశ్వసనీయమైన వార్త వ్యాపించును — వత్సరాజ ధర్మపత్ని బ్రాహ్మణ స్త్రీ వేషముతో నవంతిక యగును. మంత్రి, కాషాయాంబరధారి యైన సన్యాసి యగును. ఎవ్వరికిని తెలియకుండ నిరువురు మగధారణ్యము ప్రవేశింతురు. ఆ సమయముననే పద్మావతి యా యడవిలోని యొక యాశ్రమమున తాపసిగానున్న తన తల్లిని చూడవచ్చును. ఆశ్రమములోని తపస్వుల కోర్కెలు తీర్చుచూనిన యామెను దర్శించి, కపట సన్యాసి, "ఈమె నా చెల్లెలు, భర్త పరదేశమేగెను. అతడు వచ్చునందాక నీమెను నీవద్ద నుంచుకొని రక్షింపు" మని యర్థించి యవంతికనా రాజపుత్రి కప్పగించును.

రాజగృహమను నగరమున వాసవదత్త, అవంతిక యను పేర పద్మావతి యంతఃపురమున నుండును. దర్శకమహారాజును చూడ నుదయను డచ్చటికి వచ్చును. ఆ మగధేశుని కోరికచే పద్మావతిని వత్సరాజు పరిగ్రహించును. ఆరాజు సాహాయ్యమున వత్సరాజ్యము దయనునికి మరల వచ్చును — ఈ కథాంశములు చక్కగా వికసింపగా నిది యారంకముల నాటకమైనది.

రూపకారంభము :—భాసుని రూపకారంభ మద్భుత మతి సంగ్రహము—నాంద్యన్తే, తతః ప్రవిశతి సూత్రధారః—అను కవి వాక్య

మును బట్టి, తెరలో నాంది యాచరించిన సూత్రధారుడు రంగస్థలమున ప్రవేశించినట్లుండును. అట్లైనా, యే బెడద లేకుండ సూచ్యార్థసూచనముతోడి యొక మంగళశ్లోకము చదివి, అనంతర కథాపాత్ర ప్రవేశము సూచించి నిష్క్రమించును. ఇది స్థాపన. ఇదే తరువాతవారికి ప్రస్తావన మైనది. భాసుని యీ రీతి కానందించిన బాణభట్టు మాట యిది—“సూత్రధార కృతారంభై ర్నాటకై ర్బహు భూమికైః, సపతాకై ర్యశో లేభే భాసో దేవకులై రివ”

ఈ మహాకవి రచనలో వాగాడంబరము తక్కువ. అర్థభావ గాంభీర్య మెక్కువ, యనుటకిది ప్రథమోదాహరణము. ఇంక,

కథారంభము:— ఇది మఱియు నద్భుతము. ప్రేక్షకుల హృదయమును తొలుతనే కథామధ్య భాగమున ముంచి వారి దృష్టిని రంగస్థలమున నిలుపునట్టి యీరీతి తరువాత వారికి మార్గదర్శకమయ్యె ననుట నిరాక్షేపము—ఆదినే తమ తమ పనుల వెంబడిని కథానాయికలైన పద్మావతీ వాసవదత్తలు రంగము చొత్తురు. వారి యవస్థలు వేఱు, వారి ప్రవృత్తులు వేఱు, అయిన నేమి? వస్తుపాత్ర రసోచితముగా వాటికి చక్కగా సమన్వయము కుదిరినది. అచింతితముగా యౌగంధరాయణుని వాసవదత్తాన్యాస సంకల్పము సిద్ధించినది. ఈ మంత్రి, పద్మావతి వత్సరాజునకు భార్య కాగలదని యెఱుగును గాని, అమెవద్దనే వాసవదత్తను దాచదలచి యీ యడవికి రాలేదు. పద్మావతి తనతల్లిని దర్శింప నచ్చటికి వచ్చినదిగాని, యీ మహాభారము నెత్తిని పెట్టుకొనుటకు రాలేదు—ప్రేక్షకులకు దైవిక సంఘటనముగా దోచు నిది కవిపక్షమున కథా మర్మము. పై యర్థమును సమర్థించు పాత్రపోషణమిదె. *యౌగం - కావ్యం నైవార్థైర్నాపి భోగై రిత్యాది —

*ఇంతటినుండి పాత్రభాషిత ముదాహరింపవలసినపట్టుల, గ్రంథవిస్తరము కాకుండుటకై కొన్నిచోట్ల మూలానువాదమే వాడుచుందును. భాసుని నాటకములను నేను ‘భాసనాటకకథలు’ అను పేర వచనములుగా ననువదించి యున్నాను.

"నాకేమీ అక్కరలేదు. ప్రోషిత భర్తృకయు ధర్మశీలయు నైన నా సోదరిని కొన్నాళ్లు రక్షించిన జాలును" కంచు — "సుఖమర్థో భవే దిత్యాది-" అమ్మా! ఈ ముని యభిలాష గొప్పది. తపోధన ప్రాణములనైన ధారపోయుట సుకరము గాని, న్యాసరక్షణము మాత్రము సుకరము కాదు!!

పద్మా "ఏ కోర్కెయైనను తీర్తునని ప్రతిన చేసి, ఇపుడు వెను కాడుట తగవా?"

యౌగ-"అబ్బా!! సగముబరువు వదిలినది ... దైవజ్ఞులమాట మీాది నమ్మకమునుబట్టి యీామె నీ రాజపుత్రిక కడ నుంచుట మఱియు సముచితమైనది"

ఇక నీ సందర్భమందలి పాత్రభాషణమందు మాా ఎంత సహజమో, అంత భావగంభీరము, అంతర పోచితము-మఱియు, వాసవదత్త దగ్ధురాలైనదని విని పరిపరివిధముల పరితపించిన వత్సరాజు వియోగ దుఃఖావస్థ నీరంగముననే బ్రహ్మచారి పాత్రముఖమున వినజేసిన కవి చాతుర్యమందునూ, ఆ ప్రతిభకే చెల్లును. అది పైకెంత ప్రాసంగిక ముగా కనవచ్చునో, భావించిన కొలది నంత భావ గంభీరమై కావ్యార్థ సాధనమై, ప్రసన్న దర్శనైక మూలమైన కథా సంవిధాన చాతురియన నిది గదా యనిపించును. మఱియొక సాధారణ కవి యైతే యీా యంకమును రెండుచేసి వత్సరాజు విరహవేదనను వేఱుగా ప్రదర్శించి, నాటకరసము నేట గలిపి యుండును — అయితే కవి యెందుకీ యుదంతము నిచ్చట కల్పించెను? ప్రేక్షకులు దృశ్యకావ్య లక్ష్మీముఖ విలాసము తిలకించి, కథోన్ముఖులగుటకు, సవతులుగా నున్న పద్మావతీ వాసవదత్తల శీలములను మొదటినుండియు సరి చూచుచుండుటకు-అందును, పద్మావతిని తీర్చిదిద్దుట కథాపక్షము —

వత్సరాజ దుఃఖోదంతము తెలిపినవాడు వాసవదత్తా వత్సరాజుల

కెట్లును సంబంధింపని యాగంతుకుడు తపస్వి ప్రత్యక్ష సాక్షి. అందుచే నందలి యందఱికిని వాసవదత్తయం దాఱేనికి గల యవ్యాజ గాఢాను రాగ మక్షిగోచరమైనది. ఇందుకు– "నఖలు గుణవాన్ నానురాజా, య ఆగంతుకేనాప్య నేన్నైవం ప్రశస్యతే – ఆగంతుకుడు కూడా యిట్లు ప్రశంసించుటంబట్టి గుణవంతుడైన రాజనగా నతడే యగును" అన్న తాపసి మాటచాలును. ఆమాట విన్న చేటి పద్మావతితో రహస్యముగా "అమ్మా! ఆ మహారాజిక నేరాజకన్యను పెండ్లా డునో?" అనగా నామె "అదే నే నాలోచించుచున్నా" ననును. ఈ ప్రసంగమున నింతకుమున్ను ప్రసక్తికివచ్చిన యుజ్జయినీ రాజపుత్రీ సంబంధ వాంఛ యడుగంటినది. పద్మావతికి వత్సరాజు నం దభిలాష మంకురించినది. ఆఱేడు దయాసముద్రుడని వినుటయే యందుకు ముఖ్యకారణము. పూర్వోక్తకల్పన కిదియొక పరమ ప్రయోజనము. మఱియొకటి. కంచుకి తొలుత నా బ్రహ్మచారి నాహ్వానించినపుడు, వాసవదత్త యించుకకొంకు చూపును. అది చూచి పద్మావతి "ఓహో! ఈమె పరపురుషదర్శనమును పరిహరించుచున్నది. ఈమె నేకాంతమున గాపాడదగునుగదా!" అనును – భర్త దుఃఖమును విని వాసవదత్త తనలో దుఃఖపడుట కనిపెట్టి పద్మావతి "ఈమె పరుల కష్టము సయింపలేని దయాహృదయురాలు గదా!" అనును – ఇదంతా తరువాత తన యొద్ద న్యాసముగానున్న యవంతిక యెడ పద్మావతి, ప్రేమమే కాదు, గొప్ప గౌరవము చూపుటకు మూల మైనది. ఇట్లు బహుప్రయోజనమైన రాజవిషాదోదంత కథనముతో ప్రథమాంకము ముగియును.

ప్రతిజ్ఞా ప్రతిమాదుల యారంభములుగూడ నాహా యనిపించునవే గాని, యిందలిది మఱియు మనోహరము. కావుననే కాళిదాసు "ప్రథిత యశసాం భాససౌమిల్ల కవిపుత్రాదీనా" యనుచు బ్రశంసిం చెను. భోజ, శారదా తన యాభినవ గుప్త సర్వానందాదులు దీని

నెక్కువగా నుతించినారు. జయదేవుడు కవితా కామిని హాసమే భాసు డన్నాడు.

"భాసో హాసః కవికులగురుః
కాళిదాసో విలాసః,
కేషాం నైషా కథయ కవితా
కామినీ కౌతుకాయ ?"

కథా విషయ పర్యాలోచనము :— ఈ నాటకమున కంతకు పరమ ప్రయోజనమేమి ? వత్సరాజు నష్ట రాజ్య లాభము. దానికి ప్రధాన సాధనమో, ఆరాజు పద్మావతిని పెండ్లాడుట. అందుకు ముఖ్య హేతువో, వాసవదత్త మృతిచెందిన దన్న రుమణ్వాదాదిమంత్రుల మాటయందు నాయకునికి గలిగిన గాఢవిశ్వాసము — ఇదిగాకం మఱెట్టి హేతువు లెన్ని యున్నను, ఉదయనుడు పద్మావతిని పరిగ్రహింపడు. వారి యన్యోన్యానురాగ మంతటి దృఢమైనదని ప్రతిజ్ఞలోని వారి చర్యలును, ఇందలి వారి దుఃఖవచనములును చెప్పక చెప్పుచున్నవి. అందుచేత లావాణక గ్రామదహన వృత్తాంతము ప్రధాన కథాబీజ మనుట స్పష్టము. కావుననే తన్మూలకమైన యుదయన దుఃఖోదంత మగ్రస్థాన మాక్రమించినది. స్వచ్ఛమైన దర్శనము తోడి జీవద్వర్ణన కాశ్రయమైనది. ఇకనిది యవలంబనముగా తరువాత కథ యెట్లు వెలసినదో చూతము.

ద్వితీయ, తృతీయాంకములు తరువాత కథ కాధారము లయ్యెను. మిక్కిలి చిన్నవి — వత్సరాజు సుగుణముల కలరిన పద్మావతి, యతనినే మనస్సున స్మరించుచు తన సోదరుని యత్నమున నతడు తన్ను వరించునన్న నమ్మకముతో సోత్సాహముగా నున్నది. తనకై తన విభుడెంత విలపించెనో, అతని రాజ్య లాభమునకై యీ ప్రేమ స్థానము నెడబాసి ప్రచ్ఛన్నముగా నుండవలసివచ్చినందు కంతకు

రెట్టింపుగా వాసవదత్త మనస్సున కుమిలిపోవుచున్నది — ఈ యవంతిక వత్సరాజు రాణియగు వాసవదత్తయని పద్మావతి యెఱుగదు గాక ! ఈమె నా సవతి యగుచున్నదని వాసవదత్త యెఱుగునుగదా! ఇట్లు విరుద్ధ చిత్తవృత్తులగు నీ రెండు పాత్రములకు సహవాస సహభాషణ ములు కల్పించిఁ వీరి శీలముల కిసుమంతేని కలంకము సోకకుండ కథ నడపుటగదా కవి చాతురి! ఇందుకు రెండు మూడు మాటలు —

చేటి :— మా రాజపుత్రి మహాసేనపుత్రుని కోరుట లేదు. వత్స రాజు సుగుణముల కలగుచున్నది.

వాసం :—ఏమి కారణము ?

చేటి :—ఆయన దయాసముద్రుడని.

ధాత్రి :—(వచ్చి) అమ్మా! నిన్ను వత్సరాజుగారి కిచ్చినారు.

వాసం :—అబ్బా ! ఒడలు కంపమెత్తుచున్నది.

ధాత్రి :—అంత భయమేమి ?

వాసం :—ఏమీలేదు. నాడు వాసవదత్తను గూర్చి యంతగా చింతించి, నేఁ డుదాసీను డయ్యెగదా యని - అయితే, ఇతడే స్వయ ముగా వరించెనా ?

ధాత్రి :—లేదులేదు. ఆయన యేదో పనిమీద రాగా, ఆయన సౌజన్యమును కనిపెట్టి మారాజుగారే తమ సోదరి నిచ్చెదమని చెప్పి యొప్పించిరి.

* * *

వాస :—చెలీ ! నీభర్త నీకు మిక్కిలి కూర్చునుగదా !

పద్మా :—అది నేను చెప్పలేను. నన్ను ప్రేమించినట్లు వాసవదత్తను ప్రేమించెనా ? యని సందేహము.

వాస :—ఇంతకంటె యెక్కువగా ప్రేమించెను. లేకున్న నామె తల్లిదండ్రులను విడిచి భర్తతో వెళ్లునా? ..

♦ ♦ ♦

వాస :—నీవు 'వీణవాయింతు' నన్నపుడు నీభర్త యేమనెను?

పద్మా :—ఏమీ బదులాడక నిట్టూర్పు పుచ్చి యూరకుండెను.

వాస :—అపుడు నీవే మనుకున్నావు?

పద్మా :—వాసవదత్త సుగుణములను, నేర్పును, తలచికొని దాక్షిణ్యముచే నావద్ద విలపింపకుండె ననుకొంటిని.

(ఈ మాటలు చతుర్థాంకము లోనివి)

ఇట్లీ యంకమందలి వీరి సంభాషణ మెక్కువగా వత్సరాజునకు సంబంధించినదే. ఆ ప్రసంగమంతయు తనకు జెందినదని పద్మావతి యెరియునుగాని, అది యవంతికకును సంబంధించినదనియు ఆమె మనమున వగచుచున్నదనియు నెట్లనుకొనును? పాత్రముల యవస్థ లట్టివి — వాసవదత్త జీవించి యున్నదని తెలిసినచో వత్సరాజు పద్మావతి నెట్లు పెండ్లాడ నిష్టపడడో, అట్లే పద్మావతియు నతని బెండ్లాడ నిచ్చగింపదు. ఆ మాట ధ్రువము. అయినా, నిజము తెలిసిన పిదప నీమె, యామెకడ కడు భక్తితోనే మెలగును. ఇక వాసవదత్తయో, తనభర్త పరాధీనుడై నందుకు వికల మానస కాకపోలేదు. గాని తాను లేననుకొనుటయు, రాజ్యకాంక్షయు, నతని చర్యకు కారణములని మనస్సమాధానము గాంచినది. గాని, పద్మావతి తనకు సవతి యయ్యెనని యసూయ పడలేదు. మునుపటివలెనే యికముందును భర్తహృదయమున ముఖ్యస్థానము తనదేయని యామె యెఱుగక పోలేదు. ఈ భావము చతుర్థాంకమున రాజునోటనే ధ్రువపడినది.

రాజ విదూషకులు ప్రమదారామము చూడ వత్తురు. అంతకు ముందచ్చటికి వచ్చియున్న పద్మావతీ వాసవదత్తలు వారి రాక

తెలిసి మాధవీ లతామండపములో మఱుగు పడియుందురు. దానికి దగ్గఱ వేదికపై కూర్చున్న రాజును చూచి "పద్మావతీ వాసవదత్త లలో నీకే దేవి యుత్తమ ప్రేమస్థానము ?" అని విదూషకు డడిగెను. రాజు జవాబు చెప్ప నిరాకరించెను. "వాసవదత్త పోయినదిగదా! మఱియిక్కడనితరు లెవ్వరూ లేరుగదా! సంశయమేల ?" అని మరల నిర్బంధించి యడిగెను. "ఆర్యపుత్రుని యభిప్రాయము తెలియుచునే యున్నది. నిర్బంధమేల ?" అని పద్మావతి యనుకొనును. అపుడు "నీ పీడ పడలేక చెప్పుచున్నాను. సౌందర్య సౌశీల్యాదులను బట్టి పద్మావతియు, నాకెక్కుడు ప్రియురాలే. కాని, వాసవదత్తా లగ్నమైన నా హృదయమును మాత్ర మాకర్షింపజాలకున్నది" అని రాజనెను. అపుడు "కష్టమునకు తగిన ఫలము గాంచితిని. అజ్ఞాత వాసము కూడా సుగుణ భూయిష్ఠమైన" దని వాసవదత్త లోలోపల నానందించెను. ఇంకా, ఆర్యవాసవదత్తనే యార్యపుత్రుడు స్మరించు చున్నా డాహా యేమి సౌజన్యమని పద్మావతి పరవశయయ్యెను — అటు తరువాత మఱియు వాసవదత్తను స్మరించిన నాయకుని మాట లందుమా, ఘనీభవించిన కరుణమును కెత్తుకెత్తు; కారురాతికి కన్నీ రొదవించునవి — దుఃఖశాంతికై పెండ్లాడినా, అది నవనవోన్మేష మగుచునే యున్నదట! గట్టిగా నేడ్చి ప్రియానురాగ ఋణము తీర్చి బుద్ధిని నిర్మలము గావించుట లోకాచారమట! ఈ భావము వెల్ల డించు శ్లోక మిది :—భవభూతి యీ భావము నుత్తర రామ చరిత్రమున తమసనోట నావిష్కరించెను.

"దుఃఖం త్యక్తం బద్ధమూలోఽనురాగః
స్మృత్వాస్మృత్వాయాతి దుఃఖం నవత్వమ్,
యాత్రాత్వేషా యద్విముచ్యేహ బాష్పం
ప్రాప్తానృణ్యాయాతి బుద్ధిః ప్రసాదమ్."

సందర్భ మూహించుకొన ననువగు చిన్న చిన్న తక్కువమాటలతో పెద్దభావ మిముడ్చు కవితాశైలికి నితడే యాచార్యుడనుట కిది యొక యుదాహరణము.

అట్లు పలికి రాజొక్కమారు గొంతెత్తి యేడ్వగా "ఏమమ్మా ఆర్యపుత్రుని ముఖ మశ్రుధారాకుల మైనది, మనము వెళ్ళి పోదామా!" అని పద్మావతి యనుట, భర్త దుఃఖపాటునకు మనస్సున జాలిపడి, యతని ననునయింప నేగ దలచియు, అవంతిక నొకర్తెను విడిచివెళ్లుట యామె నవమానించి నట్లగునని శంకించుకొని యన్నదిగాని యింకా వాసవదత్తకై యింతగా విలపింపనేల యన్న యసూయతో నన్నది కాదు. అదే నిజమైతే "నేను వెళ్ళెదను. శోకించు భర్తను విడిచి నీవు వచ్చుట తగదు" అని యవంతిక యన్నంతనే, యందు కంగీక రించునా? నిజముగా మనస్సున వెగటే తోచినచో నవంతికతో నేమాత్ర మేని యనకుండునా? — తిన్నగా బయలుదేఱి వచ్చుచు దారిలో రాజు, మొగము కడుగుకొనుటకు తెచ్చుచున్న నీటిదొప్పను విదూషకుడు తన చేతి కివ్వగా పుచ్చుకొని యతడు చెప్పిన కారణము విని మాఱాడక రాజును సమీపించి "ఆర్యపుత్రా! ఇదిగో ముఖ ప్రక్షాళనోదకము" అని చేతి కిచ్చెను. గాని వికార మింతేని చూపెనా? అపుడామె రాకకు — రాజించుక సంశయించియు, విదూషకుడు చెవిలో చెప్పిన మాటకు సంతోషించి, పద్మావతీ! కూర్చుండుమని యాదరించి, "తెల్లుపుప్పొడి గాలి కెగిరివచ్చి కన్ను లలో పడుటచే కళ్లు నీరుకాఱినవిలే!" అని పలుకును. ఈ సందర్భ మున నాయకుడు తనలో ననుకొన్న మాట లివి —

"ఇయంబాలా నవోద్వాహా,
సత్యంశ్రుత్వా వ్యథాంవ్రజేత్
కామంధీర స్వభావేయం,
స్త్రీస్వభావస్తు కాతరః"

గీ. పిన్నవయసుది సరిక్రొత్త పెండ్లికూతు
రెంతయును గుందు నిజము వచింతు నేని
మంచి ధీరస్వభావ యీ మంజులాంగి
కాని, నారీస్వభావంబు కాతరంబు.

ఈ యుద్యానరంగమందలి పాత్రముల మాటలును, చర్యలును చక్కగా పరిశీలించిన గాని, కవిభావము కంటబడదు — క్రొత్తనాయిక తన విలాసము వినలేదని నాయకు డనుకొనుట కథాపక్షమున సహజము. అందుచే తన కన్నీటి కారణము కప్పిపుచ్చి లేని కారణము కల్పించి యామెను నమ్మింపజూచుట పాత్రోచితము, సమయోచితము నగును. అక్కడికి కది సరిపడినదిగదా! ఇంక, తన దాక్షిణ్యమును సమర్థించుకొనుచు రాజనుకొన్న పైమాట లెందుకు? ముఖ్యముగా పద్మావతీ శీలము ప్రకటించుటకు—

తన ప్రియుడు తన్నెక్కువగా ప్రేమించుచున్నాడని పద్మావతి మనసార విశ్వసించి యానందించుచున్న మాట సత్యమే. కాని, అసూయచే కాకున్నను, ఇంకా వాసవదత్తను స్మరించుచున్నాడని మాత్ర మనుమానించుచునే యున్నది. రాజామె నట్లు ప్రేమించు చున్న మాటయు నిజమే కాని, వాసవదత్తమీది గాఢానురాగమును మాత్రము మరలింపలేకున్నాడు. ఈ రెండు విషయము లింతకు మున్నే విదితములు — పద్మావతి బుద్ధిమంతురాలు, అనసూయ, సహనశీల. వాసవదత్త చనిపోయినదని యెఱుగును. ప్రత్యక్ష ప్రతిబంధకమును లేదు - అయినా, మృతిచెందిన సవతినే సదా తలచుచున్నచో, నామె మనస్సు నొచ్చుకోదా? ఆనొప్పి యెట్టిదందువా! తన మగని యను రాగము గాఢముగా సంపూర్ణముగా తనపైని లేదనుకొనుటయే. అట్లనుకొనుట స్త్రీస్వభావము. అందుచే నామె మనస్సును నొప్పింప కుండుటకై తాను చేసినపనిని సమర్థించుచు రాజన్న పైమాటలావ

శ్యకమే. రాజన్నట్లు పద్మావతి సుశీల యగుటయు నిజమే — రాజు గొంతెత్తి యేడ్చినపుడు, వాసవదత్త సౌశీల్యమంత మహనీయమనియు, తన మనోహరుని హృదయమంతటి నిర్మలానురాగ రసభరితమనియు, భావింపకున్న, భర్తచెంతకు వచ్చి నీరిచ్చి నిర్వికారముగా కూర్చుండునా? మగడు సత్యకారణము మఱుగు పుచ్చెనని యెఱిగియు, నిది యేమనలేదు. పతిహృదయ మెట్లయిన ప్రసన్నమగుట మాత్రమే యామె వాంఛించిన దనుట కీవర్తనము చాలును. ఇదే పద్మావతీ పాత్రశీలము — సరే. 'వాసవదత్తలేదు, మఱిరాదు.' అని తేని నిశ్చయమేకదా! అట్టియెడ నాయకుని యీ చర్య కర్థమేమి? ఆనాయిక మహత్త్వ మట్టిది, ఈ నాయకుని సుస్వభావ మిట్టిది. ఇంతకుమున్నీ ప్రశ్నకు పద్మావతియే సమాధాన మూహించినది. దాని సారమిది - వత్సరాజునకు వాసవదత్త, అంతఃప్రాణము, పద్మావతి బహిఃప్రాణము, ఈ సూత్రముతోనే కవి యీ పాత్రముల సరిదిద్దినాడు — ఇక నిందొక చిన్న సంశయము—

పద్మావతి మగనికి నీ రిచ్చినపుడు, విదూషకుం రాజుచెవిలో నొకమాట చెప్పెను — అది, కన్నీటికి కారణము కాశపుష్ప పరాగ మని తాను పద్మావతికి చెప్పినమాట యైనట్లు ప్రకరణమే తెల్పు చున్నది — రాజు వేఱుకారణము చెప్పునేమో! రాణి యనుమాన పడిపోవునేమో అన్న, శంకకదా యిందుకు హేతువు? ఈ చర్యకు మాత్రము రాణి యనుమాన పడదా? — ఇంతకంటె విదూషకుడు చెప్పిన కారణమే కవివశమున రాజు చెప్పినట్లుండుట యెక్కువ సందర్భోచితమగునని తోచుచున్నది. కవీంద్రుడెందు కీ కర్ణజపము కల్పించెనో!! — మఱియొక్క విశేషము —

"మగధేశుడు సభామందిరమున నిన్ను ముందు కూర్చుండబెట్టు కొని బంధుమిత్రులకు దర్శన మీయం గోరుచున్నాడు. సత్కారము

ప్రతిసత్కారముచే శోభిల్లి ప్రీతి పుట్టించునుగదా! వేళయైనది ర''మ్మని వసంతకు డనగా, రాజు లేచి యన్నమాట యిది:—

"గుణానాంవా విశాలానాం,
సత్కారాణాంచ నిత్యశః,
కర్తారః సులభాలోకే,
విజ్ఞాతారస్తు దుర్లభాః"

వివిధ విద్యాజ్ఞాన శౌర్యధైర్య వ్రత నియమాదులు ప్రకటించు వారును, వారిని సన్మానించువారును లోకములో లెక్క కెక్కువగానే యున్నారు. కాని, తద్గుణ తత్సత్కారముల తత్త్వము తెలిసినవా రెక్కడో కాని లభించరు. లోకజ్ఞశిరోమణియైన భాసుని యీ మాట లనుబట్టి, అనర్హులగు వారిని పైకి లేవనెత్తి బళీయని ప్రశంసించుట, అర్హులగువారి నణగద్రొక్కి నిరసించుట యను దురాచార మానా డును సంఘమున గలదని తెలియనయ్యెడి — ఇంక, పంచమాంకము.

కవి యట్లనలేదుగాని, యిది యంతర్నాటక మనదగియున్నది. ఇందుకృతక సముద్రము చెంతనున్న దివ్యమందిరము ముఖ్యరంగము. అది సముద్రగృహక మనబడును. వాసవదత్తా వత్సరాజుల తెలిసీ తెలియని కలయిక దీని ప్రయోజనము. దీనిని ప్రవర్తింపంజేసిన నటి, పద్మిని యనుప్రధానచేటి. కార్యమునుబట్టి కారణ మూహింపవలసిన యీ నాటకములోని విచిత్ర సంఘటనలలో నిది యగ్రగణ్యము. స్వప్నములో జాగ్రల్లక్షణములను, జాగ్రదవస్థలో స్వప్నలక్షణము లను ప్రతిభాదృష్టిని దర్శించి ప్రదర్శించిన కవి రమ్యనిర్మాణ నైపుణి కిది యాటపట్టు —

పద్మావతి యీ యంకమున నెక్కడా కనబడదు. కాని, యామెకు తలనొప్పి వచ్చినదని చేటి పుట్టించిన మాటమాత్రము వాసవదత్తా వత్సరాజులను తీసుకొని వచ్చియందలి శయ్యకు చేర్చినది. లావాణక

దమానచర్యా సంఘటనకువలె నీయద్భుత సంఘటనకును నిగూఢ కారణము యౌగంధరాయణుని మంత్రశక్తియని పాఠకులూహింప వలసినదే.

రాజామాట విని విచారించుచువచ్చి పద్మావతి శయ్యమీద లేకుండుటచూచి యామెరాక నిరీక్షించుచు దానిపై పరుండ, నతనికి నిద్ర పట్టినది. అవంతికయు సఖి నుపచరింప వచ్చిచూచి — పోనీ! నిద్రించుచున్నది. తలనొప్పి తగ్గినది — అనుకొని. మిగిలిన శయ్యపై పరుండి, “హా! వాసవదత్తా” యన్నమాటవిని, ఉలికిపడిలేచి, “అయ్యో! ఆర్యపుత్రుడే, నన్ను చూచెనేమో! మంత్రివర్యుని ప్రతిజ్ఞా భారము నిష్ఫలమగు నేమో!” అని చింతించి, మరల నతని పలవరింత విని, నిద్రయని నిశ్చయించుకొని, తన్ను బిలిచి ప్రశ్నించు నట్లున్న పలవరింతమాటలకు బదులు చెప్పుచు కొంతసేపుండి, పక్క దాటివచ్చిన యతనిచేతులు మెల్లగా పక్కపై బెట్టి, ఎవరైన వత్తురేమో యని శంకించుకొని వెళ్ళిపోయెను. కరస్పర్శమున మెలకువ వచ్చిన రాజు దిగ్గనలేచి ఆమెనుగానక ఇది స్వప్నమా భ్రాంతియా సత్యమాయనుచు భావించి భావించి యపుడు వచ్చిన విదూషకున కీయుదంతము తెలిపి, ప్రియురాలు బ్రతికి యున్నది, లేకపోతే నాకీ గగుర్పాటెందుకు కలుగునని యూహించు కొనుచుండి, అంతలో కంచుకివచ్చి చెప్పిన మాటలను బట్టి ధైర్యోత్సాహములతో శత్రువు మీదికి దండెత్తి వెడలెను.

ఈ రంగమందలి ముఖ్యవిషయమిది. ఈయంక మంతయు చదివితేనే కాని, రసానుభూతి కలుగదు — ఇందు వత్సరాజు, స్వప్నములో వాసవదత్తను చూచుటకారణముగా కవి యీ నాటకమునకు స్వప్న వాసవదత్తయని నామకరణము చేసెను — దీని యౌచిత్యము తెలియ గొంకింత పరిశీలింతము. ఇందుకు నాయికా రసనిరూపణము ముందావశ్యకము —

నాయిక :— ఒక్కొక్కయ్యెడ రంగమునదప్ప దక్కిన యన్నిటా పద్మావతీ, వాసవదత్తలిద్దఱును గనవత్తురు. ఆరామరంగము మొదలుగా నాయకుడు రంగమున గనవచ్చునుగాని తత్పూర్వరంగములలో నెందును నతనిదర్శనము కాదు. కడపటి రంగములోగాని పద్మావతీ వత్సరాజులు కలసి మాటలాడుట మఱియెందును గన బడదు. ఇది యిట్లుండ, పద్మావతి, వత్సరాజు నభిలషించుట, పెండ్లాడుట, ప్రేమించుట యను నంశములు కావ్యమంతట క్రమముగా ప్రసక్తములైన మాట నిజమేకాని, యంతకంటె వాసవదత్తవిరహా వేదనయే ప్రేక్షకులనెక్కువగా నాకర్షించునట్లు వర్ణితమైనది. అట్లే నాయకునినోట వచ్చిన ప్రతి మాటయు పద్మావతిమీది ప్రేమను మించి, పదిరెట్లెక్కువగా వాసవదత్తమీది గాఢానురాగమును వెల్లడించుచున్నది. ఇట్లు పరామర్శింపగా వాసవదత్తయే యిందు ప్రధాన నాయికయని తోచకపోదు. కవిహృదయ మదేయని కావ్యముపేరే చెప్పుచున్నది గదా! ఇంక ——

రసము :— పూర్వనిర్ణయమును బట్టి యిందు విప్రలంభము ప్రధానమని స్పష్టపడుచునే యున్నది. కావ్యమే విరహావ్యథతో నారంభమైనదిగదా! ఆ పక్షమున కరుణము దాని కంగమైనను, ద్వితీయ నాయికా పక్షమును బట్టి శృంగారము నంగమగును — ఇక నీ యంకమందలి వాసవదత్తా వత్సరాజ సంభాషణమందునూ, అతి మనోహరము. అత డిపుడు స్వప్నావస్థలోనున్నను తదేకాయత్తమైన యతని హృదయము నుండి వెనుక హృదయేశ్వరితో సుఖించిననాటి మాటలే పైకి వచ్చును. ఆ ప్రశ్నల కానాడు బదులు చెప్పినట్లే వాసవదత్త మాటలుండును. ఇందుకీ రెండు మాటలు చాలును.

రాజు :— విరచిక ను తలచుచున్నావా ప్రేయసీ?

వాస :— చాలు జాలు. ఇక్కడకూడా యీ వేశ్య కావలెనా?

రాజు :- దానిపేరెత్తినందుకు క్షమింప నిన్ను బ్రతిమాలు చున్నాను (అని చేతులు చాపును) ఇక్కడ, నాయిక నిషేధోక్తి కని యిపుడు నాయకుడు క్షమింప వేడినట్లు భావింపనగునా? తగదు, కథాప్రవృత్తి యందుకనుకూలము కాదు — జాగ్రదవస్థలో వలెనే స్వప్నములోను సంభాషణము తత్తదనుభవమును బట్టి సక్రమము గానే జరుగుచుండును. తదేకాయత్తమైన చిత్తము నంటియున్న స్మృతియే యిందుకు కారణము. ఇందుకు వాసవదత్త జవాబే జ్ఞాపకము — వెనుక జాగ్రదవస్థలో చాపిన యితని చేతులు వాసవదత్త చేతులను పట్టుకొన్నవి. అట్లే చాపిన యిప్పటి యితని చేతులు కలలోని వాసవదత్త చేతులు దొరకక ప్రక్క కొరగి ప్రక్క దాటినవి. అందుచే నిది నిజమైన స్వప్నమనదగును — ఇంక నీ స్వప్న వృత్తాంతము త్తర కథతో లీనమందుమా! భావనైకవేద్యము — శయ్యాదాటి వచ్చిన ప్రియుని చేతులను శయ్యపైనుంచి నాయిక వెడలిపోవును. ప్రియురాలి కరస్పర్శమున మెలకువ వచ్చిన ప్రియుడు దిగ్గనలేచి యామెను పట్టుకొనబోయి ద్వారబంధపు కమ్మి నెత్తికితగుల తెలివి తెచ్చుకొని మరలి సత్యమాలోచింప నారంభించును. అపుడు వచ్చిన విదూషకుని కుదంతమంతయు చెప్పి వాసవదత్తజీవించి యున్నదని యేమేమో చెప్పి వానిని నమ్మింపజూచును. ఆ కారణములలో నతి ముఖ్యమైనది ప్రేయసీ కరస్పర్శ సుఖమున సంభవించిన తన భుజముల గగుర్పాటు —

జీవద్వర్ణనా చతురుడైన యీ దృశ్యరూపక మహా కవి కల్పించిన యీ స్వప్నరంగము బహుప్రయోజనము. వాసవదత్తా వత్సరాజుల దృశ్యాదృశ్యమైన యీ సమాగమము, నాయిక గతించినదని విరహాగ్నిలో నుడికి పోవుచున్న నాయకుని హృదయ మందామె జీవించి యున్నదన్న యాశారేఖను కనజేసినది. దాన నంకురించిన యుత్సాహలేశము వెంటనే శత్రురాజును నిర్జించి రాజధానియైన కౌశాంబి కత

నిని చేర్చినది. యౌగంధరాయణుడు పన్నిన పరమపావన, మతి విశ్వాసపాత్రము, నైన వాసవదత్తా న్యాసోపాయమే తన పునారాజ్య ప్రాప్తికి సముచిత హేతువెనదని తరువాత నతని నానందింపజేసినది. ఆమెకై తానెంత విలపించుచుండెనో, తనకై యామెయు నంతగా పరితపించుచుండెనన్న సత్యము తెలుపుటకు, ప్రోషితభర్తృకా వేష ముతో నజ్ఞాతవాసమున నవయుచున్న యా సాధ్వి మొగమును చూపించి పరస్పర దుఃఖావస్థ నెఱిగింప జేసినది. ఇందుకు నాయకుని యీ రెండు మాటలు చాలును — నీవు చూచినది వాసవదత్త కాదయ్యా! ఈ నగరిలో, అవంతిసుందరి యనే యక్షిణి యున్నదట. దానిని నీవు చూచియుందువు - అని వసంతకు డనగా, కాదు కాదు, వినుము,

"స్వప్నస్యాన్తే విబుద్ధేన
నేత్ర విప్రోషితాంజనమ్,
చారిత్ర మపిరక్షంత్యా
దృష్టం దీర్ఘాలకం ముఖమ్"

"యోఽయం సంత్రస్తయా దేవ్యా
తయా బాహు ర్నిపీడితః,
స్వప్నేఽప్యుత్పన్న సంస్పర్శో
రోమహర్షం నముంచతి"

అని రాజు రోమహర్షమున జనించిన విశ్వాసమునుబట్టి యామె బ్రతికియున్నదనును.

తరువాత, షష్ఠాంకమంతయు వాసవదత్తా స్మారకమే. ఘోషవతి యనెడి వీణను చూడఁగానే నాయకుని విరహదుఃఖము పొంగిపొరలి అపుడన్నమాట యిది.

" చిరంప్రసుప్తః కామోమే వీణయా ప్రతిబోధితః
తాంతు దేవీం నపశ్యామి యస్యా ఘోషవతీప్రియా "

పిదప నుజ్జయినినుండి వచ్చిన సందేశహారులగు వసుంధరాకౌభ్యల ప్రవేశము. అత్తమామల సందేశములు విన్న వత్సరాజు దుఃఖ వచనములలో నొకటి —

" దృఢ మపహృతా కన్యాభూయో
మయా నచ రక్షితా "

" వీణను చూచినానుగాని, ఆ దేవిని చూడకున్నాను; బలాత్కారముగా వాసవదత్తను తీసికొని వచ్చినానుగాని, యామెను రక్షింపలేక పోయినాను " అన్న మాట లాసమయమున వాసవదత్తను ప్రత్యక్షముగా చూడకపోవుటచేతను, అత్తమామల మాటలు తలఁచుకొన్నందున వచ్చిన దుఃఖముచేత నన్నవిగాని. వాసవదత్త జీవించియున్నదన్న స్వప్నాంతస్మృతి మనస్సున లేకయన్నవికావు. అయినా, ఆ ప్రసంగమున నామాటలే సముచితములు — రాజు దుఃఖ ముపశమింప కౌభ్యుఁడన్నదియు, అందుకు బదులుగా రాజన్నదియు నివి :-

" కఃకంశక్తో రక్షితుం మృత్యుకాలే
రజ్జుచ్ఛేదే కేఘటం ధారయన్తి? "

" కథంసా నమయా శక్యాస్మర్తుం దేహాంతరేష్వపి "

మృత్యుముఖమున పడినవారి నెవరు రక్షింపఁగలరు? ఆ చింత మఱచిపోవలసినదే యని కంచుకి యనఁగా, శిష్యురాలు, ప్రియురాలు, మహాసేన పుత్రియునైన యామె నిపుడుకాదు, దేహాంతరమందైనను మఱచిపోవుట శక్యమా? అని రాజనును — అపుడు వసుంధర " ఉదయనా! నీవు మా కొడుకుల వంటి వాడవు. నీకు వాసవదత్త నీయ

గోరియే నిన్నుజ్జయినికి రావించితిమి. చాపల్యముచే నీవు మాకన్నెను మాకు తెలియకుండ తీసికొనిపోయినావు. మీ యిద్దఱి చిత్తరువుల కిందు పెండ్లిగావించినాము. ఈ చిత్రఫలకము చూచుకొని యానం దింపుము" అని యత్తగారి మాటలు వినిపించి చిత్రపట మీయఁగా, రాజు, సవిషాద హర్షముగా గైకొని,

"వాక్యమే తత్ప్రియతరం రాజ్యలాభశతా దపి"

తప్పుచేసిన నాపై దయచూపిన యా తల్లిమాట నూఱు రాజ్యములు లభించుటకంటె నెక్కువ ప్రియ మనెను.

ఈ పాత్రపోషణ విధాన మెంతేని హృదయంగమము కదా! పద్మావతీ వత్సరాజు లా చిత్తరువులు చూతురు. కాని, ఆ చూచు నప్పటి వారి యభిప్రాయములు వేఱు. అకటా! ఇట్టి ముఖలావణ్యము నా యగ్ని యెట్లు దహించెనో! యని రాజు దుఃఖించును. ఈ ప్రతి కృతి యార్యురాలికి సరిపడియున్నదా? అని పద్మావతి యడుగును. ఆమెయే యీ మెయని యతఁడనును. ఆశ్చర్యానందములతో నామె మరల మరలఁ జూచును. ఇట్లు తత్తరపడి చూచుచున్నా వేమని రాజడుగును. ఈ చిత్రప్రతికృతి కీడుజోడయిన కాంత నా వద్ద నున్న దనును - ఆమె బ్రాహ్మణకాంత యంటివి. లోకములో రూపసాదృశ్య ముండునులే, యని యతఁ డనును. అంతలో నా న్యాసమిప్పించవలసి నదని కపట సన్యాసి వచ్చి యడుగును. ఈ సందర్భమందలి పాత్ర భాషణ మంతయు ప్రేక్షకుల యుత్కంఠ నుబికించుచు హృదయమును తన్మయము గావించుచున్న దనుటకంటె స్వప్న వాసవదత్త నేమని కొనియాడుదును?

ఏవో పద్యరూపములైన సరసవర్ణనలు కొలఁదిగా లేకపోలేదు గాని, చిన్న చిన్న ప్రశ్నోత్తర రూప వాక్యములలోనే యెక్కువ రసము పుట్టించు చాతురి భాసమహాకవి సొమ్మని యంగీకరింపక తప్పదు. ఈ కృతిలో సవిశేషకల్పనతోడి పద్యములకన్న సాధారణ పద్యములే యెక్కువ. రీతి బాగుండును. శ్లోకము చక్కఁగా నడచును

గాని, హృదయాకర్షణమైన సరసకల్పన యేమున్నదనుట కుదాహరణముగా నీ క్రింది రాజు మాటలు చూతము.

"అస్య స్నిగ్ధస్య వర్ణస్య విపత్తి ర్దారుణా కథమ్.
ఇదంచ ముఖమాధుర్యం కథందూషిత మగ్నినా ?"

పద్మావతి వాసవదత్త వద్దకు వెల్లి నీ యన్న వచ్చినాఁ డన్నంతనే, ఆమె యన్నమాట యిది:—

"దిష్ట్యా, ఇదానీ మపి స్మరతి" దైవవశమున నన్నిప్పటికి తల పెట్టినాడు — అవంతికను సభకు తీసికొనిరాగా చూచి వసుంధర యన్నమాట యిది.

"అమ్మో! భర్తృదారికా వాసవదత్తా"

ఈ మాట విన్నంతనే — "కథం మహాసేన పుత్రీ? దేవీ! ప్రవిశత్వ మభ్యన్తరం పద్మావత్యా సహా" ఏమిటీ! మహాసేన పుత్రికా? దేవీ! పద్మావతిని తీసుకొని లోపలికి వెళ్ళుము — అని రాజన్నాడు. ఈ చిన్నమాటలో మహాసేన రాజుమీది గౌరవము పట్ట మహిషిమీది యాదరాభిమానములు, అంతఃపురాచారము మీది యాసక్తి, రాజ్యలక్ష్మితో గృహలక్ష్మి లభించినదన్న యానందము నిమిడియున్నవి. ఇది యీ కవిచంద్రుని వాక్యరచన యందలి పటుత్వము. సవిమర్శముగా చదువువారికి నాటకమంతట నీ విశేషము గోచరించును. ఈ రూపక మిట్లు సర్వగుణసంపన్నమని తొలుతటినుండియు విద్వల్లోకమున వినుతి కెక్కినది. కావుననే తన నాడు వ్యాపించిన కింవదంతిని విశ్వసించిన రాజశేఖర కవి,

"స్వప్న వాసవదత్తస్య
దాహకోఽభూన్న పావకః"

తక్కిన యితని రూపకములను దహించిన పావకుడు స్వప్నవాసవదత్త చెంత చేరలేకపోయెనని దీని మహత్త్వము నావిష్కరించి యున్నాడు. కాని, కొన్నిమాటలును, పద్యములును కాలవశమున నడుగంటినవని తెలియనయ్యెడి. పూర్వాలంకారికు లుదాహరించు

కొన్న యిందలి శ్లోకములు కొన్ని నేటి ముద్రణముల గనరాకున్నవి. అట్టివి రెండు. ఇందు మొదటిది పద్మావతికి సంబంధించినది. రెండవది వాసవదత్తకు సంబంధించినది.

" పాదాక్రాంతాని పుష్పాణి,
సోష్మచేదం శిలాతలమ్,
నూనంకాచి దిహాసీనా
మాందృష్ట్వా సహసాగతా "

" సంచిత పక్ష్మకవాటం
నయనద్వారం స్వరూపతాడేన,
ఉద్ఘాట్య సా ప్రవిష్టా
హృదయగృహంమే నృపతనూజా "

ఇది రూపకాలంకారముతోడి చక్కనివర్ణన. ఇట్టివి కొన్ని యున్నను, ముఖ్యముగా ప్రశ్నోత్తరరూపమైన వాక్యరచన కిది యుపదేశక మనదగును. స్వకాలమం దీ రూపకము సామాజిక రంజకమై వెలసినదనుటకు కూడా యిందలి పాత్రోచిత సహజ సంభాషణ రీతియే నిదర్శనము.

భాసుడు సర్వతంత్ర స్వతంత్రుడు. ఆనాటికి భరతనాట్యశాస్త్ర మవతరించియున్నను దాని ననుసరించి రూపకరచన సాగించినవాడు కాడనుట కితని రూపకము లన్నియు సాక్షులే. ఇందలి శయ్యారంగము లక్షణమును గణించనిదే. ఈ నాటక మామూలాగ్రముగా శ్రద్ధగా చదివినవారి కిందలి రసము పూర్తిగా నాస్వాద్యమగు ననుటకంటె దీనిని గూర్చి యిక వ్రాయజాలను.

" భాషాసురమ్యాగీర్వాణీ,
తస్యాంకావ్యం మనోహరమ్,
తత్రాపి రూపకం రమ్యం,
తత్రభాసకవేః కృతిః "

# అభిజ్ఞాన శాకుంతలము

లోకమునం గావ్యరచనకు వాల్మీకి మహర్షి వలె దృశ్యకావ్య నిర్మితికి భాసు డాద్యుడనజాలముగాని తత్పూర్వరూపకము లదృశ్యము లగుటచే నట్టి యశస్సతనికి దక్కినది. కాళిదాస మహాకవి మాలవికాగ్నిమిత్ర ప్రస్తావనలో "ప్రథిత యశసాంభాస సౌమిల్ల కవి పుత్రాదీనామ్" అనుచు గావించిన ప్రశంసకూడా దానిని స్థిర పఱచినది.

భాసాదులకును కాళిదాసునకును సుమా రొక శతాబ్ది యంతర మున్నది. ఇతనినాడు వారి రూపకములు ప్రదర్శన రమ్యములై మెప్పుగాంచినవి. అయితేనేమి? దైవానుకూల్యమున భాసరూపక ములు, కొన్నియైనా మిగిలినవిగాని, తక్కినవారివి పేరేని లేకుండ బోయినవి. ఆ భాసుని రూపకములైనను సుమారు వెయ్యేళ్లు వ్యాప్తి గాంచి తరువాత మొన్న మొన్నటివఱకు రమారమి వేయేం డ్లజ్ఞాత వాసమున లీనములైనవి. అందుచే నీతని యీ నాటకరాజము జన్మించిన యుత్తరక్షణమునుండియు స్వప్నవాసవదత్తమువాడిక్ నాట్యరంగముల నలంకరించుచు వచ్చి, దుర్దైవమున నది ప్రచ్ఛన్న మయినంత, దానే విద్వల్లోకమున నగ్రగణ్యమైనది. ఆనాటి యీ రెంటి ప్రశంసలివి:

"భాషాసు రమ్యా గైర్వాణీ
తస్యాం కావ్యం మనోహరమ్,
తత్రాపి రూపకం రమ్యం
తత్ర భాసకవేః కృతిః"

"కావ్యేషు నాటకం రమ్యం
నాటకేషు శకుంతలా"

అట్టి ఖ్యాతిగన్న దీని ఘనత నీ చిన్న వ్యాసమున నెంతని చూతుము? అయినా యొకింత —

ఇతి వృత్తము :— ఇది మహాభారతాది పర్వమున నిట్లున్నది. "దుష్యంతుడు వేటకై యడవి కేగి క్రమముగా కణ్వాశ్రమము సమీపించి, అమ్మహర్షికి నమస్కరించి వచ్చుటకై తానొక్కడ యాశ్రమములోనికి పోయెను. కణ్వుడు కుటీరమున లేడు. శకుంతల యతని కర్ఘ్యపాద్యాదు లిచ్చి సత్కరించినంత రాజాకన్యక యుదంత మంతయు నడిగి తెలిసికొని, తన్ను గాంధర్వమున బెండ్లియాడుమని కోరెను. తన కుదయించిన నందనుని యువరాజును జేయునట్లు వరము పుచ్చుకొని యామె యతనికోరిక నెఱవేర్చెను. పురమున కేగిన రాజు శకుంతలకై ప్రధానుల నంపలేదు. మూడేండ్లు గర్భము మోసి యామె కుమారుని గనెను. ఆ పిల్లవాడాఱు సంవత్సరములవాడై నంత మునీంద్రుడు శిష్యులను తోడిచ్చి తల్లిని, పిల్లవానిని రాజు చెంత కంపెను. అతండు శకుంతల నెఱింగియు నెఱుగనట్లు నటించి, "వీరు నీ భార్యాపుత్రులే, స్వీకరింపు" మని యాకాశవాణి పలికినంత భార్య నాదరించి పుత్రునికి భరతుడను పేరుపెట్టి యువరాజును జేసెను."

ఇట్లతిసంగ్రహముగానున్న యీ ప్రఖ్యాత వృత్తము ప్రదర్శనోచితములును సామాజిక మనోరంజకములు నగు మార్పులతోను నూతన పాత్రములతోను నవ్యకల్పనలతోను వికసించి మిశ్రవృత్తమైన విధ మొకింత కనుగొందము.

వస్తుసంగ్రహము :— రథారూఢుడై విల్లెక్కిడి లేడిని తఱుముచు వచ్చిన దుష్యంతుని కణ్వాశ్రమ మందలి తాపసులు వివారించిరి. రాజు రథము దిగి వారితో సంభాషించి, అతిథిసత్కారార్థము కూతురి నింటనుంచి కులపతి సోమతీర్థమున కేగెనని తెలిసియు, తనరాక మహర్షి కామెయే తెలుపుగాకయని, తానొక్కడాశ్రమము జొచ్చి,

యొకవంక పూలమొక్కలకు నీళ్ళు పోయుచున్న మునికన్యలను చూచి, చెట్టు చాటుననుండి వారి మాటలు విని వారి వేళ్లెఱింగి, శకుంతలను కష్టకృత్యమునకు నియోగించిన కణ్వుని చర్యకు వగచి యాకన్నె చక్కదనమున కచ్చెరు వడుచు, ఆమె తాను పరిగ్రహింప-దగిన కన్యయని భావించుచు, భ్రమరచేష్టావశమున వారికి ప్రత్యక్షమై మాటలధోరణిని తాను పౌరవవంశరాజయిన దుష్యంతుడని చెప్పి యనసూయవలన శకుంతలా జన్మవృత్తాంతము విని, తన మనోరథమున కవకాశము కలదని నిశ్చయించుకొనెను. నాయికానాయకులు పరస్పర మనురక్తులైరి.

తరువాత మావంశమునకీ వసుంధర యెట్టిదో మీ చెలికత్తె యట్టిదని యనసూయా ప్రియంవదలకు నచ్చజెప్పి గాంధర్వవిధికి శకుంతల నంగీకరింపజేసి సిద్ధమనోరథుడై తన్ను స్మరించుచుండుటకై స్వనామాంకితమైన యంగుళీయకమును ప్రియురాలి వ్రేలందొడిగి, రాజు తన రాజధానికి వేంచేసెను — మఱి, యానాడో లేక మఱు నాడో దుర్వాసుడు కణ్వునింటివాకిటి కతిథియైవచ్చి పతిధ్యానపరవశయై తనవైపు చూడకున్న శకుంతలను "నీవు ధ్యానించుచున్న వాడు నిన్ను మఱచిపోవు" నని శపించి, యంతలో నచ్చటికివచ్చిన యనసూయ ప్రార్థింపగా, అభిజ్ఞానమైన యాభరణము కంటబడినచో శాపము తొలగిపోవు" నని విఱుగుడు చెప్పి వెళ్ళిపోయెను. అట్టిది సిద్ధముగా తమ సఖి వ్రేల నుండుటచే గండము తప్పినదని యా చెలికత్తెలు సంతోషించిరి గాని శాపము మాట శకుంతలకు చెప్పలేదు సరిగదా, ఎవ్వరికీ నీమాట చెప్పరా దనుకొన్నారు. తరువాత —

"శకుంతల గర్భము ధరించియున్నది. దుష్యంతుడు చెప్పినట్లుగా శకుంతలను దీసికొని వెళ్లుటకై సేవకుల నంపలేదు. లేఖయైన వ్రాసి యంపలేదు. ఇందుకు దుర్వాసశ్శాపము హేతువు కాదుగదా? తాత పాదులతో నేమి మనవిచేయుదును?" అనుచు ననసూయ విచారించు

చుండగా ప్రియంవద వచ్చి, "చెలీ! శకుంతల నత్తవారింటికి పంపుటకు తగినసన్నాహము చేయుము. తాతపాదులు వచ్చి శకుంతలను జూచి 'కుమారీ! నీకు తగినభర్త లభించెను. నిన్నిపుడు పతిగృహమునకు పంపింతు' నని సెలవిచ్చినారు" అని చెప్పెను.

ఆశ్రమవాసులందఱు శకుంతల నభినందించిరి. కణ్వుడు, గౌతమిని శార్ఙ్గరవ శారద్వతులను తోడిచ్చి కూతురు నత్తవారింటికంపెను — వారందఱు దుష్యంతునికి చెప్పవలసినమాటలు చెప్పిరి. ఎవరెన్ని చెప్పినా, శకుంతలను దానాశ్రమములో పరిగ్రహించిన మాట యతడు స్మరింపకుండెను. అయితే, నీ కానవాలుచూపి నీ సంశయము తీర్చెదనని శకుంతల తన వ్రేలు తడవికొని, అయ్యో! ఉంగరము లేదని విచారించెను. శచీతీర్థమున జాఱి పడియుండునని గౌతమి యనెను. ఇక లాభము లేదని యా తాపసులు వెడలిపోయిరి. ప్రసవించునంత వఱకు మాయింట నుంచెదనని పురోహితుడు శకుంతలను గొనిపోవుచుండ, అప్సరస్తీర్థము చెంత నొక తేజస్సామె నెత్తుకొనిపోవును — శకుంతల తల్లియైన మేనక తేజోరూపమున వచ్చికూతురి నెత్తుకొనిపోయి మారీచాశ్రమములో దాక్షాయణి కప్పగించెను —

రాజనామాంకితమైన యా యుంగరము శచీ తీర్థమున చేపలు పట్టువానికి లభించినది. అది రాజుగారి దృష్టికి వచ్చినది. శకుంతలను స్మరింపజేసి విప్రలంభాపన్న తెచ్చిపెట్టినది. అతని విరహబాధ చూచి శకుంతల శ్రేయస్సుగోరు సానుమతి సంతోషించినది.

తరువాత నసుర సంహారమునకై ఇంద్రుని రథమెక్కి నాకలోకమున కేగిన దుష్యంతుడు తిరిగి వచ్చుచు తపస్వి క్షేత్రమైన హేమకూట పర్వతమందలి మారీచాశ్రమమున దిగి సర్వదమనుడను పేరనందు క్రీడించు తన పుత్రుని, శకుంతలను గాంచును. మారీచానుగ్రహమున భార్యాపుత్రులను స్వీకరించి సుఖముగా పురము చేరును. ఈసందర్భమున రెండు మాటలు :

అనసూయ నానుమతి విదూషకుడు నను పాత్రములు కనరావు గాని, యీ నాటకమందలి కథ యంతయు కొంచె మెచ్చు తక్కువగా పద్మపురాణ స్వర్గఖండమున గనవచ్చును. ఆ పురాణముకూడా వ్యాసప్రోక్తమే యన్న విశ్వాసము వ్యాపించి యున్నది గావున దానినుండి కాళిదాసీ యితివృత్తము గ్రహించి యుండునని యెవరేని తలంపవచ్చును. ఈ విషయము నా సంస్కృత వాఙ్మయ చరిత్ర ద్వితీయ సంపుటమున చర్చింపబడినది అందలి సారమిది :— "కాళిదాసు శాకుంతల నాటకము చదివి యానందించిన నానాటి పండితు డొకడు ప్రదర్శనోచిత క్రమమున నున్న యిందలి కథను స్వీకరించి చిన్న మార్పులతో ననుష్టుప్ఛందోబద్ధము గావించెను. అది పద్మ పురాణమున కెక్కెను" భారతమునందే సంక్షిప్తము లుండగా నిక దక్కిన వానిమాట చెప్పనేల? దీనినిబట్టి యీ దృశ్యకావ్య కథ చిర కాలము క్రిందట శ్రవ్యకావ్య కథగా గూడ మాఱినదని సంతసింప వచ్చును.

మఱియొక్క విశేషము — అల్లాహాబాదు నగరము దగ్గఱనున్న 'భీత' గ్రామమున మార్షలు పండితుడు సంపాదించిన గుండ్రని రాగి రేకులలో శాకుంతల ప్రథమాంక కథ రేఖాచిత్రరూపము దాల్చి యున్నదట! శాకుంతల ఘనత కిది వేఱొక నిదర్శనము.

పూర్వోక్తరీతినున్న యిందలి కథా సంవిధానమున కంతకు నభిజ్ఞానకల్పనము కీలకము. అది, అంగరసములకు మూలము. నాయికా నాయకుల శీలములకు శాణము. నాటకము పేరే దానితో నుండ నికదాని వర్ణనమేల? తరువాతిది శాపకల్పనము. ఈ రెంటికి గల సంబంధమందుమా, అతి విచిత్రము; కాళిదాస ప్రతిభా జ్ఞాపకము.

మూడు నాలుగు దినములు తన్ను స్మరించుచు కాలము గడపుటకై రాజు ప్రియురాలికిచ్చిన యుంగరము నతడా ప్రేయసిని పెండ్లాడినట్లు నమ్ముటకై యభిజ్ఞానముగా మార్చినది శాపమేకదా!

అదేపురము చేరిన తేనికి సతీస్మృతిని పోగొట్టినది. శచీతీర్థమున నయ్యంగుళీయకమును పడగొట్టినది. తన చెంత జేరి విలపించు సాధ్విని నిండు చూలాలిని రాజుచే నిల్లు వెడల గొట్టించినది. తుదకు శాంత్యుపాయమును గూడ నామమాత్రము గావించినది. శాప మంగుళీయక దర్శనావసానము — అన్నమాట ; పోయినయుంగరము మరల గంటబడినపుడు "నేను పరిత్యజించిన మునిపుత్రి నేను పెండ్లాడినశకుంతల యేయని రాజు స్మరించుటతో సరి. మఱి దాని ప్రభావమో! తరువాత రమారమి మఱి యైదు సంవత్సరము లింట దుష్యంతుని, హేమకూటాద్రిపై పొరుగింట శకుంతలను వియోగదుఃఖానలమున వేపి విడిచిపెట్టినది. ఇక శాంత్యుపాయ మాపుణ్యదంపతులను సుఖపెట్టిన దేమున్నదో యూహింపుడు?

సప్తమాంకమున మారీచ మహర్షి వినిపించునందాక శాపము మాటగాని శాంత్యుపాయము మాటగాని యాసతీపతుల చెవినిబడదు. అపుడుగదా "నేను లోకనిందా విముక్తుడనైతి" నని దుష్యంతుడును "ఆర్యపుత్రుడు నన్ను నిష్కారణము పరిత్యజింపలే" దని శకుంతలయు నూఱడిల్లగల్గిరి? అదిగదా కథానిర్మాణచాతురి! అది యట్టిది గాకున్న దీనికింత ఘనత యేలవచ్చును? ఇట్లు వస్తుకల్పనౌచితి నొకింత పరామర్శించితిమి. ఇక—

పాత్రౌచిత్యము :— పౌరవోత్తముడైన రాజర్షి కథానాయకుడు. అతడు ధీరోదాత్తుడు: దక్షిణ నాయకుడు. మేనకా విశ్వామిత్రుల కూతురును కణ్వమహర్షి పాలితయు దివ్యాదివ్యయునైన శకుంతల నాయిక. బ్రహ్మర్షి పుత్రికలైన యనసూయా ప్రియంవదలు నాయికా సఖులు. ఆపత్కాలమందు నాయికకు సహాయపడిన సానుమతి మేనకవలెనే యప్సరస. ఆ నాయికను రక్షించిన వారు దివ్యులైన దాక్షాయణీ మారీచులు, దేవదానవ మానవవంద్యులు. వారిచే దుష్యంతుని కర్పింపబడిన దౌష్యంతి జంబూద్వీపములోని ప్రాగ్భాగమునకు తనపేర భరతవర్షమని పేరు దెచ్చినతడు.

రాజు శకుంతల రూపలావణ్యములకు ముగ్ధుడై, యీ సుందరి తప్పక క్షత్రియుడు పరిగ్రహింప దగిన కన్యారత్నమని తన యుదార హృదయము దానిని కోరుటయే తెల్పుచున్న దనుటలో స్వార్థపరాయణత్వ మహంభావము కామత్వరయు గనవచ్చుచున్నవని కొంద అయిన భావింపకపోరు. సత్యమే కాని, యీ భావ మీ పాత్రకా సమయమందు సముచితమే — రాజు మొట్టమొదట ముగ్గురి నేక కాల మందే చూచి, అహో! వీరి దర్శన మెంతమధురము? ఈ రూపసంపద యంతఃపురాంగనలకు గూడా దుర్లభమే యనుకొన్నాడు. చాటున నుండి యల్లే చూచుచు వారిమాటలు వినుచుండ నతనిదృష్టి యెక్కువగా శకుంతలపై వాలినది. హృదయము సంశయగ్రస్తమైనది. ఈ కన్య కణ్వుని కూతురా? — ఒకవేళ క్షత్రియాంగనయందు కణ్వ మహర్షి కుదయించినదేమో? అని తర్కించుకొన్నాడు. బ్రాహ్మణ మునికన్యలైన యనసూయా ప్రియంవదల సౌందర్యమును మించిన దివ్యలావణ్యరూప రేఖా విలాసములు శకుంతలయం దుండుట కనిపెట్టినాడు. అపుడు మనసు పట్టజాలక "నాయుదార హృదయము కోరుచున్నది గావున నీసుందరి తప్పక క్షత్రియుడు పరిగ్రహింప దగిన కన్యారత్నమే" యని నిశ్చయించుకొన్నాడు. నిజముగా నతడెన్నడు నధర్మచింతన మెఱుగడు. కావుననే "యుదార్యమస్యా మభిలాషి మే మనః" అనుచు ధైర్యముతో నట్లు పలుకగలిగెను.

అతడు కామియైన మాట నిజమేకాని, అనసూయనడిగి యీశకుంతల జన్మవృత్తాంతము తెలియునందాక మనోవికారమును పైకుబుక నీయలేదు. తత్త్వము తెలిసిన పిదప, మహర్షి సమ్మతి కెదురుచూడ నక్కఱలేదని యీకన్నెను గాంధర్వవిధి కంగీకరింపజేయుట శృంగార నాయక లక్షణమేకదా!

నిజముగా నతడధర్మభీరువు. శకుంతల తనసభలోనికి వచ్చుటకు ముందే "అనిర్వర్ణనీయం పరకళత్రమ్" అని యీమెను జూడ శంకిం

చెను. అందఱిమాటలు వినునప్పుడేదో సత్యము మనస్సును పొడుచు చున్నను శాపవశమువ నామె తన భార్యయని స్మరింపలేక, తన్ను నమ్మింప గౌతమి శకుంతల మేలిముసుగు తొలగింప నా సుందరి జూచి చూచి తనలో "స్వీకరించినచో పరకళత్రపరిగ్రహమగు నేమో విడిచినచో స్వకళత్ర పరిత్యాగమగునేమో! 'ఉభయథా. మహా పాపమే' యన్న పాపచింతతో మంచుతోడి మల్లెపువ్వుపై వాలలేక దానిని విడిచిపోలేక యుండు తుమ్మెదవలె నున్నా" ననుచు నిట్లు చింతించెను:

> ఇద ముపనత మేవం
> రూపమక్లిష్టకాంతి
> ప్రథమ పరిగృహీతం
> స్యాన్న వేత్యవ్యవస్యన్,
> భ్రమర ఇవ విభాతే
> కుంద మంతస్తుషారం
> నచఖలు పరిభోక్తుం
> నైవ శక్నోమి హాతుమ్.

శాపము బలవత్తరమైనప్పుడు తొల్లిటి సుఖానుభూతి యెట్టిదైన నేమి? తుదకు పోపొమ్మని శకుంతలను వదల్చుకొని నాయకుడు తనలో ననుకొన్న మాటలివి.

> కామం ప్రత్యాదిష్టాం స్మరామి
> నపరిగ్రహం మునే స్తనయామ్,
> బలవత్తు దూయమానం
> ప్రత్యాయయతీవ మాం హృదయమ్.

"నేను విడిచిన మునిపుత్రిని నేను పెండ్లాడిన ట్లింతమాత్రము తలంపనుగాని, అదేమో కుతకుతలాడు నాహృదయము మాత్రము

నన్ను నమ్మింప జేయు చున్నట్లున్నది'' అనగా, ఏహృదయము తొలుత శకుంతల నభిలషించినదో, ఆహృదయమే నీవు విడిచినది నీభార్యయే సుమీ యని పరితపించుచున్నదని భావము. అయితే నేమి? శాపోపహతము.

అంగుళీయక దర్శనానంతరము శకుంతలను స్మరించిన యతని పరితాపమున దివ్రలంభ శృంగారము పొడచూపక పోదుగాని, అకటా! అధర్మమాచరించితినిగదా యన్న యనుతాపమే యందు హెచ్చు. అతడు దయాహృదయుడు, ధర్మమూర్తి – అనపత్యుడై మృతుడైన ధనమిత్రుని యాస్తి రాజునకు సంక్రమించు నన్న మంత్రిలేఖ చూచి అయ్యో పాపము! అతని భార్యలలో నొకతె యేని గర్భవతి యేమో కనుగొనుడన్న జాలిగుండెవాడు. ఛీ! అంతర్వత్నియైన ధర్మపత్నిని పరిత్యజించిన పాపిని, నాగతికూడ నట్టిదేకదా! పౌరవ వంశంబు నాతో సరి! యని ధర్మచ్యుతికి పరితపించిన పశ్చాత్తాపమూర్తి. ఇక నాయికా పాత్రమును గూర్చి యొకింత:

భ్రమర పీడాకల్పనము నాయికా నాయకుల ప్రత్యక్ష దర్శనమునకు మూలము. అంత దనుక చాటుననుండి చూచిన యతనికి మున్నే యభిలాష మంకురించినది. ఇపుడామెకు వికార మంకురించినది. అనంగదశలలో నిది దృగవస్థ. మనోహరరూపము నుదాత్తవేషమును సందర్శించినపు "డితడెవరో! ఎవరీకన్య!" యనెడి కుతూహలముతోడి వికార మంకురించుట స్త్రీ పురుష సాధారణము. స్వాభావసిద్ధమైన యీమనోధర్మము ననుచితమనుట పొరపాటు. తాత్కాలికమైన యట్టి వికారము తరువాత గుణవిచారణచే నిలచిన నిలుచును, లేకున్న నంతరించును. అంతేకాని యంకురింపక మానదు. లోకజ్ఞుడైన కాళిదాసు శకుంతలచే ననిపించిన మాటయే మనకీవిషయమున ప్రమాణము.

కింసుఖలు ఇమం ప్రేక్ష్య
తపోవనవిరోధినో వికారస్య
గమనీయాస్మి సంవృత్తా

'ఇతనిని చూచి తపోవన విరుద్ధమైన వికారము పాలయితి నేమి?' అనుకొన్నది. సహజ ధర్మము నివార్యమనుట కీమాటచాలును—ఇక నది మొదలామె చూపిన హావభావములా? మృదుతరములు, కులకన్యకోచితములు. వరునిమాటలతో కలుపని మాటల తీరందుమా, సౌశీల్యజ్ఞాపకములు. అతనిమీాది యనురాగమా గాఢమూ, విమలమూ. తండ్రిమీాది భక్తియా? అసదృశము—నాటక శకుంతల భారత శకుంతల కంటె వేఱు. నీకు నాయం దుదయించిన వానిని యువరాజును గావింపవలెనని వరమడుగలేదు. మహారాజుమాట కాదనుటకు సాహసింపలేక యెట్లకేలకు గాంధర్వమున కొడబడినదిగాని, తాతపాదులు తెలిసి యేమందురో, ఏమనుకొందురో యని భయపడుచునే యున్నది సిగ్గుపడుచునేయున్నది— సభలో శారద్వతాదుల మాటలు విని రాజు విస్మితుడై "నేనీమెను పెండ్లాడితినా?" అన్నపుడును—

పరిగ్రహ బహుత్వేఽపి
ద్వే ప్రతిష్ఠే కులస్యమే
సముద్రరశనా చోర్వీ
సఖీచ యువయో రియమ్.

"నాకు భార్యలు పెక్కండ్రున్నను, నా వంశము పేరు నిలుపునవి రెండే. ఈ చతురబ్ధిపరీత వసుంధరయు మీా చెలికత్తెయును" అని నా సఖులకు నచ్చు జెప్పి, నా తండ్రి పరోక్షమున నన్ను గాంధర్వమున బెండ్లాడి, యిపు డిట్లనుట యుక్తమేనా? యన్న తనమాట ధిక్కరించినపుడును, తన దుర్దైవమును నిందించుకొన్నదిగాని పెద్దకోపముతో భర్త నేమియు తూలనాడలేదు. ఇందలి నాయిక సాత్త్విక

భావముతోడి సతీ తిలక మనుటకంటె హెచ్చుగా విశదీకరింప బని లేదు.

వర్ణాశ్రమాచారములను యథోక్తముగా ప్రవర్తింపజేయ దక్షత గలవాడే ప్రజాపాలకుడు కాదగును. అర్థకామములు ధర్మావలంబన ములు కావలెను గాని, తద్వ్యతిరిక్తములు కారాదు. శ్రేయస్సులు విఘ్నాంతరితములు. సుఖదుఃఖములు పర్యాయ సిద్ధములు. దైవము దురతిక్రమము. ఇత్యాదిగా ప్రేక్షకులకు ధర్మము హితము నుపదేశింప నవతరించిన యీ రూపకమందలి పాత్రము లిట్టే తీర్చి దిద్దినవిగాక వేఱేమి?

రసౌచితి:—రసములలో శృంగార మెట్లాద్యమో దానిని వివిధ గతుల సముచితముగా వర్ణించిన నాటకకవులలో కాళిదాసు నట్లే యాద్యు డనదగును. ఇతని కావ్యము లన్నిటిలో నితర రసవర్ణనలెన్నో యున్నను, వానిలో నెల్ల శృంగారవర్ణనలే యెక్కువ ప్రశస్తి గాంచి యున్నవి. అందును శ్రావ్య కావ్యములలోని శృంగార పద్ధతి వేఱు, దృశ్యకావ్యములలోని దాని స్థితివేఱు. అందు తామస రాజసావస్థల కడజూచినది. ఇందు సాత్త్వికమార్గము త్రొక్కినది. ఇంక శాకుం తలములోని శృంగార మందుమా, దీని కిదే సాటి. "రసో వై సః రసగ్ హ్యేవాయం లబ్ధ్వాఽనందీ భవతి" అను శ్రుతివాక్యమును లౌకికముగా సమన్వయింతు మేని, అందుకు శాకుంతల శృంగార మాద్యోదాహరణ మగును. ఇందుకొకటి—

చెలీ! నీవు చెంతనుండుటచే నీ పొన్నగున్న తీగతో కూడి యున్నట్లు తేజరిల్లుచున్నది సుమీ యని ప్రియంవద యన్నమాట, నిజమనుచు ఆ భావము నొకింత వివరించుటకై నాయకుడు—

"అధరః కిసలయరాగః కోమలవిటపానుకారిణౌ బాహూ" అని ప్రారంభించి, ఈ పేరు పేరువరుస నీవర్ణన యేమిటిరా? అనుకొని కాబోలు!—

కుసుమమివ లోభనీయం
యౌవన మఙ్గేషు సన్నద్ధమ్

అనుచు నొక్కమాటతో శకుంతల తారుణ్య తారళ్యములను ప్రేక్షకుల భావనలో ప్రతిఫలింప జేసినాడు. ఇదిగదా శృంగారవర్ణన సౌందర్యము! మఱొక్కటి:—

యౌవనకృతములయిన శోభా కాంతి మాధుర్యములను వెఱ్ఱి యెత్తినట్లు వర్ణించినవా రెందఱో కలరుగాని, ప్రకృతి సౌందర్యవర్ణనమున భావము వికసింపజేసినవా రెందరున్నారు?

శకుంతల చక్కదన మవలోకించి, యీ సుందరి దేహకాంతి కేవల్కలము తగదుగాని, యిది యలంకారశోభను సంతరింపకపోదే దనుచు నాయకు డన్న మాటలివి:

సరసిజ మనువిద్ధం
శైవలేనాపి రమ్యం
మలినమపి హిమాంశో
ర్లక్ష్మ లక్ష్మీం తనోతి
ఇయ మధికమనోజ్ఞా
వల్కలేనాపి తన్వీ
కిమివ హి మధురాణాం
మండనం నాకృతీనామ్?

గెటీ మొదలగు పాశ్చాత్యపండితులు గూడా వహావాయని మెచ్చుకొన్న వర్ణనమిది. ఇందలి కడపటి పాదము భాసుని ప్రతిమా నాటకములో నార చీరగట్టిన సీతనుచూచి శ్రీరాముడన్న "సర్వ శోభనీయం సురూపం నామ" అను వాక్యము ననుకరణ మనుటకంటె, ఆ సూత్రమున కిది దుష్యంతుని భాష్యమనుట యుక్తము. దీని భావము తెలుగున చూతము:

కమలము నాచుతీఁగ పయిఁ
(గమ్మిన యేనియు సొంపులొల్కు-, నా
హిమకరు శోభ యిమ్మడిగ హెచ్చును
నల్లని మచ్చఁజేసి, యీ
కమలదళాక్షియందు మధికం
బొనరించెను నారచీర, ర
మ్యములగునట్టి రూపముల
కారయ భూషణ మేది కాదిలన్ ?

రసపిపాసువుల నాకర్షించు చాతుర్య మలర నితని స్త్రీవర్ణనము లెట్లు వికసించుచు వచ్చినవో తత్స్వరూప మొకింత యిచ్చట గను గొందము.

తన్వీశ్యామా శిఖరి దశనా
పక్వ బింబాధరోష్ఠీ
మధ్యేక్షామా చకితహరిణీ
ప్రేక్షణా నిమ్న నాభిః,
శ్రోణీభారా దలసగమనా
స్తోకనమ్రా స్తనాభ్యాం
యా తత్రాస్తే యువతివిషయే
సృష్టి రాద్యేవ ధాతుః

అస్యాస్సర్గవిధౌ ప్రజాపతి రభూ
చ్చంద్రోనుకాంతి ప్రదః
శృంగారైక నిధిః కథంను మదనో
మాసోను పుష్పాకరః,
వేదాభ్యాస జడః కథంను విషయ
వ్యావృత్త కౌతూహలో
నిర్మాతుం ప్రభవే న్మనోహర మిదం
రూపం పురాణో మునిః

చిత్రే నివేశ్య పరికల్పిత సత్త్వయోగా
రూపోచ్చయేన విధినా మనసా కృతాను
స్త్రీరత్న సృష్టిరపరా ప్రతిభాతి సామే
ధాతుర్విభుత్వ మనుచింత్య వపుశ్చతస్యాః

ఆ పరమేష్ఠి యువతి నిర్మాణవిషయమున గావించిన ప్రథమ శిల్పముగా సర్వాంగ సౌష్ఠవముతోడి యక్షపత్ని మొదటి శ్లోకమున ప్రత్యక్ష మగుచున్నది.

ఈ సుందరి సుధానిధియగు చంద్రుడో శృంగార నిధియైన కంతుడో కుసుమాకరుడైన వసంతుడో సృజియించినది గాని, అందము చందము నెఱుగని యీ ఛాందసుడు ముసలితాత బ్రహ్మయ్య నిర్మించినది మాత్రము కాదనునట్లూర్వశి రెండవశ్లోకమున గనువిందగుచున్నది.

మహామహిమాన్వితుడైన యీ స్రష్టముందు చిత్తరువున సర్వాంగ సౌష్ఠవముతో నీ యువతిని లిఖించి తరువాత ప్రాణముపోసెనో, లేక, సర్వావయవ సౌందర్య ముట్టిపడు నీ సుందరిని మనసా నిర్మించెనో కాని, లోకములోని యందఱు స్త్రీలను సృజించి నట్లీ రమణీమణిని సృజింపలేదు. ఈ తరుణీ సృష్టియే వేఱు, అనునట్లు శకుంతల మూడవ శ్లోకమున దర్శన మిచ్చుచున్నది. ఇక నీ విషయమున వివరణమేల ఒక ప్రాచీన విద్వాంసుని స్తుతివాక్యము స్మరింతము చాలును.

సాకూత మధుర కోమల
విలాసినీ కంఠకూజిత ప్రాయే,
శిక్షాసమయేఽపి ముదే
రత లీలా కాళిదాసోక్తిః

ఇంక రూపవర్ణనమందుమా, అపురూపము – రత్న కాంచనాభరణములు లేకయే యవయవములు దేనిచే రమ్యములై ప్రకాశిం

చునో, అది రూపము — సౌందర్యము లేక చక్కదన మనుబడునది. కన్నార జూచి మనసార ననుభవింపదగినదే కాని మాటలతో దెల్ప దగినదికాదు. అట్టి దానిని పోలికలతో నిరూపింప బూనిన వర్ణన మిది :

"అనాఘ్రాతం పుష్పం
కిసలయమలూనం కరరుహై
రనావిద్ధం రత్నం
మధు నవ మనాస్వాదితరసమ్,

అఖండం పుణ్యానాం
ఫల మివచ తద్రూపమనఘం
నజానే భోక్తారం
కమిహా సముపస్థాస్యతి విధిః"

శకుంతల సౌందర్యము, ఆఘ్రాణింపని పుష్పమువలె నున్నది, గిల్లని లేజిగురువలె నున్నది, తొలువబడని మణివలెనున్నది, రుచిచూడని తేనెవలె నున్నదనుచు, కంటికి గోచరించు వస్తువులతో పోల్చియు తనివితీఱక, పూర్వపుణ్యముల సమగ్రఫలమువలె నున్నదనుచు నదృశ్య పదార్థము నుపమానముగా జూపి, యా సౌందర్యము వర్ణనాతీతమన్న భావము వెల్లడించి నట్లున్నదీ వర్ణనము. ఇంక —

"తత్రాపిచ చతుర్థోఽఙ్క
స్తత్ర శ్లోక చతుష్టయమ్."

అనుచు రసజ్ఞుల ప్రత్యేక ప్రశంసకెక్కిన కథాభాగ మొకింత పరామర్శింతము — దీనికి సంబంధించిన ప్రదేశమా, తపోవనము. ఇందలి పాత్రములా, కులపతి కణ్వుడు, శిష్యులు గౌతమ్యాది తపస్వినులు, తాపసకన్యలు, మృగలతాపాదపములు — అయితేనేమి ?

శకుంతల నత్తవారింటికి పంపుటయను విషయమును పురస్కరించు కొని యీ రంగమును రక్తి కట్టించినది కణ్వపాత్రము. ఆ యారణ్యక వ్రతుడా బ్రహ్మనిష్ఠుడిందు దివ్యదృష్టితోడి యోగీంద్రుడై మహిమలు చూపు సిద్ధుడై పౌరుడైన గృహమేధియై పిల్లలతండ్రియై కూతురికి బుద్ధులు నేర్పిన తల్లియై పృథ్వీశాసకుని శాసించు ధర్మశాసనుడై నటియించిన చంద మపూర్వము. తన యాశ్రమములో పెరిగినందున శకుంతలపై జనియించిన మమకార మతనికంట నీరు పెట్టించినది. మాపిల్ల మగనియింటి కరుగుచున్నదమ్మా యని చెట్లతో చెప్పించినది. మాకెవ్వరికి తెలియకుండ నీమాటల కంగీకారము చూపిన యమాయికురాలుసుమీ యీపిల్ల! నన్ను స్మరించియైనా, నీభార్యలు నలుగురితో సమానముగా నీమె నాదరింపుము. తరువాత దాని యదృష్టమని యల్లునికి కబురు పంపించినది. ఆహా! సర్వజన హృదయాకర్షకముగా స్వభావ ముట్టిపడునట్లు పుత్రికావాత్సల్యము నిట్లు ప్రదర్శింపజేసిన యీ లోకజ్ఞత, ఆచాతుర్య మీ కవీంద్రుని సొమ్ముగదా! వనదేవతావనస్పతులచే శకుంతలకై బంగారు నగలు పట్టుచీరలు లాక్షారసము నిప్పించినది కవీంద్రుని వాగ్వైచిత్రియో లేక ఋషీంద్రుని మానసిక సిద్ధియో! ఇంతయేల? కావ్యరస జిజ్ఞాసతో నీయంకము చదువు పాఠకుడా సమయమం దా యాశ్రమమున నున్నట్లు తన్మయుడై హర్షవిషాదపరవశుడగు నన్నచో సరిపోవును గదా! ఇంక, శాపప్రభావముతోడి తరువాతి కథ :—

దుష్యంతుడు స్వపక్షమున ధర్మబద్ధుడు; గౌతమీశారద్వతాదుల పక్షమున ధర్మచ్యుతుడు. కణ్వమహర్షి సందేశమునే పెడచెవిని బెట్టిన యతని మఱపు తాపసుల మాటలను దరికి జేరనిచ్చునా? మేలి ముసుగు తొలగించినా, ఆనవాలు పట్టనీయని దా శకుంతల నర్మాలాపములను నమ్మనిచ్చునా?

అదివఱకే లేదు కాదనుచు రాజు తమమాటలను త్రోసివేయుటచే నందఱికిని ప్రాణము విసిగినది. ఆడవాళ్ళందఱు కపట స్వభావలే యనుటతో శకుంతల కొళ్ళు మండినది. దానితో "సధర్మమైన నా ప్రార్థన మంగీకరింపలేని నీతల వెయ్యి చెక్కలగును" అనుచు భారత శకుంతలవలె గట్టిగా తిట్టకపోయినా "ధర్మమనే చొక్కాలో దూఱియున్నావు, గడ్డిమూసిన నుయ్యివంటివాడవు, నీవలెనే యందఱును వంచనామతు లనుకొనుచున్నావు" అనుచు మృదువుగా నిందింపకపోలేదు, ఆనిందతో "ఈ తరుణికోపము నిష్కపటముగా గన వచ్చుచున్న" దనుచు రాజుబుద్ధి సందిగ్ధావస్థలో పడకపోలేదు. అయితేనేమి? అభిజ్ఞానము కంటబడలేదు గదా!

అంగుళీయక దర్శనమైనది. శాప మంతరించినది. రాజునకు విరహవేదన యారంభమైనది. శకుంతల కాయుంగరమిచ్చిన సందర్భమును స్మరించి, ఆడినమాట తప్పిన క్రూరుడనని పశ్చాత్తాపపడుచు, నామె చిత్తరువు చూచి సత్యశకుంతల ప్రత్యక్షమైనట్లు మురియుచు, చిత్తరువని తెలిసినంతనే మరల విచారించు నాయకుని విరహము, "పూర్వా పరవిరోధీ అపూర్వఏష విరహమార్గః" అని సానుమతి యన్నట్లు విజృంభించినది. తుదకు నాయకుడన్న మాట లివి:

ప్రజాగరా త్ఖిలీభూత
స్తస్యాస్స్వప్నే సమాగమః,
బాష్పస్తు నదదా త్యేనాం
ద్రష్టుం చిత్రగతామపి

ప్రియురాలిని కలలో గలసి సుఖింతునంటే కంటికి కునుకు రాకున్నది. పోనీ! చిత్తరువులోచూచి యానందింతునంటే కన్నీరు చూడనీయకున్నది.

ఇట్లనురక్తురాలైన ధర్మపత్నిని వదలుకొన్నందుకును, అంతర్వత్ని యైన యీ సాధ్విని విడిచి వంశప్రతిష్ఠ కవరోధము కలిగించుకొన్నందుకును పరితపించు నాయకుని హృదయము మాతలిచర్యచే వీర రసాక్రాంతమైనది. తరువాత దుష్యంతునికి శకుంతలా భరతలాభమున నాటకము శుభాంతముగా ముగిసినది. ఈ విషయమున మారీచ మహర్షి వాక్యము స్మరణీయము.

దిష్ట్యా శకున్తలా సాధ్వీ
సదపత్య మిదం భవాన్
శ్రద్ధా విత్తం విధిశ్చేతి
త్రితయం తత్ సమాగతమ్.

# ఉత్తరరామచరిత్ర

కవికర్మ కావ్యము. సర్వమానవ సాధారణముగా నానందము కలిగించుచు జీవించియుండునది జీవత్కావ్యము. కవి యెవడు? "హృదయ మాకర్షించు భావములతోడి ధర్మతత్త్వమును దర్శించిన వాడు కవి, అతడు ఋషి; మంత్రద్రష్ట; వైదికకవి. అట్టి ధర్మతత్త్వమును దర్శించి, మృదుమధురపావనములైన నిజవాక్కుల వర్ణించిన వాడు లౌకికకవి. ధర్మతత్త్వప్రఖ్యాన రూపమగు దర్శనమును, తద్వర్ణనమును లౌకికకవితకు ప్రధానములు. వాల్మీకి మహర్షి దర్శన మెంతటి స్వచ్ఛమైనదైనను తద్వర్ణనము వెలయువఱకును లోకములో కవిత పుట్టలేదు" అని భట్టతౌతుడు కవిదర్శన వర్ణన శబ్దములను నిర్వచించి, వాల్మీకి నాదికవిగాను, రామాయణము నాదికావ్యముగాను తెలియజేసి యున్నాడు. ఈ లక్షణము పట్టిన యే లౌకికకావ్యము శాశ్వతముగా జీవించియుండునో, అది జీవత్కావ్యమని నిర్ణయింతము.

భరతఖండమున మొదటినుండియు నక్షరాస్యత కొఱతగానే యున్నది గాని, లోకానుగ్రహ కాంక్షులగు ఋషులు వేదోక్త ధర్మములు బోధించుచు వచ్చుటయు, పౌరాణికు లితిహాసగాథలు వినిపించుచు వచ్చుటయు కారణములుగా చదువుకోనివారు కూడా కొందఱు కొందఱు ధర్మతత్త్వ మాస్వాదించుచు వచ్చిరనుట కనేకకథలు గలవు. అది యట్లు సాగుచుండ, దేశమున విజ్ఞానము పెంపొందించు భావముతో పాఠ్యకావ్యములును, విన్నదానికంటెను చదివినదానికంటెను కంటితో చూచిన విషయ మెక్కువగా మనస్సున నాటుకొను నన్న తలంపుతో దృశ్యకావ్యములు నుదయింపజొచ్చినవి. మనకిప్పటికి తెలిసినంతలో నట్టి రూపకసృష్టి కాద్యుడు భాసమహాకవి యందము.

సంస్కృతములో నట్లుదయించిన ద్వివిధకావ్యములు కొన్ని వేలు. అందు వినవచ్చునని, మఱుగుపడినవి గాక, కనవచ్చువానిలో—

"ప్రజ్ఞా నవనవోన్మేషశాలినీ, ప్రతిభా మతా, తదనుప్రాణనా జీవద్వర్ణనా నిపుణః కవిః, తస్య కర్మ స్మృతం కావ్యమ్"

అను లక్షణము పట్టున ప్రతిభామూర్తులగు కవులెందరో, అట్టి వర్ణనముతోడి జీవత్కావ్యము లెన్నో పాఠకులే యెఱుగుదురు. నే నిపుడు సంస్కృత కవి జీవితము ప్రకటించుచుండుట కారణముగా నట్టివానిలో కొన్నిదృశ్య కావ్యములను కొంచెము విపులముగా పరామర్శించి, వాని యుత్తమత్వమును యథాశక్తి తెలుపగోరుటయే యీ వ్యాసముల ముఖ్యోద్దేశము. ఇందుకు ముందుగా కాలక్రమము పాటింపక, ఉత్తరరామచరిత్ర గ్రహింతము.

వస్తువు :—జనాపవాదమును బట్టి శ్రీరాముడు సీత నడవిలో విడువనంపుట — ఆమె యచ్చట కొడుకులను గనుట — వారు వాల్మీకి యాశ్రమమున పెరుగుట — శంబూకవధ — అశ్వమేధ మను నంశముల నిది యుత్తరకాండనుండి గ్రహించుటచే నీ పేరు గాంచినది. తక్కిన కథాంశము లన్నియు, కవి ప్రతిభా కల్పితము లగుటచే వస్తువు మిశ్ర మనబడినది. ఆ కల్పితములు కొన్ని రూపకములలోవలె విఖ్యాత వృత్తమునకు విరుద్ధములు గావు సరిగదా, ఉత్తరకాండ నటుంచి, ఈ యుత్తరరామచరిత్రయే నిజమైన శ్రీరాముని యుత్తరచరిత మనిపించునంతగా స్వభావసిద్ధములు, సహృదయ హృదయంగమము లున్నై యలరుచున్నవి. క్రమముగా పరిశీలింతము.

ప్రస్తావన :— తత్పూర్వ నాటకముల ప్రస్తావనలే స్వతంత్రములు. వాటిని మించిన దిది — సూత్రధారుడు రంగస్థలమున ప్రవేశించి, యుత్తర రామచరిత మభినయించుచున్నామని యొక్కమాట చెప్పి, వెంటనే అయోధ్యలో రాముని పట్టాభిషేకసమయమం దున్నవాడుగా మాఱి, నటునితో తాత్కాలికోదంతమును గూర్చి మాటాడును. తొలిసారి తెర యెత్తినంతనే ప్రేక్షకుల దృష్టిని కథలోనికి

కొనిపోవు నీ రీతి యత్యపూర్వము. ప్రస్తావనానంతరము విష్కంభ పాత్రలు ప్రవేశించి, పాఠమప్పగించు పద్ధతిపై గీటుపెట్టిన యీరీతి, లక్షణమునకు లక్షణముకాని, లక్షణాతిక్రమణము కాజాలదని యభిజ్ఞులు తలంతురు. ఈ యిరువురి ప్రసంగము మాత్రము దీర్ఘమా? అంతా కలిసి నాలుగు మాటలు. అది తత్సమయోచితముగా, కథా సంవిధాన సూచకముగా, రాముని యాత్మబంధువులు, గురువులు, నయోధ్య విడిచి వెళ్లుట నిరూపించి, అపుడు ప్రబలంగా నలుముకొను చున్న సీతావిషయకాపవాదమును నిరసించి, సామాజికుల హృదయ మందలి కరుణమును మెల్లగా కదిల్పి యూరకున్నది. గంగప్రసాదనము, కావ్యార్థసూచనము, విష్కంభప్రతిరూపకము నైన యీ ప్రస్తావన నేమని నుతింతును! నిది చూచుటకు సూత్రప్రాయము. పర్యాలోచనకు భాష్యప్రాయము.

కథారంభము :— ఈ నాటకములోని ప్రధానరసము కరుణ మని కవి ముందే తెల్పెనన్నట్లు — " దేవ్యాస్తతో విమనసః పరిసాంత్వనాయ, ధర్మాసనా ద్విశతి రాజగృహం నరేంద్రః "

అను సూత్రధారసూచనతో, దుఃఖితచిత్తయగు జానకి నూఱడించు చున్న రాముడు ప్రవేశించును. అంతలో ఋష్యశృంగాశ్రమమునుండి వచ్చిన యష్టావక్ర మహర్షి ప్రవేశించి, అరుంధతీ వసిష్ఠాదుల సందేశ ములు వినిపించును. అవి పెద్దలు పిన్నల కుపదేశించు హితవచనము లుగా పైకి కనవచ్చును గాని, కథాపక్షమం దవి యన్నియు భావ గంభీరములు. అందు, వసిష్ఠుని యాశీర్వచనము, తమకు తప్పక పుత్రసంతానము కలుగునని యపుడు సీతారాములు విశ్వసించి సంతోషించుటకును, కుశలవులు సీతకు జన్మించినవారే యని తరువాత మున్యాశ్రమములో రాము డూహించుటకును మూలమైనది. — సీతకు గర్భవాంఛ లేవేని కలిగెనేని వెంటనే తీర్చుమన్న యరుంధత్యాదుల

సందేశము లోకసాధారణముగా కనవచ్చును గాని, యదియే దేవి గంగాతీరవిహారవాంఛను దీర్చ రాముని కూత యిచ్చినది. మఱియు, జనాపవాదము-బట్టి తన్ను భర్త యడవికి పంపుచున్నాడని సీత యనుకోకుండుటకు తగిన నెపముగా పరిణమించినది. సీత యిట్టికోరిక-కోరునని కౌసల్యాదు లూహించి రనుట కవకాశ మింతేని కలదా! ఇక ——

" యుక్తః ప్రజానా మనురంజనేస్యాః,
స్వస్మాద్యశో యత్పరమం ధనం వః "
ప్రజల రంజింపగా స్థిరపడుము మీకు,
తనువుకంటెను గీర్తి యుత్తమధనంబు —

అనుచు, రాముని రాజ్యారంభసమయమున దేశాంతరమం దుండ వలసివచ్చుటచే తండ్రివంటివాడు గావున వసిష్ఠుడు సందేశ మంపెను గాని, ప్రజానురంజనమునకై సీతనే విడువవలసివచ్చునని యూహించి కబురంపెనా? అసలీ జనాపవాద మతడు విన్నాడా? — కాని, ఈవార్త వచ్చునప్పటికి జనాపవాదము మాట లేకున్నను, లోకారాధన తత్పరుడగు రాముడు ——

" స్నేహం దయాంచ సౌఖ్యంచ
యదివా జానకీ మపి
ఆరాధనాయ లోకస్య
ముంచతో నాస్తిమే వ్యథా "

ప్రజల యారాధనంబె నా ప్రాణపదము,
దానికై స్నేహమును గాని దయను గాని
సౌఖ్యమును గాని, తుదకు నీ జనకతనయ
గాని విడిచెద బాధ యింతేని లేక —

అనుచు తన జనరంజనసంసిద్ధత నావిష్కరించి. 'ఆర్యపుత్రుడు రఘువంశశ్రేష్ఠు' డన్న సీత మెప్పు నొందెను. అట్టి యీవార్త, సీతను విడుచుసమయమందు "సంప్రత్యేవ సందిష్టం భగవతా వసిష్ఠేన" అనుచు తన నిశ్చయమును రాముడు బలపఱుచుకొనుటకును, అతడు గావించిన సీతాపరిత్యాగము గురుజనాభిప్రాయమున కనుగుణమైన దనుటకును, తరువాత రాముని చర్యను సీత నిరసింపకుండుటకును కారణమైనది — కథ కాయువుపట్టయిన నిగూఢభావమగు నీ కృత్యారంభకల్పనము భవభూతిప్రతిభకు ప్రథమోదాహరణము — ఇంక,

చిత్రప్రదర్శన రంగము:— రమ్యనిర్మాణ దక్షుడగు భవభూతి ప్రేక్షకుల హృదయము దృశ్యమయము గావింప నిందు కల్పించిన యపూర్వరంగములలో నిది మొదటిది. తండ్రి యెడబాటునకు విచారించు జానకి కుత్సాహము గలిగింప నా చిత్రశ్రేణి వ్రాయించితి నని లక్ష్మణునితో రాముడన్నమాట యథార్థము, తత్సమయోచితము నగును గాని, సామాజికులను ముందుగా నిసుమంతయు నూహింప నలవిగాక, యుత్కంఠ పుట్టించు చిత్ర విచిత్రాంశము లెన్నో యిం దిమిడి యుండుటం బట్టి యిది బహుప్రయోజనము కథాధిష్ఠానము నగుచున్నది. ద్వితీయాద్యంకము లందును, అంతర్నాటకమైన సప్తమాంకమందును దీని ప్రభావము గోచరించును - వాల్మీకిరామాయణము మొదటి మూడు కాండములలోను కొన్ని ఘట్టములు మాత్రమే యందు చిత్రింపబడినవి. వానిలో సీత మెచ్చినవి కొన్ని, మెచ్చనివి కొన్ని. అన్నియు నాయికానాయకుల గాఢానురాగమును విశదీకరించునవే — 'ఆలేఖ్య మెంతవఱ కయిన' దని యడిగి 'పూజ్యురాలి వహ్నిశోధనశుద్ధి వఱకు' నన్న సౌమిత్రి జవాబు విని, రాముడు ఖిన్నుడై 'దేవీ! తప్పుమాట, క్షమించు మను గ్రహించు' మనుచు బ్రతిమాలుట యామెపై నతనికి గల యనురాగాతిశయమునే కాదు, గౌరవాతిరేకము నావిష్కరించుచు, సీతా

పరిత్యాగమున రాముడు దోషిగాడని తోపింపజేయుచున్నది. అందు — ఉత్పత్తి పరిపూతాయాః, క్లిష్టోజనః కులజనైః — అను పద్యములు —

"దేవీ! దేవయజనసంభవా! అనుగ్రహింపుము."

"జననంబున బావనయగు,
జనకుని కన్నియకు వేఱె చనునే శుద్ధుల్"

"దుఃఖితుల లాలనంబు బంధువుల ధర్మ,
మట్టిచో నిన్ను జెడ్డమాటంటి మకట!
పువ్వు తలలో ధరించుట పొసగు గాని
కాలితో ద్రొక్కి నల్పుట పోలు నొక్కొ?"

చిత్తరువు సమీపించినంతనే ముందు సీతకు కనవచ్చినవి జృంభకాస్త్రములు. రాముడు వాటి యుదంతము తెల్పి "ఇవి నీ సంతానము నాశ్రయింపగల"వని వరమిచ్చును. కొడుకో లేక కొడుకులో పుట్టి పెరిగినతరువాత స్వయముగా వారి కుపదేశింప వచ్చునుగదా! ముందుగా నీయభ్యనుజ్ఞ యెందుకు? తన కొడుకులు జృంభకాస్త్ర సంపన్ను లగుదు రని ముందే సీత యానందించుటకు. ఇందలి యాంతర కారణమో, "స్వయముగా నీకొడుకుల కీ యస్త్రము లుపదేశించు భాగ్యము నీకు పట్టదు. ఇపుడే యిచ్చివేయు" మన్న దైవప్రేరణము. దీని కంతకు ఫలము, గంగాతీరమున జన్మించినంతనే కుశలవుల కీయస్త్రము లధీనములగుట, తరువాత మున్యాశ్రమములో కుశలవుల యస్త్రలాభము విని రాముడు తా నిచ్చిన యభ్యనుజ్ఞను స్మరించి, వారు సీత కచ్చట పుట్టినవారే యని నిశ్చయించుకొనుట. ఇంత నిగూఢార్థమైనదీ యస్త్రప్రసంగము — తరువాతి మిథిలాయోధ్యా వృత్తాంత చిత్రముల ప్రయోజనము, ఆనాటి తమ యనురాగమును సౌఖ్యమును సీతారాములు స్మరించుకొని యానందించుటయు,

అంతటి ప్రాణవల్లభుడు తన్ను విడుచుటకు దుర్దైవ మూలకమే యని యుత్తరత్ర సీత యనుకొనుటయు —

పిదప, భాగీరథీచిత్రమును చూచి సీత నమస్కరించుటయు, నీ కోడలగు సీతకు మేలు కోరుచుండుమని రాము డర్థించుటయు దేవతా విగ్రహ సందర్శనమందలి చర్యలవంటివే, అయినా, యీప్రార్థనము, గంగాదేవి, సీతను ప్రసవసమయమందు రక్షింప సాధనమైనది — అంకాంతమందలి వసుమతీప్రార్థనము నిట్టిదే — అనంతరము వైదేహి చిత్రకూటమార్గమందలి వటవృక్షమును ప్రస్రవణాద్రిని సాకూతముగా చూచునపు డామెతో రాముడన్న మాటలు ముద్దగట్టిన వారి యనురాగరసమును ప్రేక్షకుల కంటఁబెట్టునవిగా నున్నవి. వాటిలో "అలస లలిత ముగ్ధాని — స్మరసి సుతను తస్మిన్ — కిమపి కిమపి మదం మందం — అను సుప్రసిద్ధ శ్లోకముల యనువాదము లివి —

"కమలిన తూడులట్లు నడ
కన్ గడు గంది వశంబు తప్పి స
త్యము చెడియున్ మఱెంత లలి
తంబులుగా గనవచ్చు నీదు నం
గముల యలంత గొంత బిగి
కౌగిళులన్ శమియింప గేల మై
నిమిరెదు నా యురంబుపయి
నిద్దురవోయిన చోటిదే కదా !

"తలతువె లక్ష్మణుండు బహుధా
పరిచర్యలు చేయ దానిపై
నలరుచు నున్న యా దినము ?
లాసరసోదక గౌతమీనదిన్

దలతువె? దాని చెంత బులి
　　నంబుల ముచ్చట లాడుచున్కియున్
దలతువె? నాటి వర్తనమె
　　దం దలతే లలితాంగి జానకీ?

"ఒక్కొక బావుతోడ నోడ
　　లుబ్బగ బిగ్గ గవుంగిలించి ను
న్జెక్కిళు లొక్కటై కదియ
　　నెమ్మదిగా మనమేమి యేమియో
మక్కువ మీఱ మాటపయి
　　మాటగ ముచ్చట లాడుకొంచు ను
న్నక్కడి నాటిరాత్రి నలు
　　యామములంతనె యంతరింపవే?

తక్కిన చిత్రములలో జనస్థానవృత్తాంత మెక్కువ. తన వియోగమున రాము డప్పుడు శోకించిన విధమును సీత కన్నార గాంచి దుఃఖించి 'దేవా! నా మూలమున నీ వింత కష్టపడినావా' అనుటయు, భావి వియోగమునం దతని హృదయ మామె శంకింపకుండుటయు, వాటి ప్రయోజనము. ఈ సందర్భమం దొక్క విశేషాంశము కనుగొందము.

జనస్థానమున సీతాపహారణము జరిగిననాటికి సుమా రొక్క సంవత్సర మైనది. అప్పుడు రాముడు వియోగదుఃఖమూర్తియై తన్నుదా మఱచి వెఱ్ఱి యెత్తినట్లు చెట్లను తీగలను పక్షులను మృగములను జూచి 'నా సీతను చూచినావా?' యని యడుగుచు ఘోరముగా విలపించినవిధము రామాయణము నరణ్యకాండమున మూడు సర్గలలో వర్ణింపబడినది. అప్పు డన్నగారి దుఃఖమునకు ప్రత్యక్ష సాక్షియైన లక్ష్మణుడే యీ చిత్తరువులోని సీతాపహరణవృత్తాంతము చూపి నాటి రాముని విలాసమును సంగ్రహించి యొక్కమాటలో నిం దిట్లు తెల్పు చున్నాడు—

"అథేదం రక్షోభిః కనకహరిణచ్ఛద్మవిధినా,
తథావృత్తంపాపైర్వ్యథయతి యథాక్షాళిత మపి,
జనస్థానే శూన్యే వికలకరణై రార్యచరితై
రపిగ్రావా రోదిత్యపి దళతి వజ్రస్య హృదయం"

వనరుచు నున్న యార్యుదుర
వస్థకు వజ్రముగుండె వ్రయ్యున
ట్లును శిల లేడ్చునట్లును ఖ
లుల్ నశియించిన యంత నివ్వనిన్
కనకమృగంబుమూలముగ
గల్గిన దీపని, దీని మేము వెం
టనె యణగించినన్ కటక
టం బడు నేటికి సంతరంగముల్—

అచిరకాలమున పరిహరించుకొనగలిగిన యా వియోగమునకే యట్లు పరితపించిన తన నాథు డీయపార విరహవ్యథ నెట్లు భరించు చుండెనో యని తరువాత సీత తలచుకొనుట కిది కల్పిత మనుట స్పష్టము. దాని నుండనిండు — ఈ పైశ్లోకము చదివి పరవశుడైన గోవర్ధనాచార్యుడన్న మాట లివి.

"భవభూతే స్సంబంధా ద్భూధరభూరేవ భారతీ భాతి అథవా కృతకారుణ్యే కిమన్యథా రోదితి గ్రావా ?"

అన లిది గత వృత్తాంతము గాని వర్తమానము కాదు. రాముని దుఃఖము పుట్టినచోటు సత్యమైన జనస్థానముగాని, యీ చిత్రకల్పితము కాదు. అది వాల్మీకికి సంబంధించినదిగాని భవభూతికి సంబంధించినది కాదు. అట్టియెడ "భవభూతే స్సంబంధాత్" అనుచు గోవర్ధనుడు ప్రశంసించుట సముచితమా ? కాకేమి ? కవి వశమున నీ చిత్రజనస్థానమే యా సత్యజనస్థానమైనదని లక్ష్మణుడు, 'ఇదమ్'

అనుచు సీతాహరణము వేలుపెట్టి చూపుటయే చెప్పుచున్నది. ఇక రాముని దుఃఖమును విశదీకరించు నీ భవభూతి లక్ష్మణుడును దీనిని కన్నారగాంచిన వాల్మీకి లక్ష్మణుడును నొక్కడే యనుట స్పష్టము కదా! ఇంతకును "హంత వర్తమాన ఇవమే జనస్థానవృత్తాంతః" అన్న యీ రాముడే యా రాము డగుచుండ భవభూతి సంబంధమున పర్వతభూమి భారతి యైనదని గోవర్ధనుడు వర్ణించుటకు శంకింపనేల? భవభూతి గావించిన పై యద్భుతవర్ణనము విద్వల్లోకమును విస్మయమున ముంచినదన్న నాశ్చర్యమేల? ఈ వర్ణన మీ మహాశైలి కొక యుదాహరణము.

చిత్రసందర్శమున నలసిపోయిన యీ కఠోరగర్భ నొక యేకాంత స్థలమున గూర్చుండబెట్టి తాను కూర్చుండి రాము డామె భుజమును తన మెడపై చేర్చుకొనియు, నిద్రింపగోరిన యామె తల క్రింద తన భుజము చేర్చియు — వినిశ్చేతుం శక్యః — ఆ వివాహ సమయాత్ — అని యత్యాదరముతోడి తన యానుకూల్య మిట్టిపడ నుపచరించెను. ఈ శ్లోకముల యనువాదము :—

"అరయంజాలను దుఃఖమో సుఖమొ మూ
ర్ఛావస్థయో నిద్రయో
గరళావేగమొ మత్తో! నీవు నను దా
కన్ బుట్టి నా యింద్రియో
త్కరముం ద్రొక్కి మనోవికారమొక డే
కాకారమై లేచి యాం
తర చైతన్యము నంతలో గలచు నం
తం దేర్చు నేమే సఖి?

"పరిణయ వేళనుండియును
బాల్యమునం దెలప్రాయమందు మం

దిరమున గాన నీకు సుఖ
నిద్రకు గారణమైనదొండు సుం
దరి నిదురింప నెన్నడును
దార్పని దీ రఘురాము బాహు వో
ధరణికుమారి సిద్ధమగు
తల్గడ నిద్దురపొమ్ము దీనిపై ”

ఆమె యట్లు నిద్రించినంత రాము డనుకొన్న మాట — ‘ఇయం గేహే లక్ష్మీః’ ఇత్యాదికము—

“నా నిలయంబు లక్ష్మి, ఇది
నా నయనామృత, మీః తాకు నా
మేన నలందు చందనము,
మేలగు ముత్తెపు దండ నా మెడం
బూనిన యీ బుజంబు,
తనువు న్నను నీమెకు జెందినట్టి దే
దైనను, కాని యీమె విర
హంబు భరింప నశక్య మెంతయున్ ”

చిరకాలముగా సీతాస్పర్శసుఖ మనుభవించుచున్న రాముని కంతలో ననిర్వచనీయమైన యట్టి వికార మావిర్భవింప హేతు వేమి? అది భావి సీతా వియోగసూచన. రాబోవు నత్యుత్కట సుఖదుఃఖ ముల సూచనలు ముందుగా మనస్సున పొడగట్టు నని యనాగతజ్ఞు లైన మహర్షు లనియున్నారు గదా! కాని, రాముని యీమాటలు సీత, కత్యాదరద్యోతకములే యైనవి. అందుచేతనే “ ఇదంతా మీ యనుగ్రహ ” మన్నది. అమాయకురాలైన యామె కా మాటలలో ప్రతికూల భావము గోచరింపకుండ జేయుట కథా మర్మము. దానిని

పూర్తిగా నెఱిగినవాడు మానసతత్త్వవేత్తయైన యీ మహాకవి, మఱి రెండవ పద్యములోని మాటలంనునూ, ఆబాల్యముగా ననుభవించుచున్న తమ దాంపత్యానురాగమును కడసారిగా సీత యాస్వాదించుటకును యావజ్జీవము స్మరించుటకు నుద్దిష్టములు — ఇంక మూడవ పద్యము — తన సర్వస్వము సీతయే యని మురియుచున్న రాముని నోటవచ్చిన కడపటి మాట, జానకిని విడిచి యొక్క నిమిష మేని నిలువజాలనన్న యత్యాసక్తిని దెల్పుచు, దైవికమైన పునర్వియోగమును సూచించుచు కథోచిత మగుచున్నది. ఈ మాట సీత వినకుండ నిద్రలో నుండుట ప్రకరణోచితము.

జనాపవాదము :— నిద్రించుచున్న సీత చిత్ర సందర్శన సమయమందు వియోగమును స్మరించియుండుటచే కలలో "ఆర్యపుత్రా! ఎక్కడున్నావు" అని కలవరించినది. ఒక్కొక్కప్పుడు కలకూడా నిజమగు నన్న యార్యోక్తిని బట్టియు, బంధుహృదయము లనిష్టమును శంకించుచున్న న్యాయమునుబట్టియు, రాము డనిష్ట పరిహారముగా నామె దేహము నిమురుచు, ననుకూలమైన దాంపత్యమున కన్ని యెడల భద్రము గలుగుగాక యనుచు "అద్వైతం సుఖదుఃఖయో" రిత్యాది వాక్యములు పల్కెను. అంతలో దుర్ముఖుడు ప్రవేశించి సీతావిషయక జనాపవాదమును రాముని చెవిలో చెప్పెను — ఇక చెప్పెడి దేమి? పిడుగువలె ఘోరవార్త పైబడినది. సీత యొమ్మున నిద్రించుచున్నది. కుమ్ములో పెట్టినట్లు హృదయ ముడికిపోవుచున్నది. కాని, ధీరుడు వీరుడు. కొంచె మాలోచించి, దీనికి ప్రతిక్రియ లేదనుకొని, ప్రజానురంజనమునకై తన్ను విడిచి తన ప్రాణాలు విడిచిన తండ్రిని స్మరించి, గురుని సందేశమును భావించి, దూరదేశమున జరిగిన యగ్నిపరీక్ష నిక్కడి జనులు నమ్మకపోవుట సహజమే యని తలచి, పరిత్యాగము నిశ్చయించుకొని, రథము తీసికొనిరమ్మని సౌమిత్రికి కబు రంపి, సీతకు వచ్చిన దురవస్థకు లోలోపల కుళ్లి

పోవుచు విలపించిన యతని మాటలు విన్న ప్రేక్షకులు వెక్కి వెక్కి యేడ్తురన్న నాశ్చర్యమేమి? — అది మొదలుగా కావ్యమంతట శ్రీరామమూర్తిని శోకమూర్తిని చేసి సామాజికులను కరుణరస సాగరమున ముంచునట్లు రచన సాగించిన భవభూతి "ఏకోరసః కరుణ ఏవ" అని నిర్ణయించినా డన్న నేమి? కరుణరసవర్ణనము ముమ్మాటికి కతని సొమ్ము. అందుచేతనే "ఉత్తరే రామచరితే భవ భూతి ర్విశిష్యతే" అన్న యశ స్సతనిని వరించినది.

పుట్టినమాటా, లేనిదీ కానిదీ. వచ్చిన కష్టమా తిరుగులేనిది, బ్రతికినంతకాల ముండునది. అయినా, ఉత్తమ క్షత్రియుడు, లోకోత్త రుడు నగుటచే, అపుడేకాదు, రాజధానిలో నుండగానూ ప్రజలను పల్లెత్తుమా టనలేదు — ఎంత దిగమ్రింగుచున్నను పైకి పొంగు చుండుట దుఃఖప్రవాహము నైజము కావున — నేను కర్మచండాలు డను అస్పృశ్యుడను నిన్ను తాక దగను అనుచు సీత తలక్రింది తన బుజ మొత్తిగించుకొని, దుఃఖానుభవమునకే జన్మించితినని చింతించి, వసిష్ఠాదులను బంధుమిత్రులను మోసగించితినని లజ్జించి, ఇదే కడ సారి యని జానకి పాదములకు నమస్కరించి, తాపసబాధకుడగు లవణాసురుని పీడ వినరాగా ఇదిగో శత్రుఘ్నుని పంపుచున్నా ననుచు సభాస్థలికి వెడలిపోయెను. రాముని యీ పరితాపము నెఱిగినవా డొకడు లేడు. జనాపవాదమున సీతాపరిత్యాగ మావశ్యకమైనదన్న మాట యపుడు లక్ష్మణుడు మాత్ర మెఱుగును. ఇంకెవ్వరు నెఱుగరు.

పాడు కలలో భయపడి మేల్కొని రాముని గానక పరితపించుచు రథమెక్కిన సీత "ఆర్యపుత్రు డేడి?" యని సౌమిత్రి నడుగ లేదు. ఆ నిద్రబద్ధకములో, ప్రియుడు తన్నొక్కర్తెను విడిచి యెందుకు వెళ్ళెనో యన్న యాలోచనలో తా నెక్కిన రథము గంగాతీరము నకు పోవుచున్న దనుకొన్నదో లేదో! పాత్రశీలపోషణముతోడి కథా ప్రవర్తనచాతురి యన నిదిగదా! ఇక్కడ నొక్కమాట :—

గంగాతీరవిహారము కోరిన సీత 'మీరు కూడా రావలెను సుమండీ' యనగా — అయి కఠినే కిమేతదపి వక్తవ్యమ్ - 'ఓసీ కఠినురాలా! ఈ మాట చెప్పవలెనా?' — అన్నాడు రాముడు. అంటే తప్పకవత్తు నన్న మాటే కదా! — కథాప్రవృత్తి రాముని గమనమును సమ్మతింపదు గదా! కవి యెందుకీ మాట యనిపించెను? — ఆ భావము కఠినురాలా! అన్న సంబోధనములో దాగియున్నది — నిన్ను విడిచి నిమిషమేని గడపజాలని నేను, నీతో రానేమో యని యనుమానించి యిట్లడుగుటచే కఠినురాలవైతివని యా భావము. ఇట్లనుట తత్కాలమందు సీత సంతుష్టికిని, తరువాత రాముని పరిపూర్ణ పావనప్రేమ నామె స్మరించుటకును — అయినా ప్రజానురంజనమే ప్రధానమైన యీ ప్రఖ్యాతకథలో అసత్యమైన యపవాదమును బట్టి పాతివ్రత్యమూర్తిని పరిత్యజించుటకంటె నీ వాగ్దానభంగ మెక్కువ యధర్మము కాదు. ఇది దాని కంగమే. పరిత్యాగమధర్మమని రాము డెఱుగును. తరువాత సీత యనుకొన్నది. జనకాదు లన్నారు. ఇక దీని విచారమేల?

ఇట్లు జనాపవాదమూలక సీతాపరిత్యాగమన్న నిర్జీవాంశ మొక్కటి గ్రహించి కవి తన ప్రతిభచే దర్శించిన యపూర్వమనోహరాంశముల నంగములుగా కూర్చి దానికి జీవకళ తెచ్చి దర్శనీయము గావించిన యిదిగదా జీవద్వర్ణనము! ఇక నీ కథాచమత్కృతియు కవితాచమత్కారమును సామాజిక హృదయమును తదాయత్తము గావించిన విధము చూతము.

ప్రథమాంకమందువలెనే ద్వితీయాంకమందును మూలకథాంశ మొక్కటే. అది శంబూకవధ. రాముని దండకాటవికి చేర్చుట మాత్రమే దానిపని. తరువాతి విషయము దాని కనుబంధము. ఈ చిన్న యంకములో సగము విష్కంభము. అందలి తాపసీ వన దేవతల సంభాషణమున చిత్రప్రదర్శనరంగములోనివే కాక యుత్త

కథాంశములు నెన్నో వెల్లడియగును. తరువాతిదంతా రామ శంబూక సంభాషణము — బ్రాహ్మణబాలుని యకాలమరణమునకు రాజదోషము కారణమని దానిని రాముడు తనయం దారోపించు కొనుచుండ, శంబూకుని ఘోరతప మందుకు కారణమని యశరీర వాణి పలికినది. మూలకథను బట్టి వినవచ్చిన యీ హేతు వాకాశ వాణి యాదేశమున రాముడు శంబూకుని వధించుటకు మూల మైనది గాని, సీతాపరిత్యాగరూపమైన తన మహాదోషమే కారణ మనుకొన్న రాముని భావమును సూచించుటకే కవి యతనిచే ముం దామాట యనిపించె ననవచ్చును. విధిలేక రాము డా పని చేసెనుగాని శంబూక వధ రాముని కిష్టము కాదని యతని మాటల వల్లనే ఇట్లు తెలియు చున్నది.

> "రామస్య గాత్రమసి ? దుర్భర గర్భ ఖిన్న
> సీతావివాసన పటోః కరుణా కుతస్తే ?"

—పూర్ణగర్భను వైదేహిని మోసపుచ్చి, వనికిం బంపించు, పాపిష్ఠ రాముని గాత్రంబవు గావొకో! దయయు మోమోటంబు నీ కున్నదే? —

శంబూకునికి దివ్యత్వ మబ్బినందుకు మొదట సంతోషించినవాడు రాముడే. అతని దయకును కడచిన పదునొకండు సంవత్సరములలోను విరహాగ్ని యతని హృదయమున రగులుచునే యున్నదనుటకు పై మాట యొకటియే చాలు. శంబూకుడు చూపగా నా యరణ్య ప్రదేశములన్నియు పరికించి తొల్లి యందు నివసించిన నాటి చర్యలు తలంచి పరితపించి శంబూకునికి సెలవిచ్చి పంపి, తిరిగివచ్చిన యతని వల్ల నగస్త్యుని యాదేశము విని, పంచవటి చూడకుండగా ముందమ్మౌని యాశ్రమమ్మున కేగెను. ఈ యిరువురి సంభాషణము తరువాతి పంచ వటీరంగమున కుపకరించినది.

అదే యీ యంకమునందలి సారాంశము. ఇక నిందలివర్ణన లందమూ, అసాధారణములు. అందొకటి రెండు— పాఠకుల కాహా పుట్టించిన యీ నాటకములోని వర్ణనలలో నీక్రింది సుజనశీలవర్ణన మొకటి :—

"ప్రియప్రాయావృత్తి
ర్వినయమధురో వాచి నియమః
ప్రకృత్యా కల్యాణీ
మతి రనవగీతః పరిచయః,
పురో వా పశ్చాద్వా
తదిదమ విపర్యాసితరసం
రహస్యం సాధూనా
మనుపధి విశుద్ధం విజయతే"

—సరసములైన మాట, లుప
చార వివేకము తోచు చేత, లా
దరణముతోడి యీవి, విను
తంబగు నెయ్యము ముందువెన్కలన్
దిరుగని సుస్వభావము, వి
ధేయత నిష్కపటంపువృత్తి సు
స్థిరమతి, ఔర! యీ సుజన
శీల రహస్య మెఱుంగ శక్యమే?"

పండితు లెందరో పఠించు నిందలి శ్లోకములలో, కాలవశమున మార్పు సహజమని బోధించు నీ శ్లోక మొకటి—

పురా యత్ర స్రోతః
పులిన మధునా తత్ర సరితాం,
విపర్యాసం యాతో
ఘనవిరళభావః క్షితిరుహాం,

బహోర్ద్రుష్టం కాలా
దపరమివ మన్యే వన మిదం
నివేశః శైలానాం
తదిద మితి బుద్ధిం ద్రఢయతి ”

- చూడగ దొంటి వెల్లువల
చోటులు మేటలు వేసె, నచ్చటం
బాడయి పల్చనయ్యె దరు
వాటిక, యిచ్చట జిక్క నయ్యె, నే
నాడిది చూచినాడనో? క
నంబడుచుండెను వేఱు కానగా
నేడిది, కాని యీ గిరులు
నిక్క మదే యిది యంచు దెల్పెడున్ -

ఈ కథకు పట్టిన కాలము పండ్రెండు వత్సరములు. పన్నెండవ యేట రాముడీ కానలకు వచ్చెను. సుమారు పన్నెండేళ్లక్రిందట రాముడు సీతతోకలసి యీకానల నివసించియున్నాడు. అందుచే గిరుల యునికి తప్ప దక్కిన నదీతరువాటి కాదుల యునికి మాఱినదని తలచుచున్నాడు.

ఈ మహాకవి పాత్రసృష్టి కూడా అపూర్వమే. ద్వితీయాంక విష్కంభపాత్రములు, తపస్వినీ వాసంతికలు. తృతీయాంకవిష్కంభ మందలివి, మురళా తమస లనెడి, నదీదేవతలు. ఇవి యుత్తమపాత్ర ములే యగుట, విష్కంభము మధ్యమపాత్రప్రయోజ్యము కావలెనన్న లక్షణ మిందు పట్టదు. ప్రస్తావనాలక్షణమునకు పట్టిన గతియే దీనికిని పట్టినది. మహాకవులకు లాక్షణికులు శాసకులా? —— సీతావిరహ దుఃఖితుడైన రాముని చూచిన లోపాముద్ర పంచవటీదర్శనమున నతని కేమి ప్రమాదము వాటిల్లునో యని శంకించి, జాగ్రత్తగా కనిపెట్టి చూడు మని గోదావరితో చెప్పుటకు మురళను పంపినది—— శంబూక

వృత్తాంతము విన్న జాహ్నవియు, నట్టి ప్రమాదమే యూహించి, కుశలవుల పన్నెండవ జన్మదినోత్సవము చేయునెపమున సీతను వెంట బెట్టుకొని గోదావరీతీరమునకు వచ్చి యామెకు తోడుగా నుండుమని తమసను నియోగించినది.

పంచవటీరంగమే తృతీయాంకము. ఇందలి పాత్రములు వాసంతీ రాములు, సీతా తమసలు. వారు వీరికి కనవత్తురు. వారిమాటలు విన వచ్చును. వీరు వారికి కానరారు. వీరిమాటలు వినరావు. వెనుక యిచ్చోట సీతారాము లేవస్తువులు చూచి యానందించిరో యిపుడు వాటినే చూచి విచారింతురు. అపు డేయనురాగము వీరిని సుఖమున నోలలాడించెనో యిపు డదే దుఃఖాబ్ధిని ముంచెను. ఇంతయేల ? ఈరంగము భవభూతి ప్రతిభకు పరమావధి. కరుణరసము పుట్టినిల్లు. రసాస్వాదనపారవశ్యమున సామాజకులను స్తంభింపజేయు నింద్ర జాలము. కావ్యానందకందము. సీతారాముల తొంటి క్రీడాగారము— ఇందలి వీరి మాటలను దుఃఖావస్థలను ప్రదర్శనరంగమున వినవలసినవి చూడవలసినవి గాని, నాలుగుమాటలతో వర్ణింపదగినవి కావు. రాముని మూర్ఛ నుండి తేర్చినప్పటి సీతమాటలకు నతనిమాటలకు కంట తడిపెట్టనివా రుండబోరు. వీరి హృదయావస్థలను వర్ణింప జ్ఞాన నేత్రమున సందర్శించిన యీ కవికే చెల్లినది. అతనివద్ద శిక్షనందిన తమసకు చెల్లినది. ఇందు కొక యుదాహరణము—— నిష్కారణముగా నన్ను విడిచిన నాప్రియు నీస్థితిలో చూచుచున్న నా హృదయావస్థ యెట్లున్నదో, ఏమి చెప్పుదునని సీత యనగా, 'అమ్మా ! నే నెఱుగుదు' ననుచు తమస యిట్లు విశదీకరించినది :

తటస్థం నైరాశ్యా
దపిచ కలుషం విప్రియవశా
ద్వియోగే దీర్ఘేఽస్మిన్
ఝడితి ఘటనా స్తంభిత మివ,

ప్రసన్నం సౌజన్యా
          ద్దయితకరుణై ర్గాఢకరుణం
ద్రవీభూతం ప్రేమ్ణా
          తవ హృదయ మస్మిన్ క్షణఇవ ''

ఎఱిగి యూరకయ న న్నెడబాపె నిత డెంత
          వంచనంబని కోపగించినట్లు,
నాయాస లడుగంటె నాకెందు కిక నంచు
          నాస్థ మాని తటస్థ మైనయట్లు,
ఘనవియోగమున నాకస్మికఘటనచే
          బరవశంబయి ప్రమానుపడినయట్లు,
సహజ సౌజన్య భాస్వరమాట బతిభక్తి
          నల్కదేఱి ప్రసన్న మైనయట్లు,

భర్త దుఃఖంబునకు దుఃఖపడిన యట్లు
ఘనతరం బగు ననురక్తి గరగినట్లు
పాలుపోకున్న యట్లుఁ నీ పట్టునందు
నీదు హృదయంబు గనవచ్చు నిర్మలాంగి!

బాహ్యావయవములను వన్నెలు చిన్నెలు పెట్టి బళీయనునట్లు వర్ణించిన కవులెందఱో కలరుగాని, అరటిపండొలిచి చేతిలో పెట్టినట్లు హృదయమును విప్పి చూపెట్టిన యింకొక కవి యేడి? ఒక్కక్షణములో హృదయ మెన్ని యవస్థల పాల్పడునో చెప్పి చూపగలవా డితడే యని పై పద్యము చాటుటలేదా?

ఈ ఘట్టమంతయు సీతను తలచుకొని రాముడు గొంతెత్తియేడ్చుట తోను రామునిచూచి సీత విలపించుటతోను సరిపడినది. ఎందుకింత దీర్ఘప్రసంగమందుమా, కరుణరసస్వరూపము గాఢముగా ప్రేక్షకుల హృదయముల హత్తుకొనుట, రాముని ధర్మపాలనమును అతని విరహ

బాధను మనసారస్మరించి సీత యతనిని శంకింపకుండుట, అను రెండును కావ్యపక్షమున హేతువులు — అవి యట్టివే 'నీకు కీర్తికదా యిష్టము. ఓయి కఠినుడా! ఇంతకంటె ఘోరాపకీర్తి వేఱుగా నుండునా' అని వాసంతి రాముని నిందించినపుడు సీత 'నీవే కఠినురాలవు క్రూరురాలవు. ఏడ్చుచున్న యార్యపుత్రు నింకా యేడ్పించుచున్నా' వనుటయే పై భావమును బలపఱచుచున్నది. అయోధ్యలో నున్నపుడు పైకి విలపింప వీలయినది కాదు, ఇపు డేడ్చుట లాభమే, యన్న, తమస మాటయు దానికి సహాయపడుచున్నది. దీనికంతకు నుదాహరణముగా రాముని యీమాట చాలును.

"న కిల భవతాం దేవ్యా స్థానం
గృహేఽభిమతం తతః
తృణమివ వనే శూన్యే త్యక్తా
నచాప్యనుశోచితా,
చిరపరిచితా స్తే తే భావా
స్తథా ద్రవయన్తి మా
మిద మశరణై రద్యాస్మాభిః
ప్రసీదత రుద్యతే"

జానకి యింటనుండుట య
సమ్మత మయ్యెను మీకు గావునన్,
గాన దృణంబుమాడ్కి విడ
నాడితి, మీ కప్పుడైన జాలి యిం
తేనియు బుట్టనే? మది
దహించెడి నప్పటి భావములో, దయా
హీనుడ దిక్కు లేక యిపు
డేడ్చెద, మీర లనుగ్రహింపుడీ!

పౌరజానపదుల చర్య నిట్లుపాలంభించిన రామునితో, గతించిన దానికి విచారమేల? ధైర్యము తెచ్చుకొనుమని వాసంతి యనగా, రాముడన్న యీమాట లోకెవరికి తెలియును! ఇందుచేతనే యీ యంకము దుఃఖాంకమైనది.

జానకీ శూన్యమైనట్టి జగతి కిపుడు
వఱలుచున్నది ద్వాదశవత్సరంబు,
ఆమె పేరును మాసి నట్లయ్యెగాని
బ్రతికియున్నాడు పాపి యీ రాఘవుండు.

ఇట్లు విలపించు రాముని దృష్టి మరల్చుటకు, అవి చూడు మివి చూడు మనుచు, నొక పొదరిల్లు చూపి వాసంతి యన్నమాట లివి:—

"అస్మిన్నేవ లతాగృహేత్వ మభవ
స్తన్మార్గదత్తేక్షణః,
సా హంసైః కృతకౌతుకా చిరమభూ
ద్గోదావరీసైకతే,
ఆయాన్త్యా పరిదుర్మనాయితమివ
త్వాం వీక్ష్య బద్ధ స్తయా
కాతర్యా దరవిందకుట్మలనిభో
ముగ్ధః ప్రణామాంజలిః"

"ఈ పొదరింట నుంటివి మ
హీసుత వచ్చెడి త్రోవ చూచు చీ,
వాపెయు గౌతమీపులిన
మందలి హంసల జూచిచూచి, రా
నోపక, వచ్చి కోపపడు
చున్నటులుండిన నిన్ను జూచి, నీ
కోపము దీర్పగా జలజ
కోశనిభాంజలి యెత్తి మ్రొక్కదే?"

ఏ చిత్రకారుడేని చిత్రింపవలసిన మనోజ్ఞ భావమిది. ఒక గంట కూడా రాముడు సీతను విడిచియుండజాలనివాడన్న యాంతరికతత్త్వ మిందు నిరూపింపబడినది. "హృదయ మర్మంబుల నాటుకొనియున్న మనశ్శల్యమును కదల్చు వృత్తాంతము స్మృతికి తెచ్చితివా? ఎంత కఠినురాలవే!" యన్న సీతమాట దానిని బలపఱుచుచున్నది. "ఇటునటు గనబడుచున్నావుగాని, అనుగ్రహింపకున్నావు" అని రాముడు విలపించుట దానిని ధ్రువపఱచుచున్నది. ఈ యంకమంతయు నుల్లము నూటాడించు నిట్టి రచనతో నిండియున్నదనుట చెప్పదగిన విశేషము. ఇందు రామునికి వినబడని సీత మాటలకును, సీతకు వినుపించు రాముని మాటలకును సందర్భైక్యము కలిగించి రచన సాగించిన కవిచాతురి వర్ణనాతీతము. ఈమాట మన మనుకో నేల? "ఆహా! కథానిర్మాణ మెంత యాశ్చర్యముగా నున్నది?" అని తమసయే యన్నది. ఆమెచేతనే కవి యీ క్రింది మాటలు పలికించినాడు.

> "ఏకో రసః కరుణ ఏవ నిమిత్తభేదా
> ద్భిన్నః పృథక్పృథగివాశ్రయతే వివర్తాన్
> ఆవర్తబుద్బుద తరంగమయాన్ వికారా
> నంభోయథా సలిలమేవ హి తత్సమస్తమ్"

> కరుణారస మొక్కటే వేఱు కారణముల
> వేఱు వేఱు విధంబుల మాఱుచుండు
> సలిల మొక్కటె బిందు తుషారభంగ
> బుద్బుదావర్తరూపముల్ పొందునట్లు.

ఈ రంగములో కరుణారసము పొంగిపొరలినదని కవియేయనుకొన్నా డనుట కీమాట చాలు. "సీత నే పులియో మ్రింగిన దనుట నిజ" మని వాసంతితో ననుచు గొంతెత్తి యేడ్చిన రాముని చూచి, ఇప్పటి కిది నైజమేయని సమర్థించిన తమసమాట లింతకంటెను చాలును.

"పూరోత్పీడే తటాకస్య పరీవాహః ప్రతిక్రియా,
శోకక్షోభే చ హృదయం ప్రలాపై రేవధార్యతే"
"గట్లు తెగదాసి సలిలంబు కలచునపుడు
చెఱువు రక్షింప గతి తూము తెఱచు టొకటె
ఘనవిషాదంబు హృదయంబు గలచునపుడు
దాని రక్షింప నేడుపే తగిన చర్య"

సీతకు కుశలవులు జన్మించిరన్న మాట రామునికిప్పటికి తెలియదు. ఆమె జీవించి యున్నదన్న విశ్వాస మతనికి లేదు. కాని జాహ్నవీదేవి పంచవటిలో సిద్ధపఱచిన సీతమాత్రము, తాను మృతిచెందినట్లు నిశ్చయించుకొని విలపించు రాముని మాటలు విని "హా! ఆర్యపుత్రా! బ్రతికి యున్నాను. ఇక్కడే యున్నా" నను. ఈ నాటకము శుభాంతమా, విషాదాంతమా యని కట్టకడపట పరామర్శించునపుడీ విషయము పరిశీలింతము. ఇప్పటికి చదివినదానిని బట్టి, రాముని చిత్తవృత్తి యెట్టిదందుమా, వెనుక వాసంతి యన్నదే తగిన సమాధానము, అది.

"వజ్రాదపి కఠోరాణి మృదూని కుసుమాదపి
లోకోత్తరాణాం చేతాంసి కోహి విజ్ఞాతుమర్హతి?"
వజ్రమున కంటె గట్టివి, పట్టిచూడ
నరులకంటెను మెత్తని వైన యట్టి,
ధీర గంభీర సుస్థిరోదార వీర
పురుషహృదయంబు నెఱుగ నెవ్వారి తరంబు?

ఋష్యశృంగాశ్రమమం దున్న అరుంధతీ వసిష్ఠ కౌసల్యాదులు కోడలులేని యయోధ్యకు వెళ్ళలేక వాల్మీకియాశ్రమమునకు వచ్చిరి.

కూతురి కష్టమునకు సంతప్తుడైన రాజర్షి జనకుడు మిథిల విడిచి యడవుల సంచరించుచు నచ్చోటికే వచ్చెను. అరుంధతీ కౌసల్యా జనకులును, ఆటలాడుకొనవచ్చిన లవుడును రంగస్థలమున గనవత్తురు. నాలవ యంకములోని ముఖ్యపాత్రము లివే—

వాల్మీకిరామాయణ మన్న భవభూతికి ప్రాణము. రెండవ యంకమునం దది నూతనవేద మని తన్నిర్మాణకథ చెప్పించి మరలనిచ్చట దానిని లవునిచే ప్రశంసింపజేసి, అంతర్నాటక సూచనగా నందలి యొక భాగమును మహర్షి దృశ్యకావ్యముగా రచియించె నని పలికించెను. వృత్తవర్తిష్యమాణ కథాంశముల కైక్యము కలిగించు నీరంగము కేవలము కల్పితము. ఇందెక్కువగా పోషింపబడినది కరుణమే. ముందుగా సామాజికుల చెవిని బడిన జనకుని మాటలు కంటనీరు పెట్టించు ననుట యత్యుక్తి కాదు. పసిపిల్లగానున్న కూతురి మొగము తలచుకొని వగచు నతని మాటలివి:–అనియత రుదితస్మితం—ఇత్యాది,

> కలకల నవ్వు చొక్కపరి
>     కావున నేడ్చుచు నొక్కసారి, యిం
> పులు దులకించు కొన్న పలు
>     మొగ్గలకాంతులు పర్వ, ముద్దుగన్
> తెలియని పల్కులన్ బలుక
>     నేర్చిన నీపసిపిన్న నాటి కో
> మల వదనారవింద మిదె
>     మానసదర్పణ గోచరం బగున్"

అడవిపాలయిన జానకియవస్థ నూహించుకొని యన్న దుఃఖవచనము లివి :—

> "నూనం త్వయా పరిభవంచ వనంచ ఘోరం
> తాంచ వ్యథాం ప్రసవకాలకృతా మవాప్య,
> క్రవ్యాద్గణేషు పరితః పరివారయత్సు
> సంత్రస్తయా శరణమిత్య సకృత్స్మృతోఽహమ్"

అనుచితనింద భర్తవిడ
　　నాడినయట్టి పరాభవంబు కా
నవగతి కాన్పువేదన య
　　నన్యసహాయత దుఃఖవార్థి ముం
చినతఱి దుష్టజంతువులు
　　చేరినయప్పుడు, భీతిజెంది, నా
యన! యని యెన్నిసార్లు హృద
　　యంబున నన్ను, దలంచితో కదా!

"నావంశములోని పిల్ల కగ్నిశుద్ధి యేమిటమ్మా! రామభద్రుడు చేసిన యీ పరాభవమునకే తలవంచుకొనియుండ నరల మాకు లోకాపవాదమా?"

అని జనకుడు కోపముతో ననగా "నిజము నిజము. అగ్నిశబ్దము సీతాశబ్దముతో సరితూగజాలదు. సీతయంటే చాలును" అనిపలికి అరుంధతి సీతను స్మరించి, నీవు చిన్నపిల్లవైనా, శిష్యురాలవైనా, నీ పవిత్రతకు నాకు నీమీద భక్తిని నెలకొల్పిననదనుట జనకుని దుఃఖ ముపశమింప జేయుటకును ప్రవాదము పరిహరించుటకు నుపయుక్త మైనది. ఈసందర్భములోని యీ క్రిందివాక్యము విద్వల్లోకవిశ్రుతము—

"గుణాఃపూజాస్థానంగుణిషు నచ లింగం నచ వయః"

లవుని చూచి 'వీడు చిన్నతనమునాటి రామచంద్రునివలె నున్నా' డని కౌసల్యయు, "వీని ముఖములో కూతురిపోలిక కనవచ్చుచున్న" దని జనకుడును, తమలో భావించుట యెంతనైజమో, ఆముచ్చురి సంభాషణము నంత సహజమై ప్రేక్షకులను రంజింపజేయునట్లున్నది. జన కుని కున్నంత దుఃఖము కౌసల్యాదులకు లేదని యెవరందురు? అయితే ఏమి చేయుదురు? కడుపు చింపుకొంటే కాలిమీద పడునుగదా!— విధి లేక దిగ్భ్రమింగుచు నడవిలో తలదాచుకొనుచున్నారు. స్త్రీలట్లు నోరు మూసుకొని కాలము గడపుచుండ, జనకుడు క్రోధావేశపరవశుడై

రాముని పౌరజానపదులను శపింప బూనుట సముచితమా? ప్రజారంజనము రాజధర్మమని యెఱుగడా? అని, పాత్రౌచిత్యశంక యిచ్చట కలుగవచ్చును. ఎంతటి వివేకియైనా, తండ్రి ప్రాణము. వచ్చినకష్టమా, నిర్హేతుకము. లోకములో నే తల్లిదండ్రులు నిట్టి ఘోరవిపత్తు సహింపలేరని తెలుపుటకే కవి యీపాత్రము నిట్లు దిద్దుకొనుటయే సమాధానము. ఈపట్టున మఱియొక కవియైతే రామపక్షమున వాదించుటకు వసిష్ఠుని పిలుచుకొనివచ్చి వాక్కలహము కల్పించునేమో కాని, ఔచిత్యాభిజ్ఞుడైన యీకవి యట్లుచేయక జగత్పూజ్యురాలైన యరుంధతి మాటలచే నతని కోపమును చల్లార్చెను ఆసమయమందు లవుడన్న యీ మాట యెంత సందర్భోచితమో చూడుడు.

కౌసల్య:— తల్లీ భగవతీ రక్షించు, కోపించు రాజర్షిని ప్రసన్నుని గావించు.

లవుడు:— 'అతిపరాభూతులైన మహర్షివరుల కోప ముడిగింప బ్రతిమాలు కొనుటె మందు.'

తరువాతకథకు సూచకమైన యిందలి మేధ్యాశ్వ ప్రసంగము పరుల తేజంబు నోర్వని లవుని స్వభావము నావిష్కరించుచు, పంచమాంకము నాహ్వానించు చున్నది.

పంచమాంకము నాక్రమించినదికూడా కరుణమే కాని, వీర మొకింత కలసినది. ఆదిలోనే సైనికులను బాణపరంపరతో తఱుము చున్న లవుని చూచి చంద్రకేతు వాశ్చర్యపడును. సారథి సుమంత్రుడు చూచి చిన్ననాడు కౌశికుని జన్నము రక్షించిననాటి శ్రీరాముని తలచు కొనును. వెనుకకు వోయిన భటులు మరల వచ్చుట చూచి—

"నా క్షుధాగ్నికిన్..."

వెనుకకుఁ బోయి హేలమెయి

వెండియు నాఁగుచు వచ్చు మీఁదు వా

హిని యొక ముద్దయయ్యెడు స
హింపను హేళన రండు రండికన్.

అనుచు లవు డనగా — చంద్రకేతు వి ట్లనెను—

"రమ్ము రమ్ము నీ ..."
జత యనవీ బలంబు నిక
మంబన నే నిదె చంద్రకేతుడన్"

ఆ సమయమున లవుని పరాక్రమమున కచ్చెరు వందుచున్న సారథి వీరిరువురి ద్వంద్వయుద్ధ మెట్లంగీకరింతు నని యనుమానించుటయు, జృంభకాస్త్రము ప్రయోగించి సేనల నణగించిన లవుని మహత్త్వము కనుగొని తదస్త్రసంప్రదాయ మూహించుటయు, సాకూతములు. లవశౌర్యద్యోతకములు.

పిదప వీరకుమారు లిరువురు పరస్పర స్నేహానురాగముతో చూచుకొని తమలో ననుకొన్న మాటలును, వారిచేష్ట లాలోకించిన సుమంత్రుని మాటలును మన స్తత్త్వవేత్తయగు భవభూతి పరేంగిత జ్ఞానమునకు జ్ఞాపకములు. కవి కావశ్యకమైన దర్శనమున కీ ప్రసంగము మఱియొక నిదర్శనము. కుమారుల మాట —

"యదృచ్ఛాసంవాదః కిము గుణగణానా మతిశయః ?
పురాణోవా జన్మాంతరనిబిడబద్ధః పరిచయః ?
నిజోవా సంబంధః కిము విధివశాత్కో౽ప్యవిదితో ?
మమైతస్మిన్ దృష్టే హృదయ మవధానం రచయితి."

"సమయవిశేషమో ? నియతి
సంగత సద్గుణతా విశేషమో ?
అమలిన పూర్వ జన్మ సము
దంచిత మైత్రి విశేషమో ? యవే

ద్యమయిన దేహబాంధవ మ
హాత్త్వమొ! యీతని జూచినంత జి
త్తము కడు సావధానమయి
తత్పరమయ్యె నిదేమి చిత్రమో?"

అపుడు సుమంత్రుడు, తారామైత్రి యనియు చక్షూరాగ మనియు వ్యవహరింపబడు నిష్కపట ప్రేమ యొకానొకరి కొకా నొకరిపై గలుగుట ప్రాణి స్వభావము. అని తలచి లవుని చూచి కన్నీరు గార్చుచు ననుకొన్న మాట యిది—

"మనోరథస్య యద్బీజం తద్దైవే నాదితో హృతం,
లతాయాం పూర్వలూనాయాం ప్రసవ స్యోద్భవః
[ కుతః ?"

"నీదు మొలకెత్తు నభిలాష కాదియైన
బీజమును ముందటే దుష్టవిధి హరించె,
హృదయమా! ఎక్కడైనను మొదలుకోసి
నట్టి తీగను మొగ్గలు పుట్టునొక్కొ ?"

ఇందు, వీర బాలుర రక్తసంబంధ మవేద్యమైనా అది పరస్పర వీక్షణమున సహజప్రేమ స్ఫోరకమయినట్లు వర్ణించుటయు, అడవిలో విడిచి నపుడే సీత మృతిచెందిన దన్న తలంపుతో నిరాశపడుచున్న ట్లున్నా, సుమంత్రుని మదిలో లవుడు సీతకొడుకు కాడా యన్న యను మానము స్ఫురింపజేయుటయు, కవితోత్కర్ష నావిష్కరించుచున్నవి. ఈ ప్రకరణమందలి వీరి ముగ్వురి మాటలు మానసాకర్షకములు; రసపోషకములు. తరువాతి ప్రసంగములో 'మా పెదనాయనగారి ప్రతాపమునుగూడా సహింపవా ?' అని చంద్రకేతు వన్నపుడు "అది వేఱుమాట. క్షత్రియధర్మ మొకనియందే మూర్తీభవించి యున్నదా!" అని లవు డనుట క్షాత్రమున కుచితమే గాని, "పరశురాము నోర్చిన యా మహావీరుని నీ వెఱుగవు. అయనయెడ రూక్షవాదము

చేయకు"మని, సుమంత్రు డన్నపుడును "ఆ రఘువీరుని మహిమ గణింపని యిత డెంతటి నాయకోత్తముడో" అని చంద్రకేతువన్నపుడును, లవుడీ క్రిందివిధముగా నన్న మాట లించుక విచారణీయములే.

"బ్రాహ్మణులకును వాక్కున, బాహుజులకు
బాహువుల నుండు వీర్య, మీ పలుకు నిజము,
శస్త్రధరుడైన విప్రునా జామదగ్న్యు
గెల్చు టొక గొప్ప యౌనె మీ క్షితివరునకు ?"

"ఆ రఘునాథుని చరిత్రగాని మహిమగాని యెవ్వరెఱుగరు ? చెప్పదగిన విశేష మేదేని కలదా; చెప్పవా లేదా, ఊరకుండి వినుము-అది :—

"వృద్ధాస్తే న్యావిచారిణీయచరితా స్తిష్ఠంతు" ఇత్యాది-

"వారలు పెద్ద లా చరిత
వర్ణన కూడదు - సుందుసుందరిన్
బోర వధించి పేర్చిన య
మోఘయశస్కులు, వారి నుండనీ !
వీరు ఖరున్ వధించునెడ
వెన్కకుఁ బోయిన పోక, వాలిపై
సారశరంబు వేయు ఘన
చాతురియున్ జగతీ ప్రసిద్ధమే"

ఇవి, యా రథికసారథులకు కాదు, సామాజికులకు కూడా గర్వోక్తులుగాను, ఎత్తిపొడుపుమాటలుగాను ధిక్కారముతోడి కఠినవచనములుగాను తోచకపోవు. యాగీయాశ్వమును బంధించుటచే పోరెట్లయిన సిద్ధమే. లవుఁడు సంధికి వచ్చి గుఱ్ఱమును విడుచుట యబద్ధమే. అయినా వెంటనే యా బాలు రిద్దరు యుద్ధమునకు దిగుటకు పై మాటలు త్వరపెట్టినమాట నిజం. ఇంక :—

లవుడు శ్రీరాముని మహిమ విననివాడా కాడు. ఇపు డతడు వర్ణించిన దతని మహిమయేనా ? కాదు. అయితే, లోకోత్తరపురుషు

డని యెఱిగియు నిట్లు సోల్లుంఠనముగా తిరస్కారభావము చూపుట యీ పాత్రమున కుచితమా? — దీని కంతకును మూలము నాల్గవ యంకము కడపట నశ్వరక్షకులన్న యీ క్రింది మాట :—

"యోఽయ మశ్వః పతా కేయ మథవా వీరఘోషణా,
సప్తలోకైక వీరస్య దశకంఠ కులద్విషః
ఈ తురంగంబు సప్తలోకైకవీరు
డయిన దశకంఠ శత్రుని జయపతాక,
కాని-చో నెల్ల రాజలోకంబునకును,
వీరఘోషణ యగు నిదే వినుడు వినుడు."

ఈమాట విని, సగర్వముగా లవు డపుడు "భూతల మరాజకమా యేమి" అనుచు, గుఱ్ఱమును కట్టివేయుడని వటువుల కాజ్ఞాపించెను. అపు డొక భటుండు 'ఛీ చపలా! ఏ మన్నావు?' అనుచు బెదరింప జొచ్చెను. ఆ వీరఘోషణా ప్రసంగము మనస్సును కలచుచుండుటచే వీరౌద్ధత్యముతోప నిట్లు పలికెనని మనము సమర్థింపజూచినా, పై మాటలయం దనౌచిత్యము స్ఫురింపకపోదు. అందుచే లవుని బాల్య చాపల్య మిందుకు కారణమనుట యుక్తము. ఈ యభిప్రాయమును షష్ఠాంకమందు లవుని మాటలే యిట్లు స్పష్టపఱిచినవి. రాముని చూచినంతనే ముందుగా లవుడన్నదియు, దానిపై రాముడన్నదియు నివి :—

"మృష్యతా మిదానీం లవస్య బాలిశతాం తాతపాదాః. అశ్వాను యాత్రికేభ్య స్తాతప్రతాపావిష్కరణ ముపశ్రుత్య వీరాయిత మనేన — నన్వయ మలఙ్కారః క్షత్రియస్య—

ముం దట్లు సమర్థింపదలచియే కవి యిచ్చట నీ పాత్రముచే వీర ప్రతాపోచితముగా కథోచితముగా నిట్లనిపించె ననుట స్పష్టము. ఇక :—

లవచంద్రకేతువులు దివ్యాస్త్ర యుద్ధ మొనరించుచుందురు. శంబూకవధ యొనరించి తిరిగి వచ్చుచున్న శ్రీరాము డా సంగ్రా

మము చూచి శాంతింపు డని కేక వేసి వారినడుమ పుష్పకమునుండి దిగును. ఈ ముగ్గురి సమావేశముతో షష్ఠాంక మారంభ మగును. లవుని చూచుట తడవుగా "అతడు లోకము రక్షింప నవతరించిన యస్త్రవేదమా, మూర్తీభవించిన క్షాత్రమా, సద్గుణగణమా, జగత్పుణ్య నిర్మాణరాశియా? ఇతనిని చూచినంతనే నాయంతరాత్మ దుఃఖము విడిచి స్నేహాభరిత మయినదేమో!" అనుచు రాముడు లవమయహృదయుడై తర్కించుకొనుటయు, అతడు కంటపడినంతనే లవుడు "ఆహా మహానుభావుని దర్శనము!

అంచితధ్యానమునకు నాహ్లాదపదము
పావనై కాంత భక్తికి పట్టుగొమ్మ

మహనీయులందు విలసద్గంగాది తీర్థములందువలె మహిమంబొకండు సహజంబై యుండు — ననుచు, పరమానందమున నతని మనసున భావించుటయు, అప్పట్టున సహజములు, కథాపక్షమున సాకూతములు. ఈ సందర్భమున, కుశలవుల జృంభకాస్త్రలాభము విని దాని సాంప్రదాయమును స్మరించియు, వారి పుణ్యమహిమ యనుకొన్నాడు గాని, తా నిచ్చిన యభ్యనుజ్ఞను స్మరింపలేదు. సీత యపుడే పోయినదని నమ్ముచున్న యతని కపుడు, లవుడు సీతకొడుకన్న యనుమానమేని యుదయింపకపోవుటయే కారణము. అది కవీంద్రుని కథాప్రవర్తనకౌశలము —

అంతలో, లవచంద్రకేతువుల యుద్ధము విని కోపధైర్యములతో విల్లు మ్రోగించుచు వచ్చు కుశుని చూచి రాము డాశ్చర్యానంద పరవశు డగుటయు, తమ్మునివలన రఘుకుల నాయకుడైన శ్రీరాము డిక్కడ నున్నాడని విని యతడు సవినయముగ సమీపించుచు నతని చూచి, ఆహా!

"అహో ప్రాసాదికం రూపమనుభావశ్చ పావనః,
స్థానే రామాయణకవి ర్దేవీం వాచ మవీవృధత్.

ఏమి యనుభావ! మేమి రూ పేమి మహిమ
అహహా! రామాయణ కవీంద్రుఁ డనఘుఁ డైన
యర్హ్వానాయకు సమకూర్చి యర్హ్వ దివ్య
ఫణితి వాగ్దేవి నుపయోగపఱిచెఁ గాదె!"

తాతా, ప్రాచేతసాంతేవాసి యగు కుశుఁడు నమస్కరించు చున్నా డనుటయు, నెంత పాత్రోచితములోఁ ఎంత భావగంభీర ములో! చెప్పెడి దేమి? తరువాత వీరు ముప్వురు నొక చెట్టునీడ నుపవసింతురు. పిల్లలిద్దఱు తన కుమారు లను భావమును క్రమ క్రమ ముగా సహేతుకముగా రాముడు నిరూపించుకొనుచుండును. ఇది యద్భుతమైన సమావేశము.

భవభూతి మంచి మంత్రకాడు. భార్య చనిపోయిన దనుకొను భర్తను, భర్తను చూడరాని భార్యను పంచవటీ రంగమున కలిపి యద్భుతముగా మాటలాడించి యిద్దఱి నేడ్పించిన ధీరుడు. ఆ చతు రత యీ వనరంగమునందు తండ్రి యనుకోని కొడుకులను, కొడుకు లనుకొనుచున్న తండ్రిని కలిపి మాటలాడించి, తండ్రిని మాత్రమే యేడ్పించినది. ఇందలి పాత్రపోషణము, వర్ణన నైపుణి యన నిదే యని చాటుచు ప్రేక్షకులను తన్మయులను గావించుచున్న నాశ్చర్య మేమి? చిత్రప్రదర్శనమందును ప్రథమాంకమందును ప్రసక్తికి వచ్చిన యంశము లెన్నో యిపుడు రాముడు స్మరించును. ఆ సతీ పతుల యాంతర్యము, వారి రహస్య చర్య లెన్నో యిపుడు బయట పడును. ఈ ఘట్టమును విశదీకరింప బూనితినేని గ్రంథవిస్తర మగును గావున నుదాహరణకు రెండు మాటలు వినిపించెద.

తర్కించి తర్కించి, కుశలవులు తన పుత్రు లగుదురని మనస్సులో ననుకొనుచు, వీరి నడుగుదునా యని రాముడు కంట నీరు వెట్ట 'అయ్యో! దుఃఖించుచున్నారే' మని లవు డడుగును. అదేమి మాటరా తమ్ముడూ! అని కుశు డిట్లు మందలించును:

"వినా సీతాదేవ్యాః కిమివ నచ దుఃఖం రఘుపతేః
ప్రియానాశే కృత్స్నం కిల జగదరణ్యంహి భవతి,
సచ స్నేహస్తావా నయమపి వియోగో నిరవధిః
కిమేవం త్వం పృచ్ఛస్య నధిగత రామాయణ ఇవ.

ఆయెను సీతలేని బ్రతు
కక్కట దుఃఖమురాదె తేనికిన్ ?
ప్రేయసి పోయినన్ జగము
పెద్ద యరణ్యము, వారి ప్రేమ మ
జ్ఞేయ, మపార మీ విరహ
సింధువు, దీని నెఱుంగ వోక్కొ? రా
మాయణ మెన్నడున్ జదువ
నట్టులు ప్రశ్నలు వేయఁజూతువే ?"

దీనితో తన యూహ తలక్రిందు కాగా, ఆ యాలోచనము విడిచి రాముడు, నాయనా ! రామాయణములోని శ్లోకము విన గుతూహల పడుచున్నా ననెను. కుశు డీ క్రిందిశ్లోకము చదివెను.

"ప్రియాతు సీతా రామస్య దారాః పితృకృతా ఇతి,
గుణై రూపగుణైశ్చాపి ప్రీతి ర్భూయోఽభ్యవర్ధత"

ఇది విన్న నాయకుని హృదయ మేమేమి స్మరించెనో ! ఎంత పరితపించెనో !! వానికే తెలియును. లవుడు చదివిన,

"త్వదర్థ మివ విన్యస్తః శిలాపట్టోఽయ మగ్రతః"

అను శ్లోకము విని రాముడు లజ్జించి దుఃఖించుటయు నట్టిదే. అంత, తన రాకవిని తన్ను చూడ నరుంధతీ వసిష్ఠ జనక కౌసల్యాదులు వచ్చుచున్నారని విన్న రాముని హృదయావేగ మందుమా, ఊహాతీతము.

సీతను విడిచినదిమొదలుగా నీ ద్వాదశవత్సరములలోను రాముడు దుఃఖమూర్తియై జీవముతో నున్నాడనుట కతని యీ మాట యొక్కటి చాలును :—

"ఏీ, డెక్కడి పాపజీవుడో కో
యిప్పటికైన నశింప డక్కటా!"

ఇంక, సకలవిషయనిర్ధారణమున కవతరించిన సప్తమాంకము చూతము. ఈ మహాకవి యద్భుత సృష్టిలో నద్భుతమైన యిదే అంతర్నాటకము. ఇందలి కథాసంవిధాన మంతకంటె నద్భుతము.

ఈ యంతర్నాటకము నిర్మించినవారు వాల్మీకిమహర్షి గారు. దీని నభినయించువా రప్సరసలు. గంగాతీరము రంగస్థలము. సామాజికులు, దేవాసుర దేవయోని విశేషులు, జంగమస్థావరములు, సకల పౌర జానపదులు, కుశలవ చంద్రకేతువులు, అరుంధతీ వసిష్ఠాదులు, రామ లక్ష్మణులు. వాల్మీకి పిలిపింపగా వచ్చిన శ్రీరాముడు సభాసన్ని వేశము గావింపు మని తమ్ముని నియోగించెను. అత డట్లు సిద్ధము చేసెను. ఇంక :—

ముందుగా రంగస్థలము జొచ్చి సూత్రధారుడు :

"మేము యోగదృష్టితో చూచి కరుణాద్భుతరసమిశ్రము పావనము నైన చిన్న రూపకము నిర్మించినాము. గౌరవబుద్ధితో దీనిని సావధానముగా తిలకింపుడు." అని వాల్మీకిమహర్షి గారు సకల సామాజికుల కానతిచ్చుచున్నారని చెప్పి, రాముని యానతిని లక్ష్మణు డడవిలో విడిచిపెట్టిన సీత దిక్కులేక ప్రసవవేదన భరింప లేక గంగలో పడుచున్నదని కథ సూచించి వెళ్లును — ఇది ఏకపాత్ర ప్రయుక్త ప్రస్తావన. ఇది ప్రథమాంక కథకు తరువాతి విషయము. పండ్రెండు సంవత్సరముల క్రిందటిది.

ఇక నాటకప్రయోగమున తెలియవచ్చిన ముఖ్య విషయము :—

సీత నీటిలో పిల్లలను గన్నది. గంగా వసుంధరలు వారిని గట్టుకు చేర్చిరి. అమ్మా నేనీ యవమానము సహింపలేను, నీలో లయము గావించుమని సీత యనును. పిల్లలు పాలువిడిచినపిదప నీ కోరిక నెఱ

వేర్తు నని భూదేవి యనును. ఆ పాత్రములు నిష్క్రమించును. తరువాత,

ఆ మాటలు విన్న రాముడు నిజము తెలిసికొని, హా సచ్చరిత్ర దేవతా! దీనినిబట్టి నీవు లోకాంతరమున విశ్రమించియున్నా వనుట నిశ్చయము. హా దేవీ! అని మూర్ఛిల్లును. అనంతరము వాల్మీకి యన్నట్లుగా, అద్భుతముగా సముద్రమునుండి లక్ష్మి పైకి వచ్చి నట్లు సీతాదేవి గంగలోనుండి పైకి వచ్చును. గంగావసుంధర లామెను తీసికొనివచ్చి యరుంధతి కర్పింతురు. ఆమె లోకమునకు సత్యవృత్తము వినిపించి రాముని కర్పించును. పుష్పవృష్టి కురియును.

ఇందు వాల్మీకి ప్రతిజ్ఞను బట్టియు సీతా గంగా వసుంధరా పాత్ర ముల మాటలను బట్టియు, కుశలవులను గన్న పిదప సీత భూమిలో లయమైనదన్న రాముని యభిప్రాయము నిజమని విదితమగును. ఇకనో, ఉత్తరకాండ వాల్మీకి నిర్మితము కాకపోయినను (కాదని నా సంస్కృతకవి జీవితమున నిరూపించితిని...) పౌరాణిక సంప్రదాయ మును బట్టియు, ఉత్తరకాండను బట్టియు, కుశలవులను వాల్మీకి పెంచె నన్న విషయము కవి తెలిపెను గాని, వారిని కన్నపిదప సీత జీవించి యున్నదన్న విశ్వాస మతనికిని లేదు. అందుకు తగినట్లె యీ యంతర్నాటకము నిర్మించెను. అయినా నాటకము శుభాంతము గావించు నుద్దేశముతో పై విధముగా సీత నర్పింపజేసెను. ఇది కారణ ముగా నీ నాటకమందలి ప్రధానరసము విప్రలంభశృంగార మనియు సకరుణ విప్రలంభ మనియు, కొందరూహించిరి గాని, కవిమతమున కరుణమే ప్రధానమనుట స్పష్టము. కవి యీ రూపకమును శుభాం తము చేసిన సందర్భము కూడా యందుకే తోడ్పడుచున్నదని పాఠకు లూహించియే యుందురు.

ఈ మహాకవి వీరప్రధానముగా మహావీరచరిత్రను శృంగార ప్రధానముగా మాలతీ మాధవమును నిర్మించెను. ఆ రెంటికి కూడా

దేశమున వ్యాప్తి లేకపోలేదు గాని, యితని కెక్కువ కీర్తి ప్రతిష్ఠలు తెచ్చిన నాటక మిదే యనవచ్చును. భాషలో కరుణరసకావ్యము లెన్నో యున్నవి గాని, దృశ్యకావ్య దృష్టితో చూచువారికి దీనిని మించిన దింకొకటి లేదని తోచక పోదు. ఒక్క పొల్లుమాట లేకుండ నక్కఱలేని పాత్ర యొక్కటియు రాకుండ నొక నిమిషమేని వ్యర్థము కాకుండ :—

"వీనుల విందు కన్నుగవ
వేడుక నాలుక తీపియై కథా
ధీనముగాగ బుద్ధి రస
దీప్తముగాఁగ మనంబు మేను భా
వానుగతంబుగాఁగఁ గరి
నాత్మ్కనికైన ముదంబు సీతి వి
జ్ఞాన మొసంగు కావ్యము ని
జంబుగ రూపక మెంచి చూడఁగన్."

అను లక్షణమున కనుగుణమై సర్వాంగసుందరమై చిరస్థాయి యగు దీనిని మనము వినుతించుట లెక్క కాదు. ఇతని సహవాసి యగు వాక్పతిరాజే యిట్లు నుతించినాడు :—

"భవభూతి జలధినిర్గతకావ్యామృతరసకణా ఇవస్ఫురన్తి,
యస్య విశేషా అద్యాపి వికటేషు కథానివేశేషు"

ఈ కవీంద్రునికి రామాయణమువలెను కరుణరసమువలెను గాక, మిక్కిలి ప్రియములైన పదార్థములు మఱికొన్ని కలవు. వానిలో మొదటిది గోదావరి. తత్తీరమున జన్మించి తత్పరిసరారణ్యముల విహరించినవాడగుట యందుకు కారణము. అట్లే వనప్రదేశము లలో పంచవటి, గిరులలో ప్రస్రవణాద్రి, మృగములలో ఏనుగు, లేడి, పక్షులలో నెమలి, చెట్లలో కడిమిచెట్టు, అత్యంతప్రియములు.

వృత్తములలో శిఖరిణి యితని కభీష్టమని క్షేమేంద్రుని మాటవల్లనే విదితము :—

" భవభూతే శ్శిఖరిణీ నిరర్గళ తరంగిణీ,
చకితా ఘనసందర్భే యా మయూరీవ నృత్యతి "

దీనినంతను బట్టి యితడు ప్రకృతి నుపాసించిన పావనశీలు డని స్పష్టమగును. వేదవేదాంతసాంఖ్య మీమాంసాదులు పఠించిన యీ వశ్యవాణి శుద్ధాద్వైతు డని యీ కృతిలోని యీ మాటయే చాటుచున్నది.

" విద్యాకల్పేన మరుతా మేఘానాం భూయసా మపి,
బ్రహ్మణీవ వివర్తానాం క్వాపి విప్రలయః కృతః "

దాంపత్య మద్వైత మనుచు వర్ణించుట కూడా యితని మతమునకు జ్ఞాపకమే. ఇంక గ్రంథము పెంచనేల ?

" యం బ్రహ్మాణ మియం దేవీ వాగ్వశ్యే వాన్వవర్తత,
ఉత్తరం రామచరితం తత్ప్రణీతమ్... —

(దీనికి పాఠాంతర ముండుగాక) అను నితని ప్రస్తావనావాక్యము నితని యాత్మస్తుతిపరత్వమున కారోపింపక, వాస్తవమైన యితని వాణీ ప్రియత్వమునకే యారోపింతము. చెప్పినట్లు చేసిన తీర్ణప్రతిజ్ఞుడు కాడా భవభూతి ?

" ప్రాచేతసేన యాऽऽనీతా పాలితా భవభూతినా
సర్వతశ్చర్వ్యతే వాణీ సైవాద్య కవిమానిభిః "

విజయతాం భవభూతివాణీ. ఇతి శివమ్.

# "ఏకో రసః కరుణ ఏవ"

ఈమాట భవభూతి మహాకవి ఉత్తరరామచరిత్ర తృతీయాంకము తుదగావించిన యీ క్రింది కరుణరసవర్ణనము లోనిది :—

"ఏకోరసః కరుణఏవ నిమిత్తభేదాత్
భిన్నః పృథక్పృథ గివాశ్రయతే వివర్తాన్
ఆవర్త బుద్బుద తరంగమయాన్ వికారా
నంభో యథాసలిల మేవహి తత్సమస్తమ్"

నాయనువాదములోని దీని తెలుగిది:-

కరుణ రస మొక్కటె వేఱుకారణముల
వేఱు వేఱు విధంబుల మాఱుచుండు
సలిల మొక్కటె బిందు తుషారభంగ
బుద్బుదావర్త రూపముల్ పొందునట్లు."

శృంగార వీర కరుణాద్భుత హాస్య రౌద్ర బీభత్స భయానక శాంతములు నవరసములన్న మాట యేనాడో పుట్టినది. వాటికి వత్సల రసము జేర్చి పది రసములని కొందఱన్నారు. వత్సల శాంతములను విడిచి రూపకరసము లెనిమిదని కొందఱన్నారు. అంతేకాని, తమ కభీష్టమైన దానిని పురస్కరించుకొని యొకటే రసమన్న ప్రాచీను లెవరును కనరారు. అట్టియెడ నవరసభరితమైన యాదికావ్యమగు రామాయణ మెన్నోసార్లు పఠించినవాడును వాల్మీకిమహర్షి పరోక్ష శిష్యుడునైన యీకవీంద్రుడు పై నిర్ణయము గావించుట యందలి విశేష మేమో యించుక పరిశీలింతము.

శృంగార ప్రధానముగా మాలతీమాధవమును వీరప్రధానముగా మహావీరచరిత్రము నిర్మించియు, నీకవియుత్తరరామచరిత్ర రచియించు నాటికి రసతత్త్వము చక్కగా పరామర్శించి సర్వప్రాణి సహజమైన

కరుణమునకు తప్ప శృంగార వీరాదులకు రసత్వమే సిద్ధింపదన్న నిశ్చయముతోనే పై నిర్ణయము గావించునట్లు పైకి కనపడుచున్నది. ఇట్టి రసనిర్ణేత మఱియొక డున్నాడు. తన రామాయణ చంపులో శృంగారముతో వీరకరుణాద్యన్యరసములను గూడా సహృదయరంజకముగా వర్ణించినవాడయ్యు, తన యాస్థానమందలి ధనంజయుని దశరూపకములోని రసప్రకరణము పఠించినవాడయ్యు, శృంగార ప్రకాశమను రస లక్షణము నిర్మించునాటికి రసస్వరూపము నెక్కువగా పరామర్శించి సృష్టిలోని స్త్రీ పురుషాత్మకమైన సకలజంతుసంతతి ప్రవృత్తియు రతి ప్రకృతిక మగుటంజేసి శృంగారమునకు తప్ప తక్కిన వీరాద్భుత కరుణాదులకు రసత్వమే సిద్ధింపదన్న నిశ్చయముతోనే 'శృంగార ఏక ఏవరసః' అని యొక్క మాటతో రస నిర్ణయము గావించినట్లు కన వచ్చుచున్నది,—ఇట్లు పరస్పర విరుద్ధములైన యీ రెండు నిర్ణయములలో నేది గ్రాహ్యము? ఏది త్యాజ్యము? అనియు, ఈ రెంటినిబట్టి తక్కిన వీరాద్భుతాదులు రసములు కాకుండపోవలసినదేనా? అనియు రెండు సందేహములు పాఠకులకు కలుగకపోవు. అవి ప్రకృతమైన కరుణమునుగూర్చి చర్చించుటలో కొంతవరకు తొలగకపోవు.

సుఖోత్సాహ భయశోకాదుల యనుభవమందు లౌకికరసముకంటె నలౌకికమైన కావ్యరసము మిక్కిలి విలక్షణమనుచు లాక్షణికులు రసము నిట్లు నిర్వచించియున్నారు. సహృదయుల చిత్తముల నంటి యణగియున్న రతిహాసశోకాదికమైన స్థాయిభావము కావ్యముచదువునపుడో, వినునప్పుడో, యనునయించునపుడో యుద్రిక్తమగుచు నవ్యక్తమై యెదుట నున్నట్లు, హృదయమున ప్రవేశించినట్లు, సర్వాంగములను కౌగలించినట్లు తన్మయత్వము కలిగించి తక్కిన ప్రపంచమును మఱపించి వారిచే బ్రహ్మానందమువాడ్కి నాస్వాదింపబడెడి యలౌకిక చమత్కారియైన శృంగార హాస్య కరుణాదికము రసమనబడుచున్నది. అది మున్నెపుడో యున్న నాయికా నాయకాదులందుండునది

కాదు. ఇపుడు వారి వేషములు తాల్చిన నటులయందుండునది కాదు. 'ఆయుర్ఘృత' మనుచో, ఆయుర్వృద్ధికి హేతువైన యాజ్యవమాయు వన బడినట్లే పాఠకాదిహృదయాంతర్గతమైన రసము పైకి పొంగుటకు కారణమైన కావ్యము రసవంత మనబడుచున్నది గదా యని దాని యందు నుండునదియు కాదు. అది సామాజికనిష్ఠము. రత్యాదిస్థాయి విశిష్టమగు భగ్నావరణ చిదానందమే రసము – ఆ యానందము సుఖాస్వాదమునకే కాదు, దుఃఖాస్వాదమునకును గోచరమగును—

ఈవిధముగా లాక్షణికుల నిర్వచనములును, బహువిధములుగా నాయా మహాకవుల తత్తద్రస పోషణ విధానములును శృంగారాదు లెనిమిదియు రసములే యని విద్వల్లోకమున దృఢవిశ్వాసమును నెల కొల్పియుండ దానిని పూర్తిగా నిర్మూలనము గావించుటకే వీరీ నిర్ణయములు చేసియుందురా? కాదు. అయితే మఱేమి? "లోకో భిన్నరుచిః" అని యున్నదిగదా! వీరికి కరుణ శృంగారములందున్న యభిమానముతోడి యభినివేశమే యందుకు కారణమందము. "సుఖ మొక్కటే ఆస్వాద్యము, అది శృంగారమందే యున్నది. వీరాద్భు తాదులందదది యున్న దనుకొనుట భ్రాంతి" అనుచు భోజుడు వాటి రసప్రతీతిని తొలగింపబూనుట, అవి శృంగారమువలె సుఖాస్వాద రూపములు కావని నిరూపించుటకుగాక వేఱేమి? అది యటుండనిండు. ప్రకృతమైన కరుణనిర్ణయము నెత్తుకొందము.

భవభూతి శృంగారవీరములనుగూడా చక్కగా వర్ణించినా, కరుణ మితని కెక్కువ యభీష్టము. మాలతీ మాధవములోని శృంగారమును మఱపించి యందలి నాయికా నాయక మరణోద్యోగకరుణమును, మహావీరచరిత్రలోని వీరమును మించి యందలి సీతావిరహదుఃఖితు డైన శ్రీరాముని కరుణమును ప్రేక్షకుల కెక్కువగా తన్మయత్వము కలిగించునట్లు వర్ణింపబడిన వనుట నిజము. అట్లంగముగా వర్ణించు టతో తనివి తీఱకయే యిత డుత్తరచరిత మెత్తుకొని కరుణమును

కడముట్ట వర్ణించి చరితార్థుడయ్యెను. ఆ కరుణ రసావేశమే పూర్వోక్త నిర్ణయమునకు మూలమని భావించి, అట్టి యావేశమునకు హేతువేమో, వెనుక సూచించినదానినే యిచ్చట నొకింత వివరింతము.

జీవుడు దేహధారియై పుట్టుచు దుఃఖించును. నడుమ దుఃఖించును. శరీరము విడుచుచు దుఃఖించును. ఇది ప్రాణికి నైజము. ఇందువల్లనే జనన మరణ ప్రవాహాత్మక మైన సంసారము దుఃఖమయమన్న మాట పుట్టినది. దీనినే యొక వేత్త యిట్లు విశదీకరించి యున్నాడు.

"జన్మదుఃఖం జరాదుఃఖం జాయాదుఃఖం పునఃపునః,
సంసారసాగరో దుఃఖం తస్మా జ్జాగృత జాగృత"

దీనినిబట్టి లౌకికరసములలో మొదటిది కరుణ మని విస్పష్టము. మొదటిదే కాదు, తుదకు శృంగార వీరాదు లన్నిటికిని గతి యిదియే. ఇందుకు మఱియొకమాట :—

పూర్వజన్మ పుణ్యపాపకర్మవాసనలను బట్టి యైహికజీవితము సుఖదుఃఖమిశ్రమైయుండునని పెద్దలు కొందఱు మాటవరస కన్నారుగాని, తాత్త్విక దృష్టితో పరిశీలించిన వేత్తలందఱు నది సుఖాభాసముకాని సుఖము కాదనియు మరు మరీచికా జలమువంటిదనియు నిరూపించియే యున్నారు. అది లోకానుభవసిద్ధమే. దార పుత్ర రాజ్యాదులవలని సుఖ మెట్టిదో చవిచూచి గాఢవిరక్తిని చెందిన గౌతమ బుద్ధుడు "సర్వం దుఃఖం దుఃఖం" అనుచు శోకమయ మైన మానవజీవితమం దానందాత్మకమైన సుఖానుభవము మున్నాటికి కల్లయని గొంతెత్తి చెప్పలేదా ? ఇంకెందుకు ? క్షణికముగానో మూణ్ణాళ్లముచ్చట గానో తాత్కాలికముగా సుఖభ్రాంతిని గొలుపు రత్యుత్సాహాది భావములు రసములన్న వాడుక యెట్లో వచ్చినదిగాని, వానియందు నిర్దుష్టమైన సుఖమున్నదా ? ఆ భావములకు స్థాయిత్వ మున్నదా ? సముద్ర తరంగచలంచమైన జీవ మెక్కడ ? దుఃఖపర్యవసాయులైన రత్యుత్సాదులవలన సౌఖ్య మెక్కడ ? ఈ మాట శృంగారాదులకే కాదు,

లౌకిక మైన కరుణమునకును చెల్లునదే. దారపుత్రాది వియోగమున విలపించువారియందును వారిని దుఃఖించుచు నూఱడించువారియందును ప్రత్యక్షముగా గోచరించు కరుణము సుఖాస్వాదరూపమని యెవ్వారేని భావింతురా? ఈదృశమైన రసతత్త్వమును సమగ్రముగా ననుభవమునకు తెచ్చుకొన్నవాఁడు మన భవభూతి, వేదాంతజ్ఞానసునిశ్చితబుద్ధి, శుద్ధాద్వైతుడు. లౌకికకరుణమువలె దుఃఖాత్మకము గాక కావ్యకరుణము సుఖాత్మకమే యగునని చెప్పి చూపి సామాజికుల నానందపరవశులం గావించిన వశ్యవాణి. ఆ లౌకికాలౌకిక రసరహస్య విజ్ఞానమునకు ఫలమే "ఏకోరసః కరుణ ఏవ" ఇత్యాదిశ్లోకము.

ఇది కరుణవర్ణనముగాని కరుణలక్షణము కాదు. ఈ కావ్యమును సకల నాటకశిరోరత్న మనిపించిన కరుణరస మెందు వివిధగతుల వెల్లివిరిసి ప్రేక్షకుల హృదయములను తనలో లయము గావించెనో, ఆ పంచవటీ రంగములో నిదియగును. అందలి సీతారాముల సమావేశమచింత్య మత్యద్భుతము. సీతకు తెలిసియు రామునికి తెలియకయు నున్నవారి దుఃఖాలాపములు రాతిని కరగించునవి. అట్టివారి యవస్థలను చూచి ప్రేక్షకులు తన్మయులగుట యాశ్చర్యము కాదు. సీతకు తోడుగా వచ్చిన దీ దేవత యగు తమసయే, "అవురా యేమి సంఘటనము!" అనుచు విస్మయవిషాదవివశయై యప్పటి తన యనుభవమున నిట్లావిష్కరించినది. కవీంద్రుడు పాత్రముఖమున ననిపించిన యీ వాక్యములలో మానవజీవితమంతా దుఃఖమయమన్న లోకానుభవమును; శోకమూర్తులైన సీతారాముల చేష్ట లందును మాటలందును గోచరించుచున్నట్లున్న, శృంగారాద్భుతాదులు కరుణవికారములు గాని రసాంతరములు కావన్న యుపదేశమును, రెండు నిమిడి యున్నవి. ఇది యిటులుండ నీ తృతీయాంకము మొదట మురళాపాత్రముఖమున కవి యనిపించిన మాటలివి :—

" అనిర్భిణ్ణో గభీరత్వా దంతర్గూఢ గురువ్యథః,
పుటపాక ప్రతీకాశో రామస్య కరుణోరసః.

గీ. ధీర గంభీరుఁ డగుటచేఁ దెలియరాక
యుండి లోపలఁ గుతకుత యుడుకునట్టి
రాము కరుణరసంబు దురంత తాప
కారియై పుటపాక సంకాశమయ్యె.

ఇట్లే తృతీయాంక మాద్యంతము కరుణాస్థాయియైన శోకము తప్ప మఱియొక భావమే గోచరింపదు - తండ్రి మిథిల కేగెనని దుఃఖించు జానకిని రాముఁ డూరడించుటతో నారంభమైన యీ నాటకమం దెక్కడ పట్టిన నక్కడే కరుణము ప్రత్యక్షమనుట నిజమే కాని, లవ చంద్రకేతువీరాలాప శస్త్రాస్త్ర ప్రయోగములందు వీరము కనవచ్చు చున్నది. అద్భుతము నందందు గోచరించుచున్నది. ఇది కరుణాద్భుత మిశ్రమని యంతర్నాటక సూత్రధారుడే చెప్పినాడు. అట్టియెడ నీవీరాద్భుతములు కరుణాంగము లనక కరుణవికారము లనఁదగునా ? తగదు. కావున నాటకమంతయు కరుణరస ప్రధానమనియు, " ఏకో రసః కరుణ ఏవ " అను వాక్యము తృతీయాంకమునకు మాత్రమే సమన్వయించుననియు భావింపనగును. దీనినిబట్టి భవభూతిమతమున శృంగార వీరాదులు రసములు కావనెడి యపవాదముకూడా నిరస్త మగుచున్నది. రాళ్ల నేడ్పించిన భవభూతి కరుణరసోపాసకులలో నగ్రేసరుఁ డనుట నిరాక్షేపమేకాని కరుణైకత్వవాది కాఁడు.

గోవర్ధనుడు కావించిన స్తుతితో దీనిని ముగింతము—

" భవభూతే స్సంబంధా, ద్భూధరభూరేవభారతీ భాతి
ఏతత్కృతకారుణ్యే, కిమన్యథా రోదితి గ్రావా ? "

---

# పితృభక్తి – శ్రీరామ గాంగేయులు

రామాయణ కథానాయకుఁడైన మహావీరుఁడు శ్రీరాముఁడు. మహాభారత వీరాగ్రేసరుఁడు గాంగేయుఁడు. ఈ మహాపురుషుల పుణ్యకథ తెలియనివారు హిందూదేశములో నుండఁబోరు. అయినా వీరిద్దఱి సచ్చరిత్రలలో వీరిని పోల్చి వర్ణింపఁదగిన విశేషాంశముగాఁ గనవచ్చు పితృభక్తిని గూర్చి యీ చిన్న వ్యాసము వ్రాయుచున్నాను. ఈ విషయమున వాల్మీకి వ్యాసమహాకవు లీపాత్రముల నెట్లు పోషించుచు వచ్చి రనుటయే యీ వ్యాసము యొక్క ముఖ్యోద్దేశము.

శ్రీరాముఁడు శ్రీమన్నారాయణావతారము. గాంగేయుఁడు దేవయోని విశేషావతారము. ఇద్దఱును కారణజన్మ మెత్తినవారు. కాని యమానుషములైన వీరి మహిమలతో మన కిందు పనిలేదు. మఱియు, అంధతాపసుఁ డిచ్చిన శాపముచే దశరథుఁ డనుభవింపవలసి వచ్చిన పుత్రశోకమునకు ఫలముగా రాముఁ డడవికి వెళ్ళవలసి వచ్చుటయు, వసిష్ఠుని శాపముచే ననుభవింపవలసి వచ్చిన యనపత్యముగా గాంగేయుఁ డవివాహితుఁడు గావలసివచ్చుటయు మన కిందావశ్యకములు కావు. ఆ మహిమలను ఆ వరములను, ఆ శాపములను అటుంచి, వీరిరువురును మానవులు, క్షత్రియులు, ధీరోదాత్తులు అను విషయము మాత్రమే గ్రహించి వీరి పితృభక్తి నించుక పోల్చి పరిశీలింతము.

సంతానము లేక లేక పరితపించిన దశరథునకు పెద్దతనమునఁ బుట్టిన కొడుకులలో పెద్దవాఁడు శ్రీరాముఁడు. చాలా సంతానము నష్టముకాఁగాఁ బరితపించిన శంతనునకు చిట్టచివర ప్రాణములతోఁ దక్కిన యేకపుత్రుఁడు గాంగేయుఁడు. అందుచే దశరథ శంతనులకు శ్రీరామ గాంగేయు లతిప్రేమాస్పదులగుట నిక్కము. అట్లే వీరిద్ద

ఇది ప్రభవ సంవత్సర ఫాల్గుణ భారతిలోఁ బ్రకటితమైనది.

అను తండ్రులకు వినయవిధేయులై పరమభక్తులగుటయు నిజము. శ్రీరామదశరథుల భక్తివాత్సల్యములను వాల్మీకి పెక్కుచోట్ల వివరించి యున్నాడు వ్యాసుడు గాంగేయ శంతనుల భక్తివాత్సల్యములను విశేషించి వర్ణింపకపోయినా,

'పౌరవాన్ శంతనోః పుత్రః పితరంచ మహాయశాః,
రాష్ట్రంచ రంజయామాస వృత్తేన భరతర్షభ ;
త ద్వైవం సమనుజ్ఞాతః పుత్రమాదాయ శంతనుః,
సర్వకామ సమృద్ధార్థం మేనే చాత్మాన మాత్మనా.'

అని రెండు మాటలతో వాటిసారము గనఁబఱచినాఁడు.

## దశరథ శ్రీరాములు

దశరథుఁడు పౌరవృద్ధామాత్యాదుల యభిమతమును బట్టి శ్రీరాముని యౌవరాజ్యాభిషిక్తునిఁ జేయ నిశ్చయించి అతనిని రావించి, తన యాశయమును మహానందముతోఁ జెప్పుచు—

'భవంతి బహువిఘ్నాని కార్యా ణ్యేవంవిధానిహి,
విప్రోషితశ్చ భరతో యావదేవ పురాదితః ;
తావదే వాభిషేక స్తే ప్రాప్తకాలో మతో మమ,
కామం ఖలు సతాం వృత్తే భ్రాతా తే భరత స్థితః ;
జ్యేష్ఠానువర్తీ ధర్మాత్మా సానుక్రోశో జితేంద్రియః,
కింతు చిత్తం మనుష్యాణా మనిత్య మితి మే మతిః.'

అని యన్నమాటలు రాఁబోవు ననర్థమునకు సూచకములో యన్నట్లుగా తొల్లి కైకేయిని పెళ్ళాడునపుడు కేకయరాజుతోఁ జేసిన రాజ్యశుల్కప్రతిజ్ఞను స్మరించుకొని, భరతుఁ డయోధ్యలో లేనపుడు నీ యభిషేక ముచితమను తలంపుతో నన్నవికాని దేవాసుర యుద్ధములో కైక కిచ్చిన వరము లామె యడుగునేమో యను తలంపుతో నన్నవి కావు.

తరువాత, దశరథుఁడు క్రోధాకారముననున్న కైకేయి ననున యించుచుఁ గామవశవర్తియై, 'ప్రాణప్రియుఁడు, ప్రాణాధికుఁడు, ప్రాణమేయైన రామునితోడు — నీ మనోరథము తీర్చెదను; అదేదో చెప్పు' మనుటయు, ఇంకా మఱెన్నో శపథములు చేయుటయు సత్యమే కాని, అప్పటి యతని కామిత్వము కైక కోపము తీర్చుటకుఁ బూనుకొన్నదే కాని, రాముని యభిషేకమునకు భంగము కలిగించే యామె మనోరథము తీర్చుటకుఁ బూనుకొన్నది గాదని తరువాతి చర్యవల్లనే గోచరించును. ఆ మాటలలోఁ గూడా రాముఁ డంటే దశరథుని జీవనమే యనియు గోచరించుచున్నది.

ఏ ముహూర్తమునందు కైకేయి రామవనవాసము కోరినదో, అపుడే ఆమెయందు తగులుకొనియున్న దశరథుని కామపాశము తెగి పోయినది. అపుడే రామునియందు తగులుకొనియున్న ప్రేమపాశము మఱింత దృఢమైనది. అవశమైన యవస్థ తటస్థించినపుడే నిజమైన చిత్తవృత్తి తెలియవచ్చు ననుటయు ధ్రువమైనది.

రామ వనవాస వరము కోరవద్దని దశరథుఁ డెన్నో విధములఁ గైకకు బోధించెను; నయమున భయమునఁ జెప్పినాఁడు: ప్రతిమాలి నాఁడు. ఏమిలాభము? విషము తాగి చచ్చెదనన్నది గాని యామె పట్టు విడువలేదు. అపుడు సత్యసంధుఁడు, పరిపాలకుఁడు నైన యా రాజు చేయవలసిన దేమి? కైకమీఁది కామముచేతనే యా మనో రథము తోసివేయలేకపోయినాఁడా? కైక చచ్చిపోవుననే భయము చేతనా? కాదు కాదు. తన కెట్లయినా మరణమే సిద్ధమనియు, సత్యము చెప్పినా లోకము నమ్మదనియు నతనికిఁ దెలిసినది. ఎన్ని చెప్పినా, "కైకకు లొంగి దశరథుఁడు రాము నడవికిఁ బంపె" నన్న లోకాపవాదము తప్పదని యితఁడు గ్రహించినాఁడు. కాని యేమి చేయును? ఇచ్చిన వరము లేదనలేఁడు; ఆడినమాట తప్పలేఁడు; కొడుకును విడువలేఁడు; చివర కేమి చేసెను? "ధర్మబంధేన

బద్ధోఽస్మి నష్టాచ మమ చేతనా" అని యనుకున్నాఁడు. అంతే. ఈమాట చెప్పినయెడల, లేక విన్నయెడల రాముఁడు తప్పక యడవికి వెళ్ళునని యా రాజెఱుఁగును. కాని యట్లు చెప్పఁగలిగెనా? లేదు. చెప్పఁదలఁచెనా? లేదు. కైక రామునితోఁ జెప్పినపుడు విని సహించెనా? లేదు. ఆమాటలు వినఁగానే—

'ధిక్కష్ట మితి నిశ్వస్య రాజా శోకపరిప్లుతః
మూర్ఛితో న్యపత త్తస్మి న్పర్యంకే హేమభూషితే.'

శ్రీరాముఁడు వచ్చి దుఃఖితుఁడైన తండ్రికి నమస్కరించినపుడు' అతఁడు 'రామా' అన్నాఁడు. అంతే. కన్నెత్తి చూడఁజాలకపోయెను. నోరెత్తి మాటాడలేకపోయెను. "పూర్వము నాకు వరములిచ్చి యిపు డితఁడు పశ్చాత్తాపపడుచున్నాఁ" డని కైక చెప్పఁగా విని, రాముఁడు, "మా తండ్రి మాటచే నిప్పులో నుఱికెదను; విషము త్రాగెదను, సముద్రములో మునిఁగెదను. అదేదో చెప్పు" మని కైక నడిగి నిజవృత్తాంతము తెలుసుకొని, నిర్వికారుఁడై, నిర్విచారుఁడై—

'అనుక్తోఽ ప్యత్ర భవతా భవత్యా వచనా దహమ్,
వనే వత్స్యామి విజనే వర్షా ణీహ చతుర్దశ;
భరతః పాలయే ద్రాజ్యం శుశ్రూషేచ్చ పితు ర్యథా,
తథా భవత్యా కర్తవ్యం సహి ధర్మ స్సనాతనః'.

అని యతి ధైర్యముతో పితృభక్తి యుట్టిపడఁ బల్కెను. ఆమాటలు విన్న దశరథుఁడో, చెవులు చిల్లులు పడిపోయెనో యన్నట్లు—

'స రామస్య వచ శ్శ్రుత్వా భృశం దుఃఖహతః పితా,
శోకా దశక్నువ న్బాష్పం ప్రరురోద మహాస్వనమ్.'

పుత్రప్రేమము, పుత్రదుఃఖము, మిళితమైనట్లు పెద్దపెట్టున నేడ్చెను.

అంత రాముఁడు విసంజ్ఞుఁడైన తండ్రికిని, కైకకును నమస్కరించి వచ్చి, వెంటనే సీతాలక్ష్మణులతో నడవికి వెళ్లెను.

ఈవిధముగా, పితృభక్తి మూర్తీభావమో యన్నట్లుగా రాముఁడు పితృవాక్య పరిపాలనమునకు స్వార్థత్యాగము చేసెను. ఈ సందర్భమున వాల్మీకి రామ దశరథ పాత్రముల నుత్తమపద్ధతిని పోషించి తన యసమాన కావ్య రచనానైపుణిఁ బ్రకటించెను. ఇంక—

## శంతను గాంగేయులు.

శంతనుఁడు గంగను విడిచిన పిదప స్త్రీముఖ మెఱుఁగఁడు. కాని చిరకాలమునకు దాశకన్యను చూచి మోహించి, పెండ్లాడఁ గోరెను. దానికి రాజ్యశుల్క మడ్డము వచ్చినది. ఆ వర మివ్వలేక, సత్యవతీ మోహము వదలలేకఁ వచ్చి బెంగపెట్టుకొని తలకట్టుకొని పడుకొన్నాఁడు. గాంగేయుఁడు వచ్చి యతని విచారమునకుఁ గారణ మడుగఁగా శంతనుఁ డిచ్చిన యుపన్యాసము—

ఏకపుత్రుఁ డనపత్యునకు సమానుఁడు. నాకు నీ వొకఁడనే పుత్రుఁడవు. నీ వొకఁడవు వందమంది పెట్టనుటకు సందేహము లేదు గాని యుద్ధ శూరుఁడవు. లోక మనిత్యము. ఎప్పటి కేమివచ్చునో, ఏ యుద్ధమున నీ వేమగుదువో, వంశము పోవునని సందేహించుచున్నాను. నేనైనా వృథాగా పెండ్లాడఁ దలఁచుకోలేదు. సంతానవిచ్ఛిత్తి యగునను భయముచేతనే పెళ్లి గోరుచున్నాను. ఇదే నా విచారమునకుఁ గారణము" అనుచు నేమేమో చెప్పెను.

అప్పుడు బుద్ధిశాలియైన గాంగేయుఁ డామాటలు వినియు నిశ్చలచిత్తుఁడై తండ్రి మనోవేదనకుఁ గారణము తెలిసినందుకు సంతోషించి, వచ్చి, యమాత్యుల వలన యావద్వృత్తాంతము నెఱిఁగి వెంటనే, దాశరాజు వద్దకు వెళ్లి రాజ్యవరమిచ్చి తనతండ్రికి సత్యవతి నిమ్మని కోరెను. అంత దాశరాజు "ఈవరము నీవు జరుపుదువు గాని నీ కొడు

కులు జరుపుదురా ? నీ కొడుకుల వలన సత్యవతీ పుత్రుని రాజ్యమునకు భంగము రాకుండఁ జూడు" మని మరలఁ గోరఁగా, మహాశూరుఁడైన యాగాంగేయుఁడు మహోదారుడై నిర్వికారుడై —

"అద్యప్రభృతి మే దాశ ! బ్రహ్మచర్యం భవిష్యతి,
అపుత్రస్యాపి మే లోకా భవిష్యం త్యక్షయా దివి."

అనుచు నవలీలగా ఘోరప్రతిజ్ఞ చేసి, సత్యవతిని దీసుకొనివచ్చి, తండ్రికి సమర్పించెను. ఈ సందర్భమున వ్యాసుఁడు కొడుకు నెదుటఁ దండ్రిచే మోమోటము, సిగ్గు లేకుండఁగా మాటాడించి, శంతను పాత్రమున కనౌచిత్యము గలిగించెను. గాని, 'క్రియా కేవల ముత్తర' మ్మనునట్లు గాంగేయపాత్ర మతిగంభీర మతిసముచితము నగునట్లు పోషించి పాత్రౌచిత్యకలకు వన్నె దెచ్చెను. ఈవిధముగా జనకుని కోర్కె నెఱవేర్చ భీష్ముఁడు స్వార్థత్యాగము చేసెను.

తండ్రి సత్యమును పాలించుట, తండ్రి వాంఛ తీర్చుట యను వేఱు కారణములనుబట్టి క్రమముగా సవతితల్లి కొడుకునకు స్వరాజ్యము విడుచుట యను స్వార్థత్యాగము శ్రీరామ భీష్ములకు సామాన్యధర్మమైనది. ఇఁకనో, అడవికిఁబోవుట రామునకును బ్రహ్మచారియై యుండుట భీష్మునకును విశేష ధర్మము. ఇపు డెవరిత్యాగ మెంతవఱకు సముచితమై పితృభక్తిపరాయణత్వమును స్థిరపఱుచు చున్నదన్న విషయము విచారణీయము.

శ్రీరాముఁడు పదునాలుగేండ్ల కయినా మరల నయోధ్యకు రాఁగలఁడు ; రాజు కాఁగలఁడు. కాని భీష్మునికి ఆజన్మలో రాజ్యము మరల రాదు సరిగదా ; పెళ్లియే లేదు. రాముఁడడవిలో నున్నను స్వతంత్రుఁడు ; భీష్ముఁడు పురములోనున్నను అస్వతంత్రుఁడు. అతఁ డడవిలో నున్నను రాజే ; ఇతఁడు రాజ్యరక్షణము చేయుచున్నను సేవకుఁడే. అతఁడు ముని వేషధారి యైన గృహస్థుఁడు ; ఇతఁడు రాజ

వేషధారియైన శాశ్వతబ్రహ్మచారి. అతఁడణ్యములోనున్నను కళత్ర సౌఖ్యము లేకపోలేదు; ఇతఁడు కోటలోనున్నను శరీర సుఖమే యెఱుఁగఁడు. ఇఁకనో, రాముఁడు ప్రవాసములో నున్నంతకాలము నేదో యొక నెపమున గైకేయిని నిందించుచునే యుండెను. భీష్ముఁడో సత్యవతీ శంతనుల నెన్నఁడు నిందింపలేదు సరిగదా, తుదకు దాశరాజు నైనా పల్లెత్తుమాట యన్నవాఁడు కాఁడు. చివరకుఁ దన దురదృష్ట మునైనా నిందింపలేదు; కానిండు ఇది యిట్లుండ నిండు—

దశరథుఁడు కైకకు వరము లిచ్చిన మాట సత్యము. ఆవరము లీ విధముగాఁ దీర్పుమని యడుగుట కైక తప్పుగాని, తా నెన్నఁడో యిచ్చిన వరము లీవిధముగాఁ బరిణమించునని యెఱుగక పోవుట దశ రథుని తప్పుగాదు. ఇంతకును, తనమాట చెల్లింపుమని దశరథుఁడు రామునితోఁ జెప్పలేదు; కైకయే చెప్పినది. ఎవరు చెప్పినా తండ్రి ఋణము తీర్చుట కొడుకునకు విధి గాకపోదు. ఆడినమాట తప్పుట దశరథునకు పాడియా? అట్లయిన నతఁ డుభయలోకములకుఁ జెడినవాఁడే. అట్టి స్థితిలో అతఁడు చెప్పకపోయినా, అఁతడు విధింపక పోయినా, ఆ కోర్కె విన్నంతమాత్రముననే పితృభక్తి పరాయణుఁడు, ప్రాజ్ఞుఁడు నైన శ్రీరాముఁడు జనకుని వాక్యమును పరిపాలించుట యాశ్చర్యకరముగాదు. శ్రీరాముఁడును త్రికరణ శుద్ధిగా నట్లే నెఱ వేర్చెను. ఇంతవఱ కతఁడుత్తమముగా నున్నది.

ఇఁకనో, శంతనుఁడు గంగ నెడఁబాసిన పిదప ముప్పైయాఁతేళ్ళ వయస్సు వచ్చువఱకును స్త్రీముఖ మెఱుఁగక అపుడు సత్యవతిని మోహించుటయే తప్పు. పోనీ, మోహింపవచ్చు ననుకొందము. దానిని పెళ్ళాడుటకు రాజ్యశుల్క మడ్డము రాగా నిజముగా గామ పరవశుఁడే యైనచో శుల్క మక్కఱలేని మఱియొక రాజకన్యను పెళ్ళాడవలెనుగాని దాని కొఱకే తలకట్టుకొని పడుండుట మఱియొక తప్పు. పోనిండు ఆకన్నెయే యతనికి నచ్చినది. అందుచే దానిపై

మోహము విడువలేకపోయినాఁ డనుకొందము. అయి తేనేమి? తన కోరిక తెలిసినంత మాత్రముననే మహోదారుఁడైన గాంగేయుఁడు రాజ్యవరమిచ్చి తనకోర్కె నెఱవేర్చుననే దృఢవిశ్వాస ముండుట చేతనే కదా, అతడట్లు లజ్జాదాక్షిణ్యములు విడిచి గాంగేయునివద్ద నపమార్గమునఁ దాను పెళ్ళాడుటకుఁగల యక్కఱను వెళ్ళగక్కెను? ఆహా! చూడండి! పుత్రునకు రాజ్యములేకుండఁ జేయు విషయమునఁ గామపరవశుఁడై యపమార్గము తొక్కినవాఁడు శంతనుఁడా? దశరథుఁడా? తనపెళ్ళి గాంగేయుని రాజ్యమునకు హాని తెచ్చునని శంతనుఁ డెఱుఁగును. కైక నోటనుండి యాచెడ్డమాట వచ్చువఱకును రాముని రాజ్యమునకు భంగమువచ్చు నన్నమాట దశరథుఁ డెఱుగఁడు.

తనరాజ్యమునకు తనపెళ్ళికిని భంగము గలిగించిన శంతను దాశరాజులనుగాని,మూలకారణమైన సత్యవతినిగాని గాంగేయు డపుడు గాదు గదా, ఎపుడును పల్లెత్తుమాట యన్నవాఁడు కాఁడనుట ధ్రువము. తన యౌవరాజ్యాభిషేకమునకు సవతితల్లి హాని గలిగించి నదిగాని, తండ్రి కలిగింపలేదని శ్రీరాముఁ డెఱుఁగును. మఱియు దశరథుఁడు కైకేయిని పెళ్ళాడుటకు కేకయరాజుతో జేసిన రాజ్య శుల్క ప్రతిజ్ఞను శ్రీరాముఁ డెఱిఁగియు, తన్ను యువరాజును జేసెద నని తండ్రి యన్నపుడు, "ఇదేమి న్యాయము? నీ విచ్చిన రాజ్యశుల్కమునుబట్టి భరతునే యువరాజునుగాఁ జేయవలె" నని యన్నాఁడా? లేదు. ఆరాజ్యశుల్కవరముచే తన యభిషేక మాఁగినదా? లేదు. అట్టి యెడ దండ్రిని కామాత్ముఁ డనుట తగునా?

గంగ దాఁటివెళ్ళిన మొదటిరాత్రి లక్ష్మణునితో నన్నమాటలివి— (అయోధ్యా - 53 సర్గ.)

ధ్రువ మద్య మహారాజో దుఃఖం స్వపితి లక్ష్మణ,
కృత కామాహి కైకేయీ తుష్టాభవితు మర్హతి;
సాహి దేవీ మహారాజం కైకేయీ రాజ్యకారణాత్,
అపి నచ్యావయే త్ప్రాణాన్ దృష్ట్వా భరత మాగతమ్;

అనాథశ్చ హి వృద్ధశ్చ మయా చైవ వినాకృతః
కిం కరిష్యతి కామాత్మా కైకేయీ వశ మాగతః
ఇదం వ్యసన మాలోక్య రాజ్ఞశ్చ మతి విభ్రమమ్;
కామ ఏవార్థ ధర్మాభ్యాం గరీయా నితి మే మతిః

కో హ్యవిద్వా నపి పుమాన్ ప్రమదాయాః కృతే త్యజేత్,
ఛందాను వర్తినం పుత్రం తాతో మా మివ లక్ష్మణ;
అర్థధర్మౌ పరిత్యజ్య యః కామ మనువర్తతే
ఏవ మాపద్యతే క్షిప్రం రాజా దశరథో యథా.

శ్రీరాముడు తండ్రికి సంభవించిన కష్టమునకు దుఃఖించుచు, అతడు కామపరవశుఁడై కైకేయీవశుఁ డగుటచే నిట్టి యాపదకు లోను గావలసి వచ్చినాడనియు, ఎంత తెలివి తక్కువవాఁడయినా. ఆడుదాని ప్రీతి కొఱకుఁ దన కనుకూలుఁడైన పుత్రుని విడిచి పెట్టడనియు నే మేమో యించుక పితృనింద చేసినట్లు కనఁబడుచున్నది.

ఇంతకుమున్ను చేసిన విమర్శనము బట్టియు, శ్రీమద్రామాయణములోని యీకథా సందర్భములను బట్టియుఁ జూడఁగా, దశరథుఁడు కామలోలుడై యపుడు చేసిన తప్పేమియు గోచరింపదు. రాముడు పుట్టక మును పెపుడో యిచ్చినవరము కైకేయీవశుడై యిచ్చినదే యైనా, అది యీవిధముగాఁ బరిణమించినపుడును, నిజముగా దశరథునికి రామ ప్రవాసమిష్టము కాకపోయినా, ఊరకుండుటే యతని ప్రవాసమున కిష్టపడుట యని యూహింపవలసి వచ్చినపుడును, సత్యసంధుడును ప్రజాపరిపాలకుఁడు నయిన దశరథుఁ డాడినమాట తప్పకుండుట తప్పో లేక యట్టి యిక్కట్టులో 'అప్రతి షిద్ధం సమ్మత' మను న్యాయమున రామ ప్రవాసమునకు సమ్మతించుట తప్పో, కార్యజ్ఞుడును, పితృభక్తి పరాయణుఁడును, ధర్మబుద్ధియు నైన శ్రీరాముఁ డెఱుఁగని వాఁడు గాఁడు. అయినా యితరులు నిందించుటకుఁ గూడా అవకాశము

లేని యీవిషయమున నితరులనోటఁ గాకుండా పైనిందా వాక్యము లను శ్రీరాముని నోటనే పెట్టిన యాద్యమహాకవియైన వాల్మీకి మహర్షి యభిప్రాయమేమో దుర్గ్రాహముగా నున్నది. ఉచితానుచితజ్ఞుఁడు, పాత్రశీలపోషణనిపుణుఁడు, వశ్యవాక్కునయిన యామహాత్ముఁ డూరక యీసందర్భమున రామునిచే నిట్లు పలికించినవాఁడు కాఁడు. ఇందేదో విశేష ముండియుండవచ్చును. దీని నేదో యొక విధముగా సమర్థించుట కాక యథాస్థితిగా నున్న దీనియందలి సారస్యమును గ్రహించుటయే మన పని. కావున నిపు డీవిషయమును ప్రాజ్ఞలోక మునకు విడిచిపెట్టుచున్నాను.

# "మంచి చెడ్డలు"

మాటలు వేఱగునుగాని వీని యర్థముగల పదము లన్ని దేశభాష లందును గలవు. ప్రపంచ మందలి యెల్లవారును కోపము వచ్చినపుడో నీతులు చెప్పునపుడో, వస్తుతత్త్వము పరీక్షించునపుడో, కష్టమందో సుఖమందో, ఏదోయొక సమయమున వీనిని వాడుచునేయుందురు. ఒకవ్యక్తి తనకుఁగాని, యితరులకుగాని, మేలు కలుగునట్టి పనిచేయు టయు, సౌజన్యము చూపుటయు మంచియనియు, అందుకు వ్యతిరేక ముగా నొనర్చుట 'చెడ్డ' యనియు లోకు లందురు. ఏదేని యొకపదా ర్థమును రూపమునగాని, గుణమునఁగాని హృదయ మాకర్షించెనేని మంచిదనియు, దానికి వ్యతిరిక్తమైనఁ జెడ్డదనియుఁ జెప్పుదురు. ఒక వస్తు వుపయోగకరమైన మంచిదనియుఁ,గాకున్న జెడ్డదనియు నందురు. మఱియుఁ గొందఱొక వస్తువు మంచిదందురు. కొందఱదే చెడ్డ దందురు. ఇట్లు బహువిషయముల స్మరింపబడుచు విభిన్నానుభవముల కాశ్రయమైన వీటితత్త్వమెట్టిదో యొకింత పరిశీలింతము.

"దృష్టం కిమపి లోకేఽస్మి న్న నిర్దోషం ననిర్గుణమ్"

అను నార్యోక్తి గుణము లేనిదియు దోషములేనిదియు నొకటియైన లోకమునఁ గనరాదని చెప్పుచున్నది. ఈ నిర్ణయమును బురస్కరించు కొని ఇవియన్నిటికిని సహజములా? అన్నిటియందు నివి రెండు నుండునా? అన్నిటియందు సమపరిమాణములుగా సమముగా స్ఫురిం చునా? అను మూఁడు విషయములు ముఖ్యముఁగా జర్చింతము.

సహజము లందుమా, ఒక కార్యమునకో, వస్తువునకో సంబంధించిన మంచిగానీ చెడ్డగానీ, అది యందఱికొక్కవిధముగాఁ గనబడవలెను. అట్లుగాకున్న నది సహజము కానేరదు. ఇందుకు జీవహింస నుదాహ రించుకొందము.

---

ఇది ధాతృ శ్రావణ భారతిలోఁ బ్రకటితము.

ఏజంతువును జంపరాదు - చిన్న మొక్కనుగూడ హింసింపరాదు - యాగములందు పశువును వధింపవలెను - ఐదు గోళ్లుగల యైదు జంతువులను భక్షింపఁదగును. - క్రూరజంతువులను హింసింపవలెను - ఆయారోగముల శాంతి కాయామృగముల మాంసము తినవలెను - యుద్ధములందు శత్రువులను సేనలను వధింపవచ్చును - కాళికాదేవికి ప్రాణులను బలి యివ్వవచ్చును - స్త్రీవధ చేయరాదు - బ్రాహ్మణుని హింసింపరాదు.'' ఇత్యాదిగా విధి నిషేధరూపమున వివిధమైన జీవహింసకుఁ జెందిన మంచిచెడ్డలు సంఘ మేర్పఱుచు కొన్నవిగాఁ గనవచ్చును గావున సహజము లనుటకు వలనుపడకున్నది. పోనీ! ఆరోపితము లందుమా. ఒక విషయమున నించుక యభిప్రాయ భేదమున్నను, అది చలించినట్లు కనఁబడనిచో, దాని మంచిగాని చెడ్డగాని యారోపితము కాఁజాలదు. ఇందుకు సత్యాసత్యములను గ్రహింతము.

"సత్యం వద - సత్యం బ్రూయాత్ - సత్యాన్నపరం కించిత్ - సత్యమేవ జయతి - సత్యము సర్వశ్రేయము'' ఇత్యాదిగా సత్యస్తుతి సకల వాఙ్మయములందు, సర్వసంఘములందు మ్రోఁగుచున్నది. "నబ్రూయాత్సత్యమప్రియం'' మనుదానికి సత్యవచన మప్రియమైనచో నవు డేమియుఁ జెప్పక మౌనము వహింపవలెనని భావము గాని, అసత్యము చెప్పవచ్చునవెడి యర్థము కాదు.

"వారిజాక్షులందు వైవాహికములందు
ప్రాణ విత్త మానభంగమందు
చకితగోకులాగ్ర జన్మరక్షణమందు
బొంకవచ్చు నఘము పొందదధిప!''

అను భాగవతవచనము కొన్ని విషయముల నసత్యమున కనుజ్ఞ యిచ్చినది గాని, అది శ్రద్ధేయము కాదు. తనస్వామిని రక్షింపవలెనన్న యాత్రతమున శుక్రుఁడా సమయమునం దసత్యము చెప్పవచ్చు

నని బోధించినను, సత్యమర్మజ్ఞుఁడైన బలిచక్రవర్తి యామాట పాటింపకుండుటయే యిందుకుఁ జాలును. స్వాభావపరుఁడై ధర్మరాజొక్కమారు అబద్ధమాడినందువల్ల నతనికి వచ్చిన యపయశస్సును, సర్వస్వము గోల్పోయి యాలుబిడ్డల నమ్ముకొని నీచవృత్తికైనఁ బాల్పడి సత్యము పరిపాలించిన హరిశ్చంద్రుని యశస్సును లోకవిదితములు. అందుచే సత్యముయొక్క మంచియు, అసత్యముయొక్క చెడ్డయు నిశ్చలములగుటం జేసి యివి యారోపితము లనుటకు వలనుపడకున్నది. ఇఁక—

అన్నిటియందు నివి రెండు నుండునాయన్న ప్రశ్న విచారింతము - మాంసాశనము వామాచార శాక్తేయులకు మంచిది, సమయాచార శాక్తేయులకుఁ జెడ్డది - కొన్ని వర్ణముల కిష్టము, కొన్ని వర్ణముల కనిష్టము - మాతుల కన్యాపరిణయ మాంధ్రదేశీయుల కభిమతము, దాక్షిణాత్యుల కనభిమతము - పితృవ్యకన్యా పరిణయము మహమ్మదీయులకు సమ్మతము, హైందవుల కసమ్మతము - రజస్వలా వివాహమొక ముని యొకవిధముగా నంగీకరించును, ఒక ముని యేవిధముగాను అంగీకరింపఁడు - విధవా వివాహ మార్యమతవిరుద్ధము, బ్రహ్మసమాజ మతసిద్ధము - సకలజాతి సాంకర్యముచు హిందూధర్మశాస్త్రము లంగీకరింపవు, జాత్యంతరుల విధు లంగీకరించును. ఒకఁడు విగ్రహారాధన మానును. ఒకఁడు కాదనును. ఈవిధముగా నొకరికి మంచిదైన నింకొకరికిఁ జెడ్డది, ఒకరికిఁ జెడ్డదైన దింకొకరికి మంచిది యని విదితమగుచున్నది గావున నిట్టి సాంఘిక విషయములం దివి రెండును గోచరించును గాని సహజములు కాఁజాలవు. ఇట్టిపట్టుల నివి సంఘకల్పితములే. కాని—

"అన్నము ప్రాణము నిలుపును, అదే యజీర్ణమున విషమగును - నీరు నిప్పు గాలి లేక బ్రతుకలేము, అవి హద్దు మీఱినను బ్రదుకలేము - గరళము ప్రాణము తీయును, అసాధ్యరోగములు కొన్నిటి

కదే యమృతమగును.” ఇత్యాది సిద్ధవిషయములు కొన్నిటియందివి రెండు నుండును; సహజములు కూడ నగును. అయినను మఱికొన్నిటి యందివి రెండును గనరావు.

సజ్జనమైత్రి, చిత్తశుద్ధితోడి యీశ్వర చింతనము మొదలయిన యుత్తమకార్యములందు మంచియేకాని చెట్ట యిసుమంతయు గోచరింపదు. పూర్వుల నిర్ణయమునుబట్టి చదువుకూడ నిట్టివానిలోఁ జేరునుగాని యది యీ కాలమున సరిపడకున్నది. సంస్కృతమో, ఆంధ్రమో, ఆంగ్లమో ఏదోయొకటి పూర్తిగాఁ జదివిన వారిలోఁ గూడ ననేకులయందు గర్వము, దురహంకారము, స్వార్థపరత, అసూయ, అసహనము, మోసము మొదలగు దుర్గుణములు ప్రత్యక్షమగుచున్నవనుట లోక మెఱుఁగనిది కాదు. ఇంత యేల? వేదాన్తశాస్త్రము తలక్రిందుగా నప్పగించఁ గలవార మనుకొను నపూర్వ వేదాంతులలోఁ గొందఱు లబ్ధప్రతిష్ఠులు కూడ ‘బ్రహ్మసత్యం జగన్మిథ్యా’ అను సూత్రములకు ‘తాము తమ కుటుంబమును సత్యం, తక్కినదంతా అసత్యం, అను సూత్రములు కల్పించుకొని, దినమునకు వేయి యసత్యము లాడి పరులను మోసగించుచుండ, నిప్పటి చదువులందు కేవలము మంచియే యున్నదని యెవరనఁ గలరు? – ఎవరో దానము వలన దరిద్రులైనారనియు, దానివలన దేశములో సోమరుల సంఖ్య హెచ్చుననియుఁ గొందఱు దానమున దోషము కల్పింపఁ జూతురు గాని, అది సరిగాదు. యుక్తమైన దాన మెప్పటికి నుత్తమము. అందన్నదానము వంటిది మఱియొకటి లేదు. కావున నందు మంచియే కాని చెడ్డ లేదనవచ్చును. ఒళ్లు తెలియనీయకపోవుట కూడా గుణ మనుకొనువారికిఁ జెప్పలేము కాని, సురాపానమందు చెడ్డయేకాని మంచి యేమాత్రము కనఁబడదు. అట్టిదే గంజాయి. ఆత్మస్తుతి పరనిందలు రెంటను దోషము మాత్రమే స్పష్టము. ఇట్టి యనేకోదాహరణములను బట్టి యన్నిటియందు నివి రెండు నుండు ననుటకు వలనుపడకున్నది. ఇఁక ——

అన్నిటియందు నివి సమపరిమాణములుగా, సమముగా స్ఫురించునా అను ప్రశ్న మెత్తుకొందము. పూర్వోదాహృతములైన యన్నము నీరు గాలి మొదలగు వానియందు గుణ మత్యధికము, దోష మతిస్వల్పము. గరళము, నాభి, నల్లమందు మొదలగు పదార్థములందు మంచి మిక్కిలి తక్కువ. చెడ్డ మిక్కిలి యెక్కువ. కాఫీ, టీ, పొడుము, చుట్ట, సిగరెట్టు, బీడీ, కారాకిళ్ళీ మొదలగు వానికిఁ జుఱుకు పుట్టించుట యను గుణ మారోపింతురు గాని, అది యే లేశమో యున్నను, దానికిఁ బదిరెట్లు దోషమే వానియందుఁ గనవచ్చును. అందుకే యవి దురభ్యాసము లనఁబడుచున్నవి. కూరలు కాయలు పండ్లు మొదలగు వానియందు వైద్యశాస్త్ర మేదో యొక దోషలేశ మెన్నుచు వచ్చినది గాని, దానిని మించి గుణమే యెక్కువగా స్ఫురించును. కావుననే యవి భోజ్యములైనవి. ఇఁక నిట్టివానిని విడిచి లోకము సంసార సారము లనుకొనుచున్న కాంతాకనకము లందలి మంచిచెడ్డలు పరిశీలింతము.

కనకమనఁగా నిక్కడ బహువిధమైన ధనమని యర్థము. అది లేకున్న లోకమే లేదని 'ధనమూల మిదం జగత్' అను సూక్తి చెప్పుచున్నది. వైదికర్షులందఱు ధనమిమ్మనియే యింద్రాది దేవతలను బ్రార్థించిరి. దానికొఱకే రాజులు పోరాడుచున్నారు. దానికోసమే లోకమంతయుఁ దల్లడిల్లుచున్నది. ధనవంతుఁడు సర్వగుణ సంపూర్ణుఁడు. అదిలేనివాఁడు తృణముకంటెను మిక్కిలి తేలిక. నిర్ధనుని భార్యకూడఁ బరిత్యజించునని 'వ్యర్థం నిర్ధనికస్య జీవన మహో దారైరపి త్యజ్యతే' అను నార్యవచనము చెప్పుచున్నది.

> " ధనమూలము జగమంతయు
> ధనవంతున కిష్టమగు పదార్థము లెల్లన్
> దనచేతిలోని వగుటను
> ధన మార్జింపంగ నెవ్విధంబున వలయున్. "

అని భారతము. ఇంతయేల? డబ్బు లేకున్న నొక నిమిషమైన సంసారయాత్ర సాగదు. అసాధ్యము సాధ్యము గావించుశక్తి దానికున్నట్లు మఱి దేనికిని లేదు. చిన్నపిల్లలును, వెఱ్ఱివాళ్ళును కూడ డబ్బు చూపిన లొంగుదురన్నచో నిఁక దానికి లొంగనివా రెవరుందురు? అట్టి ముఖ్యాతి ముఖ్యమైన ధనమున మంచిలేదని యెవరనఁగలరు? ఇది గుణపక్షము. ఇఁక దోషపక్షము.

ధనము విఱుగుడులేని మత్తుమందు దుర్వ్యసనముల పుట్టిల్లు. కల్లల కాఁపురము. కలహముల కాకరము. రాజచోరభయములకుఁ దావలము. అవిశ్వాసమున కధిష్ఠానము. 'మాతాపుత్రవిరోధాయ హిరణ్యాయ నమో నమః' అని పెద్దలు. లోకములో నది సత్కార్యముల సంపాదించిన పుణ్యముకంటె నసత్కార్యముల నార్జించిన పాప మెన్ని మడుఁగు లెక్కువో లెక్కింపఁ దరము కాదు. సంసార తాపత్రయ మొకయెత్తు. ధనార్జన రక్షణ నాశనములవలన దుఃఖత్రయ మొకయెత్తు. "ధనమా! యెవ్వఁడు నిన్ను నమ్మి సుఖమొందగల్గెనో చూపుమా" అని నీతివచనము. అట్టి బహువిధ పాప దుఃఖహేతువైన ధనమునఁ జెడ్డ లేదని యెవరు చెప్పఁగలరు? ధనము కాంతను దెచ్చును, కాంతకొఱకు మరల ధనము కావలెను. కాంతాముఖ మెఱుఁగక తాను దినక యొకరికిఁ బెట్టక, పాఁతఱ కాచుకొనియుండు పామువలె, నార్జించిన ధనము చూచుకొనుచుండు నిరర్థక లుబ్ధుఁ డెవఁడో యొకఁ డుండకపోఁడు గాని, ధనార్జనఫలము కాంతయే యనుట లోకానుభవసిద్ధము. అందుకే పెద్దలు —

'వేధా ద్వేధాభ్రమం చక్రే కాంతాసు కనకేషుచ'

అనుచుఁ గాంతాకనకములు రెంటిని గుదిగ్రుచ్చి మహామోహస్థానము లీ రెండే యని నిరూపించియున్నారు. ఇంక, కాంతతోడిదైన గృహస్థాశ్రమమును, దద్విరుద్ధమైన సన్యాసమును బరిశీలింతము.

వేదమతమున గార్హస్థ్యము మంచిది, వేదాంతమతమున సన్యాసము మంచిది. పరస్పర విరుద్ధములైన యీ రెంటిలో నేది మంచి

దన్నను. రెండవది చెడ్డదగును. కాని, "ధర్మప్రజాసంపత్త్యర్థం స్త్రియ ముద్వహే, ధర్మేచ అర్థేచ కామేచ మా మనుచర" ఇత్యాది వాక్యముల గార్హస్థ్యము త్రివర్గ సాధనమని విదితమగు చున్నను లోకప్రవృత్తి నిబట్టి యది బహుళముగాఁ గామసాధన మగుచున్న' నుట నిర్వివాదము. పిపీలికాది బ్రహ్మపర్యంతమైన సృష్టి లోని రహస్య మాలోచించిన స్త్రీ పురుష సమాగమము నైసర్గిక మని గోచరించుచుండ నది చెడ్డ దెట్లగును? అని కర్మవాది యన — సంసార పాశములఁ దగుల్కొని జీవుఁడు పడరాని పాట్లు పడి, చేయ రాని పనులు చేయుచు, దుఃఖమగ్నుఁ డగుచున్నాఁడు. అట్టి దుఃఖము నుండి విముక్తుని గావించి యతని కాత్మానంద మొసంగు సన్యాసము చెడ్డ దెట్లగునని వేదాంతి యనెను. మఱియు —

"కామసుఖరూపమైన యిహమును యాగవ్రతతీర్థయాత్రాతిథి పూజా దేవతార్చనాది ధర్మజన్య ఫలరూపమైన పరమునుగూడ సమ కూర్చునట్టి గార్హస్థ్యమందు మంచియేకాని చెడుగే కనఁబడదు. కాని, ఒక్క పరము మాత్రమే చూపెడి సన్యాసమం దిహము చేకూర్పఁజాలమి యను చెడుగు కనఁబడకపోదు." అని కర్మవాది స్వమతము సమర్థింప, వేదాంతి యిట్లు చెప్పుచున్నాఁడు :

ఇది విపరీతోపన్యాసము. అయిన దాకులోను, కానిది కంచము లోను బెట్టిన ట్లున్నది. ధర్మాచరణమువల్లఁ బుట్టెడి పుణ్యమిచ్చు ఫలమేది? స్వర్గము. ఆ పుణ్య మైపోయినపిదప 'క్షీణే పుణ్యే మర్త్య లోకం విశన్తి' అను న్యాయమునుబట్టి జీవుఁడు మరల భూలోకమున జన్మింపవలసినదే. అనఁగా, జనన మరణ ప్రవాహరూపమైన సంసార మున మరలఁ బడెననుట. ఇహమా, సుఖశూన్యము. లోకము భ్రాంతిచే ననుకొనుచున్నది సుఖాభాసముగాని సుఖము కాదు. పైగా వ్యాధి జరావిపత్తి సంకులము. దారపుత్ర వియోగాది దుఃఖపూర్ణము. పోనీ! పరమా, గార్హస్థ్యము యథాశాస్త్రముగా నడచినను, అది

యశాశ్వతము. అట్టి గృహస్థాశ్రమము నిర్దోషము, గుణభూయిష్ఠము ననుట విపరీతవాదము కాదా! పూజ్యు లేమనిరి ?—

"జన్మ దుఃఖం జరా దుఃఖం జాయా దుఃఖం పునః పునః,
సంసార సాగరో దుఃఖం తస్మా జ్జాగృత జాగృత."

ఇఁక సన్న్యాసము మాట - శిఖాయజ్ఞోపవీత పరిత్యాగము మాత్రము సన్న్యాసము కాదు. "కామ్యానాం కర్మణాం న్యాసం సన్న్యాసం కవయో విదుః" అని భగవద్గీత. నిత్యానిత్య వస్తువివేకమున దుఃఖాత్మకమైన యిహమును, అశాశ్వతమైన స్వర్గాది ఫలమునుగూడఁ ద్రికరణశుద్ధిగా విడుచుట సన్న్యాస మనఁబడును. తాదృశపరిశుద్ధ సన్న్యాసము సాధనముగా శమదమాదిషట్కసంపన్నుఁడై జీవాత్మ స్వస్వరూపాను సంధానమునఁ బరమాత్మభావము గాంచును. అదే జీవన్ముక్తి. అదే కోరఁదగినది, అదే పొందఁదగినది. అట్టి యద్వితీయ పరబ్రహ్మభావమునకు సాధనమైన నిష్కామ సన్న్యాసమున దోషము గూడ నున్నదనుట విపరీతవాదముగాదా! ఇంతకుఁ దేలిన సారాంశము.

"దృష్టం కిమపి లోకేఽస్మి న్న నిర్దోషం ననిర్గుణమ్" అను మాట స్థూలదృష్టితో నన్నదిగాని సార్వత్రికముగా సమన్వయించునది కాదు. కొన్నిటియందు గుణముండును. కొన్నిటియందు దోషముండును. కొన్నిటియందు రెండు నుండును. ఒకచో నొకటి హెచ్చుగానున్న నింకొకచో మఱియొకటి హెచ్చుగా నుండును. అన్నిటికిని మంచి చెడ్డలు సహజములు కావు. అన్నిటికిని నారోపితములు కావు. మొత్తముమీఁదఁ బరిశీలింపఁగా, సత్త్వరజస్తమో గుణాత్మకమైన యీ సృష్టిలో గుణముకంటె దోషమే హెచ్చని గోచరింపకపోదు. నిర్గుణము నిర్దోషము నిత్యము శుద్ధబుద్ధముక్తస్వభావము నైన దద్వితీయ పరబ్రహ్మ మొకటియే. తత్ప్రతిబింబమైన జీవుఁడు గుణదోషభూయిష్ఠమైన సంసారమునుండి విముక్తుఁడై స్వీయమైన నిర్గుణపరమాత్మభావము గాంచుటకై హిక గుణదోషవివేక మొక సాధన మగును.

"సర్వం ఖల్విదం బ్రహ్మ, అయమాత్మా బ్రహ్మ."

# కర్ణార్జున శీల పరిశీలనము

## కర్ణార్జునుల జననాదికము

కర్ణుని జన్మవృత్తాంత మాదిపర్వమున మిక్కిలి సంక్షేపముగాను అరణ్య పర్వమున నించుక విస్తృతముగాను గనవచ్చును. కొన్ని సంస్కృతభారత ప్రతులలో నాదిపర్వమునఁ ♦ గుంతికి సూర్యుని వరంబున నపుడే కర్ణుఁడుఁ పుట్టినట్లును, వానిలోనే యరణ్య పర్వమున మాతృ గర్భమునఁ దొమ్మిది నెలలుండి పదియవ మాసమునఁ బుట్టినట్లును గనవచ్చుచున్నది. ఈ పాఠముల సనుసరించియే తెలుఁగు భారతములో నీతని జన్మకథ పూర్వోత్తర విరుద్ధముగా నట్లేయున్నది. కర్ణుఁడుఁ సద్యోగర్భమునఁ బుట్టినట్లు నన్నయార్యునిచే చూడఁబడిన ప్రతిలో నరణ్యపర్వమున నెట్లున్నదో తెలియఁజాలము కాని, యెఱ్ఱాప్రగడ తన యరణ్య పర్వమున నన్నయ వ్రాసిన దానికి విరుద్ధముగా నుండునని యాలోచింపక తాను జూచిన ప్రతినిబట్టి కర్ణుఁడుఁ తొమ్మిది నెలలు తల్లికడుపునఁ బెరిగియే పుట్టినట్లు వ్రాసెను. ఎట్లయినను ప్రధాన విషయంబున నేకీభవించుచున్న యీ పాఠ భేదముల నంతగాఁ బాటింపఁ బనిలేదుగాని వనపర్వములోని కర్ణ జన్మ వృత్తాంతమే నిజమైనదని మాత్రము గ్రహింప నగును.

ఉత్తమమైన యాదవ కులంబున జన్మించిన నవనవోన్మేషయౌవనయు దృఢ గాత్రియు నయిన కుంతికి సూర్యుని వరమున సహజ కుండల కవచాభిరాముఁడై దృఢ దేహుఁడై పుట్టిన తొలిచూలు కర్ణుఁడు.

---

♦ నేను జూచిన ప్రతు లన్నిటిలో నిట్లే యున్నది. పరులకుఁ దెలియ రాకుండఁగా గర్భము నవమాసములు బెరిగినపిదపఁ బుట్టె ననెడి యరణ్యపర్వ పాఠము సహజము సముచితము నగుటచే దానితో దీనికి సామరస్యము గలిగించుటకై యాదిపర్వములోని తత్కాలమందుఁ బుట్టెననెడి యర్థముగల మాటలు ప్రక్షిప్తము లనియో ప్రామాదికము లనియో చెప్పవలసి వచ్చుచున్నది.

ఆమెకే ముగ్గురు కొడుకులు పుట్టిన పిదప ననఁగా నధమపక్షము కర్ణుఁడు పుట్టిన యేడెనిమి దేండ్లకు నడవులలోఁ దిరిగి తిరిగి శరీర సౌఖ్యహీనయై శతశృంగమునఁ దపోవృత్తినున్న కాలములో నింద్రుని వరమున లోకోత్తరుఁడై భాసుర తేజుఁడై స్థిరపౌరుషుఁడై పుట్టిన నాల్గవ కుమారుడర్జునుఁడు. కావున క్షత్రియులు, దేవతాంశ సంభూతులు, కౌంతేయులు నగు వీరిరువురు జాతియెడ సమానులే యగుచున్నారు. కాని దేహ బలంబున వీరిలోఁ గర్ణుడెక్కువ వాఁడనుటకుఁ బై జన్మకథ యొక విధమైన కారణము కానోపునని యూహింపవచ్చును. ఇఁకనో సూతకులంబునఁ బెరుగుటచేఁ గర్ణునకుఁ గలిగిన దురాచారము లుగ్గడింపకయే యది యాతనియెడ దోషమనుట కెవ్వరు సాహసింతురు?

చంపానగరమున రాధాతిరథుల వలన జాతకర్మాది సంస్కారములొంది * వేదశాస్త్రాధ్యయన మొనర్చుచుఁ గర్ణుఁడు పెరిఁగెను. శతశృంగమునఁ గుంతీ పాండురాజుల వలన జనించి సకల దేవబ్రహ్మర్షి సమక్షమున క్షత్రియోచిత సకల సంస్కారములఁ గాంచి శ్రుతాధ్యయన సంపన్నుఁడై నరుఁడు పెరిఁగె. శతశృంగము నుండి తల్లి కొడుకులు హాస్తినాపురము చేరునప్పటికి నర్జునుఁడు పదునాలు గేండ్లవాఁడు. వీరు హాస్తిపురము చేరినకొన్ని నాళ్లకే ద్రోణాచార్యుఁ డచ్చటికి వచ్చి యుండునని యూహించినను విలువిద్య నారంభించు నాఁటికిఁ బార్థుఁడు కౌమార దశలో నున్నవాఁడనియే తెలియుచున్నది. కౌరవ పాండవులకు ద్రోణుఁ డస్త్రవిద్య గఱపుచున్నాఁడని విని సూతుఁడు సంప్రాప్తయౌవనుఁడగు కొడుకు వసుషేణుని దోడ్కొని వచ్చి ద్రోణుని యొద్ద నస్త్రశిక్ష సేయంబెట్టెనని యుండుట చేతను మున్ను చూపిన కర్ణార్జునుల జనన కాలభేదముం బట్టియు విలువిద్య నేర్వ నారంభించు నాఁటికి గర్ణుఁడు రమారమి యిరువది రెండేండ్లవాఁడై

* కర్ణుఁడు వేదవేత్త యనియు యజ్ఞములు చేసెననియుఁగూడ నుద్యోగ పర్వమునఁ గనఁబడుచున్నది.

యౌవన దశలో నున్నట్లు తెలియును. ద్రోణుఁడు రాకమున్న కృపాచార్యుని యొద్ద నర్జునుఁడు కొంత విలువిద్య నేర్చెను. కర్ణుఁ డీసమయముననే కృపుని యొద్దఁగూడఁ గొన్ని ధనుర్విద్యా రహస్యము లెఱిఁగెనని గ్రహింప నగును. కావున వీరిరువురకు వారిద్దరు గురువులు ◆ కాని నానా దేశాగత రాజపుత్రులతోఁ గలసి చదువుకొనుచున్న కారణముచేఁ గృపద్రోణులు కర్ణుని కులగోత్రములను బరీక్షింప లేదు సరిగదా, ధనుర్విద్య యందలి యతని బుద్ధిచాతుర్యమును గూడఁ బరిగణించినట్లు కనఁబడదు. వారికట్టి ప్రసక్తి గలుగక పోవచ్చు. దానికేమి?

అర్జునుఁ డస్త్రవిద్యలో నధికుఁడని పేరువడసి మహారాజ పుత్రుఁ డగుటచే గురుపూజ గావించుచు భారద్వాజుని సంప్రీతునిఁ జేయుచుండె. దానంజేసి గురుఁడు సందర్భానుసారముగా నెడనెడ నర్జును విద్యా కౌశలము మెచ్చుకొనుచుండె. కర్ణుఁడు విలువిద్యలోఁ దక్కిన వారందఱికన్న నధికుఁడై నరునితో సమానుఁడను, లేక యతని కంటెను ఘనుఁడ ననునంతటి గర్వము గలిగియు, లెక్క పెట్టఁదగిన ప్రభు పుత్రులలోఁ జేరకపోవుటచే గురుని మెప్పులకుఁ బాత్రుఁడు గాక నరుని యున్నతినిజూచి యోర్వఁజాల కుండెను. క్షత్రియజాతి కిట్టి మాత్సర్య ముచితమే కదా? కాదేని, విలువిద్యలోఁ దనకంటె నధికుఁడై యడవులఁ బడియున్న యేకలవ్యునిపైఁ గలిగిన యర్జును మాత్సర్యముమాత్ర మెట్లు సమర్థనీయమగును? ఇఁకఁ బ్రభు పుత్రులలో నగ్రగణ్యుండనాఁ బరఁగు దుర్యోధనుఁడో యర్జును మాశిక్క నస్త్రవిద్యఁ గృతార్థుఁడు గాఁజాలక వానిపై నీసుపూని యుండె. అందుచేఁ బాండవులపై సహజద్వేషముగల కౌరవులతోఁ గలిసి కర్ణుఁ డర్జునుతో మచ్చరించుచు దుర్యోధన పక్షపాతియై యుండె. విద్యా

◆ బ్రహ్మాస్త్రాదుల నేర్పుటచేఁ గాఁబోలుఁ గర్ణుఁడు పరశురామునే తన యస్త్రవిద్యా గురువుఁగా నందందుఁ జెప్పికొనెను.

భ్యాస కాలమున నంకురించిన యీ మాత్సర్యమే వీరి భావి మహా విరోధమునకు మూలకారణ మయ్యెననుట నిక్కము. ఈ సమయమునఁ దనపైఁ గర్ణునకు మచ్చరము గలదని యర్జునుఁ డెఱుఁగక పోఁడు కాని యతఁ డేకులముతక్కువవాఁడో యనియుఁ దనంత యస్త్రవేత్త గాఁడనియు గర్వముతో నితఁ డతనిని బరిగణింప కుండె నని యూహింపవలసియున్నది. ఇందులకు ద్రోణుఁడు తక్కిన శిష్యుల నెల్లఁ గాదని, యెల్లధనుర్ధరులలో నిన్నధికునిఁగా జేయుదునని యతనికి ద్వంద్వసంకీర్ణ యుద్ధముల నెఱుఁగును, రథ వాజివారణములపైనుండి యుద్ధముచేయు చిత్రగతులను, బహువిధవ్యూహ భేదనోపాయములను సంప్రయోగ రహస్యములను బ్రత్యేకముగా నేర్పుటయే కారణము. కావుననే యర్జునుఁడు కర్ణుని లెక్క సేయకుండెనన్నచో నాశ్చర్యమేమి? దీనం జేసి వీరిరువురకును మనసులలో మచ్చరము పెరుఁగుచున్న దనుటకు సంశయమేమి!

## అస్త్రవిద్యా సందర్శనము

కురు కుమారుల యస్త్ర విద్యను బరీక్షించుటకై రాజానుమతిని విదురాదులు రంగస్థల మేర్పఱచిరి. అది కౌరవ పాండవులకు మాత్రమే యేర్పడినదగుటచే నచ్చటికిఁ దక్కిన ద్రోణశిష్యులు పౌరజనులవలెఁ జూపఱుగా రాఁదగునుగాని తమవిద్యలఁ జూపుటకు రాఁజన దనుట సత్యము. కాని యీరాజు సామంత మండలి యెదుటఁ దన నేర్పుఁజూపి మెప్పు వడయుదునన్న గట్టి నమ్మకముగల కర్ణునివంటి ధనుర్విద్యా నిపుణునకం దవకాశము లేకపోవుట కష్టముగానే యుండును. రాజకుమారులు తమ తమ యభిమాన విద్యలఁ జూపిరి. విశేషించి యర్జునుఁడు వివిధాస్త్ర లాఘవ వైచిత్రిని జూపెను. సభ్యులందఱు పరమానంద భరితులై యతని నుతించిరి. ఆ విద్యలెల్లఁ జూపి యట్లు పొగడ్త కెక్కఁ దగినవాఁ డందున్న వారిలోఁ గర్ణుఁడు

దక్క వేఱొకఁడు లేఁడు. అతనికట్టి సమయము మరల రాఁబోదు. అర్జునుఁ డొక్కొక్క విద్య చూపు చున్నపుడెల్లఁ దనశక్తి నెపుడు చూపుదునాయని యుబ్బొత్తలూఁగుచు నుత్సాహము పొంగి పొరలి వెల్లివిరియుచుండ బుజము లుప్పొంగు చుండఁ గర్ణుఁ డాత్మవిద్యా ప్రకాశనవ్యగ్రుఁ డయ్యెనన్నఁ దప్పేమి? ఆ కుతూహలము రంగస్థల నియమములను స్మరించునా? పాటించునా? కావునఁ గర్ణుఁ డాహ్వానము లేకయే రంగద్వారముఁ జేరి యొక్కసారి యుఱిమినట్లు బుజమప్పళించి, యా మహాధ్వని వినిన రాజకుమారులు శంకాకులు లగుచుండ సభ్యుల చూపు లొక్కుమ్మడిఁ దనపైఁ బడుచుండ ధైర్య శౌర్య గాంభీర్య సౌందర్యముల మూర్తిభావమో యనునట్లు వచ్చి రంగమధ్యముఁ జొచ్చి 'నీవే నేర్పుకాఁడవు కావు. ఈ విద్యలెల్ల నేను జూపుదునే' యని యర్జును నాక్షేపించి పలికి గురువుగారి యనుమతి వడసి యవలీలగా నవియెల్లఁజూపి పదంపడి యర్జునునితో ద్వంద్వ యుద్ధముఁ జేయ గోరుచున్నా ననెను.

విల్లు పట్టువారికెల్ల సామాన్యమైన యా రంగమునకుఁ బిలువ కుండఁగఁ గర్ణుఁడు వచ్చుట యొప్పో తప్పో! వచ్చెను. వచ్చినవాఁడు తనశక్తిఁ జూపి యూరకొనక యెదుటివాని యస్త్రములు వమ్ముచేసి తన యస్త్రము లమోఘముగాఁ బ్రయోగించుటయే యస్త్రకౌశలము గాని పరుగెత్తుచున్న పంది నోటిలో నమ్ములు గ్రుచ్చుటయు, గారడములు చేయుటయుఁ గాదనెడి యూహతో నహంకరించి తన విద్యను, బూర్తిగాఁ జూపదలఁచి కాఁబోలు! అస్త్రవిద్యా, భుజబల, దర్పితుం డగుటచేతను మత్సరగ్రస్తుఁ డగుడచేతను నర్జును నెక్కటి పోరికిఁ బిలిచె. అది యుద్ధసమయముగాక వినోద సమయమగుటచే నతఁ డట్లు కయ్యమునకుఁ గాలుద్రవ్వుట యుచితము గాదు. అయినను గొంద ఱది శూర ధర్మమందురు. మఱికొందఱు ధీరోద్ధత లక్షణ మందురు. ఆమాట వినిన శూరుఁడు కుమారుఁడు నగు నర్జుననకు

మాత్రమోర్పు గలుగునా? అదిగాక తాను జూపిన విద్యల నాశ్రమం బునఁ జూపిన వానిపై నభిమానియగు పాండవవీరుఁడు బద్ధమత్స రుఁడు గాకుండునా? అందుచేతనే యతఁడీర్ష్యాసూయ లణఁచికొన లేక తోఁక త్రొక్కిన త్రాఁచు మాడ్కి లేచి కఠురోషముతో నిట్లు ధిక్కరించెను.

శ్లో॥ అనాహూతోప సృష్టానా మనాహూతోప జల్పినాం।
యే లోకా స్తాన్ హతః కర్ణ! మయా త్వం ప్రతిపత్స్యసే॥

ఓరీ కర్ణ! పిలువఁబడక సభలకు వచ్చువారును, పిలువకుండ వచ్చి ప్రేలెడి వదరుఁబోతులును బోవు లోకములకు నిన్నుఁ జంపి పంపెదను. ఈ శ్లోకముతో సరిచూచి చదివినపుడు దీనిభావము తెలుగు పద్య ములోఁ గొంచెము స్ఫురించుచున్నట్లుండును గాని ప్రత్యేకముగాఁ జదివినచో నది గోచరింపదు. చూడుఁడు

క॥ పిలువంగఁబడక సభలకు
బలిమింజని పలుకు పాపభాగుల లోకం
బులకుఁజన వేఁడిపలికెదు
పలువ! యెఱుంగవు పరాత్మ పరిమాణంబుల్॥

పిలువకుండఁగ సభలకు వచ్చుట యొక మహాపాపమనెడి నెపము వెట్టి కర్ణునిట్లు 'చూడు చంపెద' నని తిట్టుటయు ధీరోద్ధతలక్షణమే. కాన నియ్యెడ నిరువురు సమానులే యగుచున్నారు. కానిండు! చేఁతలకుఁ దీసిపోని కర్ణుఁడు మాటలకు మాత్రము తీసిపోవునా? అతఁడు మఱియు నుద్ధతుఁడై యిట్లు పలికె.

శ్లో॥ కిం క్షేపై ర్దుర్బలాయాసై శ్శరైః కథయ భారత!
గురోస్సమక్షం యావత్తేహరా మ్యద్య శిరశ్శరైః॥

'ఓ భారత! వ్యర్థప్రయత్నము లయిన యీతిట్లతో నేమి? గురుని యెదుటనే వాఁడి ములుకులతో నీతల యూడవైచునంతలోఁ

జేత నైనచో బాణములతో మాటలాడుము' పూర్వోక్తశ్లోకము లోని భావము మఱుగుపఱచుటకుఁ దగినట్లుగా నన్నయ యీశ్లోకములోని యుత్తరార్థమును విడిచిపెట్టె. అందుకుఁ గారణ మూహ్యము. దీని తెలుఁగు చూడుఁడు :

క॥ అనిన విని పార్థునకు ని
ట్లనియె నినాత్మజుఁడు దుర్బలాయాసక్షే
పనిబంధమ్ములు పలుకక
ఘననిశితాస్త్రములఁ బలుకఁగడఁగుము నాతోన్॥

ఇట్లు పాకము ముదిరినది. ఇద్దఱును గురువు నానతిని యుద్ధసన్నద్ధులైరి. ముందుగాఁ గర్ణుఁడు పార్థునిమీఁదఁ బర్జన్యాస్త్రము ప్రయోగించెను. దానివలనఁ గలిగిన పెంజీఁకటిలోఁబడి యర్జునుఁ డేమయ్యెనో యెవ్వరికిని గానరాలేదు. అంతఁ గొంతసేపటికి కెట్లో యస్త్రవేత్త యగు నతఁడును వాయవ్యాస్త్రమేసి యామేఘపటలమును బటాపంచముఁ గావించెను. అంత ద్వంద్వయుద్ధ విశారదుఁడగు కృపుఁ డేమని తలఁచెనో కాని వారిద్దఱ నడుమఁజొచ్చి కర్ణుని కులగోత్రములను బరీక్షింప నారంభించెను. ఆహా! ఇదెక్కడి రాజనీతి! ద్రోణ భీష్మాదులైన 'నిపుడీ పరీక్ష యే' మనిరా? లేదు. కర్ణుఁ డర్జునుతో యుద్ధము జేయఁదగని కులహీనుఁడని తోఁచినచో మొదటనే యావిచారణ చేయవలెను గాని యిప్పుడేల చేయవలసి వచ్చినది? దీనిచేఁ గర్ణుఁడు పైచేయి యగుననెడి యనుమానము కృపునకుఁ గలిగినట్లు తలఁచుట కడ్డముండునా? దానిపై దుర్యోధనుఁ డంగరాజ్య పట్టాభిషేకము గావించి కర్ణుని రాజుఁ జేసెను. పిదప నర్జునుఁడు మరల నస్త్రము ప్రయోగించి బదులుతీర్చెనా? లేదు. భీముఁడు కర్ణుని నిందించుటతోఁ బ్రొద్దు గ్రుంకినది. ఎవరితెన్నున వా రిండ్లకేగిరి. అస్త్రవిద్యా కౌశలమునఁ దనమిత్రుఁడు పైచేయి యయ్యెననెడి

సంతోషముతో దుర్యోధను, డర్జును వలని భయము విడిచి నాఁటి
రాత్రి ఱొమ్మునఁ జేయి వెట్టికొని సుఖముగా నిద్రించె. కర్ణుఁడును
దనకుఁ గలిగిన విజయమునకుఁ దోడుగా నంగరాజ్యము లభించుట
కానందించుచు దుర్యోధనుతో బద్ధసఖ్యుఁడయ్యె. ధర్మరాజో కర్ణుఁడు
తన తమ్ముని మించెనని తెలిసికొనుటచేతనే 'కర్ణునితో సమానుఁడైన
ధనుర్ధరుఁడు భూమిలో లేఁడని తలంచెను* దీనింబట్టి యీకుమారాస్త్ర
విద్యాసందర్శన సందర్భమున గర్ణుఁ డర్జును మించెననుట కావంతయు
సందేహములేదని తోఁపకుండునా? ఈసందర్భముననే మఱొక్క
విషయము చెప్పవలసియున్నది.

దైవవశమున నదివఱ కెన్నఁడు నొకరి నొకరు కనివిని యెఱుఁగని
యాత్మబంధువు లొకయెడ గలిసికొనుట తటస్థించినపుడు వారికిఁ
బరస్పరము కారణము తెలియని యనురాగ ముదయించుట స్వాభా
వికమని ప్రాచీన కవులు కొందఱు వర్ణించుట గలదు. నిజముగా నట్టి
వారి కట్టి ప్రేమవికారము గలుగుటయు సహజమైన ప్రాణిధర్మమే.
అట్టియెడ విలువిద్య నారంభించినది మొదలుగా నిచ్చలు చూచుకొను
చున్న సోదరులగు కర్ణార్జునులకు ననుభావమును బట్టికాని యాకార
సంపదను బట్టికాని యన్యోన్య మనురాగముగాని గౌరవముగాని
జనియింపలేదు. వీరి నననేల? దూరదృష్టిగల ధర్మరాజునకే యట్టి
మనోవికార ముదయింపలేదు. కర్ణుఁడు చచ్చినపిదప శాంతిపర్వములో
ధర్మజుఁడు, "కర్ణుని మేను కుంతి దేహమువలె నుండుట చూచి
యేమికారణమో యని మనసులో ననుకొనుచుండు వాఁడను.
కౌరవుల మీఁది కోపము కర్ణునిఁ జూడఁగానే పోవుచుండెడిది" అని
యేడ్చినట్లున్నది గాని యంతకు మున్నీయభిప్రాయ మెన్నఁడును
బ్రకటింపలేదు. దీనింబట్టి దేవగుహ్యమైన కర్ణజన్మ వృత్తాంతమును

* యుధిష్ఠిరస్యా ప్యభవత్తదా మతి । ర్న కర్ణతుల్యోఽస్తి ధనుర్ధరః క్షితౌ ॥
నన్నయ దీనిని విడిచిపెట్టెను.

మఱుగుపుచ్చుటకై వ్యాసుఁ డట్లు వర్ణింపలేదనుట విదితమగుచున్నది. నిజమే. అట్లు కాదేని యిఁక భారతమేది? కర్ణుఁడు కౌంతేయుఁడని పాండవులకుఁ దెలిసిన భారతము లేదు. ఆవృత్తాంతము బయటఁ బడనీ! పడకపోనీ! కర్ణుఁడు కౌరవపక్షమునఁ జేరకపోయినను భారతము లేదు. కావుననే 'కర్ణునితల భారత' మనెడి లోకోక్తి పుట్టినది. అతని శౌర్యము బయటఁబడుట కీయస్త్రవిద్యా సందర్శన సందర్భమే మూలమయినది. ఇదియే కర్ణార్జునుల హృదయములను మిక్కిలి ద్వేషమయములు గావించి మహాభారతయుద్ధమునకుఁ బునాదియైనది.

## కర్ణార్జునుల తారతమ్యము

ఇదియే యీవ్యాసమందలి ప్రధానవిషయము. దీనిని మహాయుద్ధ సందర్భమున మరల విమర్శింపఁదలఁచి వీరిద్దఱకును సంబంధించిన చిన్నచిన్న యంశము లందలి తారతమ్యమును వ్యాస నన్నయ తిక్కనల వ్రాఁతల ననుసరించి యించుక తెలుపుచున్నాను.

లక్ష్యవేధిత్వము—ద్రోణుఁడు శిష్యుల లక్ష్యజ్ఞానమును బరీక్షించుటకై యొక చెట్టు కొనకొమ్మమీఁద నొక కృత్రిమపక్షిని బెట్టించి దానితల నఱుకవలెనని చెప్పుచు నొక్కొక్క శిష్యునే పిలిచి దానిం జూపి యేమేమాయడిగి, "నీదృష్టి చెదరినది పోపొ" మ్మనుచు నందఱను పంపి, కడపట నరునిఁ బిలిచి చూపెను. అతని కాపక్షితల తప్ప మరేమియుఁ గనఁబడకుండుటచే నతఁ డొక్కఁడు మాత్రమే దానిని నఱుక సమర్థుఁడయ్యెను. మఱియు ద్రోణుడు సశిష్యుఁడై గంగలో స్నానముచేయుతఱిఁ దనతొడను మొసలి పట్టుకొనఁగా దానిని విడిపింపుఁడని శిష్యుల కానతిచ్చెను. నీటిలో మునిఁగి యగోచరమై యున్న యా మొసలిని దక్కినవా రెవ్వరును గొట్టనేరకపోయిరి. అర్జునుఁడు మాత్ర మైదు బాణములతో దానిని గొట్టెను. అని రెండు చిన్న కథ లున్నవి. ఈరెండు సందర్భములలోఁ గూడఁ గర్ణుఁ డున్న

మాట నిజమే. అయినను ముందుముందు చేయఁబోవు నరుని శస్త్రాస్త్ర విద్యామహిమ ప్రశంసకు శ్రీకారముగా నతని లక్ష్యజ్ఞాన "మేక మద్వితీయ" మని యిప్పట్టుల నీవిధముగా వ్యాసుఁడు లోకమున కెఱింగించెను గాని లేకున్న మూలకథతో నేమియు సందర్భములేని యీచిన్న కథలకుఁ బనియేమున్నది? వీనికెట్లో పనియున్నదని సమర్థింతురా? అట్లైని నిన్నగాక మొన్ననే యర్జునుఁడు చేసిన సకల విధ శస్త్రాస్త్రవైచిత్ర్యముల నవలీలగాఁ జేసిన కర్ణుఁడు వానినెల్ల నేఁడేఁ మఱచెనా? అతని నాఁటి లక్ష్యజ్ఞాన మంతయు నాఁడే యంతరించెనా?

గురుదక్షిణ—ద్రుపదునిఁ బట్టి తెచ్చుట గురుదక్షిణయన్న ద్రోణుని యానతిని శిష్యులందఱు బయలు వెడలిరి. కౌరవపక్షము కర్ణాదులతోఁ ముందుచని పాంచాలునితోఁ బోరాడి పరాజితులై ద్రోణుని మఱుగుఁజొచ్చిరి. అపు డర్జునుఁడు సోదరమాత్ర సహాయుఁడై వెడలి దారుణ రణం బొనరించి ద్రుపదునిఁ బట్టి కట్టి తెచ్చి గురునకు సమర్పించె. ఈసమయమునఁ గర్ణుని నరుఁడు మించెనన్నట్లు తెలియు చున్నది.

ద్రౌపదీ స్వయంవరము—దీనికి వివిధదేశ రాజులు, కర్ణదుర్యోధనాదులు, విప్రవేషములతోఁ బాండునందనులును వచ్చిరి. అనేక రాజపుత్రులు మత్స్యయంత్రము డాసి విల్లెత్తలేక వెడలిరి. దుర్యోధనాదు లెక్కువెట్టలేక మరలిరి. మఱికొందఱు గొనయం బెక్కించియు మోపెట్టలేకపోయిరి. అపుడు కర్ణుఁడు వచ్చి వెంట్రుకవాసి తక్కువగా నారియెక్కించి మోపెట్టలేక విడిచిచనెను. అని యున్నది ఇచ్చట నొక సంస్కృత భారత ప్రతిలో — కర్ణుఁడు విల్లెక్కువెట్టి బాణములు కూర్చుటచూచి ద్రౌపది "నేను సూతుని వరియింప" నని గట్టిగాఁ బలికినట్లును దానిపై గర్ణుఁడు విల్లు డించి వెడలినట్లును

మూఁడు శ్లోకములు గలవు.[1] కాని యాశ్లోకములందే యాక్రిందనే యున్న "కర్ణదుర్యోధనాదు లెంతో కష్టపడియు నెక్కిడలేక విడిచిన వింటి నింద్ర పుత్రుఁ డఱనిముసములో నెక్కిడెను"[2] అన్న మాటలచేఁ బ్రక్షిప్తములని తెలియుచున్నది. కావున వానిని గణింపఁగూడదు. అదిగాక తక్కిన రెండుమూఁడు ప్రతులలోఁ గర్ణుఁడు విల్లెక్కు-వెట్టినట్లు లేదు. అంత నర్జునుఁడు యంత్రముగొట్టి పందెము గెలిచెను. తరువాతఁ బోరు పొసఁగినది. అందు గర్ణార్జునులు గొంతసేపు బాణ యుద్ధము చేసిన పిదప, నరుఁడు వేగవంతములగు నస్త్రములు ప్రయోగింపఁగాఁ గర్ణుఁడు వానినెల్లఁ ద్రిప్పికొట్టి పెద్దబొబ్బ వెట్టెననియు నతని పక్షమువారు సంతసించిరనియు,[3] సంస్కృతమున నుండుట— నన్నయార్యుఁడు "బ్రాహ్మణతేజ మజేయమని తలఁచి కర్ణుఁడు యుద్ధము విడిచిపోయె" ననెడి తరువాతి శ్లోకమున యర్థమున కనుగుణముగా నుండునని తలఁచి కాఁబోలు —

క. వీరుఁడగు నరుని యేయు న
పారశరావలుల నడుమ వారింపంగా
నేరక యేటుడిగి మహా
శూరుఁడు రాధేయుఁ డింద్రజున కిట్లనియెన్॥

అని మార్చి వ్రాసెను. ఈ మార్పు కొంతవఱకు కుచితమనియే చెప్పవచ్చును. ఏమనఁగా! తొలుత నర్జునుఁడు బ్రాహ్మణుఁడను

1. ...కర్ణోఽపి ధనుర్ధరాణాం ప్రవరో జగామ । ఉద్ధృత్య తూర్ణంధను రుద్యతం త । త్సజ్యంచకా రాశు యు యోజ బాణాన్ । ... దృష్ట్వాతుతం ద్రౌపదీవాక్య ముచ్చైర్జగాద నాహం వరయామి సూతం॥
2. ...రాధేయ దుర్యోధనశల్య సాల్వైః ... కృతం నసజ్యం మహతోఽపి యత్నాత్ । తదర్జునో వీర్యవతాం సదర్పః...సజ్యంచ చక్రే నిమిషాంతరేణ॥
3. జ్ఞాత్వా వైకర్తనః కర్ణస్సంరబ్ధ స్సమయోధయత్
అరునేన ప్రయుక్తాం స్తా న్బాణాన్ వేగవత స్తదా।
ప్రతిహత్య ననాదోచ్చైః సైన్యాని తదపూజయన్॥

బుద్ధితోనే యుద్ధమారంభించిన కర్ణుఁడు వాని శరవేగమునకు జంక కున్నచో నడుమనట్లు శంకించుకొని పోరుమాని 'నీ శస్త్రాస్త్ర విజయమునకు సంతసించితిని, నీవు రాముఁడవా? ఇంద్రుఁడవా? అర్జునుఁడవా?' అని యడుగనేల? 'నేను నిన్ను జయింపనున్న బ్రాహ్మణ వీరుఁడను. నిలిచియుండుము' అని యర్జునుఁ డదలించుచుండఁగానే బ్రాహ్మణ తేజ మజేయమని పోరువిడిచి పోనేల? ఇపుడు, తొలుతఁ గర్ణుఁడు కోపావేశమున మఱచి యుద్ధ మారంభించి పిదప బ్రాహ్మణుఁడని తెలివి తెచ్చుకొని రణవిముఖుఁడయ్యెఁ గాని యతనికి జంకి కాదని సమర్థింపవచ్చునుగాని, యెట్లయినను గొంతవఱ కయిన పిదప నరుని తేజము కర్ణునకు బ్రాహ్మణ తేజము మాడ్కి నజేయమని తోఁచిన మాట సత్యమే కావున నిప్పట్టున నర్జునుఁడే పై చేయి యయ్యెనని చెప్పనగును.

ఘోషయాత్ర — ఈ సందర్భమునఁ గర్ణుడు తొలుత గంధర్వుల నుక్కడఁచియుఁ బిదప వారికిఁ జాలక పారిపోయె; దుర్యోధనుఁడు బద్ధుఁడయ్యె. తరువాత నర్జునుఁడు మహాశౌర్యముతోఁ జిత్రసేనాదుల నోర్చి దుర్యోధను విడిపించెను. ఇందుఁ గర్ణు నోడించిన చిత్రసేనాదుల నర్జునుఁ డోర్చెననుట తెల్లమగుచున్నది.

ఉత్తర గోగ్రహణము — ఇది యపూర్వ మద్భుతమునైన ఘట్టము. ఈవల వందల కొలఁది భీష్మద్రోణాది మహావీరులు, వేల కొలఁది సైనికులు. ఆవల నర్జునుఁ డొక్కఁడే. ఆతఁడు వీరినందఱను గెలిచి యావుల మరల్చెను. ఈ సుప్రసిద్ధమైన కథ కేవల మర్జును మహత్త్వముఁ బ్రకటించుటకై కవి కల్పించినదని భావింపఁ జనదు. అట్లయిన భారతమందలి యనేక భాగము లిట్లే పాండవ పక్షపాతమును సూచించునట్లుగాఁ గనఁబడకపోవు. కావునఁ గవి వర్ణించిన దానినిబట్టియే మన మౌచిత్యము నిర్ణయింపవలసి యున్నది.

అర్జునుఁ డప్పటికి సంపాదింపవలసిన దివ్యాస్త్రములన్నియు సంపాదించి, యెపుడు కౌరవులు కంటఁబడుదురు, ఎపుడు వారిని దెగ

ద్రిమ్మరుడు నన్నంత కోపముతోఁ బదుమూఁడేడులు చేతులు కట్టుకొని చెఱలో నున్నట్లుండి నాఁడే బయటఁబడిన వాఁడు. వానిని జూచి నంతనే —

శా. సింగం బాఁకటితో గుహాంతరమునం జేడ్పాటు మైనుండి మా
తంగస్ఫూర్జిత యూధదర్శన సముద్యత్క్రోధమై వచ్చునో
జం గాంతార నివాస ఖిన్నమతి నస్మత్సేనపై వీఁడె వ
చ్చెం గుంతీసుత మధ్యముండు సమరస్థేమాభి రామాకృతిన్॥

ఉ. ఈతనితోడి కయ్యమున కియ్యకొనం దగువార లస్మదీ
యాతతసేనలోఁ గలుగు టారయ సంశయ మెల్లభంగి గో
త్రాతనివర్తనంబు సుకరంబ కిరీటి కితండు రుద్రునిం
బ్రీతునిఁ జేసెనా వినమె పెంపెస లారెడు బాహుసంపదన్॥

ఉ. వచ్చినవాఁడు ఫల్గునుఁ డవశ్యము గెల్తు మనంగ రాదు —

అని ద్రోణభీష్ములు పలికిన మాటలు పాండవ పక్షపాతమును దెల్పుచు సంధిచేయు తలంపుతోఁ బలికిన యతిశయోక్తులని భావింపరాదు. నిజముగా నెదురు వచ్చినచో రుద్రునకైనను వెనుకటిదెబ్బ జ్ఞప్తికిఁ దెచ్చి జంకు పుట్టించు నంతటి భీకరాకార సంపదతో మబ్బు విడిచిన మధ్యాహ్న మార్తాండుని చూడ్కి నుగ్రుఁడై వచ్చిన నాఁటి యర్జునుని జూచినపుడు ద్రోణభీష్ముల కట్టి శంక గలిగినదన్న ననవచ్చును. కాని యీ పట్టున 'నంతటి మహాసేనయేమి? ఒక్క యర్జునుఁడేమి? గెలుచుటయేమి? అతఁ డంతటి యసహాయ జగదేక వీరుఁడైనచో మహాభారత యుద్ధము పదునెనిమిది దినము లేల జరుగవలయును? తన సేననంత నేల గోల్పోవలయును? కౌరవుల పదునొకం డక్షౌహిణుల నొక్కనాఁడు పరిమార్పలేకపోయెనా? కావున నుత్తర గోగ్రహణ మర్జునున కెక్కడలేని గొప్పతనము తెచ్చిపెట్టుటకై కవి కల్పించిన చిత్రకథగాఁ దోఁచుచున్న' దని కొందఱు తలంప

వచ్చును. సత్యమే కాని 'స్థితస్యగతి శ్చింతనీయా' యను బుద్ధితో నించుక యాలోచింతము. ఇందు యుద్ధారంభముననే యున్న 'కౌరవ సేనల నుఱుమాడుట, చిత్రాంగదాది కుమారుల సిగ్గించుట' యను భాగము లర్జును సర్వాతిశాయిత్వమును దెల్పుటకుఁ గల్పింపఁబడిన యత్యుక్తిభూయిష్ఠములని వాని నుపేక్షింపవలసి యున్నది. అట్లు చేయనిచో వేలకొలఁది సైనికుల నొక్కఁ డొక్కఁడు తుముల యుద్ధమున నుఱుమాడుటయు నపుడు భీష్మాది మహావీరులు ఫలహార ములు చేయుచు నూరకుండుటయు సంభవింపదు. ఆ భాగములను సరకుచేయనిచోఁ బిదప "నొక్కనితోఁ బెక్కండ్రు పోరాద" రా దను యుద్ధనియమమున కనుగుణముగానే యర్జునుఁడు కర్ణద్రోణా శ్వత్థామ కృపభీష్మదుర్యోధనులతో వేఱువేఱుగాఁ బోరాడి వారిని దఱుముటయు, నంత సేనలన్నియుఁ బైఁబడఁ జొచ్చినపుడు నరుఁడు సమ్మోహనాస్త్రముచే వారినెల్ల నొఱగఁజేయుటయు నాఁటి యుత్తరుని వేగమునకుఁ దగిన కృత్యములేయని సమర్థింపవచ్చును.

ఇట్లు మనయిష్టము వచ్చినట్లొక కథలోఁ గొంతగాదని కొంత గ్రహించుట యుక్తముగాదని కొంద ఱనవచ్చును. కాని యీనిర్ణయ మర్జునుని యాధిక్యమును సమర్థించుటకుఁ గాక యుత్తరగోగ్రహణ కథ కౌచిత్యము గలిగించుట కగునుగాన యుక్తమని యంగీకరింపనగును. అట్లు కాదందురా యిప్పుడైననేమి? ఒక్క భీష్మునకుఁ గాక మఱి యెవ్వరికిని దెలియని సమ్మోహనాస్త్రము చేతిలో నుండఁగా నతఁ డందఱను ముందే యొఱగఁగొట్టి కంతము లుత్తరించిన దిక్కేమిగలదు? కావుననే భీష్ముఁడు దుర్యోధనునితో,

క. ఇంత యెఱుంగవు సైన్యము
లింతపడిం దలలుచీర లెఱుఁగక మోహా
క్రాంతంబులయ్యెఁ బని తెగుఁ
గాంతేయుఁడు చోరఁడు గాని క్రౌర్యంబునకున్.

ఉ. మోహన బాణపాశమున ముందలచీర లెఱుంగకున్న యీ
బాహుబలంబుతోఁ గడఁగి పార్థునిఁ దాకెడు బుద్ధిఁ గమ్మరన్
సాహస వృత్తిఁజేసి యవిచారతఁ బోయితిమేని వాఁడు పూ
ర్ణాహుతి సేయఁడే మనల నందఱ నొక్కట మారణాగ్నికిన్.

అని పలికిన మాట లెంతయు నుచితము లగుచున్నవి. కావున నిది సంపూర్ణయుద్ధము, సరియైన యుద్ధమును గాదు. కాని యెట్లయిన నిప్పట్టున నొక్క కర్ణుఁడే కాఁడు భీష్ముఁడు దక్కఁ దక్కిన వీరులందఱు గూడ నర్జునున కోడిరనియే చెప్పవచ్చును.

అస్త్రాదులు—ఇద్దఱుగూడ దివ్యాస్త్ర ప్రయోగ సంహారము లెఱుఁగుదురు. వీరికిఁగల కొన్ని ప్రధానాస్త్రముల నిం దుదాహ రించెదను. కర్ణునకు—బ్రాహ్మము, రౌద్రము, సర్పముఖము, భార్గ వము, నను మహాస్త్రములు గలవు. కాలపృష్ఠమను మహాధనువు గలదు. అర్జునునకు—బ్రాహ్మము, రౌద్రము, పాశుపతము, బ్రహ్మ శిరోస్త్రము, సమ్మోహనము, ఐంద్రము, గాండీవము, నక్షయతూణీ రములును గలవు. రాధేయునకు సహజములైన యమృతములైన కవచకుండలములు గలవు. కౌంతేయునకుఁ గిరీటము, దేవదత్తమును గలవు.

ప్రత్యేక విజయములు—భారత మెల్లెడల నర్జును విజయములే వినఁ బడునుగాని కర్ణునివి గనఁబడవు. మూలకథతోఁ బ్రసక్తి లేకపోవుటచే వ్యాసుఁడు వానిని వర్ణింపలేదన వచ్చును. అయినను బ్రసక్తానుప్రసక్త ములై యందందుఁ జేర్పఁబడిన కొన్నిటి నిందుఁ జూపెదను. అర్జు నుఁడు శక్రాదుల నోర్చి ఖాండవ మేర్చె. యాదవులఁ ద్రోచి సుభ ద్రను దెచ్చె. ఎల్లరాజుల నోర్చి ద్రౌపదిని దెచ్చె. ఉత్తర దిగ్వి జయంబుచేసి యరియప్పనములు దెచ్చె. ద్రుపదుని బట్టితెచ్చె. గోగ్రహణమున గౌరవుల నోర్చె. నివాతకవచులఁ గొట్టె. కాలకే

యాదుల మర్దించె. కర్ణుఁడో శుభాంగీ స్వయంవరమున దుర్యోధను నకుఁగా నీల రుక్మి శిశుపాలాది రాజుల నోడించె. బాహుయుద్ధమున జరాసంధుని యంగసంధి వికలము గావించి యతని వలన మాలినీ నగరము గైకొనె. వైదేహపౌండ్రాదిరాజుల నోర్చి యరిగాఁపులఁ గావించె. అర్జునుఁడు బాహుయుద్ధ విశారదుఁడు గాఁడు. కర్ణుని యెడ నిది విశేషము.

సుగుణములు—వీరిద్దఱు తపశ్శాలులు. దేవబ్రాహ్మణ భక్తితత్పరులు. వేద వాదరతులు. ధర్మశాస్త్ర పారీణులు. శౌర్యాలంకారులు. ఆరబ్ధ కార్యదక్షులు. ఏవో యొకటి రెండు లోపములున్నను మొత్తము మీఁద ధీరోదాత్తులని కొన్ని వర్ణనల వలనఁ దెలియుచున్నది.

దానము—అర్జునుఁడుగూడ దాతయైనట్లు కలదుగాని యిందుఁగర్ణునకుఁగల జగద్విఖ్యాతి యతనికి లేదనుట స్పష్టము. కర్ణుఁడు శిబి, దధీచ్యాదులకెనయైన మహాదాతయనుటకుఁ దన కపాయము గలుగునని యెఱిఁగియుఁ దన్ను మోసపుచ్చ వచ్చెనని తెలిసియు నింద్రునకుఁ గవచకుండలములను దేహ మొలిచి యిచ్చెననుటయే గొప్ప నిదర్శనము. కావున దాతృత్వమున నప్పటి భారతవీరు లెవ్వరుఁ గూడ గర్ణునకు సాటిరారనుట నిక్కము.

ప్రతిజ్ఞా పరిపాలనము—సైంధవవధ, భీష్మహననముల యందలి యర్జును ప్రతిజ్ఞలు లెక్కచేయఁ దగినవికావు. లెక్క పెట్టఁదగిన ద్రుపదాయనము, ఖాండవదహనము మున్నగు శౌర్యసాధ్యములైన ప్రతినల నిర్వహించుటయైనను కర్ణునిదృఢప్రతిజ్ఞాపాలనము నెదుటఁ బరిగణనీయముగాదు. ఇతఁడు పాండవులు తన తమ్ములని తెలియని కాలమున వారిపై యీర్ష్యచేతనే కానిండు, దుర్యోధనునితో బద్ధసఖ్యుఁడనై యుండెదనని మాటయిచ్చి యట్లే యతనికి బాసటయై యుండె. రాయబారమువేళఁ గృష్ణుఁ డితనిని బాండవ పక్షమునకు ద్రిప్ప నెన్నియుపాయము లుపయోగింపవలెనో, యన్నియు నుప

యోగించెను. తుదకు 'పాంచాల రాజపుత్రియు। నంచితముగ నిన్నుఁ గూడు నార్వుర వరుసన్' అనుచు స్త్రీరత్నలోభము పుట్టించి త్రిప్పఁ జూచెను కాని స్థిరచిత్తుఁడు ధీరుఁడు నైన కర్ణుఁడు రాజ్యాదిభోగంబులకు లోనుగాక,

ఉ. సూతసుతుండు వీఁడనక సూనుల తమ్ములకంటె నాకు సం
ప్రీతియొనర్చి తేజమును బెంపును నాఁటికినాఁటి కగ్గలం
బై తనరార నన్నుఁ దనయంతటి మానిసిఁ జేసియుండ నే
నేతగవూఁది యాకురుకులేశ్వరుఁ గాయుదు ముట్టవచ్చినన్॥

అనుచు సుయోధను విడిచి వచ్చుట యధర్మమని సమయనిష్ఠఁ జూపి మఱియును,

క. గెలు పయ్యుధిష్ఠిరునకు। గల దెఱుఁగుదు నీవుచెప్పఁగా నేమి
టికిన్.

అనుచు పాండవులు జయింతురని తెలిసియు, ఏయుద్ధమునకు మూలమైన నేను సమరసముద్రంబు దఱియవీఁది నిన్నుం గనియెద. కాదేని యూర్ధ్వలోకంబునఁ గాంచెద. నీవింక నేమియుం బలుకకు మనుచుఁ గృష్ణుండు సాక్షాద్విష్ణుండు పాండవులకు సహాయుఁడై యుండెనని యెఱిఁగియు నతని మాటలు పెడచెవులం బెట్టె.

మఱియును గంగాతీరమున జపించుచున్న కర్ణునిం గని కుంతి 'నాయనా! నీవు నాతనయుండవు. వచ్చి పాండవులంగూడి రాజ్యమేలు' మని చెప్పినపుడు సూర్యమండలము నుండి 'సత్యము సత్యము నీతల్లి పనుపుచేయు' మను మాటలు వినఁబడియె. అప్పుడైనను ధైర్యము వదలక తగినమాటలు చెప్పి "అమ్మా! ఏ నవశ్యంబు దుర్యోధనునకై నీకొడుకులతోడం బెనంగెద :

"ఆ॥ సవ్యసాచిచేతఁ జచ్చుటయును కీర్తికరమ యతఁడు లోను
గాఁగ నేవు
రేనులోనుగాఁగ నేవురుగాని నీకొడుకు లార్వురనుట విడువుమింక॥"

అనుచుఁ దల్లి కోర్కెదీర్చి దృఢాభిప్రాయము దెలిపి నిశ్చలుఁడై యుండెఁ. ఇదిగదా ధైర్యము! ఇంతయేల? సూర్యుఁడు విప్రరూపమున గనఁబడి "కుమారా! ఇంద్రుఁడు తన కుమారునికై నిన్ను మోసపుచ్చి నీ కవచకుండలములు హరియింప రానున్నాఁడు. ఇచ్చితివేని నీకు ముప్పు వాటిల్లు" నని చెప్పినను, అడిగినవానికి లేదని చెప్పనని చేసిన ప్రతిజ్ఞకు వెఱచి తనకు హాని వచ్చునని నిశ్చయించుకొనియు నింద్రునకు వాని నిచ్చెఁగాని వెనుదీసెనా? ఆహా! ప్రతిజ్ఞాపాలన మనఁగా నిదిగాని వేఱొకటియా? కర్ణుని సుహృత్త్వమంతయు నీరెండు విషయంబుల మూర్తీభవించి ప్రత్యక్షము గాలేదా?

గురుజనభక్తి—ఎట్టిదశలోనైన మాఱక పెద్దలయందు స్థిరముగా నిలుచునదే భక్తి. విద్యాగురువులనియుఁ బూజ్యులనియు గణింపక కర్ణుఁ డెన్నో మాఱులు ద్రోణకృపభీష్ములను నిందించె. తుదకు ధృతరాష్ట్రుని శ్రీకృష్ణునిగూడ దూషించె. శత్రుపక్షములోని వారని యెఱిఁగియు ద్రోణాదుల నెప్పుడును గౌరవించుచుండెఁ గాని యర్జునుఁడు తూలనాడి యెఱుఁగఁడు.

దుర్గుణములు—ఎంతటి వారికైనను సుగుణములతోపాటు దుర్గుణములు గూడఁ గొన్ని యుండకపోవు. అవి లేకున్న మానవత్వమే లేదు. పుణ్యపాపమిశ్రమైన మానవత్వమునఁ దప్పు దొరకకపోవునా?

ఈర్ష్య—ఇది కర్ణున కెక్కువ. నిజముగా ధర్మరాజు నేర్పు, భీముని లావు, నరుని విలుబల్మి, నకుల సహదేవుల నయశాస్త్రకోవిదత్వమును జూచి యోర్వలేక విశేషించి నరుని యున్నతిని జూడలేక యితఁడు దుర్మార్గుఁడైన దుర్యోధనునితో స్నేహ మొనర్చె. అర్జును పేరు విను నపుడెల్ల మనస్సు దహించునంతటి యీసు కర్ణునకుఁ గలదని యెల్ల సందర్భముల వినఁబడును గాని కర్ణునియెడ నర్జునునకట్లున్నట్లు గోచరింపదు. తన్ను ద్వేషించుచున్న వానియం దిసుమంతయు లేదని చెప్పఁదగదుగాని యది చెప్పఁదగినంత లేదు. మఱియుఁ గర్ణుఁడర్జునుని

శౌర్యము నెన్నఁడు నంగీకరింపలేదు గాని పెక్కు మాఱు లితఁడతని పరాక్రమమును బ్రశంసించి తన యౌదార్యముఁ బ్రకటించెను.

కోపము, గర్వము — ఇవి యిరువురకును గూడఁ గలవని పలు సందర్భములఁ దేటపడును. కర్ణుఁడు కోపముతోఁ బలుమాఱులు గురుభీష్మాదుల నిందించె. అర్జునుఁడు మనసు నిలుపుకొనలేక తాత్కాలికముగా ధర్మరాజు నొకమాఱు నిందించెఁ గాని యది గణనీయము కాదు. ఇఁక వీరి గర్వోక్తులకా లెక్కలేదు.

అసత్యము — అర్జునుఁడసత్యవాదియనుటకుఁ దగినంత యుదాహరణము గానరాదు ‡ గాని కర్ణుఁడుమాత్ర మొకటి రెండసత్యములు పలికెను. పరశురాముని యొద్దకుఁబోయి బ్రాహ్మణుఁడనని దబ్బఱ పలికి బ్రహ్మాస్త్రమును గైకొనె. అది యతని శాపంబున నప్పుడే వికలమగుట నెఱిఁగి విచారించివచ్చి దుర్యోధనునితో —

ఆ. "అధిప! పరశురాము నాశ్రయించితిఁ గృతార్థుండనైతి నన్ను భండ
నమున మార్కొనంగలేరు మఱి లిజ్జగంబున........."

అనుచు నసత్యముతోఁ బ్రగల్భములు పలికి తన జేని మెప్పించె. ఇతని యసత్య వాదిత్వమున కిదియే చెప్పఁదగిన యుదాహరణము. ఇదిగాక కర్ణుఁడింకొక్క తప్పు చేసెనని చెప్పక తప్పదు.

ద్రౌపదిని పరిభవించుట — ద్యూత సభకు "ఆర్యులారా! ధర్మము చెప్పుఁడు చెప్పుఁ" డనుచు వదరుచున్న యార్తురాలు పతివ్రతయగు ద్రౌపదిని దుశ్శాసనుఁడు కొప్పువట్టి యీడ్చి తెచ్చి యుండఁగాఁ గర్ణుఁడు చూచి నవ్వుచు * దుశ్శాసనా! దాసియైన

‡ స్వయంవర కాలమున బ్రాహ్మణుఁడ నని చెప్పుట యసత్యముగాఁ బరిగణింపరాదు. అపుడు వారు ప్రచ్ఛన్నులై యుండిరి.

* కర్ణో దుశ్శాసనం త్వాహ కృష్ణాం దాసీంత్వహేనయ

పాంచాలి నిటఁ దీసికొని రమ్మని యామెం జూచి ♦ "ఓసీ! నీవు నిర్ధనుఁ
డైన దాసుని భార్యవు. ఇఁక నీకు ధార్తరాష్ట్రులు విభులుగాని పాండ
వులు కారు. వారు జూదమున నిన్నోడిపోయిరి కావున నీకు వారు
లేనివారే. నీవిపుడు దుర్యోధనునకు దాసివైతివి. అదిగాక పెక్కం
డ్రకు నీవొక్కతెవు భార్యవై యుండుట నీచమైన పని కావున—

గీ॥ తరుణి! యేవురకంటె నొక్కరుఁడు భర్త
యగుటలగ్గు జూదంబున నాలి
నోటువడని వానిఁగాఁ దగుభర్తఁ బడయుమింక—"

అనుచు నుల్లసమాడె. ఉత్తమకులాంగన నట్లు కర్ణునివంటి మహా
వీరుఁడు నిండుసభలో దూషించుట క్షాత్రమా? వీర్యమా? ఏదియుఁ
గాదు. కడుపుమంట తీర్చికొనుట. కావున నిది యెంతయు ననుచిత
మైన పని యనుటకు సందియము లేదు. తాను దుర్యోధను పక్షములోఁ
జేరినవాఁ డగుటచేఁ బాండవులను ద్వేషించుఁగాక. వారు దైవోప
హతులైనపు డారీతిని బరభార్య ననరాని మాటలనుట హేయము
గాదా? మొన్న మొన్నటి శివాజీవంటి సామాన్య వీరుఁడుగూడ
శత్రువంశములోని మహమ్మదీయ కన్యయైన రోషనార యొంటి
కత్తెయై కంటఁబడినపుడు దాని నోదార్చి తీసికొనివచ్చి తల్లిగా
భావించెనని వినుచున్న మనకు ద్వాపరయుగమందలి యుత్తమ
క్షత్రియ వీరుఁడైన కర్ణుఁ డట్లు కులాంగనఁ బరిభవించెనని వినుట
యెంత మనశ్శల్యముగా నుండునో చూడుఁడు! ఇట్టియెడ నెంత చేతఁ
గాని యనదయైనను, చేతనైన శాంతుఁడైననుగూడఁ దనభార్యను

---

♦ దానన్యపత్నీ త్వధనన్యభద్రే హీనేశ్వరే........ఈశాస్తు సర్వే తవరాజ
పుత్రి భవంతి వై ధార్తరాష్ట్రా న పార్థాః దాసీభూతా త్వం హి వై యాజ్ఞసేని పరాజి
తాస్తే పతయో నైవ సంతి అవాచ్యా వై పతిషు కామవృత్తిః ........ అన్యం వృణీష్వ
పతిమాశు భామిని! యస్మాద్దాస్యం న లభసి దేవనేన——ఇత్యాది.

బరుఁడట్లు తూలనాడుచుండఁగా విని యూరకుండఁ డనుట యుమ్మా టికిని నిక్కము. కాని, వీరాతివీరుఁడైన యర్జునుఁడు తన ప్రియురాలి నట్లు శత్రుపక్షములోని కర్ణుఁడు దుర్భాషలాడుచుండఁగా ధర్మ బద్ధుడై పెదవి కదల్పక మిన్నకుండెఁగాని పల్లెత్తుమాటయైనను రానీయలేదు. తరువాత నుత్తర గోగ్రహణకాలమునఁ గర్ణుఁడు కంటఁ బడినతోడనే యతఁడు మూదలించిన మాట లివియే. కర్ణుని యీమాటల నతఁడు చచ్చువఱకుఁగూడఁ బాండవులు పాంచా లియుఁ బలుమాఱులు స్మరించుకొనుచుండిరనుటయే యీమాట లపు డాసభలో వారి హృదయముల నెట్లు దహించెనో తెలుపఁగలదు. ఈమాటలు మనసులో మండుటచేతనే తనచే మూర్ఛనొందిన కర్ణుని నాలుక తెగఁగోయ సిద్ధపడిన భీముఁడు శల్యునిచే నడ్డగింపఁ బడియె. ఈమాటలు హృదయ మర్మములను బొడుచుచుండుటచేతనే "యింకను గర్ణునిఁ జంపకుండఁగా వచ్చితివా" యని ధర్మజుఁడు నరుని నిందించె. కావున నీసమయమునఁ గర్ణుఁడు గొప్పతప్పు చేసినవాఁడని నొక్కి వక్కాణింపవచ్చును. దీనింబట్టి యీార్ష్యా సూయాకోపముల నణఁచికొనలేక యనుచిత మార్గమున బయటఁ బడునట్టి స్వభావముగలవాఁడు కర్ణుఁ డనియు నెట్టి యిక్కట్టువచ్చినను సమయమును గనిపెట్టి ధర్మమునకు బద్ధుడై కోపమును దిగమ్రింగు ధీరగభీరహృదయుఁ డర్జునుఁ డనియుఁ దెలియుచున్నది.

అశక్తిదుర్జనత్వము — రాయబారిగా వచ్చిన శ్రీకృష్ణునిఁ జెఱఁ బెట్టఁ దలఁచిన దుష్టచతుష్టయములోనివాఁడు కర్ణుఁడు. గోవిందుని మహత్త్వ మెఱిఁగియు నలవిగాని యపకీర్తికరమైన యాపనికి గడఁగుటయే యతని యశక్తదుర్జనత్వమునకుఁ దార్కాణము. ఇట్టి యవివేక కృత్యముల నర్జునుఁ డొనరించియుండలేదు.

## — అభిప్రాయములు —

" కర్ణార్జునులయందు ఘనుఁడెవ్వఁడగు నొక్కొ-
యను జనంబుల సందియంబు మాన్ప "

అనునట్లు వీరిద్దఱ తారతమ్యము నిఁక సూక్ష్మదృష్టితోఁ జర్చింపఁ దలఁచి వీరిపైఁ బెద్దలిచ్చిన యభిప్రాయములను ముందుగాఁ దీసికొందమన్నఁ గౌరవ పక్షములోని వారైనను భీష్మద్రోణకృపాదు లిచ్చిన యభిప్రాయములనే యర్జున పక్షపాతములని నిరసింతురుగదా ! యిఁకఁ దక్కినవానిని జెప్పనేల ? అయిన నొక్క భీష్ముఁడు పరలోకగతి నిరీక్షించుచు నంపశయ్యపై నుండి చెప్పిన మాటలు చూతము :

భీష్ముఁడు దుర్యోధనునితో—

మ. నరుఁ డత్యద్భుత విక్రముం డతని కా నారాయణుండొప్పుఁ డె
వ్వరికిన్ వీరి జయింపరాదు—అని చెప్పెను.

కర్ణునితో—

క. నీయుదయము దైవిక గర్భాయత్తము నీకు మస్కు లసదృశులు-
చ... ...............అంతకుఁ జాలుటెఱుంగనే సుయో
ధనునకు నెప్డు నీదు భుజదర్పముగాదె సహాయము ?

అనిచెప్పెను. ఈమాటలు చూడఁగా భావివిజయ మెట్లయినఁ బాండవులదే యను సూచనతోఁ గర్ణార్జును లిరువురకుఁగూడ మహాత్త్వమున్నట్లు భీష్ముఁడు పలికెనని తోఁచుచున్నది. కాని కర్ణునకు దైవబలములేదు. అర్జునునకుఁ గనబడుచున్నది. దీనింబట్టి కర్ణపక్షమువారు కృష్ణుఁడు లేనిచో నరునకు జయమెక్కడిది ? కర్ణుఁడే తప్పక గెలిచియుండు నందురు. అర్జునపక్షము వారో, 'కృష్ణ సాహాయ్యము లేకుండఁగా నసహాయశూరుఁడై యతఁ డనేక యుద్ధముల గెలుపొందలేదా ? అపుడు కర్ణుఁ డుండియుఁగూడ నతనికిఁ జాలకుండుట విదితము

గాదా ?' యందురు. అందుకు మరల వారు శ్రీమన్నారాయణుని దివ్యతేజము నరునియందు మొదటినుండియు నున్నదనెడి భాగవత మతము నుగ్గడించి యతఁడొంటరియై పొందిన జయము లన్నిటికి దైవ బలమే మూలకారణమని నిరూపింతురు. ఇందుకు మరల వీరు, కర్ణునకు లేని దైవ బలము తెచ్చి పెట్టుటగాని యర్జునున కున్నదానిని దీసి వేయుటగాని యెవరి తరమగును? పూర్వజన్మ కర్మఫలములై యాజన్మ సిద్ధములైన బలా బలములను బట్టి వారిభేదము నిరూపింపవలసినదే కాని వీనికి దైవబల మున్నది గావున జయించి నాఁడనుట యేటిమాట ? యని వారివాదమును నిరసింతురు. ఇందుకు మరల వారు, లేని దైవ బలము తెచ్చిపెట్ట నక్కఱలేదు. ఉన్న బలముగూడ శాపాదులచే నణఁగిపోయినపుడు గదా యర్జునుఁడు గెలిచెను ! కావున నదియొక గెలుపు గాదనుచున్నాము. ఆశాపములే లేనిచోఁ గర్ణుఁడు జయించుట కాటంకముండునా ? యని యుక్తి చెప్పుదురు. ఇట్లున్నది. ఇపుడు మనము చెప్పవలసిన దేమి ?— ఏమియు లేదు. ముందుగా మహా భారత యుద్ధరంగమునకుఁ బోయి వీరి యుద్ధవిశారదత్వమును బరిశీ లింతము. తరువాత నేమి తోఁచునో !

## యుద్ధరంగము—కర్ణార్జునులు.

వీరియుద్ధ మాలోకించుటకు ముం దాకాశమున బ్రహ్మరుద్రేం ద్రులు మాటలు వినఁబడుచున్నవి. వినుఁడు. వానిచేఁ గొంత సంశయము వాయఁ గలదు :

క॥ ఇరువురు నతిరథులు సమ
స్ఫురణులు విక్రాంతిపరులు శూరులు వీ రొం
డొరువురతోఁ బెనఁగఁగఁన
శ్వరమగు జగ ముడుపరాదె సమరం బనఘా !

క॥ అనవిని యాదేవుండ
వ్వనజభవున కిట్టులను నవారోద్ధతులీ
ఘనభుజులు వీరిరణమె
ట్లును జెల్లుం దప్ప దప్పలుకు విడుమింకన్.

అను సల్లాపంబు లాకర్ణించి పాకశాసనుండు, నరనారాయణుల కెందును జయంబు ధ్రువంబు......కర్ణుండు భీష్మద్రోణ ప్రాప్తంబైన పుణ్యలోకంబు వడయుఁ, గిరీటి చిరకాలం బిడుమలం బడినవాఁడు కావున రాజ్యసుఖంబు లనుభవించుఁగాక యనిన...... ఈశానుండు,

గీ॥ మహితమునులగు వీరెందు మాఱులేక
మెలఁగు వారయిగారె జన్మించినారు
వినుము నీచెప్పినట్టులు వీరి నోఱులు
ధిక్కరించుట లోకహితంబుగాదు.

వింటిరా వారిమాటలు! వీనింబట్టి కర్ణుని పౌరుషపరాక్రమము లర్జునున కెందును దీసిపోక బ్రహ్మరుద్రాదులకుఁ గూడ విస్మయ సంశయములు గలిగించునంతటివి యనియు. నరనారాయణులు లోకహితార్థము జన్మించిన వారగుట నరుని విజయము విధివిహితమయ్యెననియుఁ దెలియుచుండలేదా? ఇఁక యుద్ధము చూతము.

కర్ణార్జును లిరువాఁగుల మేటిమగలై వెలయుచుండిరి. ఇంతటి వీరు లయ్యు వీరు మిక్కిలి యధర్మకార్యము లాచరించిరి. శిఖండి చాటున నిలిచి కిరీటి గాంగేయునిఁ గొట్టి యపకీర్తి పాలయ్యె. పెద్దకుత్రపన్నిన ద్రోణాది వీరులలో నొకడగు కర్ణుఁడు ముందుగా, సైనికులతోఁ బోరు సలుపుచున్న మహాశూరకుమారుఁడగు నభిమన్యుని వెనుక పక్కకు మెల్లగాఁజేరి తెలియకుండగాఁ నతని విల్లునతికి యంతకంటెను మిక్కిలి నీచమైన దుష్కీర్తి పాలయ్యె. విజయకాంక్ష యెట్టివారి నైన నధర్మమునకు దింపుననుట నిజమయ్యె. పిదప వీరిద్దఱు ద్రోణుఁడు బ్రతికి యుండఁగా రెండుమాఱులు తలపడిరి. ఒకసారి ద్రోణుఁడును మఱి

యొకసారి యశ్వత్థామయు నడ్డుపడి కర్ణునిఁ దప్పించిరి. కాని యిట్టి దపజయము కాదు. ఎంతటి శూరులైన నొక్కొక్కప్పుడు పారిపోవుటయు మూర్ఛపడుటయు వెనుదీయుటయు నెడ నెడ సంభవించుచునే యుండును. ఇందులకు వారిని వీరిని జూపనేల? యుధిష్ఠిర భీమ నకుల సహదేవులీ కర్ణునిచేత దెబ్బలు తినుటయేకాదు, తిట్లు గూడఁ దిని పాఱిపోయిరి. ఇంతయేల? తన్నెదుర్కొన వచ్చుచున్న కర్ణుఁడు నడుమ నడ్డ పడిన పాండవ సైనికులపై భార్గవాస్త్రంబు ప్రయోగింప, వారు దానిబాధ పడలేక తన్నుఁ జేర్కొని యాక్రందించునపుడీ యర్జునుఁడే శౌరితో —

"..... ...... ............. .. .....ఇప్డు నేర్పుమై
నుండక యీసునందొడరి యోటమి తెచ్చుకొనంగ నేటికిన్?

క. చచ్చిన మఱిగెల్చుగొనన్
వచ్చునె! తనయొడలు గలుగ వైరుల గెలువన్
వచ్చుం దఱివచ్చిన నది
మెచ్చు జయార్థులకు మరుదమిత్రధ్వంసీ!

గీ॥ పట్టపగలింటిసూర్యుని పగిది గర్ణుఁ
డుగ్రమూర్తియై వెలుఁగుచు నున్నవాఁడు
మాధవా! మన రథమును మరలనిమ్ము
బ్రతికియుండిన శుభములఁ బడయవచ్చు.

అనుచుఁ దొలఁగి యశ్వత్థామ మీఁదికిఁ బోయె. కావున నిజమైన వెనుదీయుట యర్జునునిదైనదిగాని కర్ణునిది గాలేదు. ఇఁకనో కర్ణుఁడు భీమునిచేత మూర్ఛితుఁడు కాలేదా? అపుడతఁడు తమ్ముని ప్రతినకుఁ దలఁకెగాని లేకున్న నప్పుడే కర్ణుఁడు సమసియుండఁడా యని యడుగ వచ్చు. కాని యుద్ధమున మూర్ఛవడుట శౌర్యలోపము గాదు. అట్టి

వానిని జంపఁ జూచుటయు వీరధర్మముగాదు. అట్లయిన ధర్మరాజ భీమ నకులాదులు తనబారిఁ బడినపుడు కర్ణుఁడు కుంతి కిచ్చినమాట తలఁచికొని విడిచెఁగాని యపుడే చంపినచోఁ జేసెడిదేమి? కావునఁ బాండవుల నందఱ నొక్కొక్కమాఱు బాబో! యనిపించినవాఁడు కర్ణుఁడుగాని, యతనిని వీరిలో నొక్కరుఁడైన నట్లనిపించలేదని తెలియుచున్నది.

## అస్త్రబలపరీక్ష

ఇంద్రుఁ డిచ్చిన కర్ణుని శక్తి ఘటోత్కచునితోఁ బోయినది. అర్జునుని పాశుపతము సైంధవుని తలతోఁ బోయినది. అతని బ్రహ్మ శిరోస్త్ర మశ్వత్థామ కొఱకుఁ బొదిలో దాఁగియున్నది. సమ్మోహ నాస్త్ర మేమయినదో! మరల రాలేదు. ఇఁకఁ దక్కినవారి ముఖ్యా స్త్రము లేమయినవో చూతము. కొంతసేపు చిల్లరి యస్త్రములతోఁ బోరు సాగినది. అందుఁ బార్థుని దివ్యబాణము లనేకములు రాధే యునిచేత వమ్మయిపోయినవి. ఇతని పెక్కుశరములు నరుని నొప్పించి నవి. దానింజూచి యాంజనేయుఁడు కనలి "ఖాండవం బేతెలివొంది కాల్చితివి? నీ ప్రతినకు జంకితినిగాని లేకున్న గదతోఁ గర్ణునితల పగులఁగొట్టనా?" యనెను. కృష్ణుఁడు గూడ నట్లే 'కర్ణుని శరములఁ దూలపోయి వెగటుపడితివేని నాచక్రమిచ్చెదఁ గర్ణునితల నఱుకు' మనెను. అంతఁ గిరీటి యుగ్రుఁడై బ్రహ్మాస్త్రమేసె. దానిని దాని చేతనే కర్ణుఁడు నివారించె. అంత నిద్దఱకు మహాభీలసంగ్రామము జరిగినది. కర్ణుఁడు సర్పముఖాస్త్రము ప్రయోగింప నది మండుచువచ్చి యమోఘమై కృష్ణుఁ డరదము నదుముటచేఁ గంఠమునకుఁ దప్పి సవ్యసాచి కిరీటమును గూల్చె. అపు డర్జును బాణపరంపరలు దాఁకి మేనెల్ల నెత్తురు గారుచుండఁ గర్ణుఁ డుగ్రుఁడై యంపవాన గురిసి రథసూతకేతువులతో నర్జును ముంచె. అంత బ్రాహ్మణశాపమున

రథము గ్రుంగె. అపుడు వెనుక నొకసారి " మాధవా! మనరథమును మరలని " మ్మనిపించిన భార్గవాస్త్రము శాపముచేఁ దోఁపలేదు. అట్లు దైవోపహతుఁడై బ్రహ్మాస్త్రము ప్రయోగించె. దానిపై నరుఁ డైంద్రాస్త్ర మేసెనుగాని వ్యర్థమయ్యె. మరల బ్రహ్మాస్త్ర మేసి దానిని ద్రిప్పెను. అంతఁ గర్ణుఁడు రథచక్ర మెత్తఁజూచెఁగాని యది కదల లేదు ఒఱగిన రథ మేటున కనుపీయలేదు. భార్గవాస్త్రము తోఁప లేదు. మరల బ్రహ్మాస్త్రము స్మృతికి రాలేదు. శల్యుని పోటుమాటల మనస్సు కలఁగియున్నది. ఏమయిన నేమి? అపుడు నరుఁడు ప్రళయ కాలరుద్రుఁడై బాణాగ్ని కురియుచుండె. కర్ణున కపుడు పొడమిన యలుక వర్ణింపఁదరమా? కాల మాసన్నమైనది. దైవము ప్రతి కూలమైనది. దేహ మలసినది. అయిననేమి? అపుడుగూడ నిశితాస్త్ర ములఁ గృష్ణార్జునుల నొప్పించుట మహాద్భుతమయ్యె. వెంటనే యర్జు నుండు దారుణాస్త్రమునఁ గర్ణునితల నఱికె. అంతే. పౌరుష మోడి నది. దైవము గెలిచినది. ఈ సమయమునఁ గర్ణుని భార్గవ సర్ప ముఖాస్త్రముల సాటియైన యస్త్రము లర్జునునకు లేవని చెప్పవచ్చును. అయిన నేమి? దైవప్రాతికూల్యముచే నొక్కటి యాపత్కాలమున స్మృతికి రాలేదు. రెండవది కృష్ణుని మూలముగా వ్యర్థమయినది. ఇదియే దైవ పౌరుషంబులకు భేదము. ఈకారణముననే ధృతరాష్ట్రుఁ డిట్లెడ్చెను :

క. పౌరుష మేటికి దైవం
బేరూపునఁ జూడ ఫలద మేమందము దో
స్సారనితాంతోజ్జ్వలుఁడగు
నా రాధేయుండు చచ్చె నర్జును చేతన్.

ఈ పై విషయము లన్నియు నెఱిఁగియే తన యన్నను దన తమ్ముఁడే చంపెఁ గదాయని విచారించుచున్న ధర్మరాజుతోఁ

"గర్ణుఁడు చచ్చుట కనేక కారణములు గలవు. నీతమ్ముఁడు నిమిత్త మాత్ర మయ్యెఁగాని వేఱుగాదు. దీనికై విచారింపకు" మనుచు నారదుఁడు సత్యవృత్తాంత మిట్లు సంగ్రహించి చెప్పె :

చ. వినుము నరేంద్ర ! విప్రుఁడలిపెన్, జమదగ్నిసుతుండు శాపమి
చ్చె, నమరభర్త వంచనము చేసె, వరంబని కోరి కుంతి మా
న్చె నలుక, భీష్ముఁ డర్ధరథుఁ జేసియడంచెఁ, గలంచె మద్రరా
జనుచితమాడి, శౌరి విధియయ్యె, నరుం డనిఁజంపెఁ గర్ణునిన్.

గ్రంథకర్తయే తుదకిట్లు నారదునిచే నిజము చెప్పించెఁ గావున నిఁక విషయ నిర్ణయమునకు వత్తము.

## ఉపసంహారము

మహాకవి యగు వ్యాసమహర్షి ధర్మమునకు జయమును, అధర్మమున కపజయమును గలుగునని లోకమున నుపదేశించు బుద్ధితోఁ బాండవ కౌరవ పక్షములను గల్పించి కథాసన్నివేశము గావించి తుదకుఁ బంచపాండవులను దప్ప నుభయపక్ష వీరులనెల్ల నశింపఁ జేయ నుద్దేశించి (కృపాచార్యాదులు కొందఱుందురు గాక) నరనారాయణ రూపమైన దైవమును బాండవపక్షమందును, కర్ణరూపమైన పౌరుషమును గౌరవపక్షమందును జేర్చి యీ మహాభారతము రచియించెనని యూహింపవలసియున్నది. ఎట్లయిన ధర్మపక్షమునకు జయమిచ్చుట ప్రధానోద్దేశము గావున నధర్మపక్షమందలి కర్ణునిఁ జంపుటకై శాపాదిసామగ్రి నంతనుగూర్చి యీ పౌరుషమును నరనారాయణరూపదైవముచే నణఁగించె. ఇదియే యీకథ యందలి పరమార్థము. కావున నిఁకఁ జెప్పెడిదేమి ? ధైర్యదాతృత్వముల యందుఁ గర్ణుఁడు ఘనతఁ జూపినమాట నిజము. పెక్కు యుద్ధముల

నర్జునుఁడు విజయము గాంచిన మాట నిజము. కాని వీరిద్దఱిలో భేదము తేల్చవలసివచ్చినది గావున ఫలితార్థ మిది —

పరాక్రమంబునఁ గర్ణుఁడు ఘనుండు
సత్ప్రవర్తనమున నర్జునుఁడు ఘనుఁడు.

ఎప్పుడైనను దుదకు సత్ప్రవర్తనమునకే జయము గలుగుట సహజము.

ఇది నాకుఁ దోఁచిన యభిప్రాయము. అందుఁ బ్రమాదమున్నఁ బెద్దలు మన్నింతురు గాక!

# శృంగార రస విమర్శనము

"రసో వైసః రసగ్ హ్యేవాయం లబ్ధ్వానందీ భవతి"

ఏయది చతుర్వర్గ ఫలప్రాప్తి సాధనంబై నుతిగాంచు, నెయ్యది పాఠకుల హృదయంబును హర్షోత్కర్ష పరవశంబుఁగావించు, నేది వివిధ ప్రపంచ విషయక జ్ఞానంబు బోధించు, నేయది కృత్యాకృత్య ప్రవృత్తి నివృత్తి మార్గం బుపదేశించు నట్టి సరసజన వంద్యంబు, నవరసభాసురంబు, సుకవి భారతీరూపంబు నగు సత్కావ్యంబు, "ఏకశ్శబ్దస్సుప్రయుక్త స్స్వర్గే లోకేచ కామధుగ్భవతి" యను వేదవాక్యంబునను, "కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే। సద్యః పరనిర్వృతయే కాంతాసమ్మిత తయోపదేశయుజే" యను నాలంకారిక వచనంబునను, ధర్మమోక్షోపయోగి వాక్యార్థ జ్ఞానంబును, గాళిదాసాదులకువలె యశస్సును, ధావకాదులకువలె ధనంబును రాజసచివ గురుతాపసాదులకువలె నుచితంబగు సదాచార జ్ఞానంబును, మయూరాదులకు వలె బీడా పరిహారంబును, సకల ప్రయోజన సారభూతసద్యః కాలిక సమధికానంద రసాస్వాదన సుఖంబును, మనోహారిణి యగు ప్రియరమణివలె హితోపదేశంబును గావింపఁ గారణంబగు ననుట సర్వాలంకారిక సమ్మతంబగు ప్రాచీన మతంబగుటచే నిది మానవలోకంబునకుఁ బఠన శ్రవణ దర్శనయోగ్యంబైన పురాకృతంబగు మహాభాగ్యమనియే విశ్వసింపవచ్చును. ఏతాదృశంబగు కావ్యంబున కనేక లాక్షణికు లనేక విధంబులుగా లక్షణంబులు నిర్వచించిరి. కొంచె మెచ్చుతక్కువగా సరిపడుచున్న వానిలో నెల్లఁ బ్రమాణప్రవృత్తికై కొన్నియిం దుదాహరించెదను.

## కావ్య స్వరూపము

"సహృదయ మనోరంజకం బగు నర్థముచే నలంకరింపబడిన పదసమూహము కావ్య" మని యాచార్యదండియు, "వాచ్యవ్యంగ్య

ప్రభేదంబును సహృదయ రంజకంబునగు నర్థమే కావ్యంబున కాత్మ యనియు, ధ్వని కావ్యంబున కాత్మయనియు ద్వివిధంబుగ నానందవర్ధనాచార్యుండును, "గుణాలంకార పూతంబులగు శబ్దార్థములే కావ్యమనియు, వైదర్భ్యాదిగుణ విశిష్టంబగు పదరచనమే కావ్యంబున కాత్మ" యనియు వామనపండితుండును, "దోషరహితంబులు మాధుర్యాదిగుణ సహితంబులు స్ఫుటాలంకారంబులు నగు శబ్దార్థములు కావ్య" మని మమ్మటభట్టును, "రసాత్మకంబగు వాక్యమే కావ్య" మని విశ్వనాథకవిరాజును, "మనోజ్ఞంబగు నర్థమును బ్రతిపాదించు శబ్దము కావ్య" మని జగన్నాథ పండితరాజును నింకను బెక్కండ్రు పెక్కువిధములఁ గావ్యలక్షణంబు నిర్వచించిరి. ఇట్టి యెల్ల లాక్షణికుల మతంబులు పరిశీలింపఁగా సరసగుణాలంకారంబులై రమణీయంబులగు శబ్దార్థములు కావ్యమగునని మనకు దెలియుచున్నది. ఏతాదృశలక్షణ లక్షితంబగు కావ్యంబున కేది లేక రుచి గలుగదని [1] భరతముని వక్కాణించెనో, బహులాక్షణికులు దేనినిగావ్యంబున కాత్మగా బరిగణించిరో, వాగ్వైచిత్ర్యప్రధానంబగు కవి కృత్యంబున కెయ్యది జీవితంబగు నని [2] యాగ్నేయపురాణాదులు ప్రశంసించుచున్నవో [3] వ్యక్తి వివేక కారునిచే నేది కావ్యంబున కఙ్గియని నిర్వచింపఁబడినదో, దర్పణకారాదులు దేనిచేఁ గావ్యమునకుఁ గావ్యత్వ మంగీకరించిరో, "రసోవైస" ఇత్యాది శ్రుతివాక్యములచేఁ బ్రతిపాదింపఁబడు నిత్యసిద్ధశుద్ధస్వభావంబు పరబ్రహ్మానంద రూపంబు నగు రసంబు మాడ్కి నేయది రత్నాకరకారాదులచే నిత్యసిద్ధానందాస్వాద రూపం బని నుతింపబడినదో యట్టి కవితా జీవనంబగు రసమ్మునుగూర్చి యించుక ప్రసంగింతము.

---

1. నహిరసాదృతే కశ్చిదర్థః ప్రవర్తతే.
2. వాగ్వైచిత్ర్యప్రధానేఽపి రసఏవాఽత్ర జీవితం.
3. కావ్యస్యాత్మన్యంగిని రసాదిరూపే న కస్యచిద్విమతిః

## రస స్వరూపము

"రస ఆస్వాదనే" యను రసధాత్వర్థముచేతను, "రస్యతే స్వాద్యత ఇతి" యను వ్యుత్పత్తిచేతను గూడ నానందానుభవరూపంబగు స్వాదమే రసమగునని తెలియుచున్నది. దీనినే "స్వాదః కావ్యార్థ సంభేదా దాత్మానంద సముద్భవః" కావ్యార్థ పరిశీలనంబునఁ బైకిఁ బొంగునట్టి యాత్మానందమే రసాభిన్నం బగు స్వాదమనెడి ధనంజయ సమ్మతంమగు ప్రాచీనమతముగూడ బలపఱచుచున్నది. కావుననే సర్వాలంకారికులును బ్రహ్మానందాస్వాదమును సంపాదించు దానివలె నలౌకిక చమత్కార కారియైన యీరసమును లౌకిక రసముకంటె విలక్షణమగు నలౌకిక రసముగాఁ బ్రశంసించిరి. ఈదృశంబగు రస మెట్లు జనించు ననువిషయంబున నెల్లవిధంబుల నేకీభవించిన సర్వాలంకారికుల మతంబులకుఁ బ్రధానాధారమైన భరత ముని మతంబుఁ బ్రమాణముగాఁ గొని విమర్శింతము.

"విభావానుభావ వ్యభిచారి సంయోగా ద్రసనిష్పత్తిః" రత్యాది స్థాయిభావంబులకు లలనాద్యాలంబనకారణంబులు నుద్యానాద్యుద్దీపన కారణంబులు నగు విభావాదులతోడను, కటాక్షభుజాక్షేపాది కార్యంబులగు ననుభావంబులతోడను, నిర్వేదాదిసహాయకారు లగు వ్యభిచారిభావంబులతోడను జన్యజనక పోష్యపోషక భావరూపసంబంధంబున రసము జనించు నని యీసూత్రభావంబును భట్టలోల్లటాదులు వివరించియున్నారు. ఈసూత్రార్థమునే ప్రమాణముగాఁ గైకొని ధనంజయ మమ్మటాదులు రస శబ్దార్థమును వ్యక్తీకరించుచు వచ్చిరి. సుఖబోధంబునకై వారిమతంబుల నేకీభావంబుగ నర్థము వివరించెదను.

వాసనాదిరూపంబున నతి సూక్ష్మముగానున్న రత్యాదిస్థాయుల కాస్వాద యోగ్యతను గల్పించునవి విభావంబు లనియు, ఆస్థాయులనే యనుభవ విషయంబులనుగాఁ జేయునవి యనుభావంబు లనియు,

వానినే దేహంబున విశేషంబుగ సంచరింపఁజేయునవి వ్యభిచారి భావంబులనియు, జెప్పఁబడును క్రమముగాఁ గారణంబులు, కార్యంబులు, సహకారులు నగు నీ విభావాదులచేఁ బ్రతిపాదింపఁబడు నవిచ్ఛిన్నప్రవాహరూపచిత్తవృత్తివిశేషము (*స్థాయిభావము) రసమనఁబడును. చిత్తవృత్తి రూపంబగు దీనికి శీఘ్రవినాశిత్వము సంభవింపఁ దగియున్నను వాసనారూపంబున సూక్ష్మముగా నెల్లయెడ నుండునది గావుననే యిది స్థాయి యని చెప్పఁబడుచున్నది. ఈ రసము శృంగారాది నామంబుల నవవిధంబై యొప్పుచున్నది.

కాని, భరతముని నిర్దేశింపక పోవుటచేఁ గతిపయాలంకారికులు శాంతము నొకరసముగాఁ బరిగణింపలేదు. ధనంజయాదులు గొందఱు దీనిని నాట్యములయందు మాత్ర ముపయోగింపఁ గూడదని చెప్పిరి. ఇంకఁ గొందఱు స్నేహభక్తులతో రసములు పండ్రెండని చెప్పిరి. కావున రసములు తొమ్మిదియె యని నియమము సిద్ధించుట లేదు. అయిన నీవిషయంబున పిత్రాదులకుఁ బుత్రాదులయందుఁ గన్పడు ప్రీతి స్థాయికమైన వత్సలరసమును. మిత్రాదులయందు తోఁచు నార్ద్రితా స్థాయికమైన స్నేహరసంబును, ప్రభు గురు దేవతాదుల యందు గోచరమగు తాత్పర్య స్థాయికమైన భక్తిరసంబును విభావాదిరతిసముల్లసితంబులై శృంగారరసంబున నంతర్భూతంబు లగుచున్నవి గావున వానికి వేఱుగా రసత్వము సిద్ధము గాదు. శాంత

---

*1. విభావై రనుభావైశ్చ సాత్త్వికై ర్వ్యభిచారిభిః।
ఆనీయమానస్స్వాద్యత్వం స్థాయీ భావో రస స్స్మృతః।

(దశరూ)

2 విభావా అనుభావా స్తత్కథ్యంతే వ్యభిచారిణః।
వ్యక్తస్సతైర్విభావాద్యైస్స్థాయీ భావో రస స్స్మృతః

(కావ్యప్ర)

(3) విభావానుభావసాత్త్వికవ్యభిచారిసామగ్రీసముల్లసితస్థాయీ భావో రసః

(సాహిత్యరత్నాకరము)

మునకు శమము స్థాయిభావ మని కొందఱాలంకారికులు సమ్మతించి యుండుటచేతను, శ్రవణమననాది మూలంబుగ శమదమాదిసంపన్ను లగుపండితులయం దది సంభవించుచుండుటచేతను దృశ్యేతరకావ్యం బుల శాంతరస ముపయోగింపఁదగునని మమ్మటాది సమ్మతం బగు ధర్మసూరిమతంబును బ్రమాణముగాఁ గైకొని వర్ణనాత్మకంబు లగు శ్రావ్యకావ్యంబుల రసనవకత్వమును మనము సంపాదించుకొన వచ్చును. ఈ రసంబులకుఁ గ్రమముగా రతిహాసాదులు స్థాయి భావములుగాఁ జెప్పఁబడినవి. ఇట్లు నవవిధంబయి కావ్యజీవసంపై యలరారుచున్న రసంబునకు దేనిచే రస మనునామము సిద్ధించెనో, యెయ్యది యఖిలరసంబులకు నాద్యంబై సకలాలంకారికులకు నూఁత యయ్యెనో, యేది పండితపామరసాధారణమనోరంజకంబై కావ్య కర్తలకుఁ గల్పవృక్షంబయ్యెనో యట్టి శృంగారరసముం గూర్చి విమ ర్శింతము.

# శృంగారము

## "శృంగం ప్రాధాన్య మియ ర్తీతి శృంగారః"

సర్వరసంబులలో నిది యుత్తమత్వమును బొందుచున్నది గావున. శృంగార మగుచున్న దని ధర్మసూరియు, "శృంగ మనఁగాఁ గామో ద్రేకము. దానిం గలిగించుటకుఁ గారణమై రత్యాది ప్రధాన ప్రకృతులచే విస్తరించు రసము శృంగార మనబడు" నని [1] విశ్వ నాథ కవిరాజును, "మన్మథోద్రేక కారణంబై స్త్రీపురుషనిష్ఠమైన రసము శృంగారమనఁబడు" నని కావ్యప్రకాశ వ్యాఖ్యలో [2] భట్ట వామనాచార్యుఁడును శృంగార పదముచు నిర్వచించిరి. ఈషద్వై షమ్యముగా సరిపడుచున్న యీనిర్వచనములకు సామరస్యము గలి గించుచు " [3] రసాంతరాపేక్షచే మధురమై యుత్తమమైన శృంగార రసమే రత్యాది ప్రకృతులచే దేవతిర్యఙ్నరాది జాతి సామాన్యం బుగ నమితానంద సంధాయకంబై యలరారుచున్న" దని యానంద వర్ధనాభినవగుప్తాచార్యుల మత మెంతయు నొప్పుచున్నది. పై యర్థ మిచ్చు శ్లోకమందలి "ఏవ" కారము తప్పక శృంగారమునకే ప్రాధాన్యము గలిగించు నని ధర్మసూరి మతంబునకు బలంబుగా లోచన కారాభిప్రాయముగూడఁ గన్పడుచున్నది. ఇది యిట్లుండఁగా "రస్యతే స్వాద్యత ఇతి" యను వ్యుత్పత్తిచే రసశబ్దమునకు సుఖా స్వాదరూపమగు శృంగారమే యర్థము. "సుఖ మొక్కటియే యాస్వాద్యం బగుటచే సుఖాస్వాదరహితంబు లగు కరుణాదులకు రసత్వము సంఘటింపదు" అను నభిప్రాయంబుతో శృంగార ప్రకా

---

1. శృంగంహి మన్మథోద్భేద స్తదాగమన హేతుకః ।
   ఉత్తమ ప్రకృతి ప్రాయో రస శృంగార ఇష్యతే ॥
2. ...పురుష ప్రమదాభూమి శృంగార ఇతి గీయతే ॥
3. శృంగార ఏవ (ఏకో) మధురః ప్రహ్లాదనో రసః ॥

శంబున భోజరాజు, "వీరాద్భుతాదిషు రసేషు రసప్రసిద్ధి స్సిద్ధా కుతోఽపి వట యక్షవదావిభాతి। లోకేగతానుగతికత్వవశా దుపే తామేతాం నివర్తయితు మేష పరిశ్రమోనః॥ శృంగారవీర కరుణా ద్భుతహాస్యరౌద్ర బీభత్సవత్సలభయానకశాంతనామ్నః। ఆమ్నా సిషు ర్దశరసానపరే వయంతు శృంగారమేవ రసనాద్రస మామనామ॥ శృంగార ఏకఏవ రసః".

ఏదో యొకమఱ్ఱిమీఁద యక్షగ్రహ మున్నదని నలుగురు చెప్పు కొనుటంబట్టి దానికి దయ్యాల మఱ్ఱి యని పేరు వచ్చినట్లుగానే యెట్లో వీరకరుణాదులకుఁగూడ రసప్రసిద్ధి సిద్ధమయినది. గతాను గతిక న్యాయంబున లోకంబున సిద్ధమైన యీప్రతీతిని నివారించుట కష్టసాధ్యము. కొందఱు రసము లెనిమిదని, యింకఁ గొందఱు తొమ్మిదని, మఱికొందఱు పదియని వివిధంబుగఁ జెప్పిరి. "ఇదంతయు మాకేల? మే మొక్క శృంగారమునే రసమని తలంచెదము. శృంగార మొక్కటియే రసము" అని చెప్పిన వాక్యంబులు కరుణా దులకు రసత్వము సంఘటింప దను బహులాక్షణిక విరుద్ధమైన యాతనియొక్క యభిప్రాయంబును విడిచితిమేని శృంగారముయొక్క ప్రాధాన్యంబు ప్రాశస్త్యంబు నాస్వాద్యత్వంబు మొదలుగాఁ గల గుణంబుల నపారముగా మనకుఁ దెల్పకపోవు.

మఱియు నాచార్యపాదుఁ డగు భరతమునికూడ- "రతిస్థాయి ప్రభవంబు నుజ్జ్వలవేషాత్మకంబు నగునది శృంగారము. లోకములో మిక్కిలి పవిత్రమైనదియు దర్శనీయంబు నగు వస్తువు శృంగారముతో నుపమానింపఁబడును. ఎవఁడు మనోహరంబగు వేషము గలవాఁడో వాఁడు శృంగారవంతుఁడని చెప్పఁబడును. సద్గోత్ర కులాచారోత్పన్నం బులు నాప్తోపదేశసిద్ధంబులు నగు పురుష నామములవలె రసంబులకు భావంబులకు నాట్యాశ్రితంబు లగునర్థంబులకును నాచారోత్పన్నంబులు ప్రామాణికోప దేశసిద్ధంబులు నగు నామంబులు సంభవించును. ఇట్లే

యాచారసిద్ధంబు మనోహరప్రకాశమాన వేషాత్మకంబు నగుటచే నిది శృగారరస మని వ్యవహరింపఁబడుచున్నది. ఉత్తమ యౌవన ప్రకృతిగల యిది స్త్రీపురుష హేతుకంబై యొప్పు" నని దీనిం బ్రశంసించెను. దీనింబట్టికూడ శృంగారము సర్వరసరాజంబై బహు ప్రాచీనుల వాక్యంబులకు నిదానంబై యొప్పినట్లు మనము గ్రహింపవచ్చును.

రతి ప్రకృతికత్వము శృంగారమునకు లక్షణము. హృదయానుకూలంబులగు నర్థంబుల యందలి సుఖానుభవము రతి యనంబడును. [1] యౌవనవంతులగు స్త్రీపురుషుల పరస్పరరిరంస (రమించు కోరిక) రతి యనంబడునని రససుధాకరకారుఁడును, [2] భార్యాభర్తలకుఁ బరస్పరము రతియందుఁ గలవృత్తి యనఁగాఁ బ్రీతివిషయకమైన వారి యన్యోన్యవర్ణనము శృంగార మనఁబడునని వాగ్భటుండును నిరూపించిరి. ఆనందసంధాయకంబు, రతిస్థాయిప్రభవంబు, పరస్పర వర్ణనాత్మకంబు నగు నీ శృంగార మెల్ల లాక్షణికుల మతంబునను సంభోగము, విప్రలంభము నని రెండువిధంబులఁ బ్రకాశించుచున్నది. వీనింగూర్చి క్రమముగాఁ బ్రసంగితము.

[3] విలాస వంతులగు నాయికా నాయకు లెం దానుకూల్యము గలిగి పరస్పర మభీష్టంబులగు దర్శనస్పర్శనాదులను సేవింతురో యది సంభోగమనియు, ఎప్పుడు రతిభావ మధిక మయ్యు నభీష్టంబు నొందదో యపుడు విప్రలంభ మనియుఁ జెప్పఁబడును. [4] ఈ సంభో

1. యూనో రన్యోన్యవిషయస్థాయినీచ్ఛా రతి స్స్మృతా ॥
2. జాయాపత్యో ర్మిథో రత్యాం వృత్తి శ్శృంగార ఉచ్యతే ॥
3. అనుకూలౌ నిషేవేతే యత్రాన్యోన్యం విలాసినౌ।
దర్శనస్పర్శనాదీని స సంభోగ ఉదాహృతః ॥
4. భావో యదా రతిర్నామ ప్రకర్ష మధిగచ్ఛతి।
నాధిగచ్ఛతి చాభీష్టం విప్రలంభ స్తదోచ్యతే॥

గము పరస్పరాలోక నాలింగన చుంబనాది రూప భేదంబున ననంతంబు నపరిచ్ఛేద్యంబు నయ్యు, నొక్కసంభోగ నామంబుననే వ్యవహరింపఁబడుచున్నది. విప్రలంభమో అభిలాషవిరహేర్ష్యా ప్రవాస శాప హేతుకంబై యైదు విధముల నొప్పుచున్నది. పూర్వోక్తంబగు సంభోగము ప్రేమ, అభిలాషము, రాగము, స్నేహము, ప్రేమము, రతి, శృంగారము నని మరల సప్త విధంబుగఁ బేర్కొనఁబడుచున్నది. రమ్యపదార్థంబులయందు (ఆలంబనంబు లగు నాయికానాయకుల యెడ, జనించు దర్శనేచ్ఛ ప్రేమ యనియుఁ, దద్విషయక చింత యభిలాష మనియు, దత్సంగబుద్ధి రాగం బనియుఁ, దదేకధ్యానము స్నేహమనియుఁ, దద్వియోగాసహనము ప్రేమ మనియుఁ, దత్సహవర్తనము రతియనియు, దన్మయక్రీడ శృంగార మనియు నేతత్సంభోగంబునకుఁ గ్రమస్థితి రసాకరంబున నిర్ణయింపఁబడినది. దీనింబట్టి దిదృక్ష మొదలుగాఁ దన్మయక్రీడ వఱకును గ్రమక్రమముగా నభివృద్ధిఁ జెందుచున్న యీసంభోగము క్రీడారూపం బగుశృంగారనామంబున నాయికానాయకుల కభీష్టసిద్ధిఁ గలిగించునది గావుననే సంభోగశృంగార మనఁబడుచున్న దని మనము గ్రహింపవచ్చును. కావ్యంబుల వర్ణింపఁబడు నిది మరల సంభోగాంగంబులు కామశాస్త్రప్రతిపాదితంబులు నగు నాలింగనచుంబనాద్యుపచారంబుల సంక్షేపంబున సంక్షిప్తంబనియు, సర్వోపచారసంపన్నంబగుటచే విస్తృతంబనియు ద్వివిధ మగుచున్న దని భూపాల మతము. ఇట్లు ద్వివిధం బగునిది మరల [1] చుంబనాశ్లేషాది రూపంబున బాహ్యరతం బనియు, సాక్షాన్నానాకరణవిశేషాత్మకం బైన యాభ్యంతరరతం బనియు ద్వివిధమగు

1. బాహ్య మాభ్యంతరం చేతి ద్వివిధం రత ముచ్యతే।
తత్రాద్యం చుంబనాశ్లేషనఖదంతక్షతాదికం।
ద్వితీయంతు రతం సాక్షాన్నా నాకరణకం మతమ్॥

(వాత్స్యాయనః)

చున్నది. ఇందు రెండవదానిం గూర్చిన విశేషవర్ణనము తన్మయ చిత్తవృత్తులకుఁ దాత్కాలికానందము సమకూర్పఁ గామసూత్రరతి రహస్యాదుల యందుఁ జూడఁదగినదియే కాని, నీతిదాయకంబులు, పుణ్యకథాప్రథితంబులు, లోకజ్ఞానదాయకంబులు నగు సత్కావ్యం బులఁ గనుపట్టఁదగవు. ఎందైననట్టి కావ్యంబులఁగూడ నొకొక్కచో నట్టి వర్ణనలు గన్పడుచున్నవని సంశయము గలుగుచున్నది. అనుమే యాభ్యంతర రతవర్ణనగర్భితంబులగు బాహ్యరతవర్ణనములే యని మనము గ్రహింపవచ్చును. కావుననే యనేక లాక్షణికులు కావ్యము లయం దుపయోగింపఁ దగిన సంభోగశృంగారమునకు లక్ష్యముగా నీక్రింది శ్లోక ముదాహరించిరి.

"[1] శూన్యం వాసగృహం విలోక్య శయనా దుత్థాయ కించిచ్ఛనై!
ర్నిద్రావ్యాజ ముపాగతస్య సుచిరం నిర్వర్ణ్య పత్యుర్ముఖం।
విస్రబ్ధం పరిచుంబ్య జాతపులకా మాలోక్య గండస్థలీం।
లజ్జానమ్రముఖీ ప్రియేణ హసతా బాలాచిరం చుంబితా"

ఇఁకఁ గాలాంతరభావిసంభోగాకాంక్ష గలిగిన విప్రలంభశృంగా రమో యభిలాషవిరహమాన ప్రవాసశాపహేతుకంబై పంచవిధంబుగ నొప్పును. నాయికానాయకుల యన్యోన్యప్రాప్తేచ్ఛ యభిలాషం బనియు, అసంయోగము విరహమనియు, అపరాధ ప్రభవంబగు తాత్కాలికకోపము మానం బనియుఁ, బరదేశవాసంబు ప్రవాస మనియు, గురురాజాదినియమితసుఖవిముఖ కాలాను భవము శాపం బనియు గ్రహింపఁదగును. ఇందు విరహానంతర జాతంబు, మానా

---

1. ఒకానొక ముగ్ధనాయిక, తన చెలికత్తెలు గదినుండి వెడలిపోఁగానే తన పడకనుండి మెల్లఁగా లేచి దొంగనిద్రపోవుచున్న ప్రియుని మొగము చాలసేపు పరిశీలించిచూచి నిద్రించుచున్నట్లునమ్మి యధికానురాగముతో ముద్దుపెట్టుకొని గగురుపాడిచిన గండస్థలంబును జూచి సిగ్గుచేఁ దలవంచుకొనెను. అంత నాయకుఁడు నవ్వుచు లేచి గాఢముగా నాయికను గౌఁగిలించు కొనెను.

నంతరజాతంబు నగువిప్రలంభము పూర్వోక్తసంక్షిప్త సంభోగశృంగారంబున నంతర్భూతం బగుచున్న దనియు, ప్రవాసానంతరజాతంబు, శాపానంతరజాతంబు నగునది విస్తృతసంభోగంబున నేకీభవించుచున్న దనియుఁ దెలియఁదగును. ఇఁక విప్రలంభశృంగారంబున కాద్య మగు నభిలాషమునందే రతిభావము [1] దృఙ్మనస్సంగాది దశావస్థలం గలిగి వర్ధిల్లుచున్నది. ఇం దమంగళకరంబు రసవిఘాతంబు నగు మరణము కావ్యంబులఁ బ్రత్యక్షముగ వర్ణనీయముగాదు. ఏవంవిధంబగు నభిలాషహేతుక విప్రలంభశృంగారమే కావ్యప్రపంచంబునం దెల్లెడల వ్యాపించి గుణావయవవర్ణనరూపంబునఁ బ్రశంసింపఁబడుచుఁ, దుదకుఁ గావ్యఫలభూతంబగు సంభోగ శృంగారంబునకు నిదానంబై యొప్పుచున్నది. కావుననే [2] విప్రలంభము లేక శృంగారము పుష్టిని జెందదని పూర్వలాక్షణికుఁడు వచించెను. ఇట్లు ద్వివిధంబగు నీశృంగారమునందు శృంగారతిలకంబునఁ బరిగణింపఁబడినట్లుగా [3] శంకాసూయాది వ్యభిచారిభావంబులు ప్రయోగింపఁ దగునని యెల్లలాక్షణికు లంగీకరించిరి. కామపరవశు లగు నాయికా నాయకులయెడఁ బ్రయోగింపఁబడు నీభావంబులే కావ్యంబుల గుణావయవరూపంబునఁ గన్పట్టుచున్నవని యెఱుంగునది.

ఈశృంగారరసంబునకు స్వీయ, కన్యయగు పరకీయ, సత్యానురాగయగు వేశ్య యను నాయికలును, ఉత్తమ లక్షణ లక్షితులగు దక్షి

1. దృఙ్మనస్సంగ సంకల్పా జాగరః కృశతా రతిః।
   హ్రీ త్యాగో న్మాద మూర్ఛాంతా ఇ త్యనంగదశా దశ॥
2. నవినా విప్రలంభేన సంభోగః పుష్టి మశ్నుతే॥
3. శంకాసూయా భయ గ్లానీ వ్యాధి శ్చింతా స్మృ తిర్ధృతిః।
   ఔత్సుక్యం విస్మయో హర్షో వ్రీడోన్మాదో మద స్తథా॥
   విషాదో జడతా నిద్రా వహిత్థా చాపలం మతిః।
   ఇతి భావాః ప్రయోక్తవ్యా శృంగారే వ్యభిచారిణః॥

ణాది నాయకులును నాలంబన మగుదురు. [1] కాని పరోఢయుఁ, బ్రేమలేని వేశ్యయు, నీచనాయకులును నాలంబనంబుగాఁ దగరు. దీనింబట్టి పరోఢానాయికాత్వము కావ్యంబులఁ గేవల నిషిద్ధం బగుటచే నాంధ్రంబున రెండుమూఁడు గ్రంథంబుల కసత్కావ్యత్వము సంభవించుచున్నదని కొందఱూహించుచున్నను, నవి పురాణ గాథాగ్రథితంబులై గురుమునిపత్నీ సమాగమము మహాపాతకహేతు వగుననెడి యుత్తమనీతిని దెల్పునవి యగుటచే నపరిత్యాజ్యంబులని చాలామంది యాశయము. అట్లు కాదేని పరోఢ నాయికగాఁ గలిగిన కేవల కల్పిత కావ్యములు లోకంబున నెందైనఁ జూడఁబడుచున్నవా?

ఈ శృంగారము మరల నాయకారబ్ధము, నాయికారబ్ధము నని ద్వివిధము. "[2] ముందుగా స్త్రీ యనురక్త యగును. పిదప దదింగితము లచేఁ బురుషు డనురక్తుఁ డగును. తరువాత సంభోగవిలాసము. ఇది స్వభావరమ్య మగుస్థితి" యనెడి రుద్రభట్టవచనముగూడఁ బైదానినేఁ ధ్రువపఱచుచున్నది. ఇందు సంభోగలీలాశబ్దమునకుఁ బరస్పరాలోకన సంభాష ణాలింగన చుంబనాదు లగు బహువిధ చేష్ట లర్థ మయినట్లు కనబడుచున్నది. యౌవన వంతులగు నాయికా నాయకుల యీచేష్ట లను సరసముగా వర్ణించుటకంటె వేఱుగా లోకంబున కానందంబు గలిగింపఁ గావ్యరచన మెట్లు నిర్వహింపఁదగునో యాలోచింపుఁడు. సరియే, ఈచేష్టలను వర్ణించుటకుఁ బూనిన యే భాషాకవి హావభావా వయవముల మాట యెత్తకుండఁగా మఱియెట్లు వీనిని వివరించి మనో హారంబుగా వ్రాయఁగలఁడు? ఇట్టి వర్ణనలే పరిత్యాజ్యంబు లగునేని కావ్యజీవనంబగురస మెక్కడినుండి వచ్చును? శృంగార మెక్కడ? కావ్యత్వ మేడ? అట్లయిన గవికుల శేఖరుండగు కాళిదాసుకూడఁ కుమారసంభవ మేఘసందేశములయందు వర్ణించిన సంభోగవిప్ర

1 పరోఢాం వర్జయిత్వాత్ర లేశ్యాంచా ననురాగిణీం॥

2. పూర్వం నారీభవేద్రక్తా పుమాన్ పశ్చాత్త దింగితైః ।
తతస్సంభోగలీలేతి స్వభావసుభగా స్థితిః ॥

లంభశృంగారము లనౌచిత్య రసాభాసములకై యుదాహరణమగునా? ఆహా! యేమి ఇప్పటి మూలచ్ఛేది పాండిత్యప్రకర్షము!

మఱియు వ్యంగ్యప్రధానంబైనది ధ్వనికావ్యం బనుపేర నుత్తమం బనియు, వ్యంగ్యాప్రధానం బయినది గుణీభూతవ్యంగ్యం బనుపేర మధ్యమంబనియు, నస్ఫుటవ్యంగ్యం బగునది చిత్రం బనుపేర నధమం బనియుఁ గావ్యంబును ద్రివిధముగా నెల్లరు నిరూపించిరి. ఇందు నగ రార్ణవో ద్యానసలిల క్రీడావిప్రలంభ రతోత్సవా ద్యష్టాదశవర్ణనలం గలిగి మహాకావ్య సంజ్ఞం బడయుచున్న యాకావ్య లక్షణంబున కాలం కారికు లుదాహరించిన పద్యంబు లెల్లఁ జూచినచో శృంగారరస మెంత వఱకు వర్ణనీయమో తెలియకపోదు. అందు ధ్వని కావ్యంబు నకుఁ గావ్యప్రకాశ కారాదు లుదాహరించిన యీక్రిందిశ్లోకము ప్రకృతం బగుశృంగారరసంబు నవధింగూడఁ దెల్పుచు నెంత సహృదయ రంజకముగా నున్నదో చూడుఁడు.

(1) "నిశ్శేషచ్యుతచందనం స్తనతటం నిర్మృష్టరాగోఽధరో
నేత్రేదూరమనంజనే పులకితా తన్వీ తవేయం తనుః।
మిథ్యావాదిని! దూతి! బాంధవజన స్యాజ్ఞాతపీడాగమే
వాపీం స్నాతు మితో గతాసి న పున స్తస్యాధమ
స్యాంతికమ్॥"

కావుననే లాక్షణికులకుఁగూడ లాక్షణికుఁ డగుమహాకవి కాళిదాసు శ్రవ్యకావ్యంబుల రతివర్ణనము నింద్యము గాదనుటకో యనఁ గుమారసంభవాష్టమసర్గంబున వాచ్యంబుగ బాహ్యరతంబును వ్యంగ్యంబుగ నాభ్యంతరరతంబును వర్ణించి శృంగారంబునకుఁ ద్రోవ త్రొక్కి యుండెనని మన మెఱుంగఁ దగును. అందలి శృంగారము కేవల ముత్తమదేవతావిషయకం బగుటచేఁ గొన్నివర్ణనంబుల ననుచితంబుగా నున్నదని కొందఱు లాక్షణికులు చెప్పినమాట సత్యమే కాని,

యదియే యదివ్య దివ్యాదివ్య విషయుక మయ్యేనేని తగియుండు ననియేకదా వారియభిప్రాయము! సరియే! యిది యిట్లుండనిండు. ఇతఁడే దృశ్యకావ్యంబగు మాలవికాగ్నిమిత్రములోఁ గూడబాహ్యారతం బనఁదగు సంభోగ శృంగారమును వర్ణించియుండలేదా? ఈ యుదాహరణములఁ జూడుఁడు!

(1) "సస్వజే ప్రియ మురోనిపీడనం ప్రార్థితం ముఖమనేన నాహరత్ |
మేఖలా ప్రణయలోలతాంగతం హ స్త మస్య శిథిలం రురోధసా"||

(2) హస్తం కంపయతే రుణద్ధి రశనావ్యాపారలోలాంగులీః |
హస్తౌ స్వౌ నయతి స్తనావరణతా మాలింగ్యమానా బలాత్ ||
పాతుం పక్ష్మలనేత్ర మున్నమయిత స్సాచీకరో త్యాననం |
వ్యాజేనా వ్యభిలాషపూరణసుఖం నిర్వర్తయ త్యేవ మే||

ఇట్లే యేకవి యైనను రతంబును వ్యంగ్యముగానే వర్ణించెను గాని వాచ్యముగాఁ జెప్పియుండలే దని విశ్వసింపవచ్చును. ఆ ధ్రశృంగార కావ్యంబులఁగూడఁ దరచుగా నిట్లే ప్రతికావ్యమున సురతపుంభావ రత వర్ణనలు గన్పడుచున్నమాట సత్యమే కాని యవి రతిసురతో పరతి పుంభావాది పదఘటితంబు లగుటచేఁ గొందరు చదువరులకు జుగుప్సాకరంబులైన యాభ్యంతర రతవర్ణనంబులుగా భ్రమ గలిగించు చున్న వేమో కాని, నిజముగా నవి యట్లుగాక వ్యంగ్యసురత వర్ణన పరంబులైన బాహ్యరతవర్ణనలే యని పరిశీలకులు గ్రహింపకపోరు. ఈ సందర్భంబున నింకను సంస్కృత కవులు సురతవర్ణన సేయు నపు డొక్క విషయ నిగరణముగా వర్ణించిన చోట్లఁగాక మిగిలిన యెడలఁ దమపాకమును మార్పక యేకరీతిగా వర్ణించుచు వచ్చినట్లు కనఁబడుచున్నది గాని మన తెలుఁగు కవులుమాత్ర మట్లుగాక తమ కదళీ ద్రాక్షాపాకములను నారికేళపాకముగా మార్చి స్త్రీ బాల సామాన్య దురవగాహముగా వ్యంగ్యముగానట్టి వర్ణనలు గావించిరని

మనము చూడక పోలేదు. పై యెల్ల విషయంబులకుఁ బెద్దనామా త్యాదుల 1 సహసానఖంపచేత్యాది పద్యములే యుదాహరణము. ఇట్టి పద్యంబు లతి క్లిష్ట సంస్కృత పదభూయిష్ఠదీర్ఘ సమాసార్థ గ్రహణశక్తి గలవారికిఁగాక యెల్లరకుఁ దెలియునా? "ఎల్లకావ్యంబుల నిట్లే గూఢముగా వర్ణింపఁ బడినవా? తేటతెల్లముగా నున్న వర్ణ నలు మాత్రము లేవా" యని కొందఱడుగవచ్చును. సత్యమే కాని యట్టివేవైన నొకటిరెం డున్నను వానికి సర్వజనసామాన్యపఠన పాఠన ప్రసిద్ధి లోకంబున రాలేదనియు మనము వ్యవహరించుకొను నుత్తమకవి సత్కావ్యంబుల మాత్ర మట్లు లేవనియు నమ్మ వచ్చును. పెద్దలు హర్షింపదగని నింద్య వర్ణనలు పూజ్యంబుగానే యుత్తమకవి వర్ణించును. కావునఁ గేవల వాచ్యంబులు నశ్లీ లంబులు నగునాభ్యంతరసురతవర్ణనలు వచనీయంబులగుటఁ బరిత్యా జ్యంబు లనియు, వ్యంగ్యంబులు తద్వర్ణనగర్భితంబులు నగు వర్ణనలు రసభావజనకంబులు కావ్యోద్యమఫలంబులు నగుటఁ బరిగ్రాహ్యంబు లనియు సాంస్కృతిక లక్ష్యలక్షణ గ్రంథములంబట్టి మనము తెలిసి కొనవచ్చును. ఇట్లు చెప్పుట సమరత్యుపరతివర్ణన లవశ్యముగాఁ గావ్యంబుల వర్ణింపఁదగినవియే యను పట్టుదల సాధించుటకొఱకుఁ గాక భామకుఁ బ్రమాణంబగు నలంకార శాస్త్రమునుబట్టి కావ్యత్వసంప దకు సంపూర్ణత నొసంగు సంభోగశృంగారాంగంబు లగునట్టి వర్ణనల యౌచిత్యమును విశదీకరించుటకే యని విశ్వసింపఁదగును.

మఱియుఁ బూర్వోక్త విషయంబునే బలపఱచుచు సంభోగ శృంగార వర్ణనముంగూర్చి రసతరంగిణి గూడ నిట్లు చెప్పుచున్నది. "యౌవన వంతుల పరస్పర పరిపూర్ణ ప్రమోదము గానివారిపరస్పర రతిభావముగాని శృంగార మనఁబడును. ఇందు దర్శనస్పర్శనాదులచే

1. "సహసానఖంపచ స్తనదత్త పరిరంభ మామూల పరిచుంబి తాధరోష్ఠము (మనుచరిత్ర)

"ఆననాంభోజవ్యాపా వర్తనాముహుర్వ్యోష్ఠ్యు తాధరపాన విలసనంబు" (ప్రభావతీప్రద్యుమ్నము) ఇత్యాదులరయునది.

నాయికా నాయకు లన్యోన్య మనుభవించు సుఖము గాని, వారి రపస్పర సంయోగంబున జనించు నానందము గాని సంభోగ మనఁబడును. సంయోగ మనఁగా బహిరింద్రియ సంబంధము" అనఁగా, నాలింగన చుంబనాదులని భావము.

ఈసందర్భమున సంభోగమునకు ధనంజయకవి దశరూపంబున నుదాహరించిన యుత్తర రామచరిత్ర నాటకంబులోని "కిమపి కిమపి మందం మంద మాసక్తి యోగాత్" అను పద్యముగూడ నుదాహరణముగాఁ గలదు. ఇట్టి వర్ణనలు గూడఁ గేవల సురత వర్ణనలోనే పరిగణింపఁబడి దృశ్యకావ్యలక్షణ దూరంబులై రసాభాసంబులు నసహ్యజనకంబులు గాఁదగనేని పూర్వమహాకవులకు నిపుడు సంభవించు నపయశస్సుతోఁ గూడ రూపక సముదాయంబును మూటగట్టి యావలఁ బెట్టవలసియే వచ్చునుగదా! అట్లుగాక దృశ్యకావ్యంబులలోని యిట్టి వర్ణనలు దుర్నీతి కరములుగాక దృశ్యంబులే కాఁదగనేని యీవద్వైషమ్యముగా వీనింబోలిన యంతర్భావిత వ్యంగీభూత సురతంబులగు శ్రవ్యకావ్యంబులలోని పూర్వోక్త సురతవర్ణనల వంటి వర్ణనలుగూడ శ్రావ్యంబులు గాఁదగవా? అట్లును దగవని యందురేని యఖిల జన వంద్యంబు నార్యకవితానిధానంబు నగు నాదికావ్యంబునకుఁ గూడ జలాంజలి యర్పింప వలసినదియే. ఏమనఁగా; కవితాబ్రహ్మాండ సృష్టికర్త యగు వాల్మీకి మహర్షి రామాయణంబున నందందు వర్ణించిన వర్ణనలటుండఁగాఁ గిష్కింధా కాండంబున శరత్కాల వర్ణనా సందర్భంబున జానకీ విరహతప్తుఁడై విప్రలంభావస్థ ననుభవించుచున్న శ్రీరాముని వాక్యములుగా వర్ణించిన యీక్రింది శ్లోకములు లుపమాశ్లేష స్వభావాలంకార భూషితములై సంభోగ శృంగారంబు మేరఁ జూపుచు హృద్యంబులై యెంతయుక్తముగాఁ గవిలోకంబునకు శృంగారరస వర్ణన మర్యాద నుపదేశించుచున్నవో చూడుఁడు.

(1) "దర్శయంతి శరన్నద్యః పులినాని శనైశ్శనైః।
నవసంగమసంవ్రీడా జఘనానీవ యోషితః॥

(2) చంచచ్చంద్ర కరస్పర్శ హర్షోన్మీలిత తారకా!
అహోరాగవతి సంధ్యా జహాతి స్వయ మంబరం"

కావున సురతాదిపదఘటితంబులై నంతమాత్రమునఁ దద్వర్ణనంబు లసభ్యంబగు శత్రిక్రియా స్వరూపంబును బోధింపవనియు, వ్యంగ్యముగా గూఢాభిప్రాయముగా వర్ణింపఁబడిన యవి కావ్యంబునకు రసపుష్టిని బాఠకుల కానందంబును గలిగింపఁ గారణంబు లగుననియు సంతోషింపఁదగును.

## అవయవ వర్ణనము

ఇఁక నవయవవర్ణన మెంతవఱకుఁ దగునను విషయముం గూర్చి విమర్శింతిము. ఆలంబనోద్దీపనాది కారణంబులగు విభావానుభావాదుల చేతను స్వభేదంబులగు ప్రేమాభిలాషాదులచేతను శృంగారము పోషింపబడునని యిదివఱకే తెలిసికొని యుంటిమిగదా! అట్టి రసోద్దీపకంబులు వధూవరానురాగాభి వృద్ధికరంబులు నగు నాయా భావంబులను నాయికానాయకుల యెడ సమన్వయింపఁజేయుటయే తొలుత గుణావయవాదివర్ణన రూపంబును దాల్చి తుద కాలింగనచుంబనాది రూపంబున బరిణమించి బాహ్యరతంబు పేరఁ బరగుచున్నట్లుగా నయ్యాలక్షణ గ్రంథ సరణియుఁ దత్పూర్వ కావ్య రచన పద్ధతియు మనకు బోధించుచున్నవి. పూర్వోక్త సర్వవిషయంబును గూర్చి దశరూపక చతుర్థ ప్రకాశము వేనోళ్ళఁ జాటుచుండ నెంత యని యిచ్చట వివరింపగలము? ఇఁక నితరలక్షణములనుండి యెన్ని యుదాహరింపనగును? అయినను బైసందర్భంబున కనుకూలముగాఁ గవుల కుపదేశపరముగా నున్న యీ క్రింది లక్షణము చూడుఁడు.

"[1]రమ్య దేశ కలాకాల వేషోపభోగాది సేవనంబునను మధు రాంగ విచేష్టితంబులను బరస్పరాను రక్తులగు యౌవనవంతుల ప్రమోదాత్మకంబగు రతి శృంగారమనఁబడును. (వ్యాఖ్య) ఇట్లు నిర్మింపఁబడిన కావ్యము శృంగారాస్వాదము" కొఱకగునని యీవాక్యము కవ్యుపదేశపరము. ఇందెల్ల భావంబుల కుదాహరింపఁబడిన వానియందెల్లఁ బ్రకృతానుసరణముగా నున్నయుదతి భావోదాహరణం బగు మాలవికాగ్నిమిత్రములోని యీక్రింది పద్యము చూడుఁడు.

[2] " దీర్ఘాక్షం శరదిందుకాంతివదనం బాహూనతావంసయోః।
సంక్షిప్తం నిబిడోన్నతస్తన మురః పార్శ్వే ప్రమృష్టే ఇవ।
మధ్యః పాణిమితో నితంబి జఘనం పాదావరాలాంగులీ।
ఛందోనర్తయితు ర్యథైవ మనస స్పృష్టంతథాస్యా వపుః "॥

ఇట్లున్న పైలక్ష్యలక్షణములబట్టి గుణావయవవర్ణనలు నింద్యములు గాక కావ్యశోభాకరంబులై పాఠకానందదాయకంబు లగునని తెలియుచుండఁగా నిప్పటిమతము ననుసరించి కచకుచాదివర్ణనంబులు దూష్యంబులను విషయమున మనము విమర్శింపఁదగిన దేమియు

---

1. రమ్యదేశకలాకాల వేషభోగాది సేవనైః
ప్రమోదాత్మారతి స్సైవయూనో రన్యోన్యరక్తయోః
ప్రస్తూయమాణా శృంగారో మధురాంగవిచేష్టితైః

(వ్యాఖ్య) ఇత్థ ముపనిబధ్యమానం కావ్యం శృంగారాస్వాదాయ ప్రభవతీతి కవ్యుపదేశ పరమేతత్

2 (మాలవికయొక్క) మొగమా ? పెద్దకన్నులు గలిగినదై శరత్కాలచంద్రుని వలె నున్నది. బాహువులా? మూఁపులయందు వంగియున్నవి. ఱొమ్మా? దగ్గరగాఁ గలిసికొనిన కుచములు గలదై సంకుచితమై యున్నది. ప్రక్కలా? చిత్రిక పట్టినట్లున్నవి. నడుమా? గుప్పెఁ డున్నది. మొలయా? పెద్దపిఱుఁదులు గలిగియున్నది. పాదములా ? వంకరైన వ్రేళ్ళతోఁ జక్కగా నున్నవి. ఇఁకఁ జెప్పనేల? సృష్టికర్తయొక్క మనోఽభిప్రాయ మెట్లున్నదో దీని శరీరమట్లున్నది.

లేదు. కావ్యంబునకు యువతి నాయికగాఁ దగియుండఁగా [1] జవ్వనంబున జవరాండ్ర కలంకారములుగా నాలంకారికులు పరిగణించిన భావహావశోభాకాంతి మాధుర్యాదులకు మూలంబగు సౌందర్యమును గుచాదులను వర్ణింపకుండఁగా నెంతసేపును గాలుసేతులు మాత్రమే గ్రహించివర్ణించుటచేతనే కావ్యరసంబు పోషింప నలవడునా ? ఇట్లనుటచే నవయవవర్ణనము చేయవచ్చును గదా యని తదేకధ్యానముగా, విపరీతముగా నాశ్వాసమున కాశ్వాసమంతయుఁ దద్వర్ణనముతోనే సరిపుచ్చుట సమంజసమని నాయభిప్రాయము గాదు. సహృదయరంజకముగా, మితముగా హద్దుమీఱక యవయవ వర్ణనముగూడ నుండినఁగాని శృంగారమే లేదను నాలంకారికమతము విశ్వసింపఁదగినదనియే నాయభిప్రాయము. నాయికలయౌవన సౌందర్యము లేక శృంగార మెట్లు వర్ణింపఁబడును ? కచకుచాదులు లేక తత్సౌందర్యము నాయిక కెట్లుగలుగును ? ఈ విషయంబున మమ్మటపాదభట్టు వామన మతముగూడ నెట్లున్నదో చూతము.

" లోకోత్తర వర్ణనా నిపుణం బగు కవికృత్యమే కావ్యము. ముఖాదులను గమలాదులతోఁ బోల్చి చమత్కారముగా నసాధారణముగా వర్ణించుటయే కవికృత్యమని ప్రదీపోద్ద్యోతములు చెప్పుచున్నవి. చేఁదుమందు త్రాగుటకిష్టపడని బాలురను దేనె నాకించుట వలెనే నీతిశాస్త్ర విముఖులగు కుమారులను శృంగార రసకావ్యము క్రమముగా సదుపదేశంబునఁ బ్రవేశపెట్టును. మఱియుఁ " గావ్యాలాపములను వర్జింపఁదగు " నను నిషేధశాస్త్రము భగవద్భక్తభిన్న వర్ణన విషయకంబుగాని శృంగారకావ్యవిషయకంబు గాదు. కావుననే కాళి

1 యౌవనే సత్త్వజా స్త్రీణామలంకారాస్తు వింశతిః।
భావో హావశ్చ హేలా చ త్రయ స్తత్ర శరీరజాః।
శోభా కాంతిశ్చ దీప్తిశ్చ మాధుర్యంచ ప్రగల్భతా॥ ఇత్యాది (దశరూపకము.)

దాసాదులు శాకుంతల, నైషధీయచరితాదులను సరసముగా వర్ణించిరి. భాగవతంబున సశృంగారముగా భగవద్గుణవర్ణనము చేయఁబడినది. భామినీవిలాసంబున, శృంగారోల్లాసంబున జగన్నాథపండితరాజు స్వప్రేయసీ వర్ణనము చేసినను గంగాప్రసాదంబు గాంచిన యతని యెడ నదియర్హమే యగునని సాహిత్యసారటీక కూడ వ్రాయుచున్నది. మఱియు, "వ్యంగ్యము కామినీ కుచకలశంబులమాడ్కిఁ జమత్కారకారి యగును." అని యివ్విధంబుగా శృంగారరసవర్ణన పరిమితిని గూర్చి కనఁబడుచున్నది. వీనిఁబట్టియైన లాక్షణికమత మెంతవఱ కభ్యనుజ్ఞ యిచ్చుచున్నదో తెలియకపోదు. కావునఁ గావ్యరసపోషణంబునఁ గుచాదివర్ణన మంత వ్రీడాకరమై యనుచితము గాఁదగదని విశ్వసింపఁదగును. ఇంకనో గుహ్యాది గుహ్యావయవ వర్ణన మెంతయు నింద్య మనుట యుక్తము. అట్టిదానిని నీచాతి నీచముఁగా బరిగణించి గ్రంథములఁ జొరనీకుండఁగఁ జేయవలసినదని యే పూర్వమహాకావ్యంబులఁ బరిశీలించిన విద్యావంతులెల్ల నంగీకరింతు రని ప్రశంసించుకొనుచు నిఁక రసాభాసాదులం గూర్చి యాలోచింతము.

## రసాభాసము.

1 ఇందుఁ గొన్ని యుత్తమలాక్షణికుల మతంబులఁ గ్రింద వివరించుచు వాని కేకీభావంబుగ నర్థముఁ దెల్పెదను. ఈ క్రింద నుదాహరింపఁబడిన వివిధ లక్షణములంబట్టి, ఉపనాయకనిష్ఠము, మునిగురుపత్నీగతము, బహునాయకనిష్ఠము, ప్రతినాయకగతము, బహునాయికావిషయకము, ఏకతరనిష్ఠము (అనుభయవర్తి), అధమపాత్రతిర్యగాదివిషయకము, అనుచితనాయికానాయకంబులై యొప్పుచున్న

---

1. ఉపనాయకనిష్ఠాయాం మునిగురుపత్నీగతాయాంచ । బహునాయకవిషయాయాం రతౌ తథానుభయనిష్ఠాయాం। ఆభాసత్వం కథితం తథైవతిర్యగాది విషయతాయాం (ఉద్ద్యోతము).

శృంగారము రసాభాస మగునని తెలియుచున్నది గదా! కావ్యవిషయకంబైన యీరసాభాసముంగూర్చి యాలంకారికుల యభిప్రాయం బేమో విమర్శింతము.

రసాభాస మన నేమి? అది కావ్యంబుల నుపాదేయ మగునా కాదా?

రసమువలెఁ బ్రకాశించుట రసాభాసము. విభావాదిసామగ్రి సంపూర్ణముగా లేనిదయ్యు నారోపణంబున రసమువలెఁ గన్పడుట రసాభాసంబనియు, ఆరోపితం బగు రతిభావము రసాభాసం బనియు, మర్యాద నతిక్రమించి ప్రవర్తించు నంగరసముచే బాధింపఁబడెడి యంగిరసము రసాభాసం బనియుఁ గొంచెమెచ్చుతక్కువగా మూఁడు విధంబుల నిర్వచింపఁబడుచున్నది. తుదిదానింబట్టి హాస్యాది భూయిష్ఠంబులగు నవరసంబులకుఁ గూడ నాభాసత్వము గలుగుచున్నదని భావప్రకాశము చెప్పుచున్నది. దీనింబట్టియుఁ బూర్వోక్త లక్షణంబులం బట్టియుఁ బ్రకృతంబగు శృంగారమున కెట్లు రసాభాసత్వము సిద్ధించునో తెలియకపోదు. ఈసందర్భంబున లోకోత్తర నాయకాశ్రయత్వము ప్రధానముగా నుండఁదగిన శృంగారము పైవిధముగా నాభాసంబగునేని కావ్యంబుల నెట్లు గ్రాహ్యంబగు నను నాక్షేపంబునకుఁ బ్రతాపరుద్ర వ్యాఖ్యాన మిట్లు సమాధాన మిచ్చుచున్నది.

---

2. తదాభాసా అనౌచిత్యప్రవర్తితాః (కావ్యప్రకాశము)

3. పశ్చాదుభయనిష్ఠత్వేఽపి ప్రథమ మేకనిష్ఠ త్వే రతే రాభాసత్వం (లోచనకారులు)

4. ఏకత్రైవానురాగశ్చే త్తిర్యఙ్ మ్లేచ్ఛగతోఽపివా।
యోషితో బహుసక్తి శ్చే ద్రసాభాస స్త్రిధామతః॥ (శృంగార తిలకము)

5. అనుచితవిభావాలంబనత్వం రసాభాసత్వం (రసగంగాధరము)

6. పుంసోఽ ప్యనేకనాయికానురాగే రసాభాసత్వ మితి కేచిత్ । సాహిత్యదర్పణ రత్నాకరకారాదయోఽ ప్యేవమ్॥

"పరస్పర మనురాగము సమానముగా నుండకపోవుటవలనను, దిర్య గధమనాయకులయం దవివేక మధిక మగుటవలనను, నాయిక కనేక నాయకులయం దనురాగ ముండుటవలనను, రతిభావ మారోపింపఁ బడినదై హాస్యాస్పదం బగుటచే శృంగారాభాసము త్రివిధ మగు చున్నది. ఓయీ! ఆరోపిత రసంబున వారియందుఁ జమత్కార మెట్లు జనించునని యడుగుదువేని శుక్తికారజతమును గ్రహించి యానందించువాని నడుగుము. అది యాభాసమని తెలిసిన పిదప బాధ గలుగనందువా? పోనిమ్ము. ఆబాధాప్రపంచము సత్యమని నమ్ముచున్న సమయమందలి సంసార వ్యవహారమునకువలెనే వారి తాత్కాలిక చమత్కారమునకు హాని గలిగింపదు. కావున గ్రంథ విస్తర మేల? రసాభాసముగూడ నుపాదేయమే యగును." ఇట్లున్న పై విమర్శనముం బట్టియు, నే లాక్షణికుఁడుఁగూడ రసాభాసము కావ్యంబుల వర్ణింపఁదగ దని నిషేధింపకపోవుటంబట్టియు, నుత్తమా లంబనం బగు రసంబుమాడ్కి ననుచిత విభావాలంబనం బగు నిది సంపూర్ణంబు ముఖ్యంబును గాకపోయినను, అవర్ణనీయము బరిత్యాజ్య మును మాత్రము గాదని తెలియుచున్నది. అయినను, ఈరసాభాసం బును దాని యనౌచిత్యమును నెంతవఱకు నియమింపఁబడిన వను నంశంబున లాక్షణికుల చర్చ యెట్లున్నదో చూతము.

## [1] రసానౌచిత్యము-రసాభాసము

ఈయనౌచిత్యముంగూర్చి భట్టవామనాచార్యుఁ డిట్లు చెప్పెను. "ముందుగా స్త్రీ కనురాగము చెప్పఁదగినది. పిదపఁ దచ్చేష్టలచే బురుషునకుఁ జెప్పఁదగినది. ఇది యౌచిత్యము. దీనికి విపరీతంబగుటచే

1. ఇందుఁ గావ్యప్రకాశ, ప్రతాపరుద్ర వ్యాఖ్యలు, రసగంగాధర, సాహిత్యదర్పణౌచిత్య విచారచర్చలును బ్రమాణము. గ్రంథవిస్తరభీతిచే సంస్కృత మున నుదాహరింపలేదు.

ననురక్త కానిదానియందు వర్ణింపఁబడు ననురాగంబున కనౌచిత్యము సంభవించును. ఇట్టి యనౌచిత్యమునఁ బ్రవర్తింపఁబడు రసమే రసాభాస మగును.” దీనింబట్టి యీక్రింది చర్చ చూడఁదగును.

(1) మొదల నొకరి కనురాగంబు లేకున్నను బిదపఁ గలిగెనేని యది రసాభాసము గాదు. ఇందులకు రత్నావళి నిదర్శనము.

(2) నాయకున కనేకనాయికలయందు జనించు ననురాగము రసాభాసము గాదు. అట్లయినచోఁ గావ్యంబుల సుప్రసిద్ధముగా వర్ణింపఁబడెడు దక్షిణనాయకత్వమునకే హాని వచ్చును.

(3) స్వాభావసిద్ధం బయిన తిర్యగాదుల యనురాగంబున కనౌచిత్యము గలుగ దని వృత్తికారులు సెప్పిరి గాన నదియు నాభాసము గాదు.

(4) ప్రతినాయక నిష్ఠరతి యాభాసం బయ్యు ననౌచిత్యదోషపాత్రముగాక యుపాదేయంబే యగును. ఇందులకు రామాయణ ముదాహరణము.

(5) ఏకతర నిష్ఠరతికూడ నాభాసంబే యయ్యు బూర్వోక్తంబు మాడ్కి నుపాదేయంబే. ఇందులకు మాలతీమాధవ ముదాహరణము.

(6) ఉద్ద్యోతకారులు “ఉపనాయకసంస్థాయాం బహునాయకవిషయాయాం” అని ద్వివిధముగాఁ జెప్పి “మునిగురుపత్నీగతాయాంచ” అని మరలఁ జెప్పుట మాతలవలెఁ బూజ్యు లగునట్టివారి యనురాగము పరనాయకవిషయకముగాక భర్తృవిషయకంబైనను రసాభాసమే యగునను నర్థమును దెల్పుట కొఱకే వెం యని తోఁచుచున్నది. అట్లుగాక పరనాయక విషయక మగు నపుడే యాభాస మగునందురా? యిఁక సందియం బేమి? అట్టి యనురాగము తప్పక యనుచితంబై యనుపాదేయంబే యగును. కావుననే మిగిలిన వాని కెల్ల నుదాహరణములు చూపిన మమ్మటాదు లీయాభాసంబున కుదాహరణమే చూపినట్లు కనఁబడదు. కాని యిట్టి రసాభాసములుగూడ

నాయావిధంబుగా మహాపాతక వినాశాదులను దన్మూలకంబుగా లోకంబునకు నీతిని దెల్పునవి యగుటచే నంగములుగాఁ గావ్యంబులఁ బ్రతిపాదింపఁదగినవియే యని లాక్షణికుల మతమైనట్లు కనపడుచున్నది. కావుననే యిట్టి సందర్భంబులను భారతాదులలో వ్యాసాదులు వర్ణించిరని యెఱుంగునది. విప్రలంభ శృంగారాభాసంబునకు ననుచిత సీతాలంబనం బగు రావణానురాగ ముదాహరించిన పండితరాజు నభిప్రాయముగూడ నేతాదృశరసాభాసము మహాకావ్యంబుల నీతిదాయకముగా వర్ణింపఁదగు నను పైయభిప్రాయముననే స్థిరపఱచుచున్నదని గ్రహింపవచ్చును.

(7) వేశ్యాది విషయకంబు హాస్యరస సంకీర్ణంబు నై శృంగారాభాసము పేర నొప్పిన యనేకనాయక నిష్ఠానురాగ మనుచితం బగుటచే నంగముగా గ్రహింపఁదగును గాని యుత్తమ కావ్యంబులఁ బ్రధానముగా నుండఁదగదు. ఆ వేశ్యయే సత్యప్రేమ కలదయ్యేనేని మృచ్ఛకటికాదుల యందువలె గ్రాహ్యమే యగును.

(8) ఉపనాయక నిష్ఠరతి పరకీయా (పరోఢా) విషయకం బగుటచేతను, పరకీయ నిషిద్ధాలంబనం బగుటచేతను నిది రసాభాసంబు ననుచితంబు నగును. ఇందులకుఁ నాయకునియెడ ననురాగము గలదైనను బ్రభుకాంత యనుచిత ప్రణయ మగుటచేఁ దద్విషయకరతి రసాభాసమే యని పండితరాజును, గోపిక తనయం దనురాగము గలదైనను బరాంగన యగుటచే దానియందుఁ గృష్ణునకున్న యనురాగము రసాభాసం బగునని విశ్వనాథకవిరాజును, నిట్లే మమ్మటాదులు నుదాహరించిరి. ఇట్లే భావం బనుచిత విషయకం బయ్యేనేని భావాభాసం బగునని పండితరాజాదులు వక్కాణించిరి. ఇట్లున్న లాక్షణికుల పైచర్చనుబట్టి ప్రధాన రసభంగ హేతువుగాని యనౌచిత్యాపాదకం బగు రసాభాసాదికము కావ్యంబుల నుపాదేయ మనియు, రసభంగ హేతువును గేవలానౌచిత్య కారణంబును నుచితాలంబనంబు నగునది

పరిహరణీయమనియుఁ దెలియుచున్నది ఏవిధమైన యాభాసం బైనను దుదకు నీతిదాయక మయ్యేనేని గావ్యములనంగముగా నుండఁదగును గాని యంగిగా నెప్పుడు నుండఁదగదు.

మఱియు నీక్రింది చర్చకూడ సంభోగరతియొక్క యౌచిత్యానౌచిత్యంబుల నిర్ణయించుచుఁ బైదానినే ధ్రువపఱచుచున్నది. చూడుఁడు! చిత్రమీమాంసలో నుత్ప్రేక్షాలంకార సారస్యమున కప్పయదీక్షితు లుదాహరించిన "బాలేందువక్రా ణ్యవికాసభావా ద్బభుః పలాశా న్యతిలోహితాని। సద్యోవసంతేన సమాగతానాం నఖక్షతానీవ వనస్థలీనాం" అను కుమారసంభవ పద్యమును దత్పూర్వమే యౌచిత్యవిచారచర్చలో రసౌచిత్యమున కుదాహరించిన క్షేమేంద్రుఁడు "ఈ శ్లోకంబున వక్ష్యమాణం బగు పార్వతీ విషయక పరమేశ్వరాభిలాష శృంగారంబున ముందుగా నుద్దీపన విభావనభూతుఁడగు వసంతుని యందుఁ గాముకత్వాధ్యారోపంబున వనస్థలీ లలనల కుటిల లోహితపలాశకలికలచే నవసంగమ యోగ్యనఖక్షతం బుత్ప్రేక్షింపఁబడుట మిక్కిలి యౌచిత్య సారస్యమును బ్రతిపాదించుచున్న" దని చెప్పి మఱియొకచో నందే ప్రబంధార్థానౌచిత్యంబున కుదాహరణముగా "ఊరుమూల నఖమార్గపంక్తిభి స్తత్క్షణం హృతవిలోచనో హరః। వాససః ప్రశిథిలస్య సంయమం కుర్వతీం ప్రియతమా మవారయత్" ఈ యంబికా సంభోగ వర్ణనంబునఁ బామరస్త్రీలకుఁ దగినట్టి నిర్లజ్జంబు లగు నఖక్షతంబులతోఁ గూడిన యూరుమూలములచే నాకర్షింపఁబడిన నేత్రములు గలవాఁడని భగవంతుండు జగద్గురువు నగు త్రిలోచనుని యెడ వర్ణించుట యయుక్తంబై యనౌచిత్యమును గలిగించుచున్న" దని యుత్తమ దేవతా ప్రకృతుల సంభోగరతి కనౌచిత్యము చూపుట చేతను; గావ్యప్రకాశంబున మమ్మటాచార్యుఁడు "రతిహాసశోకాద్భుతముల దివ్యోత్తమఁ బ్రకృతులయందు వలెనే దివ్యులయెడ వర్ణింపఁ

దగును గాని సంభోగరూపం బగు రతిమాత్ర ముత్తమ దేవతా విషయకంబుగా వర్ణింపరాదు. అట్టి సంభోగవర్ణనము జననీజనకుల సంభోగవర్ణనమువలె నత్యంత మనుచితము.'' అని చెప్పినదానికి భట్టవామనాచార్యుడు — "దష్టముక్తి మధరోష్ఠ మంబికా వేదనా విధుత పాణిపల్లవా। శీతలేన నిరవాప తత్‌క్షణం మౌళిచంద్రశకలేన శూలినః'' అని పరమేశ్వరకృత పార్వతీ విషయక చుంబనదంతక్షత రూప సంభోగరతి యుదాహరించుటచేతను, రసగంగాధరంబునఁ బండితరాజు "మనుష్యులయందు వలెనే యుత్తమ దేవతలయెడ సంభోగరూపరతియొక్క స్ఫుటీకృత సకలానుభావవర్ణన మనుచితము. సకల సహృదయ సమ్మతమగు నీ సమయమును గీతగోవిందాదుల యందు జయదేవాదు లుల్లంఘించిరని యాధునికుఁ డట్లు వర్ణింపఁ గూడ'' దని గీతగోవిందంబు నందలి లీలామానుష విగ్రహరూప ధారియు, నుత్తమదేవతా ప్రకృతియు నగు శ్రీనారాయణుని సంభోగ రతి కనౌచిత్యము దెల్పుటచేతను, నుత్తమ దేవతలయొక్కయు గురు జనముయొక్కయు సంభోగరూపరతివర్ణనము మాత్రమే యనుచితం బనియు మిగిలిన యదివ్యదివ్యాదివ్య సంభోగరతివర్ణన మనుచితము గాదనియు నెఱుంగనగును. అట్లు గాదేని యదివ్యులగు నలవత్స రాజాదులయు దివ్యాదివ్యులగు రామకృష్ణాదులయు సంభోగరతి వర్ణింపఁబడిన తత్తత్కావ్యంబుల కనౌచిత్యమూలకముగా ననుపా దేయత్వము సిద్ధింపకపోవునా? అట్లయిన గీతగోవిందములోని రతిని జగన్నాథకవి నిందింపలేదా? అందలి గోవిందుఁడు దివ్యాదివ్యుఁడు గాఁడా? యని కొందఱడుగవచ్చును. సరియే కాని యట్లు కాఁడు. ఏమనఁగా? అతఁడు దివ్యాదివ్యుఁడే యను నభిప్రాయ మైనయెడల జగన్నాథకవి "యుత్తమ దేవతా విషయక సంభోగరతి యనుచిత'' మను తన లక్షణమునకు గీతగోవింద మేల యుదాహరించును? సంభోగ శృంగారమును దెల్పు రామాయణ కథాకావ్యముల నేల

యుదాహరింపఁడు ? కావున నందలి కృష్ణుడు శ్రీమద్భాగవతము లోని కృష్ణునివలె దివ్యుఁడుగాఁ బరిగణింపఁబడి యుండును. ఆకావ్యము గూడ నట్లే చెప్పుచున్నది. ఈ విషయంబున రామకృష్ణాద్యవతారపురుషులను గవులొక్కచో దివ్యులుగా నింకొక్కచో దివ్యాదివ్యులుగా మఱొక్కచో నదివ్యులుగాఁ గూడఁ బురాణేతిహాస కావ్యాదుల యందు వర్ణించియుండుట యెఱింగిన విద్యావంతులకు వేఱుగాఁ దెలుపనక్కఱలేదు మఱియు నీ విషయంబున భరతాచార్యానుమతముగా దివ్యాదివ్య మిశ్రవస్తువులు రూపకేతివృత్తములుగా నిర్ణయించిన ధనంజయకవి తనదశరూపంబున సంభోగ శృంగారమున కుత్తర రామచరిత్రలో భవభూతి వర్ణించిన దివ్యాదివ్యనాయకులగు సీతారాముల యీ క్రింది సంభోగరతి వర్ణన ముదాహరించుటయే ప్రమాణము.

(ఆంధ్రీకరణము)

"తరుణీ! యెయిది దుఃఖమో సుఖమొ నిద్రాసౌఖ్యమో
మోహమో

గరళవ్యాపనమో మదంబో యెఱుఁగంగారాదు నీదైనయీ
పరిరంభంబున నింద్రియంబులను వే బంధించు హృద్భ్రాంతి యాం
తరచైతన్యము సంచలింప ముదమందం జేయు నా కిమ్మేడన్"

దృశ్యకావ్యంబులయందే యిట్లుండ నిఁక శ్రవ్యకావ్యంబుల నుండఁ దగునని చెప్పెడిదేమి? కావున నుత్తమదివ్యులకుంబోలె నదివ్యదివ్యాదివ్యుల సంభోగరతి కనౌచిత్యము సంభవింపదు. ఇట్లనుటచేఁ దెగఁబడి వర్ణింపవచ్చునని నా యభిప్రాయముగాదు. దీని మర్యాదం గూర్చి పూర్వమే చెప్పియుంటిని.

మఱియు నీ సందర్భంబున నెల్ల లాక్షణికులును "సత్యానురాగయైనయెడల నాయికగా నుండఁదగు" నని గణికంగూర్చి లక్షణము

చెప్పుచు దాని నొక నాయికగాఁ జేర్చుట యటుంచి స్వీయతోఁ దుల్యముగా నిషిద్ధాలంబనంబగు పరోఢనుగూడ నాయికగాఁ జేర్చి దాని భేదంబులను దల్లక్షణంబులను, దదుదాహరణంబులను విస్పష్టముగా వెల్లడించుచు వాత్స్యాయనునకు మార్గదర్శిగాఁ దమ లక్షణ గ్రంథములను బరకీయాలక్షణముతో నేల పూరించిరో యనునంశము విమర్శింపవలసి యున్నది. కాని యిది ప్రత్యేకముగా విమర్శింపఁ దగిన విషయమగుటచేఁ బ్రకృతంబున కనుకూలముగా స్థాలీపులాకన్యాయంబున నీ క్రింది లాక్షణికుల యభిప్రాయ ముదాహరించెదను.

[1] "పరకీయనాయకాంతర సంబంధముగలది యనోఢ. ఇది యంగియగు ప్రధాన రసంబున నెక్కడనుగూడ నిబంధింపఁదగదు గావున దీనింగూర్చి వివరింపలేదు" అని ధనంజయ ధనికుల మతము.

[2] "పరస్త్రీ గమనోపాయము కవు లుపదేశింపరు. ఇంక నేమనఁగా? నీతిదాయకముగ రమ్యముగాఁ గావ్యాంగముగా దాని లక్షణములను లోకంబున కుపదేశింతురు" అని శృంగారతిలకకర్త యభిప్రాయము. ఈ వాక్యములం బట్టి యనోఢా విషయక శృంగారము నీతిదాయకముగా వర్ణింపఁ బడెనేని కావ్యమునం గముగా నుండఁ దగునని తెలియుచున్నది.

## అశ్లీలాదిదోషములు.

ఇంక నశ్లీలాదులంగూర్చి కొంచెము విమర్శించి ప్రకృత కాలానుసరణముగా శృంగారరస సంస్కరణముంగూర్చి ముచ్చటింతము.

వ్రీడా జుగుప్సామంగళ వ్యంజక మగుటచే నశ్లీలము మూఁడు విధంబు లనియు, సందిగ్ధాదులు కావ్యరసపుష్టిని గలిగింపవు గావునఁ

---

1. పరకీయా=అనోఢా. ఇయం త్వంగిని రసే నక్వచి న్నిబంధనీ యేతి నప్రపంచితా.

2. పరస్త్రీ గమనోపాయః కవిభిర్నో పదిశ్యతే। సుందరం కిం తు కావ్యాంగ మేత త్తేనో పదిశ్యతే ॥

గావ్యదోషంబు లనియు, నెల్లలాక్షణికులు నిరూపించిరి. ఇం దశ్లీలము పదగతము, వాక్య గతము, అర్థగతము, రసగతము నని వివిధం బగు చున్నది. గ్రామ్యంబుగూడ నశ్లీలంబున నంతర్భూతము. ఈయశ్లీల దోషంబునుగూర్చి దండి మమ్మటాదు లనంతముగా వ్రాసిరి. వారు నిషేధించినట్లుగాఁ బదవాక్యార్థంబులను దత్సమా నార్థకంబులను బరిత్యజించుచుఁ దత్ప్రయోగము విషయమై మాటిమాటికి నశ్లీలతా దోషమునకు జంకుచుంటయే విధి యయ్యెనేని పూర్వమహాకవులు కావ్యరచన వృత్తి మానవలసియే వచ్చును. కావున వారు వ్రాసిన యశ్లీలతాదోష బోధక లక్షణ మంతగా, లక్ష్యగ్రంథములపై నధి కారము చేయఁ దగినట్లుగా లేదనియు, అట్లు గాదేని వారుదాహరిం చిన శబ్దార్థాదులను మాత్రమే శాసింపఁదగును గాని తత్సదృశంబులు నగు శబ్దాదులను నియమింపఁ దగదనియు వారి లక్షణంబులును బూర్వకావ్యంబులును జాటుచున్నవి. ఇందుల కొకటికొక్క యుదాహరణ మిట్లరయుఁడు. "సాధన శబ్దమునకుఁ గల సైన్యా ద్యనేకార్థములలోఁ బురుషలింగ మని యింకొకయర్థము గూడ నుండుటచేతను, వాయుశబ్దము, అపానవాయు వను నర్థముగూడఁ జెప్పుచుండుట చేతను, వినాశ శబ్దమునకు మరణమను నర్థముండుట చేతను గ్రమముగా లజ్జను, రోఁతను, అశుభమును దెల్పుచున్నవి గావున నివి యశ్లీలములు అని మమ్మటభట్టు చెప్పెను. ఈశబ్దములనే సరిగా నీ హేతువులచేతనే యశ్లీలము లని విశ్వనాథ కవిరాజు చెప్పెను. ఇందు వీరి యభిప్రాయం బేమి? అశ్లీలతా దోషాపాదకంబు లగు నివి కావ్యంబులఁ బ్రయోగింపరాదని కదా! సరియే కావ్యప్రపంచమున నీశబ్దము లెన్నియో లక్షల పర్యాయములు గనపడుచుండ లేదా? ఇంకొక యుదాహరణము చూడుఁడు. "కటిశబ్దము గ్రామ్యము. దీనిని పామరులు ప్రయోగింతురు. పండితులు శ్రోణి నితం బాదిశబ్ద ములు బ్రయోగింతురు" అని కావ్యప్రకాశాదులు వాకొనుచున్నవి.

యభ మైథున పదంబు లశ్లీలంబు లన్నవారే, రతి సురతపదంబులు ప్రయోజ్యంబు లనిరి. పై దానింబట్టి సాధనాది పదంబులను వా రశ్లీలంబు లన్నను బూర్వకవులు ప్రయోగించుచునే వచ్చిరనియు, భాషలో నత్యల్పముగానున్న కటి మైథునాదిపదంబు లశ్లీలంబులని కవులు సుప్రసిద్ధముగా వ్యవహరించిన నితంబ సురతాది పదంబుల కభ్యనుజ్ఞ యిచ్చి రనియు, వారి నిషేధము నిషేధింపఁబడిన కొన్నిశబ్దముల యందు మాత్రమే కాక తత్సదృశ తదర్థక పదంబులయందు వర్తింప దనియుఁ దెలియుచున్నది గదా? ఇఁక దీనింగూర్చి విశేషచర్చయేల? మిగిలిన సంధిగ్ధాదిదోషంబులకుఁగూడ నిట్లే యరయునది. ఇదిగాక యీ యశ్లీలాది దోషపరిగణన విషయమై లక్షణ గ్రంథముల కంటెఁ బూర్వ మహాకావ్యంబులే యెక్కుడు ప్రమాణ మని విశ్వసింపదగును. కావున దేశ కాల పాత్ర వ్యవహార యోగ్యతను, భాషా ప్రయోగార్హతను బూర్వకవి వ్యవహారంబును నెఱింగి ప్రయోగింపఁబడిన పదవాక్యార్థ రసంబులకు నేదోషము నంటదని నాయభిప్రాయము. “సకల సుకవి వ్యవహృతంబులు లోకప్రతీతంబులు నగుటచే” భగిని, సుభగ, భగవతి, జన్మభూమి, అభిప్రేతము, ఉపస్థానము, కుమారి, మొగలుగాఁగల శబ్దంబు లశ్లీలంబులుగా” వను వామనపండిత మమ్మటాదుల మతము నాయభిప్రాయంబునకుఁ దోడ్పడకుండునా?

ఓ భాషాభిమానులారా! మనమీయపార కావ్యాలంకార లక్షణ సుధాసాగరంబు నీఁది శృంగారరసంబు తత్త్వమెఱుంగఁ దలంచుట రసాత్మకుఁడగు పరమపురుషుని తత్త్వ మెఱుంగఁ దలంచుటయే. మన భాషలోని శృంగారంబునకు సంస్కృతలక్షణమునే సంపూర్ణముగాఁ బ్రమాణముగాఁ గైకొంటిమేని “శృంగార మిట్లుండ వచ్చును. ఇట్లుండఁ గూడదు” అని మాట మాత్రమైనఁ జెప్పదగము. చిరకాల ముత్తమ రాజ్యాధిపత్యము వహించిన సంస్కృతభాష తత్తద్దేశ కాలరాజపాత్ర సమ్మతముగా ననేక విధములుగా వ్యాపించి పెక్కు లక్ష్యలక్షణ గ్రంథ

ములను నిర్మించినది. దానినే మాతృకగాఁ జేసికొని తత్తత్కాలాను గుణముగా మనభాషకూడ, గొన్ని చిన్నెలు సేకరించినది. అట్టి యెడ "దానిలో నట్లున్నది. దీనిలో నిట్లుండఁగూడదు" అని మన బుద్ధితో నిర్ణయింప నెట్లు శక్యమగును? కావున మనమేమియు వానిలో వేయక తీయక వానిని మన పెద్దలు మనకు గడించి యిచ్చిన పెన్నిధులుగా నెంచికొని సంరక్షించుకొనుచు మనభాషకు మనమిపుడు చేయఁదగిన నూతనశృంగార మేమైన నున్న దాని నార్జింప యత్నింతము. అంతియకాని గీర్వాణభాషా యోషామణితోఁ జిరకాలము మైత్రి యొనరించి సరసముగా సర్వవిధాలంకారములు శృంగారించుకొని యున్న మన యాంధ్రభాషావధూటి కిపుడు, పూర్వ మున్నట్లుండక యెప్పటి కప్పుడు తన వేషము మార్చికొనుచు నెవ్వరిని నమ్మక యున్న నూతనహూణభాషా చిరంటితో నవీన మైత్రి వచ్చినదిగదా యని తొల్లింటి చెలికత్తె యందలి విశ్వాసము లేకుండఁ జేయనగునా? అయినను, దేశకాలపాత్రముల బట్టి దేశభాషకుఁ గొంత మార్పుగలిగింపక తప్ప దందురా? సరియే; యట్లయిన యెడల నీవిషయంబున సంపూర్ణముగా సంస్కృతలక్షణము ననుసరించినచో నట్లు వలనుపడదు గావున, గొంతవఱకు దాని ననుసరించి యాధునిక కావ్యరచనంబున కనుగుణంబుగా మనమిట్లు శృంగార రస సంస్కారణము చేసికొనిన బాగుగా నుండునని నాయభిప్రాయంబును దెల్పుచున్నాఁడను. ఇందులకు విద్వల్లోకమే ప్రమాణము.

## శృంగార రస సంస్కారణము

(1) పరోఢారతి యంగిగాఁ గావ్యంబుల వర్ణింపఁదగదు.

(2) అనుచితాలంబనం బగు సామాన్య యెంతమాత్రము కావ్యములఁ జొరఁగూడదు.

(3) ఉత్తమ దేవతా గుర్వాది విషయక సంభోగ శృంగార మత్యంత మనుచిత, మవర్ణనీయము.

(4) ఆదివ్య దివ్యాదివ్యుల సంభోగ శృంగారము వ్యంగ్య మర్యాద నతిక్రమింపక వర్ణింపఁదగును.

(5) అవయవ వర్ణనము సహృదయ రంజకముగాఁ దగునుగాని క్రీడాజుగుప్సాకరముగా నుండఁదగదు.

(6) కావ్యంబులఁ గథాచమత్కార మధికముగాను, శృంగార వర్ణన మల్పముగాను నుండఁదగును.

ఇవ్విధముగా సంస్కరింపఁబడిన శృంగార ముభయ పక్షములవారి మదికి నెక్కునని తలంచెదను.

# రూపకములు - లక్షణములు

రమారమి రెండువేలయేండ్ల క్రిందట భరతఖండమున సంస్కృత భాషలో రూపకము లవతరించినట్లు కనఁబడుచున్నది. అట్టి వాటిలో మొదటివి భాసునికృతులని యీ క్రింది బాణభట్టు వచనమునఁ దెలియుచున్నది.

"సూత్రధారకృతారంభై ర్నాటకై ర్బహుభూమికైః,
సపతాకై ర్యశో లేభే భాసో దేవకులైరివ."

దీనిని బట్టి భాసునికి మున్ను సూత్రధారకృత ప్రస్తావనాదులు లేని కొన్ని రూపకము లుండి యున్నట్లును, సూత్రధారునిచే నారంభింపఁ బడిన రూపకములు రచించినవారిలో భాసుఁ డాద్యుఁ డన్నట్లును తెలియుచున్నది.

ఆకాలమందలి నాగరికుల యభిరుచికిఁ దగినట్టి రూపకరచనా పద్ధతులను, నాట్యరంగ పద్ధతులను భరతాచార్యులు తమ నాట్యశాస్త్రమున వివరించియున్నారు. భాసుని రూపకములు ముందో, భరత నాట్యశాస్త్రము ముందో నిర్ణయించుట కిది యదను కాదు గాని, ప్రదర్శన రమ్యములై ప్రాజ్ఞలోకమును రజింపజేసిన రూపకములలో మొదటివి భాసుని రూపకములేయని తోఁచుచున్నది. అవి స్వప్నవాసవదత్త, అవిమారకము, ప్రతిజ్ఞాయౌగంధరాయణము మొదలైనవి. తరువాత ఖ్యాతిగాంచిన వాటిలో శాకుంతలము, మృచ్ఛకటికము, ముద్రారాక్షసము' ఉత్తరరామచరితము మొదలగు కొన్నిమాత్రమే అత్యుత్తమములు.

ప్రాచీన కవులు కొన్నికొన్ని చిన్నవిషయములందు స్వాతంత్ర్యము వహించినను చాలవఱకు రూపకరచనా పద్ధతికి భరతనాట్య శాస్త్రమునే ప్రమాణముగా గ్రహించిరని చెప్పవచ్చును. కాని యది వివి

ధముతైన నాట్యధర్మములను పలుతెఱంగుల నుపదేశించు పెద్దగ్రంథ మగుటచే, రూపకలక్షణము సుబోధకముగా సులభముగా నుండవలె నన్న యుద్దేశ్యముతో నాట్యశాస్త్రమందలి బహువిషయములను సంగ్రహించి, రత్నావళీ శాకుంతలాది పూర్వరూపకములను పరిశోధించి, నాట్యశాస్త్రమునకు వెయ్యేళ్ళకుఁ తరువాత భోజమహారాజు పెత్తండ్రియైన ముంజుని యాస్థానములోని ధనంజయుఁడు దశరూపక మనుపేర రూపకలక్షణమును రచియించెను. దీని తరువాత బయల్పడిన యాలంకారిక లక్షణములలోని రూపక నాయక రసాది లక్షములైనను ప్రభిన్నములుగాక యించుమించు యేకరూపముగా నొక్కరీతినే యున్నవనుట నిక్కము. అనఁగా, మొత్తముమీఁద భరతనాట్యశాస్త్రము మొదలుఁగాఁ గడపటి రూపకలక్షణము వఱకును మన దేశమున రూపకరచనా పద్ధతియందు పెద్దమార్పులు సూచించు లక్షణము వేఱుగా లేదనియే చెప్పవలసి యున్నది.

రూపకముయొక్క ప్రదర్శనరమ్యత, లేక సభారంజకత్వ మను ధర్మము కవి ప్రతిభాదీనమైన తద్రచనయం దున్నది గాని కేవలము లక్షణమందు లేదనుట నిక్కము. ఇట్లనుటచే లక్షణము ననుసరింపక యథేష్టముగా రచియింపవచ్చుననియు, అట్లు పూర్వులు రచియించి రనియుఁ దలఁపరాదు. ఈకాలమువారు మనపూర్వరూపకలక్షణము ప్రదర్శనోచితము, సభారంజకము నైన రచనకు సహకారిగా లేదని యాక్షేపించుచున్నను, తొల్లినాట్యరంగముల కెక్కి ఖ్యాతివహించిన శాకుంతలాది నాటకములు కొన్ని యాంధ్రములై నేఁడు గూడ సభారంజకము లగుచున్నవనుట ప్రాజ్ఞలోక మెఱుఁగనిది గాదు. మఱియు రూపకలక్షణమును 'తూచా' తప్పకుండఁగా రచియించినామని పీఠికలలో పెద్దబడాయి చూపినవారి కొన్ని కృతులు ప్రదర్శనమునకుఁ గాదుగదా; చదువుట కైనను రుచిగొల్పని స్థితిలో నుండుటయు, సంస్కృతరూపక లక్షణమును పూర్తిగా ననుసరింపక పోయినను మఱి

కొన్ని యీనాఁటి నాటకములు ప్రదర్శన రమ్యము లగుచుండుటయు మనఁకు దెలియనిదిగాదు. ఈపట్టున చదువునపుడు మనోహరము లుగానుండు కొన్ని నాటకములు నాట్యరంగమున రక్తి కట్టకుండుటయు, చదువనింపుగాని కొన్ని యెట్లో రక్తికట్టుటయు, కనిపెట్టిన కొందఱు, నటులు సమర్థులయినచో నెట్టి నీరస నాటకమైనను ప్రదర్శన రమ్య మగుననియు, వారసమర్థులైనచో నెట్టి సరసనాటకమైనను ప్రదర్శన రమ్యము కాఁజాలదనియుఁ దలంచుట కలదు. ప్రదర్శన రమ్యత కొంత నటుల నైపుణినిబట్టి కూడ నుండునని తలంపవచ్చును గాని, అది కేవలమువారి యధీనమే యని చెప్పుట మాత్రము పొరపాటు. అయి నను రూపకము రంగస్థలమున రక్తికట్టుటయుఁ గట్టకపోవుటయు నటుల యధీనమనుమాట యటుండనిచ్చి, ముందుగా లక్షణమునకును రూపక రచనకును గల సంబంధమును గూర్చి యాలోచింతము.

ఆంధ్రమున రూపలక్షణములేని లోపమును కనిపెట్టి కీర్తిశేషులైన మహారాజా సర్ వెలుగోటి రాజగోపాలకృష్ణ యాచేంద్ర బహదరు వెంకటగిరిరాజావారి సమాదరణమున నేను 1915 లో దశరూపకము తెలిఁగించినారు. అప్పటికి తెలుఁగున నాకటకములు రచియించువారు చాలావఱకు సంస్కృత నాటక రచనా పద్ధతినే యనుసరించుట కలదు. తరువాతఁ గొందఱు స్వతంత్రించి తమ నాటకరచనమున సంస్కృ తాంగ్ల నాటక రచనా సంప్రదాయములకు సాంకర్యము గలిగింపఁ జొచ్చిరి. ఇపుడిపుడు కొంద ఱేసంప్రదాయము ననుసరింపక యథేష్టముగా నాటకములు రచించుచున్నారు. దీనిని గనిపెట్టిన కొందఱు మిత్రులు ఆంధ్రదశరూపకమందలి ప్రధాన లక్షణముల సారమును కొన్ని వ్యాసములుగా రచియించి ప్రకటించవలసినదని కోరినందున నాటక రచనా సంప్రదాయమును మూఁడు వ్యాసములుగా నీభారతిలోఁ బ్రకటింపఁ బూనినాను.

ఉ. వీనులవిందు కన్నుఁగవ వేడుక నాలుక తీపియై కథా
ధీనముగాఁగ బుద్ధి రస దీప్తముగాఁగ మనంబు మేను భా
వానుగతంబు గాఁగఁ గరినాత్మనకైన ముదంబు నీతి వి
జ్ఞానమొసంగు కావ్యము నిజంబుగ రూపక మెంచిచూడఁగన్.

చ. కవి చతురాసన ప్రతిభఁ గల్పితమైన విచిత్ర సృష్టికిం
దవిలిన దేశకాలసుర దానవమానవ వృత్త మెల్ల ని
క్కువమనునట్లుగా నెదుటఁగూరిచి చూపఁబ చిత్తమున్ సుఖా
ర్ణవమున నోలలార్చు కృతిరాజము రూపకమే తలంపఁగన్.

అనునట్లు త్రివిధకావ్యములలో నుత్తమమని వన్నెకెక్కిన రూపకము సకలజన మనోరంజకము గావలెనన్నచో, అది ఏవో కొన్ని నియమములకు లోఁబడియున్ననే యట్లగును గాని లేకున్నఁ గాదనుట ధ్రువము.

రూపకరచనకు వస్తువు, లేక కథ, నాయకాదిపాత్రములు, రసము అనునవి ప్రధాన విషయములు. నాయకాదులు లేక కథయే యుండదు. ఆ నాయకాదుల చేష్టల ననుసరించియే కాని రసము జనింపదు. అందుచే నివి మూఁడును అవినాభావసంబంధము గలవై నను, వీటిలోని యంతర్భేదములను సుబోధకముగా వివరించుటకై పూర్వలాక్షణికులు వీటిని విభజించి నిరూపించియున్నారు. అందు వస్తువు ప్రఖ్యాతము, ఉత్పాద్యము, మిశ్రము అని మూఁడు విధములు. పురాణేతిహాసాది ప్రసిద్ధమైన కథ ప్రఖ్యాతమనియు, కేవల కల్పితకథ ఉత్పాద్యమనియు, రెంటును కలిసిన కథ మిశ్రమనియుఁ జెప్పఁబడును. ఇం దెట్టి యితివృత్తము నాటకము, ప్రకరణము, భాణము, ప్రహసనము, డిమము, వ్యాయోగము, సమవాకారము, వీధి, అంకము, ఈహామృగము అను దశవిధరూపకములలో నెందెం దుపయోగింపఁ దగునను విషయమును పూర్వు లీ క్రింది విధముగా నిర్ణయించినారు.

"నాటక డిమ వ్యాయోగ సమవాకారములందు ప్రఖ్యాత
వృత్తము, ప్రకరణభాణప్రహసన వీథీ రూపకములందు ఉత్పాద్యము,
ఈహామృగమున మిశ్రవృత్తము, ఉపయోగింపవలెను. అంకమనెడి
రూపకమున ప్రఖ్యాతముగాని ఉత్పాద్యము కాని వాడవలెను.
సంకీర్ణరూపకములలో నాటికా నాట్యరాసకములు మొదలగు కొన్నిటి
యందు ఉత్పాద్యమే వాడవలెను." మఱియు చివరకంట నుండు
నితివృత్తమాధికారికమనియు, ప్రసంగవశమున వచ్చిన యితి
వృత్తము ప్రాసంగికమనియు నిర్ణయించి, ఇందుకు రామాయణ కథ
యందలి సీతారామ వృత్తాంతమును, సుగ్రీవ విభీషణాది వృత్తాంత
మును ఉదాహరించియున్నారు.

ఇట్లు ఇతివృత్తరూపక నిర్ణయము కనఁబడుచున్నను, ఇప్పటివారు
పెక్కండ్రు ఇతివృత్త మెట్టిదైనను తాము రచియించు రూపకము
లన్నిటికిని నాటక మను నామమే పెట్టుచున్నారు. ఇతివృత్త భేద
మునుబట్టి రూపకనామభేదమును పాటింపకున్నారు. కాని లక్షణము
పూర్వోక్తవిధముగా నున్నను తదతిక్రమణము కొంచెమో గొప్పో
ప్రాచీన సంస్కృతరూపకములలోఁ గూడ గోచరింపకపోదు.
చూడుఁడు—

కాళిదాసు భారత ప్రసిద్ధమైన శకుంతలా దుష్యంతకథను ప్రధాన
ముగాఁ దీసికొనియు, అందు నాటకరచన కనుకూలములగు కొన్ని
చిన్నమార్పులు గావించియు, పైఁగా అంగుళీయక వృత్తాంతము,
సానుమతి శకుంతలను గొనిపోవుట, దుష్యంతుని యింద్రలోక గమ
నము, మారీచాశ్రమ కథ మొదలగు విషయములను గల్పించి, తన
కల్పన కనుగుణముగాఁ దననాటకమునకు అభిజ్ఞాన శాకుంతల మను
పేరు పెట్టి, శాకుంతలములోని యితివృత్తమును మిశ్రముఁ గావించెను
మఱియు నిట్లే భవభూతి ఉత్తర రామాయణ కథను ప్రధానముగాఁ
గైకొని, తిరస్కరిణీ విద్యచే సీతారామ సమాగమమును, జాహ్నవీ

వసుంధరాచర్యను, అంతర్నాటక కథను కల్పించి యందలి యితి వృత్తమును మిశ్రముఁ గావించెను.

మఱియు, నాటకమునందు దివ్యుఁడుగాని రాజర్షిగాని నాయకుఁడు కాఁదగునని పూర్వలక్షణములు చెప్పుచుండఁగా, విశాఖదత్తుఁడు, ముద్రారాక్షసములో బ్రాహ్మణుఁడైన మంత్రిరాక్షసుని నాయకునిఁగా నొనరించెను. (ఇందు చంద్రగుప్తుఁడు ప్రధాననాయకుఁడును గాఁడు రాజర్షియుఁ గాఁడు. మఱియు, వీరశృంగారములలో నేదైన నొకటి నాటకమునకుఁ బ్రధానరసము గాఁదగునని లక్షణము. కాని పూర్వకవులు రసవిషయమునఁ గూడ స్వాతంత్ర్యము చూపకపోలేదు. ఇందుకు ఉత్తరరామచరితములోని కరుణ విప్రలంభశృంగార సాంకర్యమును, నాగానందములోని శృంగార శాంతరససాంకర్యమును ఉదాహరణములు. వీటిలో మొదటిదానియందు విప్రలంభము అంగియనియు, కరుణము అంగమనియుఁ జెప్పుట సమంజసముఁగా గనఁబడదు. అదియును గాక, యందలి ప్రధానరసము కరుణమే యనునట్లు భవభూతియే "ఏకో రసః కరుణ ఏవ" అను శ్లోకమున సూచించియున్నాఁడు. నాగానందములోని నాయక రసౌచిత్యములను గూర్చి ధనంజయమతమును నా యాంధ్ర దశరూపకమున వివరించియున్నాను. చూడఁదగును. ఇట్లు విశేషప్రతిభాశాలులైన పూర్వమహాకవులు తమ రూపకములు సుమనోమనోహరము లగునట్లుగా వృత్తనాయక రసములను బోషించుచుఁ గావించిన రచనలకు లక్షణ ...డ్డుపడలేకపోయినదనియు, వారి రచనావిశేషములనుబట్టి లక్షణమే తనలోని లోపములను సవరించుకొనవలసి వచ్చినదనియుఁ జెప్పవలసి వచ్చెను. అందుచే నట్టివానికి లక్షణాతిక్రమణ దోష మాపాదింపరాదు. ఇట్లే ఆధునికులు రచియించిన నాటకములలో పండిత పామర సాధారణ రంజకములైన వేవేని కలవేని యందు లక్షణాతిక్రమ దోష మున్నను పరిగణింపఁదగినది కాదు.

ఏపద్ధతియు లేక, వస్తునాయక రసశుద్ధి లేక, పాత్రౌచిత్యాదు లెఱుఁగక యిష్టమువచ్చినట్లు రచియించిన నేఁటి కొన్ని నాటకాభాసములలో నట్టి దోష మున్నదని పరిగణించుట యావశ్యకమే కాదు. ఇఁకనో కొంతవఱకు జనరంజకము, రంగస్థలోచితము నగురీతిని రచింపఁబడినట్లుగాఁ గనఁబడుచున్న కొన్ని నాటకములలోఁ గథా పాత్ర రసౌచిత్యము లందుఁ గొన్ని దోషము లున్నవని సందర్భమును బట్టి చెప్పవలసి వచ్చినది. అట్టివానిని శేరొ_నుట యుచితము కాదు గాని, రూపకకర్తలు ముఖ్యముగా వస్తుపాత్ర రసపోషణమందు జాగరూకులై రూపకము హృదయంగమముగా నండునట్లు ప్రయత్నింపవలసి యుండునని మాత్రము విన్నవింతును. రూపకరచనము సామాన్యమైనది గాదు మహాకవి భవభూతి యంతటివాఁడు మనదృష్టికి దివ్యముగా నున్నట్లు కనఁబడుచున్న మాలతీమాధవమును రచియించి, అది యాకాలమందలి విమర్శకుల యాక్షేపములకు లోనుగావలసి వచ్చుటచేతనే కాఁబోలును,

> " యేనామ కేచిదిహ నః ప్రథయంత్యవజ్ఞాం
> జానంతి తే కిమపి తాన్ ప్రతి నైష యత్నః ;
> ఉత్పత్స్యతే మమతు కోఽపి సమానధర్మా
> కాలోహ్యయం నిరవధిర్విపులాచ పృథ్వీ. "

అని ప్రస్తావనలోఁ దెలిపియున్నాఁడు. అంతటివాఁడే యట్లు సంకోచించి యుండఁగా నిఁక సామాన్యులమాట చెప్పెడిదేమి ?

మ. ఇతివృత్తంబు తెఱం గెఱుంగక రసం బీక్షింప కంకాది ప
ద్ధతి భావింపక పాత్రధర్మముల పొంతంబోక యౌచిత్య సం
గతి నర్థింపక యిచ్చవచ్చిన గతిన్ గర్వించి క్రీడించు దు
ష్కృతు లాకాశ పురాణ మిత్రములు తుష్టిం జేయఁగాఁ జాలునే !

అనుట కుదాహరణములైన రూపకములు రూపకము లనిపించుకోవు.

కూలంకషమైన సాహిత్యజ్ఞానము, వాఙ్మయ పరిశోధకత్వము, సందర్భోచిత పదగుంభన సామర్థ్యము, పాత్రౌచిత్యవిజ్ఞానము, రసపోషణ నైపుణి, లోకజ్ఞానము నను ధర్మములు గలిగి రచియించిన నాటకము పఠనరమ్యమును, ప్రదర్శన రమ్యమును అగునుగాని, నాలుగు పద్యములు, పది పాటలు, నడుమ నడుమ నేవో కొన్ని మాటలును అతికి దినమున కొకటి చొప్పున రచియించిన నాటకములు నాటకములగునా ?

ఇతివృత్తమును కవి రూపకోచితముగా మార్చుకొనవచ్చునని పూర్వరూపకముల వలన దెలియుచున్నది గాని, అర్జునుడు, శ్రీకృష్ణుడు మొదలగు ధీరోదాత్తపాత్రములను పామరాతి పామర పాత్రములను జేయునట్టి మార్పు హృద్యమగునా? సీతవంటి యత్యుత్తమ నాయిక భర్తతోఁ గాని యితరులతోఁ గాని సంభాషించుట యెంతో యుదాత్తమై, గంభీరమై, రసోచితమై యుండఁదగియుండగా, ఇప్పటి కొన్ని రూపకములలో ఆ పాత్ర మెంత నీచముగాఁ జేయఁబడినదో పరిశీలించినవారికి పాత్రపోషణ మీకాలమున నేదారిని బడి పోవుచున్నదో తెలియఁగలదు. ప్రదర్శన సమయమందు సామాజికుల హృదయమునం దాయా రస ముద్బుద్ధ మగునట్లు రచియించుటయే రూపకముయొక్క ముఖ్యోద్దేశమై యుండఁగా, తొలుత కథా సన్నివేశమే రసౌచితికి భంగకర మగునట్లు రూపకము రచియించుట యెట్టిదో యూహింపుఁడు. కావున 'నాటకాంతం కవిత్వ' మ్మను నార్యోక్తి యందలి విలువ తెలిసి, దానికి గావలసిన సాధనసామగ్రి సంగ్రహించి, ప్రదర్శనమునఁ దెలియవచ్చు లోపములను గ్రహించి, యపుడు రూపకమును రచియించినచో నది సహృదయహృదయంగమ మగునుగాని, లేకున్నఁ బరిహాసాస్పద మగుననుటలో నాశ్చర్య మేమియు లేదు.

ఇపుడు కల్పిత కథల కనుగుణములైన రూపకనామములను పెట్టక

యిప్పటివారు దృశ్యకావ్యములకెల్ల నాటకనామమే పెట్టుచున్నారు. కానిండు. ఇం దంతగా హానిలే దనవచ్చును. నాటకము నందలి యితివృత్తము ప్రఖ్యాతమేకాక ఉత్పాద్యమో, మిశ్రమో కావచ్చును. దానికిని శంకింప వలదు. కాని గ్రహించిన కథను పెంచి కాని, కుదించికాని రచించుటలో పాత్రపోషణము సముచితముగా నుండవలెను. దృశ్యకావ్యములు కేవలము పామరజను లానందించుటకై రంగస్థలమునఁ బ్రదర్శింపఁబడుచున్నవనియు, ప్రదర్శనము కేవలము ధనాకర్షణమున కనియుఁ దలంపరాదు. ఏకథ గ్రహించినను అందలి నాయికానాయకాదుల చర్య స్వభావసిద్ధమగున ట్లుండవలెను. ఆపాత్రముల ప్రవర్తనములు నైజములుగా నున్నట్లు తోఁచిననేకాని సభ్యులహృదయముల రస ముద్బుద్ధముగాదు. సామాజికులు రస పరవశులు గారా, ఆ ప్రదర్శనము నిజమైన ప్రదర్శనమే కాదు. వేషములచేతను, నృత్యగీత వాక్యములచేతను, పాటలచేతను సభ్యులకుఁ గలుగు నానందము నిజమైన ప్రదర్శన ఫలము గాదు. సభ్యుల హృదయమును కథాను యముఁ గావించి, దాని నా సారసమున ముంచునట్టి ప్రదర్శనమే ప్రదర్శనము.

కావున రసిక హృదయముల నాకర్షించునదియు, ఏదేని యొక యుత్తమ ధర్మమును బోధించునదియు నగు కథను గ్రహించి, అందు లోకవిరుద్ధములుఁ స్వభావ విరుద్ధములు నగు మార్పులు గావింపక, ప్రదర్శనౌచితికిఁ గావలసిన మార్పులు నైజము లనఁదగినట్లుగా గావించి, దానిని రంగములుగాను, అంకములుగాను విభజించునపుడు పూర్వోత్తర సందర్భములకు విరోధము గలుగకుండఁ గథ తీఁగ సాగినట్లు సాగుటచూచి, పాత్ర సంభాషణ మందుఁ గథాప్రధానోద్దేశమునకు భంగము గలుగకుండఁగా బాత్రోచితముగ గంభీరము, నుదాత్తము నైన సంభాషణము కల్పించి, రసముపై దృష్టినిలిపి, చాతుర్యమమీఱ దృశ్యకావ్యము రచియించుట శ్లాఘ్యమగును.

# నాటకరసవిచారము

"రసో వై సః;
రసగ్ం హ్యే
వాయంలబ్ధ్వానన్దీ భవతి."

నాటకము దశవిధరూపకములలో మొదటిది.

పూర్వులు నిర్వచించిన దాని లక్షణమును ప్రత్యేకము. కాని, యిపు డాంగ్లసంప్రదాయము ననుసరించి ప్రదర్శనార్హ మైన యెట్టి లక్షణముతోడి యే రూపకము నైనను నాటక మనియే వ్యవహరించు చున్నారు. ఇపు డా భావముతోనే రసమునుగూర్చి యొకింత ముచ్చ టింతము.

కావ్యనిర్వచనమందువలెనే రసనిర్వచన మందును ప్రాచీనాలంకా రికుల మతము లించుంచుక వేఱుగా నున్నను, రసము కావ్యమున కాత్మ, లేక జీవిత మనెడి యభిప్రాయము పెక్కండ్రమతముల గోచ రించుచునే యున్నది. 'రస ఆస్వాదనే' అను ధాత్వర్థమునుబట్టియు, 'రస్య తే స్వాద్యత ఇతి రసః' అను వ్యుత్పత్తినిబట్టియు, ఆనందానుభవ రూపమైన స్వాదమే రస మని తెలియుచున్నది. దీనినే "స్వాదః కావ్యార్థసంభేదా దాత్మానన్దసముద్భవః" కావ్యార్థ పరిజ్ఞానమున పైకి పొంగునట్టి యాత్మానందమే రసమనెడి స్వాద మన్న ధనంజయు మతము ధ్రువపఱచుచున్నది. ఈవిషయమునం దనుమితివాదులు భుక్తివాదులు త్రొక్కిన మార్గము లవలోకించి ధ్వన్యాలోక నాట్య శాస్త్రవ్యాఖ్యలం దభినవగుప్తాచార్యుడు లేవనెత్తిన యభివ్యక్తి వాదము మమ్మటాదులకు మార్గదర్శకమై వినుతి కెక్కినది. అందలి సార మిది :

"సహృదయుల చిత్తముల నంటి యణగియున్న రతి, ఉత్సా హము, శోకము ఇత్యాదికమైన స్థాయికావ్య పఠన శ్రవణ నాట్య

దర్శన సమయములందు విభావాదులవల్ల నుద్రిక్తమై యభివ్యక్త మగుచు నెదుట నున్నట్లు, సర్వాంగములను కౌగలించినట్లు తన్మయత్వము కలిగించి తక్కిన సర్వప్రపంచమును మఱపునకు తెచ్చుచు, వారిచే బ్రహ్మానందము మాడ్కి నాస్వాదింపబడెడి యలౌకిక చమత్కారకారియైన శృంగారవీరకరుణాదికమగు రస మగుచున్నది." దీనిని పండితరాయ లెత్తుకొని రసచర్చలో భగ్నావరణచిద్విశిష్టమైన రత్యాదిస్థాయి రస మనుటకంటె, రత్యాదిస్థాయివిశిష్టమగు భగ్నావరణచిదానందమే రస మనుట యుక్తమని స్వమత మావిష్కరించెను. ఇది 'రసో వై స' ఇత్యాదిక శ్రుత్యర్థమునకు సరిపడి సముచిత మగు నని యతనిభావము. కావ్యరసము లౌకికరసముకంటె విలక్షణమైన యలౌకికరసమని సర్వాలంకారికులును ప్రశంసించియున్నారు.

శ్రవ్యపాఠ్యకావ్యములు వారివారి యర్హతలను బట్టి శ్రోతలకును, పాఠకులకును రసానుభవము కలిగించు నన్నమాట నిజమే కాని, ప్రదర్శనరమ్యమైన దృశ్యకావ్య మట్లు కాదు, పండితపామర సాధారణముగా నందఱికిని రసానుభూతి కలిగింపజాలును. అందుచేతనే 'కావ్యేషు నాటకం రమ్య' మన్న యభియుక్తోక్తి పుట్టినది. ఒక సహృదయు డింట నుండి యొక చక్కని నాటకము చదివి యానందించుటకంటె దానినే నాట్యరంగమున నటులు ప్రదర్శించునపుడు చూచి పదిరెట్లెక్కువగా రసాంబుధి నోలలాడును, ఇదే పాఠ్యదృశ్యములకును, పఠన ప్రేక్షణములకును గల భేదము. అయితే, యీ యభిప్రాయము సర్వనాటక సామాన్యముగా వర్తింపకున్నది. చదువునపు డింపు పుట్టించు నొక రూపకము ప్రదర్శనరమ్యము కాకపోవుటయు, చదువునెడ నరుచిగా నున్న యొక కావ్యము నాట్యరంగమున రక్తి కట్టుటయు ప్రాజ్ఞలోక మెఱుగును. అందుకు తగిన కారణములును మన మెఱుగుదుము. ఇపు డావిమర్శ మటుంచి ప్రకృతమైన రస మవలోకింతము.

రసము రసత్వధర్మమున త్రికాలములయందు నేకరూపమే. అయినా ఆలంబనవిభావనాది భేదములను బట్టి శృంగారవీరకరుణాదిభేదములను పొందుటయు, అవస్థాభేదములనుబట్టి యాస్వాదగోచరము లగు రుచి భేదములను గాంచుటయు దాని నైజము. ఆ భేదములకు వశము గాక బిఱ్ఱబిగిసి కూర్చుండెనా, అది రాయిగాని రసమే కాదు. ఇందు కొక దృష్టాంతము: తీపి, తియ్యదన మనుగుణమున నొక్కటే యైనను, అందెన్నో భేదము లున్నవికదా! ఎన్నిజాతుల పండ్లున్నవో? ఒక పండుతీపి నింకొకపండుతీపి పోలుచున్నదా? ఇదంతా సత్యమే యైనను తీపితీపియే. అట్లే రసము రసమే. కాని, యొకటిమాత్రము నిజము. మాధుర్యము వలెనే యవస్థాభేదములనుబట్టి రసము ప్రభిన్నముగా గనిపించు గాక! దాని ననుభవించువారికి కలుగు నానందముమాత్ర మేకరూపమే. అదే చిదానందము. రత్యాదిస్థాయివిశిష్టమును, భగ్నావరణము నైన యాచిదానందమే రస మన్న పెద్దల నిర్వచనమున కర్థమదే.

నాటకమున వీరశృంగారములు ప్రధానములనియు, తక్కిన రసములు యథోచితముగా నంగములు కావచ్చు ననియు లక్షణవేత్తలనిరి. కాని, మహాకవులీ నియమమును పూర్తిగా ననుసరింపలేదు. శ్రోతలకును, ప్రేక్షకులకు నానందము కలిగించునట్లు రసమును గ్రహించి దానిని పోషింపబూనిన కవులు గ్రుడ్డిగా లక్షణము చేయి పట్టుకొని నడవరుగదా! అందుచే లక్షణాతిక్రమణము తప్పనుటకు వీలులేదు. రసపోషణౌచిత్యము కవిప్రతిభాధీనము. కుమారసంభవాదులందు శృంగారము నొకించుక పచ్చిగా వర్ణించిన యా మహాకవియే తన దృశ్యకావ్యములందు మర్యాదాతిక్రమణము గాకుండ దానిని పోషించినాడు. అది రసౌచిత్యపార దృశ్వుల మార్గము.

కొందఱు వ్యాఖ్యాతలును, విమర్శకులును లక్షణము దృష్టిలో నుంచుకొని యిందు ప్రధానము వీరము, ఇందు శృంగార మనుచు

భావించిరి గాని, తత్వము పరిశీలించినపుడు వాని ప్రాధాన్యమే గోచరింపదు. ఇందు కొక యుదాహరణము: నాగానందమందు ప్రధానముగా గోచరించునది శమమే. అయినను, లక్షణానుగుణముగా నందలి ప్రధానరసము దయావీరమని నిరూపించుటకు ధనికుడు విశ్వప్రయత్నము చేసినాడు. అందుకు కారణము శాంతము నాటకరసము కాదగదని లాక్షణికు లనుటయే. ఆనాటకము ప్రదర్శించునపుడు సామాజికు లనుభవించునది శాంతమే యగును గాని వీరము కానేరదు గదా! అందుచే నతడన్న దయావీరము శాంతములో నంతర్భూత మనవలెనా? శమమే యంగ మనవలెనా?

పఠనప్రదర్శనయోగ్యములైన నాటకములలో ముద్రారాక్షస మొకటి. ఇది వీరరసప్రధానమే యందురు. అయితే దాన దయాయుద్ధ వీరములలో నేది యగును? నాయకు డెవడు? చాణక్యుడా? చంద్రగుప్తుడా, లేక రాక్షసుడా? మన మెంత సమర్థించినను యిది లక్షణానురోధ మగునా? పరీక్షించినచో నిం దుత్సాహము స్థాయి యన దగునో, క్రోధ మనదగునో యను సందేహ ముదయింపక పోదు. ఇందలి విస్మయవిషాదాదిజనకములైన కుటిల ప్రవృత్తులెన్నో! తన్మూలములైన స్థాయి లెన్నో? అందుచే నామమాత్రముగా నేదోయొకటి ప్రధానరస మనుకొన్నను రసాంతరసంబంధము లేక యే నాటకమును సహృదయరంజకము కాజాల దనుట నిజమగుచున్నది. యథార్థస్థితి యదే కదా! మాలతీమాధవములో బీభత్సము వర్ణిత మగుటచేతనే యందలి శృంగార మత్యంతము మెఱుగెక్కి ప్రేక్షకుల కాశ్చర్యానందదాయకమైన దనుటయే యం దొక దృష్టాంతము.

కరుణము నాటకమునకు చెప్పిన రసము కాదు. అది ప్రధానమైన యుత్తరరామచరిత్ర మందుమా, సర్వనాటకశిరోభూషణ మైనది. వ్యాఖ్యాతకూడా ఇందలి ప్రధానరసము కరుణ మని యంగీకరించినా, కొందఱు విప్రలంభశృంగార మనుట లక్షణభయము చేతనే. అయినా

ఆ మాట యంగీకరింత మన్నను నది నాయికానాయకు లిరువురును పునస్సమాగమప్రత్యాశ లేదనుకొన్నయట్టి విప్రలంభము కరుణము గాక మఱేమగును ? తమ కావ్యము సహృదయరంజక మగుటయే ప్రధాన మనుకొని కొంద ఱిట్లు కొన్నియెడల లక్షణ మతిక్రమించినా లక్షణ మును లెక్కచేయని భాసునివంటివారు కూడా లక్షణము ననుసరింపక పోలేదు. వస్తువు కల్పిత మగుటయు, నాయకుఁడు శాంతుఁ డగుటయు కారణములుగా నింకను కొంచెము పెరుగవలసిన చారుదత్తము నాటిక యైనది. అవియే కారణములుగా నాటక మగుటకు సమర్థమైన మృచ్ఛకటికము కొంచెమనవసరముగా పెరిగి ప్రకరణమైనది. అయితే నేమి! రసపోషణమున కత్యావశ్యకమైన పాత్రపోషణ విధానమునందు రెండును చరితార్థములైనవి. అది యాకవులకు చెల్లినది.

రసపోషణము సర్వసాధారణము కాదు. అది విశేషప్రతిభాలుల సొమ్ము. దృశ్యకావ్యశోభకు కథౌచిత్య పాత్రౌచిత్య రసౌచిత్యములు మూడును ముఖ్యము లనుట సత్యమైనను, పాత్రపోషణ మటు కథకు, నిటు రసమునకును జీవకళ యుట్టిపడునట్లు చేయునది యని యంగీకరింపక తప్పదు. పాత్రశీలము సముచిత మగుచున్నంతసేపును రసము చక్కగా ప్రవహించును. అది తప్పుదారి త్రొక్కెనా, యిది యెక్కడనో యంతరించును. అందుచేతనే గణన కెక్కిన కొందరు మహాకవులు కావ్యజీవమైన రసముమీఁద దృష్టి పెట్టుకొని పాత్రముల నేమఱక పోషించుచు వచ్చిరి. ఇందు కెన్నో దృష్టాంతములు చూపవచ్చును గాని యిందు వసంతసేనను గైకొందుము.

విశ్వామిత్రునివంటి మహర్షులను వశపఱుచుకొన్న వారాంగనలకు చారుదత్తునివంటి శాంతనాయకుని లొంగదీయుట లెక్కలోనిది కాదు. అట్టి మార్గము లెన్నో లోకవిదితములు. అయితే నేమి? ఇందులో ధన ప్రధానమైన కులమున బుట్టిన వెలవెలది. సుగుణలాలసయై దరిద్రుని ప్రేమించి యా శాంతనాయకుని కనుగుణయైన శాంత

నాయికయై యిందలి రసమును సుప్రసన్నము గావించి సామాజికుల హృదయము నలరించినది. ఈ వసంతసేనాశీలపోషణము శృంగారరస పోషణమున కాదర్శోదాహరణ మన్నను సాహసము కాదు.

పాత్రములు కథలోనివే కాని వేఱు కావు. అయినా, పాత్రోచిత ముగా వస్తువును సంతరించుటయు, కథోచితముగా పాత్రములను సరి దిద్దుటయు కావ్యదృష్టిలో వేఱే. ఆ రెండును సముచితము లగుటయే రసౌచిత్యమునకు మూలము. ఇందు కెన్నో యుదాహరణము లు చూపవచ్చును గాని, కల్పితవృత్తములలో నవమాలికము, ప్రఖ్యాత వృత్తములలో వేణీ సంహారము ప్రశంసనీయము లందము. వీరరస ప్రధానములైన రామకథానాటకము లెన్ని పుట్టినవో! వాటిలో వేణీసంహారమువలె వన్నె కెక్కిన దేదీ?

ప్రఖ్యాతవృత్త మని లాక్షణికులు పేర్కొన్నారే కాని, ఆద్యంత మట్టి వృత్తముతో నున్న ప్రసిద్ధనాటకమే కనబడదు. ప్రతిమా శాకుంతలాదుల యితివృత్తములు మిశ్రములు కావా? మన మెఱిగిన విఖ్యాతరూపకముల నొక్కమాఱు స్మరించినచో, ప్రధానరసమున కంగరసముతోడి సంబంధము వలెనే ప్రఖ్యాతవృత్తమునకు కల్పిత కథాభాగముతోడి సంబంధము కూడా సహృదయాహ్లాదకారియైన రస ముప్పతిల్ల హేతు వగు నని తెలియకపోదు. కల్పితవృత్త మని కాబోలు, చారుదత్తమును నాటికగా నిర్మించి భాసుడే ప్రఖ్యాత వృత్తమైన ప్రతిజ్ఞాయౌగంధరాయణమును నాటికగానే నిర్మించినాడు. అందును నూతనాంశములను కూర్చినాడు. ఆ భవభూతియే యూ యుత్తరరామాయణకథనే యథోక్తముగా గ్రహించి కరుణరసప్రధా నముగా నాటకము రచియించినా, మనకు లభించిన కల్పితభాగముల తోడి యుత్తరరామచరిత్రవలె హాయి పుట్టించునా? అతని ననుక రించినవారి కరుణరసనాటకము లింపు పుట్టించెనా?

ఒకరి కథాపాత్రపోషణవిధానమును మఱియొక రనుకరింప

వచ్చును గాని రసపోషణవిధానము ననుకరింప నగునా? శృంగార ప్రధానములైన నాటకములు కొన్నివందలున్నవి గదా! రసప్రదర్శనవిధిలో నొకదానిని పోలిన దింకొకటి కలదా! సమానేతివృత్త రూపకములోనే యది దృగ్గ్యము కదా! ఇంక విభిన్నేతివృత్తరూపకములమాట చెప్పనేల? కాళిదాసు రూపకములు మూడును శృంగార ప్రధానములే. అందు శాకుంతలమునకు మాత్రమే విశేష ప్రసిద్ధి యేల వచ్చెను? భాసుని రూపకము లన్నిటిలోను స్వప్నవాసవదత్తకు మాత్రమే యశస్సేల వచ్చెను? దీనిని బట్టి, కథాపాత్రరసములు మూడు నొక్కరీతిగా నౌచిత్యపారము గాంచుటయే యందుకు కారణమని భావింపక తప్పదు.

నాటకములో ధీరోదాత్తులైన రాజర్షి దివ్యులు నాయకులు కావలెను రని లక్షణకర్తలన్నారు గాని, యీ నియమము నర్వాచీనులు పాటించినారా? యిప్పటివారు పాటించుచున్నారా? ప్రధానపాత్రములుత్తమశీలసంపన్నములు కావలె నన్నవారి ప్రధానోద్దేశము గ్రహించి తదనుగుణముగ నేపాత్రములు పోషించుచున్నచో ప్రధాననాయకు డేజాతివాడని శంకింప నక్కఱలేదు. ఆ పాత్ర మట్టి ధైర్యౌదార్యములను చూపదా? అతడు రాజయిన నేమి, దేవుడైననేమి? కావున సంగ్రహముగా చెప్పదలచిన దేమంటే — నాటకరచనకు పూనుకొన్న కవి సహృదయరంజక మగునను తలంపుతో తన కిష్టమైన యితివృత్తముచే గ్రహించు గాక, కాని ఆ కథ కెట్టి పరమ ప్రయోజన మభిలషించెనో దానిమీద దృష్టి నిలిపి, పాత్రముల శీలములను ప్రేక్షకుల హృదయ మాకర్షించునట్లు పోషించినపుడే యది సిద్ధించు ననియు, అపుడే రసము సముచితమై సామాజికుల నానందవశులను గావించు ననియు తెలుపుటయే. ఈ విషయమును పూర్తిగా పరామర్శింప బూనినచో గ్రంథ మెంతేని పెరుగును. దానికిందు తావు చాల దని సంగ్రహించితిని. రస పక్షపాతు లిందలి గుణము గ్రహింతురు గాక.

దశవిధములైన రూపకములలో నాటకము మొదటిది. ఆంధ్రీకరణములు, గాని తెలుఁగుదృశ్యకావ్యములన్నియు సంస్కృతలక్షణము ననుసరింపక నాటక సంజ్ఞనే స్వతంత్రములుగా వెలువడుచుండుటచేతను ప్రదర్శించునదెల్లనాటక మనియే వ్యవహరింపఁబడుటచేతను, మన భాషలో దృశ్యరూపశబ్దములకు నాటక మనెడి యర్థమే స్థిరపడుచున్నది.

నాటకములో వీరము గాని శృంగారముగాని ప్రధానరసముగా నుండవలె నని ప్రాచీననియమము కలదు. దానినిబట్టి తక్కినరసములు ప్రధానములు కాఁగూడదని గ్రహింపఁదగును. కాని, అప్రధానములుగా నుండఁగూడదని గ్రహింపరాదు. ఇందుకుఁ గాళిదాసాదుల శాకుంతలాదులందుఁ గనవచ్చు రసాంతరములే దృష్టాంతము. మఱియు నేదైన నొకనాటకమందు నాయికకుఁ గాని, నాయకునకుఁ గాని, యిద్దఱికిని గాని సంబంధించిన చర్యల యం దానాటక కథ కనుగుణముగా వీరమో లేక శృంగారమో ప్రధానముగా గోచరింపవలెను గాని, ఆనాటకమందలి యితర పాత్రముల మాటల యందుఁగూడ నట్లే యారసమే గోచరింపవలెనన్న నియమమును లేదు; ఆనాయికా నాయక చర్యలయం దైనను, అప్రధానములుగా సందర్భములను బట్టి యితర రసములు గోచరింపరాదన్న నియమమును లేదు. అట్టివే యున్నచోఁ యిపుడే సంస్కృత లక్షణము ననుసరించిన యెడల రూపకరచనయందు వైవిధ్యమే కనఁబడ దనెడి యాక్షేపణము వినవచ్చుచుండ నపు డింకను జెప్పవలెనా? పేళ్ళు వేఱయినను శృంగారనాటకము లన్నియు నొకటిగాను, వీరనాటకము లన్నియు నొకటిగాను గనఁబడక పోవునా? అట్లైనచో రసజిజ్ఞాసారస విచారముల కవకాశమే లేకపోవును. కావుననే రసవిషయమునఁ బ్రాచీనులట్టి యసంబద్ధ నియమములు గావింపనులేదు; ఒకరిద్ద ఱేవో కొన్ని సూచనలు చేసినను పూర్వకవులు వానిని బాటింపనులేదు. అదిగాక :—

ఒక ప్రధానరసమునకు రసాంతరముతో సంఘర్షణ కలిగినపుడు దాని ప్రాధాన్యముయొక్క విలువ హెచ్చుటయు, దానితోఁ జూపఱ చిత్తము తన్మయమగుటయు సంభవించును. అట్లు కలుగదేని ప్రేక్షకునిభావ ముద్బుద్ధము గాక మన్నుతిన్న పామువలె నట్టే పడియుండును. అట్లనవేల? రసాంతర సంఘర్షణ లేక శుద్ధముగా నొక్క రసమే వర్ణించిన నాటకము లేదా? అట్టిది రంజకము కాదా? అని యడుగవచ్చును గాని నిజము చెప్పవలసివచ్చినచో నట్టి దెందును లేదనియే చెప్పవలెను. రసాంతర సంఘర్షణ గలనాటకములే బహుళముగా నుండుటచే, ఆమాట వాడవలసివచ్చినది కాని, ఆద్యంతమొక్కరీతిగా నొక్కరసమే వర్ణింపఁబడినదనుకొన్న యేదో యొక నాటకమందైనను, ఆరసమున కవస్థాభేదము కనుపింపకపోదు. అదియును గనఁబడకుండఁగా నాటకము రచియించుటయు శక్యముగాదు. అట్లు రచించిన నాటకము నాటకమును గాదు.

రసము రసత్వధర్మముచే నొక్కటే యైనను, ఆలంబన విభావనాది భేదములను బట్టి శృంగారవీరాది భేదములు వుండునట్లుగా, ఏరస మైనను దన యవస్థాభేదములను బట్టి యాస్వాద గోచర రూపభేదములను బొందకపోదు. ఆభేదములకును వశముగాక బిఱ్ఱబిగిసికొని కూర్చున్న రసము రాయిగాని రసమేకాదు. ఈవిషయమునకు సంస్కృత నాటక చక్రమున నెన్నియో యుదాహరణములు కనవచ్చును. ఇందు కొక దృష్టాంతము తీసికొందము.

తీపి తియ్యఁదనమను ధర్మమున నొక్కటే యైనను, ఆ తీపిలో ననేక భేదములు కలవు. బెల్లపు తీపివేఱు; పంచదార తీపివేఱు; ఈరెంటికంటెను గలకండతీపి భిన్నముగానుండును. తేనె తీపికిని చెఱకు తీపికిని బోలికయే కనఁబడదు. ఇట్లే. అన్ని రుచులలోను భేదము గోచరించునుగదా! అట్లే, శృంగారమను రస మొకటే యైనను దానికి - అయోగము, సంయోగము, వియోగము - అను

భేదములను లాక్షణికులే కనిపెట్టిరి. అందు, అయోగ శృంగారము దృఙ్మనస్సంగ సంకల్ప జాగరకృశతాఽరతిహ్రీ త్యాగోన్మాద మూర్ఛావర్ణనల చేతను, సంభోగ శృంగారము సల్లాప సంస్పర్శన చుంబనాలింగనాది వర్ణనలచేతను, విప్రలంభ శృంగారము శాపప్రవాస బంధనాపహరణాన్వేషణస్మరణ రణమరణాది వర్ణనలచేతను, ఎన్నెన్ని భిన్నగతులఁ బోషింపఁబడుచున్నదో చూడుఁడు! అట్టి భిన్నగతులే లేక, అయోగము నొక్క చూపు వర్ణించియు, సంయోగము నొక్క సహావేశనము వర్ణించియు, వియోగము నొక్క మరణమును వర్ణించియుఁ బోషించ శక్య మగునా? అప్పు డది రసమగునా? ఇంతెందుకు? ఒక్కసారి పూర్వనాటకములవైపు దృష్టి త్రిప్పుఁడు.

స్వప్నవాసవదత్తలోను శాకుంతలములోను మృచ్ఛకటికములోను ప్రధానరసము శృంగారమే కదా! కాని వానిలోని రసములకు శృంగారశబ్దమునఁ దప్ప మఱెందును సామ్యము కానరాదు. ఆనాయకుల పద్ధతులు వేఱు, ఆనాయికల సౌశీల్యములు వేఱు. ఆరసములకుఁ గల్గిన రసాంతర సంఘర్షణాలు వేఱు, ఆరసముల యవస్థాంతరములు వేఱు. వేయేల! ఆరస పోషణవిధానములే వేఱు. అయినను, ఆమూఁడును మూఁడుదారులు త్రొక్కి మూర్ఖుల హృదయములను గూడ నెట్లు రంజింపఁ జేయఁజాలియున్నవో చిత్తగింపుఁడు. కావున నేరసమైనను, రసాంతర సంఘర్షణలవల్లఁగాని, అవస్థాంతర సంఘటనము వల్లఁగాని సముచితముగాఁ బోషింపఁబడి సహృదయహృదయాహ్లాదకర మగు ననుట నిజము. ఇక్కడ నొక్కమాట.

రసపోషణము సర్వసాధారణము కాదు. అది విశేష ప్రతిభాశాలుల సొమ్ము. దృశ్యకావ్యేందిరకు, కథౌచిత్యము శరీరము, పాత్రౌచిత్యమారోగ్యము, రసౌచిత్యము జీవము. ఈమూఁడును ముఖ్యములే యైనను, అందారోగ్యము మిక్కిలి ముఖ్యము. శరీరము సర్వావయవ సంపూర్ణమైననుఁ ఆరోగ్యము సరిగా లేకున్న నది

రూపము చెడునట్లు కృశించును; ఆ బడుగు దేహమునే యంటిపెట్టు కొని యుండి కళాహీనమై క్రమముగా జీవము క్షీణించును. కావున, ఇటు శరీరపోషణమునకును, అటు జీవరక్షణమునకును, ఆరోగ్యము ప్రధానమగుట తెల్లము. అట్లే పాత్రౌచితియుఁ గథకును రసము నకును గూడఁ బుష్టిని గలిగించును. పాత్రములు సముచితముగా నున్నంతసేపును రసము చక్కఁగా బ్రవహించును. అవి తప్పుదారి త్రొక్కెనా, ఇది యెక్కడనో యంతరించును. మఱి కనఁబడదు. కావున నాటకరసశోభ యంతయుఁ బాత్రపోషణముపై నాధారపడి యున్నదనుట ధ్రువము.

పాత్రపోషణము రసపోషణము కంటెను క్లిష్టమైనది. అది నాటక జీవమైన రస ముప్పొంగఁజేయ నాధారమగుటయే యందుకుఁ గార ణము. కొన్ని నాటకములలో నిపుడు, ఇంద్ర బృహస్పతి యుధిష్ఠిర కృష్ణార్జునుల నంటి యుత్తమ పాత్రముల సంభాషణ మానాయకుల శీల ములకే కాక యాయా నాటకముల యందలి రసములకును లోపము దెచ్చునట్లుగాఁ గనవచ్చుచున్నది. అందుచేతనే పాత్రపోషణము క్లిష్ట మని చెప్పవలసి వచ్చినది. ఇప్పుడు రంగస్థలములఁ బ్రదర్శింపఁ బడు నాటకములను జక్కఁగాఁ బరిశీలించినచో రసపోషణ పాత్రపోష ణము లెట్లున్నవో, యెట్లుండవలెనో గోచరించుననుటకంటె నిప్పట్టున వానింగూర్చి యధికముగా వ్రాయఁజాలను. ఇఁక నీ ప్రసంగ మిట్లుంచి నాటకమునం దేదోయొకటి ప్రధానరసమున్నను, రసాంతర సంఘర్షణ వల్లనే దాని ప్రాధాన్యముయొక్క విలువ హెచ్చునన్న విషయము నకు నుదాహరణముగా నుత్తరరామచరిత్ర నాటకమును గ్రహించి యించుక పరిశీలింతము.*

ఉత్తరరామ చరిత్రమునఁ బ్రధానరసము విప్రలంభ శృంగార మన్ని

* ఈ నాటకమును నేనాంధ్రీకరించితిని గావునఁ బాఠకులెల్లరును తెలియు టకై యందలి శ్లోకములకు బదులుగా దెలుఁగు పద్యము లుదాహరింతును.

కొందఱును, కరుణమని కొందఱును, పత్రికావాదము సలుపుచుం డుట చదువరు లెఱింగియుందురు. మనకిపుడావివాదముతోఁ బనిలేదు. నేను దీనిని 1909 లో నాంధ్రీకరించి ప్రకటించినపుడు పీఠికలో నిందలి ప్రధానరసము సకరుణమైన విప్రలంభ మని వ్రాసియున్నాను. ఇప్పటికిని నా యభిప్రాయ మదియే.

మహాకవి భవభూతి యీ నాటకము దుఃఖాంతముగా సమాప్త మగుట కిష్టపడక రామునికి మరల జానకీ సమావేశము గలిగినట్టు లంతర్నాటకమున వర్ణించెనే కాని, ఆ సమావేశము సత్యము కాదని యీ క్రింది మాటలవల్లనే స్పష్టపడును.

“సీత — అమ్మా! ఈ జీవలోక పరాభవ మనుభవింపఁజాలను. నన్ను నీలో విలయము చేయుము.

వసుంధర — నా మాట విని పాలు విడిచిపెట్టునంత వఱకు నీ పిల్లలను జూచుకొనుచు నుండుము. తరువాత నీ కిష్టమైనట్లు చేసెదను.

రాముఁడు — హా సచ్చరిత్రదేవతా సీతా! దీనినిబట్టి నీవు లోకాంతరమున విశ్రమించి యున్నావనుట నిశ్చయము”.

పై విషయమును, రాముని యీ క్రింది వాక్యములుగూడ బల పఱుచుచున్నవి.

“వానరసేన గూర్చుకొని వారిధిదాఁటి విచిత్రమైన క య్యానకు లోక మద్భుతమునందఁగ రావణుఁ గూల్చుదాఁక ము న్నె న్నవియోగ మోర్చుకొననయ్యె, ననంతము ఘోరమైన యీ జానకి విప్రలంభ మిఁకఁ జచ్చెడిదాఁక సహింపనయ్యెడిన్”

అయినను గవి నాటకము శుభాంతముగా సమాప్తి నొందించుట చేతను, కథ భార్యాభర్తల వియోగదుఃఖముతో నిండిన దగుట చేతను, ఇందలి రసము సకరుణ విప్రలంభ మనవలసివచ్చినది గాని, లేకున్న నిందుఁ బ్రధానరసము కరుణమనియే చెప్పవలసివచ్చును

దీనివల్ల నాటకలక్షణమున కవిరుద్ధముగా నిందు విప్రలంభ శృంగారము ప్రధాన మైనదనియు, దానికిఁ గరుణముతో సంఘర్షణము సంభవించిన దనియు విదిత మగును. ఇఁక నిందలి రసపోషణ విధాన మెట్లున్నదో చూతము. భవభూతిమహాకవి ప్రస్తావనలో నే-

"అవనిపుత్రి మహాసాధ్వి యఖిల పూజ్య
యైన వైదేహి యెడ నింద లాడుజనము
రక్కసుని యింట నుంటయే లెక్కచేయు
నమ్మహాగ్ని పరీక్షను నమ్మఁబోదు"

"కాని యీ లోకాపవాదము మన మహారాజు చెవిని బడెనేని మిక్కిలి కష్టము సంభవించును జుమీ! అయినను మునీంద్రులును దేవతలును సర్వవిధముల శ్రేయస్సు సమకూర్పఁగలరు."

అను నటీ సూత్రధారుల సంభాషణమున లోకాపవాద రూపమయిన ప్రథమాంకార్థమును, తజ్జన్యమైన సీతాప్రవాస విప్రయోగమును, ఆమెను గంగా తమసా వసుంధరాదులును వాల్మీకియు రక్షించుట యను నితరాంకార్థమును సూచించుచుఁ గథాబీజమును విప్రలంభరసమునఁ దడిపి నాటి, ఉద్దిష్ట రసోచితముగాఁ గల్పించిన వసిష్ఠ సందేశమునకు రాముఁడు -

"ప్రజల యారాధనంబె నా ప్రాణపదము
దానికై స్నేహమును గాని దయను గాని
సౌఖ్యమును గాని తుదకు నీ జనకతనయఁ
గాని విడిచెదఁ జింత యింతేని లేక".

అని సమక్షముననున్న సీతకూడ మెచ్చునట్లుగా బదులు పలికిన దాన వీరసూచక మగు నుదారవచనముల దోహద మొనర్చి, దుర్ముఖుని వలన సీతాపవాదము విని దుఃఖించి "దేవీ! నీపాదపద్మస్పర్శము రాముని శిరస్సున కిదియే కడపటిది" అని కన్నీరు విడు

చుచు నిద్రించుచున్న సీతపాదము లొకసారి నెత్తిని బెట్టుకొని యామెను విడిచి వెడలిపోవు రాముని దురంతసంతాపమును బ్రకటించుట యను నెపమున మొలకెత్తించెను. కవి యిట్లీయంకమున నాదియందు విప్రలంభము సూచించి యంతమందు దాని రూపము గనఁబఱిచియు, మధ్యభాగమున నందందు విప్రలంభ శృంగార చ్ఛాయ కనవచ్చునట్లుగా శృంగారమునే వర్ణించెను. అది సముచితమే. అతిపవిత్రము నతిగాఢమునైన సీతారాముల యన్యోన్యానురాగమును దనివిదీఱ నాస్వాదించినపుడే కాని తరువాత వర్ణింపఁబోవు వారి దురంత వియోగ సంతాపము సామాజికుల హృదయముల నొక్కమాఱుగాఁ జఱుకుక్కున నాట దనెడి యుద్దేశముతోనే కవి యట్లు వర్ణించెను. అందుకే చిత్రప్రదర్శనము తెచ్చిపెట్టెను. అందును, ఏవి రాముని నిర్మల ప్రేమామృతమున సీతహృదయము నోలలాడించి పరవశము గావించునో, ఏవి యాయనుకూల నాయకుని నిష్కల్మష హృదయము విప్పి సాభిజ్ఞానముగా జానకి కన్నులకుఁ గనఁబఱచునో, అట్టివిషయములే ముఖ్యముగాఁ బ్రదర్శించెను. అదే కదా రసపోషణపద్ధతి! ఇట్లు చిత్రప్రదర్శన మొక్క రసపోషణమునకు నిదాన మగుటయే కాదు. మొత్తము నాటకకథ కంతకును మూలాధారమై నిలిచినది. అదిగదా కథా సన్నివేశ పద్ధతి!

తన మూర్ధాభిషేక మహోత్సవము చూడవచ్చిన జనకమహారాజు కొన్ని దినములుండి మరల మిథిలకు వెళ్ళుటచేఁ దండ్రియెడఁ బాటున వికలచిత్తయైన ప్రియురాలి మనోవేదన నసాధారణ వినోదోపాయమున నపనయించి యామె మనస్సు త్రిప్పుటకై రాముఁడు చిత్తరువు నిర్మింపజేసినట్లు కవి యాతనిచే నొక్కమాట పలికించెను గాని. కథాసన్నివేశమున కనుగుణములైన ప్రయోజనములెన్నో యాచిత్ర ప్రదర్శనమున నిమిడియున్న వనుటనిజము. ఇక నొక్కగంటలో సీతారాములకు దీర్ఘవియోగము సంభవింప నున్నది గావున, ఆ యను

కూలదంపతు లవివాహముగా గృహమందును వనమందును చిన్న తనమునను యౌవనమునను మనసారఁ గ్రోలిన యనురాగరసమును జ్ఞప్తికిఁ దెచ్చుకొని యానందించుటకును, తన వియోగమున రాముఁడు పడ్డ శ్రమదుఃఖములను సీత చూచి తనయెడ నతనికిఁగల నిత్యసత్య ప్రేమనింక నెక్కుడుగ విశ్వసించుటకును, గర్భములోని కుశలవులకు జృంభకాస్త్రదానము చేయించుటకును, సీతను గంగా వసుంధరల కప్పగించుటకును, వసిష్ఠుని యానతి కనుగుణముగా సీత గోరిన గంగా స్నాన తత్తీరవిహారరూపమైన గర్భవాంఛ ననుగ్రహించుటకును, ఆ కోరికయే నెపముగా లోకాపవాదభీతుఁడైన రాముఁడు సీతనడివిలో విడిచి పెట్టించుటకును, రాఁబోవు నంకములలోని కథారసములకు రాచబాట వేయుటకును గ్రంథకర్త చిత్రప్రదర్శనము కల్పించెను. ఇక నిందు శృంగార మెట్లు వర్ణింపఁబడెనో చూతము.

దేశకాల వేషాధికమైన విభావము కారణముగాఁ బరస్పరాను రక్తులగు యౌవనవంతుల యానందాత్మకమైన సుఖానుభవమే రతి. అదియే శృంగారము. ఇందుకు దేశవిభావ కారణమగు సీతారాముల సుఖానుభవము చూడుఁడు.

## ప్రస్రవణాద్రి దర్శనము విషయము

"తలఁతునె లక్ష్మణుండు బహుధా పరిచర్యలు చేయదాని పై
నలరుచు నున్న యాదినము? లా సరసోదక గౌతమీనదిన్
దలఁతువె? దాని చెంతఁ బులినంబులు ముచ్చటలాడుచుక్కయుం
దలఁతువె? నాఁటివర్తన మెదం దలఁతే లలితాంగి జానకీ?
మఱియు నొక్కమాట. ఇది యెప్పుడైనఁ దలఁచెదవా ప్రేయసీ!
ఒక్కొక బాహుతోడ నొడలుబ్బఁగ బిగ్గ గవుంగిలించి ను
న్నెక్కిళు లొక్కటై కదియ నెమ్మదిగా మనమేమియేమి యో

మక్కువమీఱ మాటపయి మాటగ ముచ్చట లాడుకొంచు ను
న్నక్కడి నాఁటిరాత్రి సలుయామము లంతనె యంతరింపవే ?''

(అలసిపోయిన సీత బుజమును దన మెడమీఁదఁ జేర్చుకొని రాముఁడు సంతోషముతో)

"అరయంజాలను దుఃఖమో సుఖమొ మూర్ఛావస్థయో నిద్రయో
గరళావేగమొ మత్తొ నీవు ననుదాఁకం బుట్టి నా యింద్రియో
త్కరముం ద్రొక్కి మనోవికార మొకఁ డేకాకారమై లేచి యాం
తర చైతన్యము నంతలోఁ గలఁచు నంతఁ దేస్చునేమే సఖీ!''

సీత— ఇందాశ్చర్యమేమి? మీనిశ్చలానుగ్రహ మట్టిది.

రాముఁడు—"అవుర నీమాటలరయఁ గర్ణామృతములు
మానసరసాయనంబులు మ్లానజీవ
పుష్పవికసనములు నంగమోహనంబు
లగుచు నానందపెట్టున న్నంబుజాక్షి!''

ఇంక నిట్టి వెన్నో కలవుగాని గ్రంథవిస్తరభీతిచే నుదాహరింప నైతిని. మార్దవము తప్పక హాయిగొలుపు శృంగార రసమర్యాద కీయు దాహరణములు చాలవా! కాని విప్రలంభచ్ఛాయతోడి శృంగారము నకుఁ గూడ రెండుమాటలు చదువుదము. తనతొమ్మ నానుకొని నిద్రించిన సీతను జూచి రాముడు —

"నానిలయంబు లక్ష్మియిది నానయనామృత మీమెతాఁకు నా
మేన నలందు చందనము, మేలగు ముత్తెపుదండ నామెడం
బూనిన యీభుజంబు తనుప్పున్నను నీమెకుఁ జెందినట్టి దే
దైనను, గాని యీమె విరహంబు భరింప నశక్య మెంతయున్''

అన్నమాటలలో, పైమూఁడు పాదములందును బ్రియాసౌందర్య సౌశీల్యాస్వాదరూపమగు శృంగారము గోచరించుచున్నది. నాల్గవ

పాదములో ననుభూత వియోగ స్మరణముతో నా గామవిరహము సూచిత మగుచున్నది ప్రస్తుతసంబంధియు భిన్నార్థము నై యాకస్మికముగ వచ్చిన యిట్టి మాటకు గండ మని లాక్షణికులు పేరుపెట్టిరి. ఇట్లు రాముఁ డనుకొనుచుండఁగానే దుర్ముఖుఁడు వచ్చి లోకాపవాదము నెఱిఁగించెను. అది మొదలుగాఁ దక్కిన ప్రథమాంక కథ యంతయు విప్రలంభముతోనే నిండిన దగుట విదితమే కదా! మఱియు నిందే హావభావ విభావాది వర్ణనమున శృంగారమును బోషించుచు దానిప్రక్క భార్గవ శూర్పణఖా దర్శనమున భయానకమును, సీతాహరణ దర్శనమునఁ గరుణమును, వర్ణించుచు దానికి మెఱుఁగు పెట్టిన భవభూతి రసపోషణ చాతుర్యము నిం దెంతని వివరింపవచ్చును? దీనివలన రసాంతర సంఘర్షణము లేక యేరసమును శోభిల్ల దనుట మాత్రమే మనమిపుడు గ్రహింపఁదగును.

తరువాత ద్వితీయాంకమున సీతా వృత్తాంతము స్మరించు నాత్రేయీ వాసంతీ సంభాషణ మంతయుఁ గరుణమయ మనియే చెప్పవచ్చును. రాముఁడు శంబూకవధ నెపమున జనస్థానమును, బంచవటిని, బ్రవేశించి మున్ను సీతతోఁ గలసి నివసించిన యాయా ప్రదేశములు చూచి విచారించు సందర్భమున నున్న కథాభాగ మంతటను, నాటక లక్షణమునకు లోఁబడి విప్రలంభ శృంగారముకూడ స్ఫురించుచున్న దనవలసి వచ్చునేమో కాని నిజమున కందు, కరుణమే విస్తరిల్లినదని చెప్పవలెను. ఇందుకు రాముని యీ క్రింది మాటలే ప్రమాణము.

" తనువున నుండియుండి యెగఁదన్నెడు తీవ్రవిషద్రవంబు రీ
తిని, మును డొక్కలో నణఁగి దెబ్బఁ జలించిన ముల్కిముక్కలా
గున, సెలలెత్తి బద్దలగు గుండియలోని రణంబు మాడ్కి నా
వెనుకటి శోకమే మరల వేఁపఁగఁ జొచ్చెను నూతనంబుగా. "

"అక్కట! యింట నున్నగతి నా కమలాక్షిని గూడి పెక్కు నా
ళ్ళొక్కడనుంటి? దేనికథ లెప్పటికప్పుడె యూరుచుండు మా
కక్కమనీయ పంచవటి నాసతి మాపినపాపి రాఘవుం
డొక్కఁడు నిప్పు డెట్లు కనునో? చని చూడక యెట్లుపోవునో?"

'ఉత్తరే రామచరితే భవభూతి ర్విశిష్యతే' అను ప్రసిద్ధికిం బాత్రమైన యీ నాటకమందలి కథాకల్పనము నిరుపమాన మగుటచే నిం దీగుణ మున్నది యిది లేదని చెప్పవలసిన యవసరమే కనంబడదు గాని, అందును, ప్రథమాంకమందలి చిత్రప్రదర్శనము తృతీయాంకము నందలి సీతారామ సమాగమము సప్తమాంక మందలి యంతర్నాటకము ననునవి మూఁడును నాటకేందిరకు మూఁడు రత్నహారము లనుట యతిశయోక్తి కాదు. మఱియును—

"కవి చతురానన ప్రతిభఁ గల్పితమైన విచిత్రసృష్టికిన్
దవిలిన దేశకాల సురదానవ మానవవృత్తమెల్ల ని
క్కువ మనునట్లుగా నెదుట, గూరిచి చూపఱ చిత్తమున్ సుఖా
ర్ణవమున నోలలార్చు కృతిరాజము రూపకమే తలంపఁగన్."

అను లక్షణమునకు లక్ష్యము గాఁదగిన యిందలి తృతీయాంకమునఁ గవి యుద్దేశించిన సకరుణ విప్రలంభము మూర్తీభవించి రాతిని గూడఁ గరఁగించునట్లున్న దనుటయు నతిశయోక్తి కాదు. అదియుం గాక, గంగా యమునా సరస్వతులవలె విప్రలంభ కరుణ సంభోగ శృంగారములు కొంతవఱ కెడనెడఁ గలసి ప్రవహించుటయే దీని ప్రత్యేక ప్రశంసకుఁ గారణమనుటయు యథార్థోక్తి కాకపోదు. ఇట్లు శృంగారాది రసములు స్ఫురించుచున్నను, ఈ నాటకమందలి విప్రలంభము విశేషించి దుఃఖాత్మకమే యగుటచే, కవి యిందలి ప్రధానరసము కరుణమనియు శృంగారాదు లప్రధానరసము లనియు స్వాభిప్రాయమును తమసావాక్యమున నిట్లు వెల్లడించియుండెను.

'కరుణరస మొక్కటే వేఱుకారణముల,
వేఱు వేఱు విధంబుల మాఱుచుండు
సలిల మొక్కటె బిందుతుషారభంగ,
బుద్బుదావర్త రూపముల్ పొందునట్లు'

ఈ యభిప్రాయము నౌచిత్యమును గొంత పరిశీలింతము.

రంగము పంచవటి. రాముఁ డచ్చటికిఁ గార్యాంతర ప్రసక్తిచే వచ్చెను గాని, సీత కనఁబడునని రాలేదు. ఆవిరహ మట్టిదగుటచే నతని కట్టి సంకల్పము జనించుటకే వీలులేదు. ఇఁకనోఁ గంగాదేవి పన్నిన యుపాయమును బట్టి కుశలవుల జన్మదినోత్సవ సందర్భమున సూర్యు నారాధించుట యను నెపము పెట్టి తమసాదేవి సీత నచ్చటికిఁ గొనివచ్చెను గాని, యిఁక దన జన్మములో రాముని దర్శింతు నన్న యాశ యామెకును లేదు. అట్టియెడఁ బరస్పర సందర్శనమున నిరాశ చెందియున్న వారి యవస్థలఁ గరుణముగాక విప్రలంభ మెట్లు గోచరించును? కాని యిం దొక్క విశేషము.

సీతారాములు చిరకాలము నివసించిన పంచవటిలోఁ బ్రవేశించిరి. అందలి చిరపరిచితము లయిన ప్రదేశములును మృగపక్షి పాదపాదులును వారి స్నేహసల్లాప క్రీడాదులకు సాక్షులయి యున్నవి. అవి వారికిఁ గనఁబడక మానవు. వాటిని జూచి తమ పూర్వవృత్తాంతము స్మరించుకొని తమ వియోగ మానాఁడే వచ్చినట్లుగా వారు దుఃఖింపక పోరు. ఆపట్టున వారి చేష్టలయందు విప్రలంభము గోచరించుట సహజమే కాని, యదియుఁ గరుణమయముగానే యుండుననుటయు సహజమే. వారిద్దఱికిని బ్రాణసఖియు వనదేవతయు నగు వాసంతి రామునికిఁ దోడు, ఆదంపతుల శ్రేయమే కోరుచున్న తమసాదేవి సీతకుఁ దోడు, వారిద్దఱికిని వీరిద్దఱు కనఁబడరు. వీరి మాటలు వినఁ బడవు. వీరిరువురికిని వారిరువురు కనఁబడుదురు. వారిమాటలు వినఁ బడును.

"విమానరాజమా!" యన్న రాముని కంఠస్వరము వినఁగానే,

ఉఱుమువిన్న బాలమయూరికిఁ బోలె సీతకు విలాసహేతువగు సాత్త్విక భావ ముదయించెను. చిక్కి పాలిపోయియున్న రామునిఁ జూడఁగానే యామెకు విరహ వికారమైన మూర్ఛ వచ్చెను. పంచవటిని జూడఁగానే హృదయమున దాఁగియున్న విరహదుఃఖము ముప్పిరిగొనుటచే రామునికి మూర్ఛ వచ్చెను. అతని యవస్థ చూచిన సీత హృదయమును దుఃఖాగ్ని దహించెను. ఈపట్టున శృంగార విప్రలంభ కరుణము లెట్లు మెలివేసుకొనుచున్నవో కనిపెట్టుచుండుఁడు.

సీత రాముని లేవనెత్తెను. రాముని యానందమునకు మేరలేదు. సీత "నా కిపు డిదే యెక్కువ" యనుచుఁ బతిస్పర్శసుఖపరవశ యయ్యు నయ్యానందమును శంకాభయములతో నాస్వాదించెను గాని, రాముఁడు సీత కరస్పర్శమున జనించిన పరమ సుఖమునఁ దన్మయుఁడై మైమఱచి, తమ యప్పటి వియోగము మాటయే మఱచిపోయి జానకితో నున్నట్లే యి ట్లానందించెను.

"పరమాహ్లాద మొనర్చి జీవనము నాపాదించి రక్షించు నీ
కరసంస్పర్శము మున్నెఱింగినదె నిక్కంబౌర ! చిత్తవ్యథా
భరజాతం బగుమూర్ఛ నిప్పు డిది పోవంద్రోసి యానంద సం
భరితం బౌజడభావ మంగములఁ బర్వంజేయు నూత్నంబుగా."

"ఘనవియోగమున నాకస్మిక ఘటనచే బరవశంబయి ప్రాను
పడినయట్లు
భర్తృదుఃఖంబునకు దుఃఖపడినయట్లు ఘనతరంబగు ననురక్తిఁ గరఁగి
నట్లు"

సీత హృదయ మానందించెను. మరల నింకొకసారి రాముఁడు మూర్ఛిల్లెను. సీత యతనిని స్పృశించినది. రాముఁడు మూర్ఛదేఱి యామెచేయి పట్టుకొని వాసంతితో — "ప్రేయసీ సంస్పర్శ సంజనిత మైన శృంగార భయముచే నానందమగ్నమై నాయొడలుపరవశ మగు

చున్నది. ఈచెయ్యి నీవుకూడఁ బట్టుకొనుము" అనుచు స్పర్శజన్యరతి ననుభవించెను. చెయ్యూఁడ దీసికొనియు సీత ——

"మగనిఁ దాఁకిన సుఖముచే గగురుపాటు
చెమట కంపంబు గదురు నీ విమలతనువు
గాలిఁ గదలుచు వాన చుక్కలకుఁ దడిసి
మొగ్గ దొడిగిన కడిమి సొంపును వహించె."

అని తమస యన్నట్లుగా సాత్త్వికభావంబు లంకురింప నానంద పరవశురాలయ్యెను. చూచితిరా! కరుణములో విప్రలంభములో సంభోగశృంగారమంత చక్కఁగా నిముడునట్లు వర్ణించిన కవి రస పోషణచాతుర్యము! ఇఁకనో, భార్యాభర్తృ వియోగమునకు సంబంధించిన దగుటచే విప్రలంభము పేరుగూడ వెన్నంటి వచ్చు చున్నను ముందుముందు కరుణమే సార్వత్రికమై రసాంతర సంఘర్షణ గాంచుచుఁ దఱిమెనఁ బెట్టినట్లు తళతళలాడుచుండును.

పా లెంతతియ్యగా నున్నను, పంచదార కలసినప్పటి తీపిరాదు. అట్లు రస మెంతయాస్వాద్యమైనను రసాంతరము కలసి నప్పటి మాధుర్యమును దానికి రాదు. వీరమునుండి యద్భుతమును, రౌద్రము నుండి కరుణమును బుట్టినట్లే కరుణమునుండి క్రోధముగూడ జనియించి యాస్వాదగోచర మగును. ఇందు కీయుదాహరణములు చూడుఁడు.

రాముఁడు——ఓ పౌర జాన పదులారా! మహాత్ములారా!

"జానకి యింట నుండుట యసమ్మతమయ్యెను మీకుఁ గావునన్
గానఁ దృణంబు మాడ్కి విడనాడితి మీ కపుడైన జాలి యిం
తేనియుఁ బుట్టెనే? మది దహించెడు నప్పటిభావముల్, దయా
హీనుఁడ దిక్కులేక యిపు డేడ్చెద మీర లనుగ్రహింపుఁడీ!"

మఱియును జనకుఁడు (నాల్గవ యంకము) సీతను దలఁచి దుఃఖించి "హా కుమారీ! పతివ్రతాశిరోమణీ;

అనుచితనింద భర్తవిడనాడినయట్టి పరాభవంబు కా
ననగతి కాన్పువేదన యనన్య సహాయత దుఃఖవార్ధిముం
చిన తఱి దుష్టజంతువులు చేరినయప్పుడు భీతిచెంది 'నా
యన' యని యెన్నిసార్లు హృదయంబున నన్ను దలంచితో గదా!"

"అహాహా! దురాత్ములగు పౌరుల నిర్దయత్వము?
ఆహా! శ్రీరాముని శీఘ్రకారిత్వము" అనుచుఁ గారుణ్మక మెత్తనా, శాపమివ్వనా యని లేచెను. పైస్థలముల యందు కరుణముతోఁ గ్రోధము పుట్టినట్లున్నది గాని, దాని కతికినట్లుగా లే దనుటయే రస రసాంతరసంఘటన మందలి కవి నైపుణిసి వెల్లడించును. ఇట్లే రసాం తర సంఘటనమున కుదాహరణము లిందెన్నే చూపవచ్చును. అయిన నింకొకటి రెండు :—

శృంగార వీరకరుణాదు లెనిమిది మాత్రమే రూపక ప్రధానరసము లుగాఁ బరిగణింపఁబడినను, తక్కినవి యం దుపరసములుగా నుండుట కాటంకము కనఁబడదు. సుప్రసిద్ధ రూపకము లన్నిటి యందును రూపకేతరరసములు సందర్భోచితముగా వర్ణింపఁబడుటయే యిందుకుఁ దారాహ్యణము - అట్లే యిందును,

అరుంధతీ కౌసల్యలు లవునిజూచి ప్రేమించి దగ్గఱకుఁ బిలిచి యొడిలోఁ గూర్చుండఁ బెట్టుకొని 'సీత మొగమే వీని మొగ' మని యానందించుచున్నపుడు జనకుఁడు మనుమనిఁ జూచి హృదయమున వాత్సల్య ముప్పొంగ —

"అనుగుం గూఁతురిచాయ రాముచుచి తా నచ్చొత్తినట్లుండె నీ
తనియం దీముఖకాంతి యీయొడలి సౌందర్యంబు నీ వాణి యీ
వినయం బీయనుభావ మయ్యవియు, హా విశ్వంభరా నందినీ
తనయా! నా హృదయంబు చంచల గతిన్ ధావించు వేదానలన్."

అనుచు విచారించె. ఇందు వత్సలముతోఁ గరుణమైక్యమైనది. మఱియు నే నాటకమందైనను, కథాసన్నివేశ మొక్కరసమునకే

యనుగుణముగా నుండదని యింతకు మున్నె చదివియుంటిమి. ఆ యభి ప్రాయమునకుఁ దగినట్లుగా నిందును, ప్రధానరసమును వెనుక చేసి కొనియు దానిని గప్పిపుచ్చియు హాస్య వీరా ద్భుతాది రసములు ముందుకు వచ్చిన చోట్లును గలవు. ఇందుకు వాల్మీకి శిష్యసంభాషణ మును, లవ చంద్రకేతు సంవాదమును, జృంభకాస్త్ర మహిమయు మున్నగునవి యుదాహరణములు. పోరాటమునకు డీకొన్న లవ చంద్ర కేతువులు పరస్పరము చూచుకొని స్నేహ వివశు లగుటయు, ఆ సంద ర్భమున సుమంత్రుఁడు లవుని జూచి సీత కొడుకేమో యని భ్రాంతి పడి కన్నీరు విడిచి, "హృదయమా! పెడదారిఁ బడెద వేమి?

నీదు మొలకెత్తు నభిలాష కాదిమైన,
బీజమును ముందుగా దుష్టవిధి హరించె
హృదయమా! యెక్కడైనను మొదలుకోసి,
నట్టితీఁగకు మొగ్గలు పుట్టునొక్కొ?"

అని విచారించుటయు, తన్ను లాలించిన సుమంత్రునితో "పెద నాయనగా రనపత్యులై యుండ సూర్యవంశమునకుఁ బ్రతిష్ఠయేది?" యనుటయుఁ గథతోఁ జక్కఁగా నతికిన భవభూతి పూర్వోక్తమయిన రససంకీర్ణతను మనస్సున నుంచుకొనియే లవునిచే "అబ్బా! రస క్రమము మిశ్రీకృత మగుచున్నది" అనిపించెను. రసాంతర సంఘట నము చేతనే రసముయొక్క విలువ హెచ్చుననుట కీనాటకకర్త వచ నమే పరమ ప్రమాణము. ఇఁక నీనాటక ప్రాణములలో నొకటియైన విషయ మింకొకటి యున్నది. అది రామ కుశలవుల సమావేశ రంగము. ఈ నాటకమందలి ప్రతిరంగము ప్రదర్శనమున రక్తి కట్టునదే యైనను, దీనివలె సామాజికులను చిత్రప్రతిమలఁ గావించునది యంత ర్నాటక రంగము తప్ప వేఱు లేదేమో యని నాయనుమానము. ఇందలి వీర భక్తివత్సల కరుణ శృంగార విప్రలంభముల యేకీభావమే యిందుకుఁ గారణము.

దాండాయనునివల్ల లవునికిని రామసేనకును సంగ్రామముసంభవించిన మాట విని కుశుఁ డుగ్రుఁడై విల్లుచేపట్టి వీరోక్తులు పలుకుచు వచ్చు చుండ నతనిఁ జూచి రాముడు "ఈ పాపఁడు వచ్చు వీరరసభాసుర మూర్తియొ దర్పమో యనన్" అనుచు శాంతిముగా నతనిఁ బ్రశంసించెను. అపుడు లవుఁ డన్నను గలసికొని రామాయణ కథానాయకుఁడైన శ్రీరామమూర్తి యిచ్చట నున్నాఁడు, వినయముతో రమ్మని చెప్పఁగా నతఁడందు కంగీకరించి యట్లే వచ్చి ఆ మహనీయునిం జూచి భక్తిరసం బుప్పతిల్ల,

> "ఏమి యనుభావ మేమిరూ పేమి మహిమ !
> అహహా ! రామాయణ కవీంద్రుఁ డనఘుఁడైన
> యర్థనాయకు సమకూర్చి యర్థదివ్య
> ఫణితి వాగ్దేవి నుపయోగ పఱిచెఁగాదె"

అనుచు స్తుతించి రామునికి నమస్కరించె. రాముఁడు నతని, గౌఁగిలించుకొని పుత్రాలింగన సంజనిత మగు నానందాబ్ధి నోలలాడెను. ముప్వురు నొక్కచోఁ గూర్చుండిరి. రాముఁడు కుశలవుల యాకార సంపద పరిశీలించి వారు తన పుత్రులేయని సాభిజ్ఞానముగాఁ దన మనస్సునకు సరిపెట్టుకొనుచు వీరి నడిగి తెలిసికొందునా యని కన్నీరు విడిచెను. ఈ సందర్భమున లవుఁడన్న మాటకు బదులుగాఁ గుశుఁ డిట్లు పలికెను.

"ఆఁ తమ్ముఁడూ ! ఏమిది ?

> ఆయెను సీతలేని బ్రతు కక్కట ! దుఃఖము రాదె తేనికిన్ ?
> ప్రేయసి పోయినన్ జగము పెద్దయరణ్యము, వారి ప్రేమ మ
> జ్ఞేయ మపార మీవిరహ సింధువు, దీని నెఱుంగవొక్కొ ? రా
> మాయణ మెన్నఁడుం జదువనట్టులు ప్రశ్నలు వేయఁజూతువే !"

రసము నట నిష్ఠముకాదు కాని, ఇందలి ప్రతివాక్యము చదువునపుడును అనుకార్యు కుశుఁడు గూడఁ గంటనీరు పెట్టకపోఁ డనుచో, కరుణ

రస మూర్తియై యెదుటనున్న యనుకార్య రాముని జూచు సామాజికుల హృదయము కరుణాపారము గాంచుననుట కాశ్చర్యమేమి ? తరువాత-

లవుఁడు చదివిన శ్లోకమున రాముఁడు మందాకినీతీర వనవిహార సమయమందలి సీతతోడి ప్రణయ క్రీడా ప్రసంగము స్మరించుకొని తన్మయుఁడై సీతను మనసున నిలిపి సలజ్జాస్మిత స్నేహముగాఁ బలికిన యీక్రింది వాక్యముల నతని భావమెట్లు స్ఫురించుచున్నదో చూడుఁడు.

"శ్రమజల శీతలం బయి నిరాభరణోజ్జ్వల కర్ణపాళి ర
మ్యము నయి పత్రభంగ మలినాకృతిఁ జెందని చెక్కులన్ మనో
జ్ఞమునయి యేటిగాలి కలకల్ చలియించి పడంగ, వాని మ
ధ్యమునఁ జెలంగు ఫాలరుచు లారిన నాఁటి మొగంబు నెంచెదన్"

మహాకవి భవభూతి సకరుణ విప్రలంభమును ప్రధాన రసముగాఁ గైకొనియు, కథౌచిత్యమునకు బాత్రౌచిత్యమునకు సరిపడునట్లుగా సహృద యహృదయ రంజక మగునట్లుగా రసాంతర సంఘర్షణము గావించుచు రసౌచిత్యము పాటించుచు నీనాటకమును శుభాంతముగా సమాప్తి నొందించుచు,

"కనకవిగ్రహమూల మీకనకగాత్రి,
పుణ్యచారిత్ర నీదేవి భూమిపుత్రి
యీమె సహధర్మచారిణి యైమెలంగ,
నశ్వమేధం బొనర్పు ధర్మానురక్తి."

అనుచు నరుంధతిచే సీతను రాముని కప్పగింపఁజేసెను. నేను నీ వ్యాసమును పాఠక లోకమున కప్పగించితిని.

# నాటకములు : పద్యములు

ఇపుడు దృశ్యకావ్యము లన్నిటికి నాటక మను సంజ్ఞయే తఱుచుగా వాడుకలో నున్నది కావున నిందు దానినే వాడుదము.

విజాతీయుల సహవాసమువల్ల వారి మతాచార సంప్రదాయములు కొన్నికొన్ని హైందవుల కబ్బుచున్నట్లే, ఆంగ్లభాషాసంసర్గవిశేషమువల్ల దాని సంప్రదాయములు కొన్ని మన భాషలకు సంక్రమించుచున్న వనుట విదితము. అది స్వాభావికమే, తప్పదు. ఇపుడు తక్కిన లక్షణముల మాట యటుంచి, నాటకముల కావశ్యక [illegible]నుచున్న యొక మార్పునుగూర్చి యించుక పరామర్శింతము.

“నాటకమందు పద్యము లుండరాదు” అని రూపకరచన కొక క్రొత్తలక్షణము తలచూపినది. ఇది పదములు, లేక పాటలకు ఉపలక్షణము. ఇవి రాగములతో పాడుట యాచారము కావున సంగీతము కూడ దన్న యభిప్రాయ మిం దిమిడియున్న దనుట స్పష్టము. ఈ మతము నేఁటిదికాదు. ఇది యుదయించి సుమారు ముప్పదియేండ్లయినది. కాని, ఆనాఁడు పద్యసంగీతములు ప్రేక్షకరంజకము లగుట కనిపెట్టుచున్న నటులు వాటిని విడువలేదు. అది యెఱిఁగిన రూపకరచయిత లామతము నెక్కువగా నాదరింపలేదు. అయినా, కొంద ఱాసమయమున వచననాటకములు రచియించుచుండుటయు, వాటిలో నొకటి రెండు ప్రదర్శింపఁబడుటయు లేకపోలేదు. అందు గణింపఁదగినది ‘కన్యాశుల్కము.’ పాత్రౌచిత్యమును చక్కఁగా పాటించినయది చదువరులను, చూపరుల నాకర్షించినమాట నిజము. కాని, ఆనాఁటివే మఱికొన్ని వచననాటకములు సామాజికులను రంజింపఁజేయలేదు సరిగదా, పాఠకులకైన నింపు పుట్టించలేదు. ఇట్లనుట పద్యాదులతోఁడి నాటకములు రెండువిధముల రంజకము లైనవని కాని, అగుచున్న వనికాని చెప్పుటకాదు. అట్టి వెన్నో విఫలమైన

మాట విద్యావంతు లెఱుఁగనిది కాదు. వాణీవిలాస నాట్యమండలి వారి యొకటిరెండు వచననాటక ప్రదర్శనము లిపుడు సభ్యరంజక ములై సఫలము లగుచున్న మాటయు నాటకకళాభిజ్ఞులకు తెలియనిది కాదు. దీనినిబట్టి, నాటకమును, తత్ప్రదర్శనమును సహృదయ హృద యంగమము లగుటకు వస్తుపాత్రరసౌచిత్యములు కారణముగాని పద్య సంగీతముల కలిమియు, వాని లేమియు హేతువులు కావని తెలియు చుండఁగా, వాటిని తీసివేయవలె నన్న వాద మెందుకు పుట్టవలెను?

"కథాదుల యౌచితి ముఖ్యమే యైనను, రంగస్థలమునందు పద్య సంగీతములతోడి సంభాషణము పాత్రోచితమును, స్వభావసిద్ధమును కాకపోవుటచే నది యింపు పుట్టింప" దని, సరే కాని, వేటి ననుక రించి మన మీ మార్పు కోరుచున్నామో, ఆయాంగ్ల నాటకము లలో పద్యములు లేవా? పాత్రముల సహజ సంభాషణముకంటె ఆ పద్యరూప సంభాషణము విలక్షణముగా నుండదా? షేక్స్పియరు మహాకవి పద్యరూప సంభాషణమందలి యౌచిత్యానౌచిత్యము లెఱుఁ గఁడా? అతని నాటకములు ప్రదర్శన రమ్యములు కావా? మఱియు తెలుఁగును పోషించిన సంస్కృత ప్రాకృతములలోని రూపకములలో పద్యము లున్నవి గదా! నాటకకళాభిజ్ఞులైన భాసకాళిదాసాదులును, రాజశేఖరాదులును పద్యరూపపాత్ర సంభాషణము సామాజిక రంజ కము కాదని తలఁచినచో వారు పద్యములు రచించి యుందురా? కావున, రూపకములందు పద్యము లుండరాదన్న వాదము సమర్థము కాఁజాలదు. ఇఁకనో. పద్యభావము తెలియకుండునట్లు నిరర్థకములైన పదముల విఱుపులతో పద్యమధ్య పద్యాంతములందు రాగము సాఁగ దీసి పాడుట కూడదందురా; అది యంగీకరింపఁ దగినదే. అంకములు పద్యశతకములో యనునట్లు సందర్భశుద్ధియు, భావపుష్టియు లేని పద్యములతో నాటకము నిండించుట తగదందురా, ఆ యభిప్రాయ మును గ్రహింపఁదగినదే. అంతే కాని శ్రుతిరమ్యమును, భావాను

గతము నై యౌచిత్యమర్యాద నతిక్రమింపని పద్యమును, సంగీతమును సామాజికుల కుత్సాహము పుట్టింపవని మాత్రము భావింపరాదు. అవి రంగప్రసాధనవిధులలో చేరినవే.

సంస్కృతనాటకముల ననువదించుటయు, వాటి ననుకరించి యను సరించి రూపకములు వ్రాయుటయు తెలుఁగునకు సుమా రేఁబది యేండ్లనాఁడు బయలుదేఱినది గాని, నన్నయభారత ముదయించిన దాదిగా సుమారాఱుశతాబ్దులలో మనవారు రూపక రచనమే యెఱుఁగరు. తరువాత నేవో యొకటిరెండు నాటకములు పుట్టినట్లు వినవచ్చిన నేమి? అవి కనరావు. పిదప ౧౭౦౦ ప్రాంతమునందు తెలుఁగురాజులు పాండ్యాదిమండలము లేలుచున్నపుడు దృశ్యకావ్య నిర్మాణ మారంభ మైనది. అది నాట్యశాస్త్రదశరూపకాది లక్షణముల ననుగమించినది కాదు; స్వతంత్రము. వీథిపందిరియే నాట్యరంగముగా నటులు ప్రద ర్శించిన యీ దృశ్యకావ్యములు యక్షగానకావ్యము లని మనవారు వ్యవహరించుచున్నారు. అవి యిపుడు తంజావూరు పుస్తక భాండా గారమున వందలకొలఁదిగా నున్నవి. మన దేశములో చిరకాలముగా ప్రదర్శింపఁబడుచు ప్రేక్షకుల నాకర్షించుచు వచ్చిన భామకలాపము, గొల్లవేషము, ప్రహ్లాద చరిత్ర మొదలయిన వాజాతిలో చేరినవే. భారత రామాయణాదికథలను ప్రేక్షకరంజనముగా వీథిపందిటిలోని తెరమీఁద ప్రదర్శించెడి 'తోలుబొమ్మలాట' తెలుఁగువారికి చిరపరి చితమే. అది నేఁటి టాకీసినీమాను పోలవచ్చును. ఈచెప్పినవాటిలోని పద్యములు, పాటలు నింత దనుక జనరంజకము లగుచు వచ్చిన వని మన మెఱుఁగమా? నేఁటి తక్కిన నవనాగరికతాలక్షణములవలె నాటకమున పద్యాదు లుండరాదన్న నూతనలక్షణము వెలసినది గాని, యీ వాదమున సారస్య మేమీ లేదు. పద్య సంగీతసహితము కానీ, తద్రహితము గానీ! యేది సహృదయరంజక మగునో, అదే గణిం పఁదగిన నాటకమనుకొన్నచో విప్రతిపత్తియే లేదు. ఎవరికి తోఁచిన

పద్ధతిని వారునాటకములు రచింతురు. అందేది సభ్యరంజక మగునో !! దాని యదృష్టము. పదపద్యసంగీత ప్రియులు వచన నాటకములు వద్దనుచున్నారా? ఇంక వీరెందుకు వాటిని నిషేధింపవలెను ? కావున పద్య నిషేధవాదము హ్యాస్యము కాదనక తప్పదు. ఇంక :—

పాత్రసంభాషణము పద్యములవల్ల నసహజమై సముచితము కాకున్నదనెడి మతము నింతవఱకే సోదాహరణముగా నొకింత చర్చించియున్నాము. ఈ సందర్భమున మఱిరెండు మాటలు :—

కథ సత్యమో కల్పితమో! అది పురాతనమో అధునాతనమో! అందలి స్త్రీపురుషుల వేషములు వేసుకొని నటులు నాట్యరంగమున కావించు కృత్యమేమి? వారి యవస్థల ననుకరించుట. అంతే కదా 'అవస్థానుకృతి నాట్య' మన్నంతమాత్రమున వారి చేష్టలను మాటలను, ఎట్లు జరిగెనో, లేక యెట్లు జరిగియుండు నని మనమూహింతుమో, అట్లే నటులు చూపుట యనుకరణ మనియు, అదే నాట్య మనియు భావింపరాదు. అట్లేని, యా నాటకకర్త కవికాఁడు, ఆనాటకము కావ్యమును కాదు. కణ్వుఁడు శకుంతల నత్తవారియింటికి పంపునపుడే విధముగా మాటలాడి యుండునని లోకానుభవమునుబట్టి మనము తలంతుమో, అట్లే శాకుంతలనాటకమున నున్న దనఁగలమా? నిజముగా నట్లే యున్నచో, కాళిదాసు ప్రతిభాశాలి యగు మహాకవి యను పేరొందునా? ఆనాటక మింత కాలము విద్వద్రంజకమై నిలచునా? కణ్వుఁడు పద్యముతోనే పూల మొక్కల యనుమతి ప్రార్థించెనా? దుష్యంతునికి పద్యరూపసందేశము శిష్యులచేత పంపెనా? అట్లే వా రాతేనికి చెప్పిరా? లేదు. అయితే, ఆఘట్టమును నటులు నటించునపుడు సామాజికులలో నొకఁడైన 'ని దేమిటి? ఈ సంభాషణము సహజముగా లేదు. స్వభావనిరుద్ధ, మనుచిత, మని నిరసించె ననఁగలమా? ఇట్లే సీతారామ ద్రౌపదీ ధర్మజాదుల చేఁతలను, మాటలను పురస్కరించుకొని, నాటక కవు లాయాసందర్భములందు

రచించిన పద్యము లెట్లు సముచితములు కావో సప్రమాణముగా నిరూపించి, యపుడు నేఁటి నాటకకవులకు పద్యనిషేధ ముపదేశించిన బాగుండును.

ఉత్తరరామచరిత్రలో శ్రీరాముఁడు సీతను తలఁచుకొని విలపించి నట్లు రెండుమూఁడుచోట్ల పద్యము లున్నవి, నటులు వాటి భావ మభినయించుచు పఠించునపుడు తన్మయత్వము చెంది సామాజికులు కంట నీరు పెట్టుదురు గాని, "అయ్యో! భవభూతి శిఖరిణీవృత్త ములో విలాపము వర్ణించి రసభంగము కావించె" నని యతనిని తిట్టుదురా? దృశ్యకావ్యకళాపారీణు లగు కవిసత్తములు —

"కవిచతురాననప్రతిభఁ
గల్పిత మైన విచిత్రసృష్టికిం
దవిలిన దేశకాలసుర
దానవమానవవృత్త మెల్ల ని
క్కువ మనునట్లుగా నెదుటఁ
గూరిచి చూపఱచిత్తమున్ సుఖా
ర్ణవమున నోలలార్చు కృతి
రాజము రూపకమే తలంపఁగన్."

అన్నట్లు, సామాజికులు తన్మయులై యానందించుటకు రసో చితము, పాత్రోచితము, సందర్భోచితము నగు రీతిని మాటలు, పద్యములు కూర్చుచు తమ కృతి ప్రదర్శనరమ్యమగుట కుద్య మించుచు వచ్చిరి. ఇపు డా యాచారము తగదన్న కవీశ్వరులు సభారంజక మగు పద్ధతిని పద్యరహితముగానే నాటకములు నిర్మింప యత్నింతురుగాక. ఈ రెండుపద్ధతులకును రూపకసారస్వతమున నెంతో యవకాశ మున్నమాట సత్యము. అట్టియెడ నొకదాని నొకటి నిరసింపఁబని యేమి? అది తగ దనుటయే యీ వ్యాసము నుద్దేశము.

# నన్నయ తిక్కనల కవిత్వసామ్యము

మహాభారతకథ కెల్ల ద్యూతపర్వము హృదయమై శ్రీకృష్ణ యానపర్వము జిహ్వయై యాయువు పట్టు లగుచున్నవి. తెనుఁగున నున్న యీ రెంటను గూడ రసవిషయమున మూలకథ నొకమూలకుఁ ద్రోసి తాము ముందు వచ్చిన దనుటకు గోరంతయుఁ గొంకు లేదు. క్రమముగా నిన్నూ ఱేఁబది, ఏనూఱు పద్యంబులు గలిగి మఱిమఱి చదువ మురిపించెడి యీ రెంటిని గూర్చి చదువరులకుఁ గ్రొత్తగా దెలుపఁ దగినది లేదు గాని-

ఉ॥ వీనులవిందు కన్నుఁగవ
వేడుక నాలుక తీపియై కథా
ధీనముగాఁగ బుద్ధిరస
దీప్తముగాఁగ మనంబు మేను భా
వానుగతంబుగాఁగ గతి
నాత్మన కేని ముదంబు నీతి వి
జ్ఞాన మొసంగు కావ్యము ని
జంబుగ రూపక మెంచి చూడఁగన్.

అనెడి దృశ్యకావ్యలక్షణంబున కనుగుణముగా రస ముట్టిపడు నట్టి యయ్యాయి కథపట్టు లాటపట్టులై కన్నులకుఁ గనుపట్టు నట్టులు మధుమయఫణితిని భారత మారంభించిన నన్నయనైపుణియు, నట్లే దానిని దుద ముట్టించిన తిక్కన చాతురియు నొక్కచోఁ గలిపి చూడవలయునన్నందుకుఁ బైని జెప్పిన రెండుభాగములు ముఖ్యములని చెప్పవలసియున్నది.

సంస్కృతమునఁ జప్పగాఁ గనఁబడు శిశుపాలవధ తెలుఁగున బ్రత్యక్షశయ్యం బరఁగి వీరరసకణమ్ము లెగఁజిమ్ము చున్నట్లింతయుఁ

జక్కని పాకమునఁ బడినది. చిత్తగిం చెడి యీభాగమందలి యీ క్రింది పద్యము చదువరుల యెదుట సహదేవుఁడు తాండవ మాడుచున్నట్లుగా నెంత రసోచితముగా నున్నదో చూడుఁడు.

చ॥ ఎడపక యర్ఘ్య మచ్యుతున
కిచ్చితి మిచ్చిన దీని కిం దోడం
బడ మని దుర్జనత్వమునఁ
బల్కెడు వీరుల మస్తకంబుపై
నిడియెద నంచుఁ దాఁ జరణ
మెత్తె సభన్ సహదేవుఁ డట్టిచో
నుడిగి సభాసదుల్ పలుక
కుండిరి తద్దయు భీతచిత్తులై.

నివురు గప్పిన నిప్పువలె నుండి నట్లుండి యదను పదనెఱింగి తోఁక తొక్కిన త్రాఁచు మాడ్కిఁ బైలేచెడి సహదేవుని శౌర్యమును దెలిపెడి యీ పద్యమును జూచియే సోమయాజి నిజముగా మూలమున నిట్టిభావము లేకున్నను-

మ॥ తుదిరాజ్యమ్ము సగమ్ము గొమ్మ డవియం
దుం బేరు వంచించియుం
బదుమూఁడేఁడులు నీవునుం దిరిగి రాఁ
బా లీక పోవచ్చునే ?
యదిగాదేఁ దెగిబంటవై యిఱుము మా
య ల్వాన్ను నేర్పింకఁ జె
ల్లదుసూ నీ కని యా సుయోధనుని యు
ల్లం బుచ్చి పోనాడుమీ!

అనుచు సహదేవుఁడు దుర్యోధనుని మీఁదఁ బడుచున్నట్లుగా, నతని నిగూఢ శౌర్యమును వెల్లడించుచు వ్రాసినాఁడు. ఇట్లెన్నో

సందర్భములు గలవు. ఎన్నియని యుదాహరింపనగును? కావున నొక్క శైలి, నొక్క రీతిం దులఁదూఁగుచు నొక్కనోటినుండి వచ్చి నట్లుండిన ద్రౌపదీప్రసక్తి గల కొన్ని పద్యములను రెంటినుండి చవి చూతము.

ఉ॥ ఆననిజాసనం గురుకు
లాపశదుండు గడంగి రాజసూ
యావభృథంబునందు వసు
ధామరమంత్ర పవిత్రవారిధా
రావళిఁజేసి పావను
లైన శిరోజములం దెమల్చి పా
పావహుఁ డీడ్చి దెచ్చె సభ
కందఱు సంభ్రమ మంది చూడఁగన్.

ఉ. నీవు సుభద్రకంటెఁ గడు
నెయ్యము గారవముం దలిర్ప సం
భావనసేయు దిట్టి ననుఁ
బంకజనాభ యొకండు రాజసూ
యావభృథంబునందు శుచి
పెనుపొందిన వేణి వట్టి యీ
యేవురు చూడగా సభకు
నీడ్చెఁగులాంగన లిటు లోర్తురే?

చ. అనుపమ దైవయోగహతుఁ
డయ్యు నవశ్యము ధర్మసంపదం
దనరును కాక ధర్మజుఁడు
ధన్యుఁడు ధర్మపథంబు తప్పఁ ద్రో

కర్ణునె కురువృద్ధులార భృశ
కోపనుఁడీతఁడు నన్ను నేల దు
ర్జనుఁ డిటయీడ్చి తెచ్చె నవి
చారపరుం డయి దుర్మదంబునన్.

ఉ. అసభ కేకవస్త్ర యగు
నట్టి ననుం గొనివచ్చి నొంచు దు
శ్శాసనుఁ జూచుచుంబతుల
సంభ్రములై తగుచేష్ట లేక నా
యాసలు మాని చిత్రములు
యాకృతి నున్నయెడన్ ముకుంద వి
శ్వాసముతోడ నిన్గొలువ
వచ్చె మనంబది ముం దలంపవే

చ. ఇదియుచితంబు గా దనక
యిక్కురుముఖ్యులు చూచుచుండ దు
ర్మదుఁ డయి వీఁడు నన్ను నవ
మానితఁ జేసెడి సర్వధర్మ సం
విదులయి యున్న యీభరత
వీరులవంశము నేఁ డధర్మసం
పద నతి నింద్య మయ్యె నని
భామిని కృష్ణుఁ దలంచె భీతయై.

చ. అరయమిఁ జేసిరోడ జన
కప్పుడు దాసిఁగఁ జేసె నన్మహా
పురుషుని పాలికిం బతులు
వోవఁగ వీరలతోన యేను జె

చ్చరఁ జని కోటరంబు దగఁ
జేయుదునోయటు గాక పాడిమై
వరవుడ మోపి చేయుదునో
నారికి మాధవ నిశ్చయింపుమా !

ఇది యతనిది ఇది యితనిది యని యెఱింగిన వారికిఁ గాక క్రొత్త వారికిఁ పైపద్యము లన్నియు నొకనివే యని తోఁచకపోదు. మఱియు సర్వనామపదంబు లొకించుక కాలభేదమును దెలుపుచున్నవి. కాని, లేకున్న బైపద్యము లన్నియు నొక పట్టులోనివే యనియుఁ దోఁపఁక పోదు. ఈపద్యములొక్క పాత్రమునకు సంబంధించిన వగుటఁజేసి జీవకల యుట్టిపడెడి నన్నయ తిక్కనల కవిత్వకల నొక్కచోఁ జూచి యానందించుట కుదాహరింపఁ బడినవి గాని వాని నొండొంటితోఁ బోల్చి విమర్శించుట కుదాహరింపఁ బడినవి గావు. ఇఁకనో ప్రకృత విషయము గాక పోయినను ప్రసక్తియించుక గలిగినది గావునఁ రెండువిషయములయందలి ద్రౌపదీపాత్రముయొక్క యౌచిత్య మెట్లు న్నదో యించుక చూతము.

దుశ్శాసనుఁడు కొప్పు పట్టి యీడ్చినపుడు పట్టరానికోపమువచ్చిన దయ్యు భర్తలను బల్లెత్తు మాటయనని సాధ్వి యాకష్టమును రాయ బారమున కేగు కృష్ణునితోఁ జెప్పునపు డంతటి గయ్యాళియయ్యె నేమి? యనెడి, కొందఱసందియ మిందుఁ దీర్పవలసియున్నది. మూల మందలి యీభాగములు తెలుఁగునకు వచ్చునపుడు సందర్భశుద్ధికై యేదో యొకింత మార్పు చెందినను, వ్యాసుని యాశయము మాత్ర మిసుమంతయు మాఱక పోవుటం జేసి పై రెండు సమయములంగూడ ద్రౌపది కీ బుద్ధులు సుద్దులు వ్యాసుఁడు దిద్దితీర్చినవే కాని, నన్నయ తిక్కనలు క్రొత్తగా నేర్పినవి కావని తెలియుచున్నది. కాని మూల మునం దయినను ద్రౌపదీవచనముల నౌచిత్యము మాఱి పాడయిన దేమో పరిశీలింతము.

ద్రౌపది నీతిమతియు ధైర్యవతియుఁ గావుననే ధర్మరాజుఁడు సర్వ స్వముఁ దమ్ములఁ దన్నుఁ దరుణి నోటు వడెనని విన్నంతనే చెడి పోయిన గుండె నెట్లో పదిలపఱచుకొని 'యతఁడు ముందు తన్నోడెనా లేక నన్నోడెనా' యని ప్రాతిగామి నడిగె. దానికి బదులు రాకుండఁ గానే దుశ్శాసనుఁ డామె నీడ్చి తెచ్చె. భీష్మాదులు నిరుత్తరులై నిశ్చేష్టులై యుండిరి. ధర్మబద్ధుడైన యగ్రజుని మీఱఁజాలక భీమా దులు దుఃఖాయమానమానసులై యుండిరి. పైగా దుశ్శాసనుఁడు కట్టుపుట్టంబు నొలువ నుంకించుచుండె. అత్తఱి నమ్మానిని తనకోప ముపసంహరించుకొని మానరక్షణంబు కావించుకొని యావలఁ బడుట కార్యమో లేక భర్తలను నిందించుట కార్యమో యాలోచింపుఁడు. కావుననే సమయజ్ఞురాలైన యా సతి యార్తత్రాయపరాయణుం డగు నారాయణుండే కాక యిందు వేఱొండు దిక్కులేదని తెలివి తెచ్చు కొని యా శ్రీకృష్ణుంగూర్చి మొఱ్ఱవెట్టి మానము గాపాడికొనియె. ఇట్లు జూదమున నవస్థకుఁ దగినట్లుగాఁ బోషింపబడిన ద్రౌపదీపాత్రము రాయబారము నెడ నెట్లౌచిత్యము గాంచినదో చూడుఁడు.

పాంచాలి మహారాజకులంబునఁ బెరిగిన యసూర్యంపశ్యయయ్యుఁ గష్టకాలంబులఁ బతులను నీడవోలె ననుగమించి పెక్కిడుములు గుడిచినది. ప్రతినతీఱినను భర్తల కర్ధరాజ్యము వచ్చు వెరవులేదయ్యె. అయిదూళ్లిచ్చినను జాలు నని ధర్మరాజు శాంతిఁ జూపుచుండె. అన్న యానతి నతిక్రమింప లేక తమ్ములు మొక్కవోయిన వజ్రాయుధము మాడ్కి మెఱయకుండిరి. యుధిష్ఠిరు ననుమతిని గృష్ణుండు సంధికై యరుగనుండె. అట్టియెడ పరాభవదుఃఖాగ్నిని జిరకాల మెడఁదనణఁచి కొని యున్న యామె కెట్లుండునో చెప్పఁ దరమా? వీరపత్నియు వీరమాతయు రాజనీతిజ్ఞురాలు నైన యామహారాజ్ఞి గాక యెప్పుడు నీచజీవనమున కోడఁబడెడి ప్రియులకు శౌర్యోద్రేకంబు గలిగించు మంత్రము లింకెవ్వరు గలరు? తన్నుఁ బ్రేమించెడి భర్తలకుఁ దన్ను

గారవించెడి తోఁడబుట్టువునకును నింటిలో నున్నపుడే యామె తన యభిప్రాయ మెఱిఁగించుట తప్పయ్యె నేని యిఁక సమయ మెద్ది? ఆమాటలైనను శత్రువుల దుశ్చేష్టలను జ్ఞప్తికిఁ దెచ్చుటకుఁ గాక భర్తలను నిందించుట కుద్దేశింపబడినవా? కావున నయ్యవస్థకు శాంతింబోలె నీయవస్థకుఁ గ్రోధ ముచితమై యీపాత్రము నౌచిత్యము నకు గుఱి గావించినదని చెప్పవచ్చును. ఇంకనో సంస్కృతముననున్న యధిక ప్రసంగమును విడిచిపెట్టి "మాఱటనోరి దానవయు కాఱులు ప్రేలెద"నని యితరు లన దగిన మాటల నామె నోటనే పలికించి, తుదకు "దీనికి నూఱుపెన్నడుం బుట్టదు దుష్టనిగ్రహము పూని జగంబులుగాచునట్టి తోఁబుట్టువు నీవుఁ దేజమునఁ బోల్చిన భర్తలు గల్గవచ్చుతా!" యని నిజమయిన యభిప్రాయమును జెప్పించి యొక్కమా ఱేడ్పించి సత్యమయిన స్త్రీస్వభావము లోకమునకు విశద పఱచి ద్రౌపదీపాత్రము నెంతయుఁ దిక్కన పోషించియున్నాడు. కావునఁ బై రెండు విషయము లందును సంస్కృతాంధ్రములు రెంటి యందుగూడఁ బాత్రౌచిత్యమునకు భంగముగలుగలేదని విశ్వసింప వచ్చును.

# ఎవఁడు కవి ? ఏది కావ్యము ?

కవిశబ్దము మిక్కిలి సనాతనమైనది. మంత్రద్రష్టలు, లేక మంత్రకృత్తు లనెడి యర్థమును దెల్పు ఋషి సూరి ధీర కవి శబ్దములు సమానార్థములై వేదములఁ గనవచ్చును. ఇందు కవిశబ్దము మాత్రమే లౌకికభాషలో కావ్యకర్త యను నర్థమున వాడుకలోనికి వచ్చినది గాని, దీనికి ఋషిశబ్దార్థమును పూర్వు లసమన్వయించక పోలేదు. భట్టతౌతుఁ డను మహాలాక్షణికుఁడు తన కావ్యకౌతుకములో నీ శబ్దముల యర్థము నిట్లు నిర్వచించి యున్నాఁడు. అతని కృతి లభింపకపోయినా, ఈ శ్లోకములు మాత్ర మర్వాచీనుల వాక్కుల నలంబడి జీవించి యున్నవి :

"నానృషిః కవి రిత్యుక్త మృషిశ్చ కిల దర్శనాత్,
విచిత్రభావ ధర్మాంశ తత్త్వప్రఖ్యా చ దర్శనమ్ ;
స తత్త్వదర్శనా దేవ శాస్త్రేషు పఠితః కవిః"

"దర్శనా ద్వర్ణనాచ్చాథరూఢా లోకే కవిశ్రుతిః"

"ప్రజ్ఞా నవనవోన్మేషశాలినీ ప్రతిభా మతా,
తదనుప్రాణనా జీవద్వర్ణనా నిపుణః కవిః"

అతీంద్రియమైన ధర్మతత్త్వమును జ్ఞాననేత్రమునఁ జూచి, చూచిన ట్లుచ్చరించినవాఁడు ఋషియైన కవి యని మంత్రద్రష్టృపరమైన మొదటిభాగమున కర్థము. అసాధారణమును, సహృదయ హృదయాహ్లాదకారియు నైన విచిత్ర విషయమును కనిపెట్టి దానిని ప్రతిభా విశేషమున జీవ ముట్టిపడునట్లు వర్ణించు నేర్పుకాఁడు కవి యని లౌకిక కవిపరమైన రెండవభాగమున కర్థము. ఇందు కుదాహరణము వాల్మీకిమహర్షి. అతని దర్శనము స్వచ్ఛమును, నిత్యము నైనను,

శ్రీరామచరితవర్ణనము పుట్టువఱకును లోకమునఁ గవిత్వ ముద
యింపలే దనుచు నతఁ డిట్లు పలికియున్నాఁడు :

"తథాహి దర్శనే స్వచ్ఛే నిత్యేఽప్యాదికవేర్మునేః
నోదితా కవితా లోకే యావ జ్జాతా న వర్ణనా"

దీనినిబట్టి రుచికరమైన విచిత్ర విషయము కనిపెట్టుటయు, దానిని సహృదయరంజకముగా వర్ణించుటయు లౌకిక కవి లక్షణ మని విదిత మగుచున్నది.

ఈ లక్షణమే పూర్తిగా పట్టవలెనంటే వాల్మీకి తరువాత వ్యాసుఁడు లెక్కకువచ్చును. మఱి భాస కాళిదాసాదుల మాట యేమిటి? లక్షణము చెప్పినట్టి వర్ణనము వారిదైనా, దర్శనము వారిది కాదు కావున, వా రర్ధకవు లనఁదగుదురు గాని పూర్తికవులు కాఁజాల రనవలసివచ్చు చున్నది. — బాగున్నది. అయితే, ప్రాచీన పండిత సంప్రదాయసమ్మతము లైన కవిలక్షణములలో నిదియొకటి కావచ్చునుగాని, యిదే పరమ ప్రమాణ మనవచ్చునా? దీనినిబట్టి దీనికిఁ బూర్వులైన భాసకాళిదాసాదులే యర్ధకవులైతే దీనికిఁ బరులైన వారిమాటయేమి?, అనువాదకులైన తెలుఁగువారి గతియేమి? ఈ వ్యాసము మొదటికే మోసము వచ్చునుగదా! — అట్లు కాదు. ఇతరుల దర్శనమందలి ప్రధాన కథాంశమును గ్రహించినా, సాధారణ మానవులకు గోచరింపని విచిత్రవిషయములను దర్శించి వాటితో సర్వాంగసౌష్ఠవముగా దానిని పెంచి పోషించు ప్రతిభయున్నచో నతఁడు కవియే యన్న భావ మీలక్షణములో నిమిడియున్నది. 'కవిత్వబీజం ప్రతిభానమ్' ఇత్యాదిగా వామన రాజశేఖరాదులు నీ భావమునే వెల్లడించియున్నారు. ప్రతిమానాటకమునందును, శాకుంతలములోను గనవచ్చు విషయమంతయు రామాయణ భారతసంహితలలోనిదేనా? వారందు చూపిన చిత్ర విచిత్ర మనోహర నూతన

విషయము వారి దర్శనము కాదా ? అదియెల్ల ప్రతిభాకార్యమనుట స్పష్టముకదా! కావుననే "భాసో భాసయతే జగత్" "కవయః కాళిదాసాద్యాః" ఇత్యాదిస్తుతులకు వారు పాత్రులైరి. ఉత్తర రామచరిత్రలో ముప్పాతికముప్వీసము భవభూతి దర్శనము కాదా ? అందుచే వారు పూర్తికవులే యగుదురనుట నిశ్చయము. కాని, ఆనాఁడు కవిపదమెంతో గిరాకీ గాని, "పోకకు పుట్టెఁ" డన్నట్లు కారుచౌక కాదు. అది యెంతో దుర్లభవస్తువని, యిపుడు మనము మహాకవు లనుకొనుచున్న యీ మహనీయులే భావించియున్నారు. ఇందుకు కాళిదాసెంతో జంకుచు నేమన్నాఁడో చూడుఁడు :

"మందః కవియశః ప్రార్థీ
గమిష్యా మ్యుపహాస్యతామ్."

అబ్బా! అంతటి కవిత్వకళామూర్తి కెంతటి సంకోచము! ఇది యహంకారనిరాశావచన మన్న ననవచ్చును గాని, చదివినంతనే తోఁచెడి యర్థమో ! కవియన్న కీర్తి నపేక్షించుట నవ్వులపా లగుట యఁట ! కవిపదము దుర్లభాతిదుర్లభ మనుట కింతకంటె వేఱే సాక్ష్యమేల ? ఇదే యంత దుస్సాధమైతే మహాకవి పదము మాట ? ఆ విషయము నిరూపింప మనము సమర్థులము కాము. ఆనందవర్ధనాచార్యుఁ డేమన్నాఁడో చూడడమే మన పని :

"అస్మిన్నతి విచిత్ర కవిపరంపరా వాహిని
సంసారే కాళిదాస ప్రభృతయో ద్విత్రాః
పంచషావా మహాకవయ ఇతి గణ్యంతే."

అతివిచిత్రమైన యీ కవిపరంపరారూపసంసారములో కాళిదాసాదులిద్దఱు ముగ్గురు, లేకపోతే అయిదాఱుగురు మహాకవులుగా గణింపఁబడుచున్నారని నిర్దాక్షిణ్యముగా చెప్పినాఁడు. మన లెక్కను బట్టి చూచినా, ధ్వన్యాలోకములోని యితరకవుల శ్లోకములనుబట్టి

చూచినా, యితనినాఁటికి గణనకు వచ్చిన కవులు సుమారు వంద మంది యుందురు. అయితే నేమి? ఏ ప్రతిభావిశేషము పాఠకులయు, శ్రోతలయు హృదయము నానందమయము గావించునో, అట్టి ప్రతిభ గల మహాకవులు వారిలో నాలుగురికంటె నెక్కువ లేరని యొక్క మాట చెప్పి విడిచిపెట్టినాఁడు. ఆ యైదాలుగు రయినా, తమంతఁ దాము మహాకవులమని యనుకొన్నవారు కారు; నలుగురిని చేరఁదీసి యనిపించుకొన్నవారు కారు, లోకములో వారికున్న ప్రఖ్యాతినిబట్టి యితఁడు గణించినవారే. సెబా సానందవర్ధనా! గొప్ప ధైర్యశాలివి. మహాకవిబిరుదమునకే నీవింత యాగ్రహము చూపినావు, దీనిని తలదన్నే నేఁటి బిరుదులు నీనాఁడున్నచో నీనిర్ణయ మెట్లుండునో! ఏమయితే నేమిలే! ఆకాలము గనుక నీమాట చెల్లినది. నీవిపుడు మా దేశములో నుదయించి యింతమాటందువా, నీపని యేమగునో!

అర్వాచీన సంస్కృత కవులలో కొందఱు దుర్గర్వదురహంకారముల నేవేవో బిరుదులు తగుల్చుకొని విజృంభించినమాట నిజమే కాని, వారైనా చెప్పడానికి వీలులేనంతగా మితిమీఱినవారు కారు. పాపము! వారి కావ్యములైనా బయటికి రాలేదు. ఇఁక నట్టివారి గొడవ యెందుకు?

ఇంతదనుక సంస్కృతమందలి కవిలక్షణ మెట్టిదో, కవులు, మహాకవులు ననఁదగినవా రెట్టివారో కొంచెము తెలిసికొన్నాము. ఇట్లే తెలుఁగునఁగూడ కొంతవఱకు చూతము.

నన్నయార్యుఁడు మొదలుగా పోతనార్యునివఱకు మహానీయు లెందఱో యున్నారు. వారందఱు ననువాదకులే యైనను, అలోకసామాన్యమైన ప్రతిభచే విచిత్రవిషయము లెన్నో చూచినవారు గావున దర్శనవర్ణనములు రెంటను వారు కవులై దేశీయులకు మృదుమధురభాష ప్రసాదించి కవిత్వభిక్ష పెట్టినవారై వంద్యు లగు

చున్నారు. అవకాశ మున్నను వారు తమ పోషకప్రభువులవల్ల బిరుదులు గైకొన్నవారు కారు. అట్టివారికి బిరుదు లెందుకు? వారి పేరే బిరుదు. శ్రీనాథుఁ డొకఁడు తప్పనిసరి యగుటచే గౌడడిండిమభట్టుకంచుఢక్క పగులఁగొట్టించి, దేశమంతట వెలసినాఁడు కాని, యతఁడైనా, తన కవిత్వశక్తికి మెచ్చి చంద్రశేఖరు క్రియాశక్తిరాయలు నిండుపండితకవిసభలో నిచ్చిన కవిసార్వభౌమ బిరుదము పరిగ్రహించి యొక చాటుపద్యములో నొకమాఱు స్మరించినాఁడే కాని దానిని బుజాన వేసుకొని యూరేగలేదు. "అరుగుచున్నాఁడు శ్రీనాథుఁ డమరపురి" కన్నాఁడు గాని పోవునపుడు కూడా పట్టుకొనిపోవుట కుద్యమించలేదు. అల్లసాని పెద్దనార్యుని యాంధ్రకవితాపితామహ బిరుదము నట్టిదే.

కాని, ఇక్కడ నొకమాట— పూర్వ సంస్కృత కవులవలె పూర్వాంధ్రకవు లందఱును నిర్మత్సరులు, నిరహంకారులు కారు. వీరి కర్వాచీన సంస్కృత కవుల గుణములు కొన్నియబ్బినవి. ఇఁక నర్వాచీనాంధ్రకవులందుమా, వారర్వాచీన సంస్కృత కవులను మంచివారనిపించిన వారైరి. ఈపోలికలు గుణములందే కాని, కవితాశక్తిని కాదు. మన ప్రస్తుత విషయమదే కదా! కాని,

> "అంతా కవులముగామా?
> అంతంతగ కందపద్దె మల్లఁగలేమా?"

అన్నట్లున్న యీ రోజులలో వేమన శతక సుమతిశతక కర్తలు మహాకవు లనఁబడుచున్న యీకాలములో - కవితాశక్తి పరీక్ష కాక దంతపరీక్షయేదైనా, మనవారు చెప్పిన కవిలక్షణ మెట్టిదో యొకింత చూచుటకేమి? కవిలక్షణము నిర్వచించిన వారిలో నత్యంత మర్వాచీనుఁ డయ్యు, నాద్యుఁ డనఁదగినవాఁడు పింగళిసూరనార్యుఁడు. ఇతఁడు కళాపూర్ణోదయములో కలభాషిణి మాటలుగా—

> "పొసఁగ ముత్తెపుసరుల్ పోహళించినలీల—"
> "చలువగల వెన్నెలల చెలువునకు సౌరభము గలిగినను,"

అను రెండు పద్యములలో నిట్టి కవిత్వము చెప్పినవాఁడు 'సుకవి' యన్న సిద్ధాంతము నెలకొల్పినాఁడు. అందఱికి నాహాపుట్టించెడి యద్భుత, మపూర్వము నైన కథాసన్నివేశముతో కళాపూర్ణోదయము నిర్మించిన యితఁడే దీనికి లక్ష్యమగునో కాఁడో యని యొకానొక రన్నట్లు మనము సంశయించినచో నిఁక నితని కవిలక్షణము సార్థకము గావించు కావ్యకర్త యేఁడీ?

ఏది కంటఁబడినంతనే చదువ నుత్సాహము పుట్టించునో, ఏది చదివి యొక్కమా ఱాలోచించి నంతనే హృదయము నానందపరవశము గావించునో, ఏది మఱిమఱి చదువ బుద్ధిపుట్టించునో, ఏది విన్నంతనే మనస్సు నాకర్షించునో మధుమయఫణితి నున్న యట్టి సరసకావ్యము సారస్వతమున శాశ్వతము. అట్టిదానిని నిర్మించినవాడు కవి. అంతేకాని, పదిమందిని పోగుచేసి తన కావ్యమును తానే నుతించుకొనుచు పాడి వినిపించి యెన్నాళ్లు బళీ యనిపించుకోఁగలడు? అదెన్నాళ్ళు నిలుచును?

కాలకర్మ వశమున నాలువందలయే ళ్ళణగియున్న యుత్తరహరివంశ మిపు డుత్తమ కావ్యముగా పొగడ్త కెక్కుటకు నాచనసోముని యత్నమేమున్నది? దాదాపు మూడువందల యేండ్లు మూలబడి యున్న కళాపూర్ణోదయ మిపుడు సకలజనవంద్య మగుటకు సూరనార్యుని యత్నమేమి? నిజముగా వారు కవులు, అవి హృదయంగమములైన కావ్యములు: అంతే కారణము. మూఁడువేల సంవత్సరముల క్రిందట నుదయించిన రామాయణ భారతములు నేఁడు పుట్టినట్లున్నవి. ప్రపంచ మున్నంతవఱకును భాస కాళిదాస భవభూత్యాదుల కృతులు నిలిచియుండవా? కారణము? వారు చెప్పఁదగిన కవులు, అవి చెప్పదగిన కావ్యములు. కవిత్రయమువారి భారతము కలకాలము నిలుచును గాని, దానితో నిలుచు మఱియొక పురాణమేది? అట్లు తన కావ్యముతో శాశ్వతముగ జీవించువాఁడు గాక మఱియొకఁడు కవి యగునా?

కావ్యమందు గుణమున్నదా. అది పుట్టినంతనే రాణించలేదని విచారింప నక్కఱలేదు. భవభూతి చెప్పినట్లది రాణించుట కనంతమైన కాలమున్నది. సంస్కృతమున నుదయించిన కావ్యము లెన్ని వేలో! అందు నిలిచిన వెన్నో, వాటిలోఁగూడ నేఁటికిని పాఠకుల నాకర్షించుచున్న వెన్నో యొక్కమాఱు పరిశీలించినచో, కవికావ్యతత్త్వము కంటఁబడును. అట్లే కడచిన తొమ్మిదివందల సంవత్సరములలోని తెలుఁగు కావ్యముల స్థితిగతులను వివేకించినచో, కవి యెవడో కావ్యమేదో గోచరించును.

కవి సరియైన యధికారియైనఁ గాని కావ్యము చిరస్థాయి కాదు. అధికారి కానివాని రచన మదురుమీఁది చికిలింత. అది తత్కాలమం దొక్కమాఱు పామరజనరంజకమైతే కావచ్చును గాని, ఒక్కమట్టు మధ్యాహ్నముతో దాని యేపుసరి. ఉభయభాషలలోని పెక్కు గ్రంథములు చదువుట. ఉభయ మిత్రులగు పెద్దలతోడి సహవాసము, లోకజ్ఞత, గుణదోష విమర్శకత, సౌశీల్యముతోడి రసికత మొదలగు సుగుణములు కలవాఁడు కావ్యరచన కధికారి. తన్నుఁదా మఱచి కావ్యములో నైక్య మందినవాఁడే కవి. నిష్కామబుద్ధితోడి యాత్మధ్యాన మెట్టిదో నిరహంకారముతోడి కవితోపాసన మట్టిది. అధికారము కొఱఁతవడినా, అహమిక విజృంభించినా, అట్టివాని కావ్యము పుబ్బలో పుట్టి మఘలో మాడినదే. అట్టి దాని కిదే లక్షణము.

> "కోవిద గ్రంథపరిచితి గుండుసున్న
> వస్తుపాత్ర రసజ్ఞత బండి సున్న
> నిర్మమాహం కృతిస్థితి నిండుసున్న
> యైన కవికర్మ హాళ్ళికి హాల్లి సుమ్మ!"

కావున బుద్ధిశాలియగువాఁ డధికార మార్జించి, యహంకారదూరుఁడై వాగ్దేవతను తన్మయుఁడై యుపాసించి కవికీర్తి గాంచుఁగాక!

# కళాపూర్ణోదయము

(కేవల కల్పిత కావ్యము)

దీనికి లింగపురాణము మూలమని నా మిత్రులు శ్రీ దువ్వూరి వెంకటరమణశాస్త్రిగారు వెనుక నెపుడో భారతిలో నొకవ్యాసము ప్రకటించియున్నారు. ఆ యభిప్రాయము సరి గా దని గుడివాడ పరిషద్వార్షికసభకు వచ్చినపు డాయనతో చెప్పియున్నాను. కాని, పాఠకుల కాభ్రాంతి తొలఁగించుట సముచితమని కొందఱు మిత్రులు చెప్పుటచే నందలి యీ ముఖ్యవిషయమునుగూర్చి మాత్ర మిందు సంగ్రహముగా వ్రాయుచున్నాను.

లింగపురాణములో తుంబుర నారదగాన మాత్సర్యకథ యున్న మాట నిజము. అది కళాపూర్ణోదయములో నున్న కథవలె సహృదయ రంజకము గాకపోయినా, ఒక పురాణములో కనవచ్చుచున్నది గావున ప్రాచీనమనియు, దానిని గ్రహించి సరసముగావించి సూర నార్యుఁడు తన కృతిలో స్వీకరించినుండుననియు చూచినంతనే యెవరి కైనా భ్రాంతి కలుగకపోదు. ఆ విషయమున చెప్పవలసిన దేమీ లేదు. దాని ప్రాచీనత యెట్టిదో తరువాత చూతము. కాని, ఆ చిన్న గానమాత్సర్యకథ కళాపూర్ణోదయ మూలకథకే మూలమనుట మాత్ర ముచితము కాదు. ప్రాసంగిక మైన యా చిన్న కథ (నేను పరిష్కరించి సవ్యాఖ్యానముగా ప్రకటించిన ప్రతినిబట్టి) రెండవ యాశ్వాసము ౬౬ వ పద్యము మొదలుగా ౧౦౫ వ పద్యమువఱకు ౩౯ పద్యములలో నిమిడియున్నది. "ప్రధానకథ కావశ్యకమనిగాని యీవర్ణన మెందు"కని శంకించుకొని నా వ్యాఖ్యానములో సమాధానము తెలిపి యున్నాను. అది శాస్త్రిగారి వ్యాసమునకు పూర్వము జరిగినదే. ఈకథ నారదుఁడు నాలుగేళ్లు శ్రమపడి గానవిద్య నేర్చు కొన్న ట్లుతెలిపి ద్వారకకు చేర్చుటకును, అసమయమున కలభాషిణీ

మణికంధరులు శ్రమలేకుండఁగా సంగీతములో సంపూర్ణజ్ఞాన మార్జించి రనుటకు నుపయోగపడుచున్నది. ఇందు కలభాషిణి గానవిద్యావిశారద, యనునంశము మూలకథతో సంబంధించియున్నను, (ఆ గానము నకై యీకథ కల్పించ నక్కరలేదు. ఆది తొలుతనే యావిద్యలో ప్రవీణురా లని యెక్కడ చెప్పినా చెప్పవచ్చును ఈ కగ పద్యములును పుస్తకములోనుండి తీసివేసి పూర్వోత్తరసందర్భమున నొక్క వాక్యము వ్రాసి విడిచినా కళాపూర్ణోదయ మూలకథకు లేశమైనా లోపము రాదు; వీసమైనా హాని కలుగదు. అట్టియెడ లింగపురాణములోని యీ కథ కళాపూర్ణోదయములోని గానమాత్సర్యకథకు మూలమంటే అనవచ్చును గాని, దీనిని పురస్కరించుకొని లింగపురాణము కళాపూర్ణోదయకథకు మూల మనుట యుక్తమా! పాఠకుల కీ మాట విదితమగుటయే ముఖ్యము.

నే నీక్రింద తెలుపఁబోవు విషయము సప్రమాణమని, సిద్ధాంతమని చెప్పఁజాలను గాని నా కిట్లు తోఁచినది — లింగపురాణములోనే కాదు, సర్వపురాణములలోను ప్రక్షిప్తభాగము లెన్నో యున్న వని గ్రంథపరిశోధకు లెందఱో భావించి యున్నారు. కొన్నిటిని నిరూపించియున్నారు. ఈ గానమాత్సర్యకథయు నట్టిదే యనియు, సూరనార్యుఁడు చక్కని సందర్భము తెచ్చిపెట్టి సరసముగా కల్పించి వర్ణించిన యీ పద్యములు చదివిన యానాఁటి విద్వాంసుఁ డొకఁ డీ కథాచమత్కృతి కానందించి దీనిని సంస్కృతీకరించి లింగపురాణములో సందర్భము కలిగించి యం దతికి యుండుననియు నే ననుకొనుచున్నాను. ఇందుకానాఁటి యాచార మొకటి తోడ్పడుచున్నది.

తిరుమల దేవరాయల కృతిపతిగా వెలసిన రామరాజభూషణుని వసుచరిత్ర చదివి సంతోషించిన కామాక్షీదా సను కాళహస్తికవి వసుచరిత్రచంపు వొకటి సంస్కృతమున నిర్మించియున్నాఁడు. ఈ కవి తిరుమలరాయల తమ్ముఁడై చంద్రగిరి నేలిన వెంకటపతిరాయల

యాస్థానములోని యప్పయదీక్షితుల శిష్యుఁడు. క్రీ.శ. ౧౫౬౦ ప్రాంతమునందు తెలుఁగు వసుచరిత్ర పుట్టినది. ౧౬౦౦ ప్రాంతమునందు సంస్కృత వసుచరిత్ర పుట్టినది. కావున తెలుఁగుకృతినిబట్టియే సంస్కృతకృతి పుట్టిన దని వేఱుగా చెప్ప నక్కరలేదు. ఈ క్రింది సంస్కృతారంభము కూడా యందుకు తగినట్లే యున్నది.

"వసుప్రభు ర్వ్యాసవధూతరీత్యా
కోలాహలాద్రీశకుమారికాయాః,
గీతోజ్జ్వలాయా గిరిజాభిధాయాః
కళ్యాణశా లీతి కథా స్తు పుణ్యా."

నాటి యీ యాచారమును పురస్కరించుకొని, ౧౬౨౦ ప్రాంతమున జన్మించిన యీ కళాపూర్ణోదయములో నప్పటి రాజాస్థానముల లోని విద్వత్కవుల మాత్సర్యములకు జ్ఞాపక మగునట్లుగా కల్పింపఁ బడిన యీ కథలోని చమత్కృతి కానందించిన తాత్కాలిక విద్వాంసుఁ డొకఁడు దీనిని సంస్కృతీకరించి లింగపురాణములో దీనికి సందర్భము కల్పించి యతికియుండు ననుకొనుట సాహసము కాదేమో! అయినా, "ఈకథ లింగపురాణములోనే ముందుగా పుట్టినది. దానినే సూరనార్యుఁడు తెలిఁగించె"నని యంగీకరింతము. అయితే మాత్రము కళాపూర్ణోదయమున కీ మాత్సర్యపుమాటలే మూలమా? అట్లు కాదనుట ముమ్మాటికి నిజమని పాఠకులు భావించినఁ జాలును. సూరనార్యుఁడు లేని గొప్పతనము చెప్పుకొన్న వాఁడు కాఁడు. ఇతరుల మాటలు గైకొను గ్రంథచోరుఁడు కాఁడు. లోకవంచకుడు కాఁడు.

"అత్యపూర్వ కథాసంవిధాన వైచిత్రీ మహనీయము" తన కళాపూర్ణోదయ మనుచు, ప్రతిజ్ఞ చేసి యద్భుత మపూర్వము నైన ప్రధానకథ లోను, ప్రాసంగిక కథలతోను, ఉపాఖ్యానములతోను ఎని

మిథ్యాశ్వాసముల మహామహాప్రబంధము కల్పించిన యతఁడు కర్ణ పద్యముల యీ చిన్నకథను లింగపురాణమునుండి దొంగిలించి యుండునని మనము స్మరించుటకూడా యర్హము కాదు. కళాపూర్ణోదయములోని యెల్ల కథలతోడి మూలకథ యీ మహాకవి సూరనార్యుని నవనవోన్మేష ప్రతిభలో పుట్టినదే కాని, అం దొకయక్షర మైనా యన్యుల దని యారోపించుట యంగీకార్యము కాదు. సత్యము వెల్లడించుట కింతమాత్రము చాలును.[1]

1. ఆయన మతము నెంతగించుచు నెవరో బదులు వ్రాసిరిగాని యది నా యభిప్రాయము మార్పఁజాలినదిగా లేదు.

# శిల్పము

శిల్ప మనుమాట చెవినిపడినంతనే పండిత పామర సాధారణ ముగా నేదో భావవిశేషము పై కుబుకును. వివిధములైన విషయము లనేకము లిమిడియున్న కొలఁదిశబ్దములలో నిదియొకటి. దీనియర్థము సర్వతోముఖము దీనిభావ మతిగంభీరము. ఇంత యేల? ఇష్టార్థ చింతామణి యనదగిన దీశబ్దము. దీనియం దంతమహత్త్వ మున్నది కావుననే యిది ప్రాచీనుల హృదయ మాకర్షించి వివిధములైన స్తుతులకు పాత్రమైనది. ఛాందోగ్యమతమున నిది దేవజనవిద్య. చరణవ్యూహ మతమున యథర్వవేదమున కనుబంధమైన యుపవేదము. మఱి యొకమతమున నిది యష్టాదశవిద్యలలో కడపటిది. ఇంకొక మతమున నిది స్థాపత్యవేదము. వేరొక మతముననిది వివిధకలా నిపుణ క్రియా నిధానము. ఇట్లు వేఱు వేఱు కాలముల నానా విద్యావేత్తల నుతి గాంచుచు దేశము నలుగడల వ్యాపించి సంఘశ్రేయము సమకూర్చిన దీనిమహిమ యిట్టిదని యీ చిన్న వ్యాసమున నిరూపింప గలమా?

శీలధాతువునుండి పుట్టినది శిల్పశబ్దము. అభ్యసింపఁబడు పని శిల్ప మనియు, నిపుణమైన కర్మ శిల్ప మనియు, క్రియాకౌశలము శిల్ప మనియు, అర్థములు కనవచ్చునుగాని యింతమాత్రమున దీనితత్త్వము తెలియదు. నృత్తగీతవాద్యాదు లఱువది నాలుగు బాహ్యక్రియలును ఆలింగనచుంబనాదు లఱువదినాలు గాభ్యంతర క్రియలును, స్వర్ణ కారాది బహువిధ క్రియలును శిల్పశబ్దవాచ్యము లన్నచో దీని పర మార్థము బైటఁబడును. దీనినిబట్టి, విచిత్రమును ప్రతిభాచాతుర్యద్యోత కమును విజ్ఞానవిశేషబోధకము నగుచు శ్రవణ నయన హృదయ రంజక మైన యే పనియైనా శిల్ప మన్న భావము తెల్లమగును. ఇపుడు దృగ్గోచర మగుచున్న మృద్దారుశిలాదిక్రియలు కొన్ని మాత్రమే శిల్పము లని చెప్పఁబడుచున్నవి కాని, నేర్పు చూపుపనియు పని

యందలి నేర్పును శిల్పము లన్న ప్రాచీనుల నిర్వాచనములనుబట్టి పూర్వా మార్యులు సంఘమందలి వివిధజాతులవారి జీవనార్థము కల్పించిన వివిధవృత్తులును, వినోదార్థము కలిగించిన యెల్ల కళలును శిల్పములే యనుట స్పష్టము. నృత్తగీతవాద్య కవితాదికళలును, వడ్రము కమ్మరము కుమ్మరము మొదలుగా చెప్పులు కుట్టుట వఱకు కల యన్ని జాతుల యన్నివృత్తులును శిల్పము లనియే వారి యాశయము. రాను రా నట్టివృత్తు లొనరించు వారిలో వడ్రంగి సాలె మంగలి చాకలి ముచ్చి యనునైదుగురు మాత్రమే శిల్పు లన్న వాడుక వచ్చిన ట్లమరసింహునిమాటవల్ల తెలియుచున్నది గాని, పాణినిమతమునుబట్టి గాయనీ గాయనులు నర్తకీనర్తకులు మార్దంగికుఁడు మొదలగుకళావిశారదు లందఱు శిల్పులే. అందుచే, అతనినాఁటి కితరవృత్తు లాచరించు వారికన్న వడ్రంగి మొదలగువారికి శిల్పి సంజ్ఞ యెక్కువగా వాడుకలో నుండె నని యూహించవలెను గాని వారే శిల్పు లని భావించ రాదు. శిల్ప మాచరించువా రందఱును శిల్పులే. ఇపుడు శిల్పియన్న మాట వాడుకలో నెక్కడనో కాని వినఁబడదు. అందుచే పూర్వోక్త క్రియ లాచరించువారు శిల్పులు కాకపోవుదురా? శిల్ప మెంత యుపయోగకరమో సంఘమునకు తెలియనిది కాదు. మున్ను పేర్కొన్న యేక్రియ వాడుకలో లేకపోయినా లోకము నడవదు. అందుచే వృత్తి యనఁబడు ప్రతిశిల్ప మావశ్యకమే కాదు, గౌరవార్హ మనియు, శిల్పి యేజాతివాఁడైనా మాన్యుఁడే యనియు భావింపఁదగును. ఇందుకు విశ్వకర్మ మయుఁడు మొదలగు సనాతన శిల్పులయుదంతములే నిదర్శనము.

ప్రాచీనవిద్వాంసులు నిరూపించిన పూర్వోక్త నిపుణకర్మలు మాత్రమే శిల్పములు కావు. అవి యపారములు. పరమేశ్వరుని సంకల్పమం దావిర్భవించి యావిష్కృతి కాంచిన యీ భౌతికసృష్టి యంతా గొప్పశిల్పము కాదా? ఇందలి నది గిరి కాననాదుల సహజ

శోభాచిత్ర విచిత్రరూపములును అందలి సూర్యచంద్రాదుల తేజో విశేష క్రియలును శిల్పములు కావా? ఒక మహర్షి కశ్యపసూర్యుని శిల్ప మెట్లు వర్ణించెనో విన్నచో శిల్ప మన్న నేమో అది యెంత మహనీయమో విశదమగును.

"యత్తే శిల్పం కశ్యప రోచనావత్,
ఇంద్రియా వత్పుష్కలం చిత్రభాను,
యస్మిన్ త్సూర్యా అర్పితాః సప్త సాకమ్,
తస్మిన్ రాజాన మధివిశ్ర యేమ మితి"

"ఓకశ్యపసూర్యా! నీశిల్పముదివ్యప్రకాశ లక్షణము. సర్వేంద్రియసామర్థ్యసంపన్నము. అట్టి యేచిత్రకర్మయం దారోగాది సప్తసూర్యులను నిలిపి ప్రకాశింపఁ జేయుచున్నావో దానియం దీయజమానుని గూడా దీప్తిమంతుని గావించి ప్రతిష్ఠింపుము." జగదాద్యమును సృష్టిసాధనము నైన కశ్యపసూర్యుని దివ్యప్రకాశరూప మైన విచిత్రకర్మ శిల్పమన్న ఋషులభావము గ్రహించినచో శిల్ప మెంత పూజ్యమైన క్రియావిశేషమో బోధపడును.

శిల్పము సహజము ప్రకృతిసిద్ధము. ప్రకృతియే దాని కాద్య గురువు. అటు దివ్యక్రియలను ఇటు తిర్యగ్జడాదుల స్వాభావికక్రియలను పరిశీలించి ప్రాచీనార్యులు చిత్రవిచిత్రము లైన బహువిధ శిల్పములు కల్పింపఁ జొచ్చిరి. నిజమైన శిల్పసంప్రదాయ మిదే యని నాయభిప్రాయము. ఇందుకు కొన్ని దృష్టాంతములు :—

చెట్లకొమ్మలు ముక్కుతో చెక్కి తొలిచి రంధ్రములు చేయు నొకపక్షికి దానిక్రియావిశేషమును బట్టి పూర్వులు వర్ధకి (వర్ధచ్ఛేదనే) యనుపేరుపెట్టిరి. దారుక్రియ చేయుశిల్పికి వృత్తినిబట్టి యదే పేరు వచ్చినది. తెలుఁగులో నది వడ్రంగిపిట్ట. ఇతఁడు వడ్రంగి యనఁబడును. ఆ పిట్ట కితఁడు వడ్రము నేర్పెనో, అది యితనికి నేర్పెనో విది

తమే. దాని కీశిల్పము ప్రకృతిసిద్ధ మనియు నితని కభ్యాస సిద్ధమనియు స్పష్టము.

గృహద్వారగవాక్షాదులు మఱుఁగుపడునట్లు తన నాభినుండి పైకి తీసిన (ఊర్ణనాభి) సన్నని తంతువుతో పడుగు పేకలుగా తెరవలె నేఁతనేయు కీటకమునకు దాని క్రియనుబట్టి తంతువాయ మని పేరు పెట్టిరి. నేఁతపని చేయుశిల్పికిని వృత్తినిబట్టి తంతువాయుఁ డన్న పేరే వచ్చినది. తెలుఁగులో దానికి నితనికి సాలీఁడనియే పేరు. మానవుఁ డభ్యసించిన నేఁత శిల్పములకు స్వాభావసిద్ధమైన యాకీటకము చూపిన శిల్పము ప్రమాణమని భావించుట యసంగతమా? ఇట్లే కుమ్మర పురుగుచేయు మృత్క్రియను చూచి యొకఁడు మృణ్మయశిల్పవృత్తికి దిగి కుమ్మరియయ్యె ననుటయు, మయూరలాస్యము నృత్యకలకును దానికేక షడ్జమస్వరమునకును బోధకము లనుటయు సుసంగతములు. ఇట్లు పరిశీలించినచో ప్రకృతిలోని సహజశిల్పములను చూచి ప్రాచీనులు పెక్కు శిల్పములను నిర్మింపఁ జొచ్చి రన్నమాట విశ్వసనీయ మని తోఁచక పోదు. ఇంకొక్కమాట—

బంగారు పిచికగూడు పొరకు లెందఱో చూచి యుందురు. విశ్వకర్మకు కూడా ఆహా పుట్టించెడి యారమ్యనిర్మాణ చాతురి కీడైన శిల్పచాతురి కలదా? తాజ్‌మహాల్ నిర్మించిన యా శిల్పి శేఖరుని వంటివాడైనా దానిని చూచి యట్టిగూడు నిర్మింపలేఁడు. సరిగదా, దాని మొదల లేదో తుద యేదో తెలుసుకొనలేఁ డనుట సాహసము కాదు. అభేద్యమైన యా యల్లిక జిగిబిగి యేమి? ఆయంతరువు లేమి? ఆహా? ఆ గూడు గృహకటాది నిర్మాణశిల్పము లెన్నిటి కుపదేశ కమో యూహింపవలసినదే. ఇఁక నాభ్యంతరక్రియ యనెడి కల కొక్కయుదాహరణము.

పద్మిని సూర్యునిరాకకు కమలములను వికసింపఁజేయును. అతని పోకకు ముకుళింపఁజేయును. దాని స్వాభావికములైన యీవికాస

సంకోచక్రియలు కవుల నాకర్షించి వర్ణనల కెక్కినవిగదా! మనము తెలివిలేని దనుకొనుచున్న యొకతీఁగకు సహజములైన యీరెండు నాభ్యంతరక్రియలే, శిల్పములు. ప్రియనాథుని సంయోగవియోగముల ననుకూలనాయిక ముఖపద్మమునందు ప్రత్యక్షము లగు నాభ్యంతర క్రియలట్టివే. ఇట్లనుటచే తామరలతను జూచి నాయిక యాక్రియ లభ్యసించెనా యని శంకింపరాదు. అచేతనములందు కూడా యట్టి కలాశిల్పములు గోచరించుచున్న వని విశ్వసించినఁజాలును.

ఇట్టి ప్రకృతిలోని శిల్పములను చూచి ప్రాచీనులు కొన్ని శిల్పము లేర్పఱచినా, వారిలోని ప్రతిభాశాలులు సంఘోపయోగకరములైన బహుశిల్పములను కల్పింపకపోలేదు. వానిని పాఠకులు భావింపఁగలరు. దానినిబట్టియు దీనినిబట్టియుఁ గూడా శిల్పసిద్ధి కభ్యాసము తప్పక కావలె నన్నమాట నిజమే కాని, పూర్వజన్మ కర్మవాసనను బట్టి యాయా శిల్పజ్ఞానము బీజరూపమున బుద్ధియం దున్నవాఁడే కృతార్థుఁ డగును. అది లేనివాఁడు కానేరఁ డనుట సత్యము. ఇందు కొక్క దృష్టాంతము చాలును.

చిత్రకారలోక ప్రసిద్ధుఁడును చిన్నతనముననే దుర్దైవము తన పొట్టలో పెట్టుకొన్నవాఁడును చిత్రకలలో తనదేశమునకు పేరు తెచ్చినవాఁడు నగు దామెర్లరామారావు పాఠశాలావిద్యార్థిగా నున్నపుడు వారమునకు సుమారిరువదిగంటల కాలము చదివెడి యాంగ్లాదిపాఠములం దతనికి రుచియే పుట్టలేదు. వా రాని కేరెండు గంటలలో నేర్పుకొనే చిత్రలేఖనమందతని యభిరుచికి మేరలేక పోయెడిది. తుద కాతఁ డాంగ్లవిద్యకు స్వస్తిచెప్పి చిత్రకలయం దెంత వాఁడయ్యెనో చెప్పనక్కఱలేదు. దీనినిబట్టి యే విద్యయైనా యేశిల్పమైనా కేవల మభ్యాసమున సిద్ధిగాంచఁజాల దన్న నిజము గోచరింపక పోవునా? "ప్రపేదిరే ప్రాక్తనజన్మవిద్యాః" అన్న పెద్దలభావమ దే గదా!

ఏ శిల్పమైనను బాహిర మగుటకు ముందు దాని కాంతరరూప మేర్పడియుండు ననుట తథ్యము. శ్రీకృష్ణవిగ్రహము చెక్కఁబూనిన శిల్పి యది యెట్లుండఁ దగునో యెట్లున్న దర్శనీయ మగునో ముందు భావించి భావించి పిదప దానిని రాతిపై నిర్మించునుగదా! ఆభావనయే దాని యాంతరావస్థ. అదే దాని మొదటిరూపము. కావున నే శిల్పమేని యే కళయేని యాయా ప్రజ్ఞాశాలి బుద్ధివిశేషమున ముం దావిర్భవించి తరువాత నావిష్కృతి గాంచుననుట తెల్లము. అట్లు ప్రతిభావిలసిత మైన శిల్పమే శ్లాఘ్యమై చిరస్థాయి యగును.

శిల్పము లన్నిటిలో నెక్కువస్థిరముగా నుండునది ప్రతిమాశిల్పము. అది శిలాలోహమయము. ప్రతిమా శిల్పమునకు భరతఖండము పట్టుగొమ్మ. ఆసేతుహిమాచలము భక్తహృదయంగమములైన స్త్రీ పురుష దేవతా విగ్రహము లెన్ని యున్నవో లెక్కలేదు. అందు కేదారనాథ బదరీనాథ ప్రతిమలు నేఁటి కాఱువేలసంవత్సరముల క్రిందటి వనుటకంటె ప్రతిమాశిల్ప ప్రాచీనతను వేఱుగా వర్ణింపఁ బని లేదు. దేవాలయాదులందు ప్రతిష్ఠించు ప్రతిమలే కాదు, జీవికార్థము సీతారామాద్యుత్తమ స్త్రీపురుష విగ్రహములు నిర్మించి యమ్ముకొనెడి యాచారము పూర్వమే కలదని "జీవికార్థే చాపణ్యే" అను పాణిని సూత్రము సాక్ష్య మిచ్చుచున్నది. ప్రతిమాశిల్ప మానాఁటి యార్యుల నెక్కువగా నాకర్షించినట్లు వక్కాణించుచున్నది. భరతు నానందపెట్టిన దిలీపాది ప్రతిమలశోభ నాఁటి విద్యానైపుణ్యమును వేనోళ్లఁ జాటుచున్న దన్నాఁడు భాసుఁడు.

శిలాశిల్పము నెక్కువగా ప్రేమించిన సూరనార్యుఁడు తా నెందైన చూచిన యొకయువతి ప్రతిమను సుగ్రహునికథ కతి దేశించెనో లేక కల్పించెనో చెప్పఁజాలను గాని, యొక దేవాలయద్వారమందున్న యొక సుందరీప్రతిమ సర్వసంగపరిత్యాగము చేసి యడవులపాలైన యొక సన్యాసికి కూడా మన్మథవికారము పుట్టించె నని యిట్లు వర్ణించి యున్నాఁడు.

"సీ. ఆయతీశ్వరుఁ డంత నతిరమ్య మైన యా
లెప్పంపుఁ బూఁబోఁడి యొప్పుఁ జూచి
బళిర శిల్పికులేంద్ర ! బ్రహ్మను మీఱి తే
పగిదిఁ జేసితిర యీ ప్రతిమ ? యనుచు
తనమదిఁ గడు మెచ్చి తల యూఁచుచును నిట్టి
పడఁతులు గల రొక్కో పుడమి ? ననుచు

అతనువికృతికి లోనయ్యె........."

దీనినిబట్టి యేప్రతిమకానీ యేచిత్తరువుకానీ మఱి యేక్రియకానీ, జీవ ముట్టిపడునట్లు దృశ్యమైనపుడే యది శ్లాఘ్య మగునని తెలియఁ గలదు.

శిల్పము లనఁబడుకళలలో చిత్రక్రియ సంగీతము కవిత్వము ననునవి సకలజనరంజనము లనుట సుప్రసిద్ధము. ఇవి యనాదు లనఁదగినంత ప్రాచీనములు. మంత్రద్రష్టలు కవు లని వేదమే తెల్పినది. సంగీతము నకు సామవేదము మూల మని పూర్వులే వక్కాణించిరి. చిత్రక్రియ కూడ వేదములనాఁ డున్న దని విశ్వసింపవచ్చును.

వైదికర్షులు ఖగోళము పరిశోధించి సాధించిన విజ్ఞాన మపారము. బహుసూర్య మండలములయు బహుభూమండలములయు స్థితిగతులను కనిపెట్టి వారు విస్మయానందభరితులై కావించిన సూర్యస్తవములు వేదము నెల్లెడనున్నవి. అందు చిత్రశబ్దము కనవచ్చును. సారస్వతమం దాశబ్దమున కాశ్చర్యకరమన్న యర్థము సాధారణముగా నుండుటంబట్టి మొన్న మొన్నటి భాష్యకర్త లాయర్థమే వ్రాసిరిగాని, ఒకచోట దానికి చిత్తరు వన్నయర్థము కూడా పొసఁగుచున్నను వ్రాయని కారణ మూహ్యము. చిత్తరు వన్న యర్థముకూడా పొసఁగు ననుట కొకమంత్ర ముదాహరింతును.

"చిత్రం దేవానా ముదగా దనీకం
చక్షు ర్మిత్రస్య వరుణ స్యాగ్నేః,
ఆ ప్రాద్యావాపృథివీ అంతరిక్షం
సూర్యా ఆత్మా జగతా స్తస్థుషశ్చ"

ఇందలి పూర్వార్థము బాలసూర్యమండల వర్ణన, ఉత్తరార్థము సూర్యమహిమవర్ణన—మిత్రాగ్ని వరుణలోకములకు దివ్యచక్షువును సహస్రరశ్మి పుంజము నైనచిత్రము (చిత్తరువు) ఉదయాద్రిమీఁద దృగ్గోచర మగుచున్నదని తొలిభాగమున కర్థము. ఈ వర్ణించినఋషి యాజన్మము చూచుచున్నదే కాని యాబాలసూర్యమండలమానాఁడు కనవచ్చినది కాదుగదా! అట్టియెడ నది యాశ్చర్యకరముగా నున్న దనుటలో విశేష మేముండును? కావున నరుణకాంతు లెగఁజిమ్ముచు వర్తులమై మనోహరమై ప్రకృతి చిత్రించిన జగన్నయన చిత్రమువలె నామండల మున్న దని యాఋషి భావించె ననుట సముచితము కాదా? ఇట్టి ప్రాసంగిక విషయము లెన్నేని వైదికార్యులు చిత్రక్రియ నెఱుఁగుదు రనుటకు చాలి యున్నవి. వేదమందలి వర్ణశబ్ద మక్షర మునే కాక శుక్లాదివర్ణములను కూడా తెలుపు నని ప్రాచీను లంగీక రించి యున్నారు. పాణినీయమున వర్ణధాతువునకు వర్ణక్రియ (శుక్ల నీలపీతాదిక్రియ) అనునర్థము కనఁబడుచున్నది. బుద్ధుని కాలమం దున్న యఱువదినాలుగు లిపులలో చిత్రలిపి యొకటి యని లలిత విస్తరము చెప్పుచున్నది గాని, అంతకు పూర్వము మూఁడువేల సంవత్సరములనాటి మొహంజోదారో యనుప్రదేశమున చిత్రలిపితోఁడి ముద్రలు లభించిన విషయ మిపుడు బయటికే వచ్చినది. ఇంక దీని యతి ప్రాచీనత నిరూపింప గ్రంథవిస్తరమేల?

వత్సరాజు సత్యవాసవదత్తయే యనుకొనునట్లు భాసుఁడు వాసవ దత్తను చిత్రించినాఁడు. కాళిదాసు బ్రహ్మచే ప్రాణము పోయించి

చిత్రగత శకుంతల నాడించినాఁడు. ఇంక చెప్పెడి దేమి? నాఁటి చిత్తరువులు జగన్మోహనములుగా నుండెననుటకు పూర్వమహాకవుల చిత్రవర్ణనలు చాలవా? ఈకళ తొల్లి పారము ముట్ట వెల్లివిరిసినదనుట ముమ్మాటికి నిజము. భవభూత్యాది మహాకవులకు పిదప నీ శిల్పవిద్య కొన్ని శతాబ్దు లొకవిధముగా నుండెను గాని, ఆలోపము తీర్చుకొనుటకో యన నిది యిపు డువ్వెత్తుగా విజృంభించుట యెంతయు ముదావహము. పాశ్చాత్య శిల్పకలాసహవాసము దీనికి క్రొత్త మెఱుఁగు తెచ్చె నని కొంద ఱందురు. నేనారీతిని వివరింప వలఁతినిగాను. చూచినంతనే, దృష్టిని పరిశీలించినంతనే భావమును పరవశమును గావించుచిత్రమే చిత్ర మని మాత్రము తలంతును. రవివర్మాదుల పూర్వచిత్రములే రంజకము లనుకొనుచుండ నిపుడు రామారావు చిత్రములు వాటిని మించెనని వినుచున్నాము. అతని చిత్ర పద్ధతి దేశమున విస్తరించుఁగాక.

సంగీతకల సామవేదముతో పుట్టి పిదప గాంధర్వవేద మన్న పెద్ద పేరు తెచ్చుకొని యెంతో సారస్వతము గాంచినది. దీని యుత్పత్తి వికాసములను గూర్చి నా సంస్కృతవాఙ్మయచరిత్ర ద్వితీయ సంపుటమున సవిస్తరముగా వ్రాసియున్నాను. సరస్వతీ తుంబుర నారదాదుల వీణావాదనములను బహువిధముల స్తుతించిన పురాణవచనములే దీని ప్రాచీనతయెడ మనకు విశ్వాసము పుట్టించును. "హసితగ్ రుదితం గీతం, వీణాపణవలాసితమ్" అను వేదవాక్యమున వీణా మృదంగములు పేర్కొనఁ బడినవి. వాల్మీకి మొదలుగా మహాకవులందఱు సందర్భోచితముగా సంగీతమును బ్రశంసించినవారే. ఈకళలో నౌత్తరాహుల పద్ధతి వేఱు. దక్షిణాత్యులరీతి వేఱు. దక్షిణా పథమందలి పూర్వ రాజులందఱు వీణాగానము నాదరించినవారే. శ్రీకృష్ణదేవరాయ లీకళ నెక్కువగా పోషించినవాఁడే. పెద్దనార్యుఁడు జంత్రగాత్రముల పాటలు హాయిగా విని యానందించినవాఁ డని యతఁడు వరూధినిచే,

"రహిం పుట్టి జంత్రగాత్రముల రాల్గరఁగించు
విమలగాంధర్వంబు విద్య మాకు"

అని సందర్భ సంగతిగా ననిపించిన వాక్యమే సాక్షి. తరువాత తంజావూరు సంస్థానమును, మన విజయనగర సంస్థానము నీగానకళకు వ్యాప్తి తెచ్చి మహావిద్వాంసులను సిద్ధము చేసినవి. ఇపు డామాట లేల? మనదేశమందు కర్ణాటపక్కి యనఁబడు సంగీతవిద్యకు శారదా తనయుని యవతారమో యన జన్మించిన త్యాగరాజే పరమగురువు. ఈవిద్య యిపు డేరాజు నవలంబనము లేకున్నను గానరస పిపాసువులగు ప్రజలయాదరము గావించుచు వర్ధిల్లుచున్నది. ప్రజాదరణము గాంచిన యేవిద్యకును క్షతి కలుగదు. ఇంక కావ్య శిల్పమును గూర్చి యొక్కింత :—

చిత్రాదికళలు మూఁడును మిక్కిలి మనోహరములనుట నిర్వివాదమే కాని, వాటిలో హెచ్చుతగ్గులు లేకపోలేదు. ఆ రెంటికిని సాహిత్యజ్ఞానముతో పని లేదనియే చెప్పవచ్చును. కావ్యకలకో, అది యత్యావశ్యకము. కేవలము చిత్రము దృశ్యకల. గీతము కేవలము శ్రావ్యకల. కావ్యమో దృశ్యము శ్రావ్యము పాఠ్యము నైనకల. చిత్రము భావములను వ్యంగ్యముగా చూపును. కావ్యమో వ్యంగ్యముగాను వాచ్యముగాను గూడ చూపించును. గానముకూడా యట్లు చేయు నందురా, అట్టిపాట కావ్యమే. కాంభోజి మొదలగు కొన్ని రాగములు కరుణాది రసహేతువు లందురు. కాని, కావ్యమువల్ల రస మభివ్యక్త మగునట్లు కేవల రాగాలాపమువల్ల కానేరదు. చిత్రకారుఁడును కవియు నంతరించినా చిత్రమును కావ్యము నంతరింపవు. గానమో గాయకునితో సరి. మఱియు, చిత్రమును గానమును కన్నపుడు విన్నపుడు నానందము కలిగించునుగాని, యది తరువాత నిలవదు. స్మరించినా కన్నవిన్న నాఁటి సంతోషము కలుగదు. కావ్య మట్లు కాదు. చదివినపుడు విన్నపుడు చూచినపుడే కాదు

భావించినపుడెల్ల రసము హృదయమున నుబుకుచునే యుండును. కావున, తరతమ పరీక్ష చేసినపు డీ మూఁడింటిలో కావ్య ముత్తమ మని తోఁచక పోదు.

కావ్యకళ పుట్టినది మొదలుగా నేఁటివరకు నొక్కరీతిగానే వచ్చుచున్నదని యెవ్వరు ననఁజాలరు. అది యొక్కొక్క దేశమునం దొక్కొక్క కాలమం దొక్కొక్క రీతిగా మాఱుచునే వచ్చినది. వైదర్భి గౌడీ పాంచాలీ రీతు లన్నను, ప్రత్యక్ష బాహాట పాంచాల శయ్య లన్నను నర్థ మదే. శ్లేష యమక చిత్ర బంధకవిత లన్న నర్థ మదే. శ్రవ్యదృశ్య పాఠ్యభేదము లన్న నదే. ఈ పరిణామావస్థలు సంస్కృతమున కట్టు లాంధ్రమునకు నున్నవనుట విదితము. ఇట్లు వివిధావస్థలలో వివిధ దేశములలో నుదయించుచు వచ్చిన కావ్యములలో నెందు నిజమైన కావ్యకళ మూర్తీభవించినదో వాటికి మాత్రమే వ్యాప్తివచ్చినది. అట్టివానియెడ ప్రాజ్ఞులు ప్రాఁత క్రొత్త భేదమును పాటింపరు. సహృదయ హృదయంగమమైన కావ్యము ప్రాచీనముకానీ, అర్వాచీనముకానీ, నవీనముకానీ కవితాకలాభిలాషి దానిని చూచి యుపేక్షింపఁజాలఁడు. చదివి మఱవఁజాలడు. అందుకు నిదాన మాయాకావ్య శిల్పచాతురియే యనుట పునరుక్తము.

భావస్వతంత్రుడైన యొక కవి కవితలో క్రొత్తదారి త్రొక్కినపుడు, లోకమునఁ గొంత యసమ్మతి తలయెత్తుట నైజమే. పింగళి సూరనార్యుఁడు వినూతన విచిత్రకథా కావ్యము నిర్మించినతఱి నట్టి యసహనముతోడి యవరోధము బయలువెడలి యా కావ్యమును చిర కాలము పైకిరాకుండ నణఁగఁ ద్రొక్కినది. అయితేనేమి! మణి మణియే! అది మట్టిలో నణఁగియున్నను సమయము వచ్చినపుడు కిరీటము నధిష్ఠించును. తుదకది యట్లే సకల ప్రబంధ శిరోరత్న మైనది కదా! అట్లే యిపుడు పాశ్చాత్య కవితా సహవాసమున నేమి భావుకుల బుద్ధివైశద్యము మూలముగా నేమి నేఁటికవితలో

నూతన మార్గ మొకటి యేర్పడినది. దాని నవలంబించు వారి సంఖ్యయు, ఆదరించువారి సంఖ్యయు పెరుగుచున్నదనుట వాస్తవము. ఈదారి శుభ్రముగా విశాలముగా సుఖగమనమున కనుకూలముగా ముందుముందుకు సాగుచుండెనేని పదిమంది యీత్రోవనే నడవఁ జొత్తురనుట నిరాక్షేపము. అందు కీసందర్భమున నవ్యకావ్యములు చదివిన కొందఱి యభిప్రాయము లెఱిఁగించుట యావశ్యకము కాకపోదు.

ఏశిల్పమైనా యాది నున్నట్లేయుండక కాలక్రమమున నభివృద్ధి కెక్కుచు జనరంజక మగు నొక్కొక్కవిశేషము చూపుచునే యున్నదనుట నేఁటి శిల్పద్రష్టల కనుభూతమే. ఇందుకు ప్రతిమాశిల్ప చిత్రశిల్ప దారుశిల్పము లెన్నెన్ని తెఱఁగుల వికసించెనో చూచినఁ జాలును. అట్లే కావ్యశిల్పమును గూర్చియు నూహింపదగును.

తక్కిన యెల్ల శిల్పములకంటెను కావ్యశిల్పము కష్టాతికష్ట మనుట తెల్లము. కావుననే యిది యెల్ల కళలలో నగ్రస్థాన మధిష్ఠించి 'విశ్వశ్రేయః కావ్య' మ్మన్న గొప్పఖ్యాతి గాంచినది — నేఁటి యే శిల్పియైనను మున్నున్నదానికి పెంపు కూర్చి మెఱుఁగు తెచ్చుటకు యత్నించును గాని తొల్లింటిదానిని పనికిమాలినదని త్రోసివేయఁడు. అతఁ డట్లు గర్హించితినని చెప్పుచు తాను క్రొత్తగా కల్పించిన ట్లేది నిర్మించినా అది మున్నున్నదానికి రంగుపూఁతతోడి రూపాంతరమే యని లోకజ్ఞులు భావింపకపోరు. కావున పాఁతదంతా పాడని భావించుట పాడిగాదు. మన బహుళ సారస్వతప్రపంచమున వెదకినచో కనఁబడనివస్తు వుండదు. అందుచేతనే కవి బహుగ్రంథద్రష్ట కావలెనని పెద్దలన్నారు. పూర్వకవులు సాధారణముగా ప్రాచీనకథనే ప్రధానముగా గ్రహించినా, నాటి సాంఘిక ధర్మములను ప్రాసంగికముగా వర్ణించకపోలేదు. అయినా, యిపుడాపుంత పూర్తిగా విడిచి, సంఘాభివృద్ధి నభిలషించి సంఘమందలి కథాపాత్ర వ్యవహారముగనే

గ్రహించవచ్చును. అందు కాక్షేపించువా రుండరు. ఈ యభిప్రాయమును నాయాంధ్రదశరూపక పీఠికలో విశదీకరించియున్నాను. ఇంక నేఁటి ఖండకావ్యములు చదివిన కొందఱెత్తిన యాక్షేపములలో మొదటిది భాషావిషయము.

అన్నిటివలెనే భాషకూడా క్రమక్రమముగా మాఱుచు వచ్చిన మాట సత్యము. సముచితమైన భాషాస్వాతంత్ర్యము కవుల కున్న మాట నిజము. అట్టి భాషాసంప్రదాయము ననుసరించి, 'ప్రయోగశరణం వ్యాకరణ, మ్మనుసూక్తి యాధారముగా, పూర్వ కవి పరంపరలోని యెల్ల ప్రయోగములును శిష్టులవాడుకలోని పెక్కు శబ్దరూపములును గ్రామ్యము లనుచు సోదాహరణముగా నాంధ్ర భాషానుశాసనము నిర్మించియున్నాను. అది చదివిన కీ. శే. గిడుగు రామమూర్తిపంతులుగారు "మే మనుచున్న దానిలో నూటికి కఱువది వంతులు మీరు సమ్మతించినా"రని పలికియున్నారు. వా రయినా వ్యవహారమందు వినవచ్చే యెల్లశబ్దము లట్లే ప్రయోగింప వచ్చునని భావించలేదు. శిష్టులు నెమ్మదిగా మాటలాడునపు డెట్లుండునో యట్టి భాష ప్రయోజ్య మన్నారు. అంతేకాని, "అల్లాచెయ్యాల్సొచ్చింది" వంటివాక్యములు కావ్యములందు వాడవచ్చు ననలేదు. పెద్దలు 'అల్లాగ చెయ్యవలసివచ్చింది' అని పలుకుదురు. అట్టియెడ నెవరో తొందరగా పలికెడి పై వాక్యమట్లే ప్రయోగించుట భాషాగౌరవమునకు కళంక మాపాదించుటే గదా! మఱియు, శబ్దముల స్వరూపము పూర్తిగా చెడిపోయిన యట్టివాక్యము చదువరి కింపు పుట్టింపదు సరిగదా! చదువుటయే కష్టమగును. అందుచే వ్యావహారిక భాష వాడవచ్చునని స్వరూపము పూర్తిగా చెడిన యతినింద్య గ్రామ్యములను గావ్యమందు ప్రయోగించుట మంచిదిగాదు. గావ్యభాష కొంచెమేని యుదాత్తముగా నుండవద్దా? ఇంక—

"ఈ పద్యముల యర్థమే తెలియరాదు. వీటిభావమేమో గోచరింపదు" అనుచు నేఁటిగావ్యములు చదివినకొందఱనుట కలదు.

ఒకరిద్దఱు పెద్ద మనుష్యులు నాతో నన్నపై మాటలు తత్కవులకు చెప్పియున్నాను. మన కిపుడు పాఠకాభిప్రాయము తెలియుట ముఖ్యము గాని, తద్విషయ విచారణ మావశ్యకము కాదు.

కవికి కావ్యరచనవల్ల కలుగు ప్రయోజనము యశస్సు. దొరకితే ధనము, అంతే. తక్కినప్రయోజనమంతా పాఠకునిదే, అందుచే కవికర్మ ప్రజోపకారిగా పాఠకరంజనముగా నుండవలయు ననుట సర్వసమ్మతము గాదా? ఇపుడు సంఘక్షేమ మభిలషించియో సంఘములోనిగుణదోషములను విమర్శింప నెంచియో దేశాభ్యుదయము కాంక్షించియో వివిధ విజ్ఞానబోధకముగానో పాఠకవినోదార్థముగానో యనేకవిధముల రచన లావిర్భవింపవలసియున్నది. అట్టివి కొన్ని పుట్టినవి, పుట్టుచున్నవి. అట్టివన్నియు సర్వసాధారణములై యుత్సాహము పుట్టించున ట్లుండవలెనని యభిలషించుట రచయితల ధర్మము. వస్తు పాత్ర రసౌచిత్య మావశ్యకమన్న విశేషలక్షణము కావలసిన కావ్యవిశేషము నటుంచి చూచినా, శబ్దార్థభావౌచిత్య మెట్టివిషయమెత్తి నిర్మించు నెట్టిరచన కైన ముఖ్యమె కదా! కావున నే కవియైనను, రమ్య నిర్మాణశాలి యన్న పేరు తెచ్చుకొనఁగోరినచో నేఁటి కనుగుణమైన రీతినే కావ్యలక్షణము పాటింపవలెను. ఇందు కితరులు చెప్పినమాట లేల?

"సారమతిం గవీంద్రులు ప్రసన్నకథాకలితార్థయుక్తిలో
నారసిమేలునా, నితరు లక్షరరమ్యత నాదరింప—"

అని పదౌచిత్యము నర్థౌచిత్యము కావ్యరచన కావశ్యకమని తెలుపుచున్న యీ నన్నయార్యుని మాట యేనాఁటికవులకైన ననుసరణీయమే కదా! ఇంకా సూరనార్యాదులు చెప్పిన కావ్యౌచితీ లక్షణము లుగ్గడింపనేల? ఇది చాలదా? కావుననేఁడు కావ్యనిర్మాణము సముచితపదరమ్యత అర్థప్రసన్నత భావస్ఫూర్తి కలుగునట్లుండి వివిధవిజ్ఞాన విశేష బోధకమగుచు సంఘాభివృద్ధికి తోడ్పడునట్లుండుఁ గాక! యని, యాశించుచున్నాను.

"ప్రకృతిమహతే కుర్మ స్తస్మై నమః కవికర్మణే"

# మన్త్రశక్తి

ధర్మాధర్మ వివేకమునకు మూలమైనది మంత్రమని దీని మొదటి యర్థము. అది వేదములలోని యొక్కొక్క వర్ణానుపూర్వితోడి యొక్కొక్క ఋక్కునకును లేక, యట్టి వాక్యమునకును చెల్లుచు అట్టి ఋక్సముదాయము వాక్యసముదాయములైన వేదములసంహితా భాగములకును చెల్లుచున్నది. గాయత్రీమంత్రము—సౌరమంత్రము అనునపుడు, ఒక్కొక్క మంత్రమర్థము. మంత్ర బ్రాహ్మణాత్మకము వేదమనునపుడు ఋక్సంహిత సామసంహిత యజుస్సంహిత లర్థము.

“అహే బుధ్నియ మన్త్రం మే గోపాయ, య మృషయ స్త్రైవిదా విదుః, ఋచస్సామాని యజూగ్ంషి, సా హి శ్రీ రమృతా సతామ్”

అట్టే యెక్కువగా నైహికప్రయోజనములైన మంత్రముల రాశి యగు నథర్వ వేదమునకు మంత్రమనునది నామాంతరమైనది. తరువాత నా వేద మాధారముగా నుదయించిన దేవతోపాసనాపరమైన శాస్త్రమునకు మంత్రశాస్త్రమను పేరువచ్చినది. ఇష్టార్థసిద్ధికి సాధన మయినది మంత్రమని మంత్రశబ్దార్థము మాఱినది. ఇది దీని రెండవ యర్థము.

రాజపురోహితుం డథర్వవేదజ్ఞుండుగా నుండవలెనని స్మృతీతిహాసములు చెప్పుచున్నవి. ఆ వేదము నామాంతరము ‘మంత్రము’ కదా! అది కలవాడు మంత్రి. ద్వాదశవిధ మంత్రులలో నతం డొక మంత్రి. శత్రువశీకరణము శత్రుస్తంభనము శత్రునాశనము దేశోపద్రవ నివారణము మొదలగు కార్యములందా మంత్రజ్ఞుడైన మంత్రి యెక్కువ సహాయుండై మంత్రసాహాయ్యమున నాయా రాజకార్యములు నిర్వహించునెడ నర్హమైన యాలోచనము చెప్పుచుండెడివాడు. దానిని బట్టి మంత్రశబ్దమునకు రహస్యాలోచన మనెడి మూండవ యర్థము సిద్ధమైనది. ఇప్పటికీ యర్థములనుబట్టి మంత్రశక్తి యెట్టిదో విచారించుటయే యీవ్యాసము నుద్దేశము.

మంత్రమన్నమాట నిన్నంతనే యెట్టివాని హృదయ మందైనా పవిత్ర భావ మేర్పడుటయేకాదు. అందేదో మహత్త్వ మున్నదని స్ఫురించుటకూడా నైజము. అది యట్టిదే. మంత్రము (వేదము) భరతఖండముపాలిటి మహాభాగ్యము. ఈశ్వర ప్రసాదము, ఐహికా ముష్మిక సుఖసాధనము. అనాదియైన యీ మహాసృష్టిలో నెన్ని యుగము లవతరించి యంతరించినవో లెక్కలేదు. కాని, మంత్రము మాత్రమట్లే, ఆ యానుపూర్వితోడనే ప్రతి యుగారంభమందును మహ ర్షుల జ్ఞాన నేత్రమునకు గోచరించుచు వచ్చుచున్నదనుట సత్యము. ఇది మంత్ర తత్త్వజ్ఞులైన మహర్షులమాట. నిష్కాములు లోకాను గ్రహకాంక్షులునైన వారి మాట పరమప్రమాణము కదా!

"యుగాన్తేఽన్తర్హితాన్ వేదాన్, సేతిహాసాన్ మహర్షయః, తపసాలేభిరే పూర్వ, మనుజ్ఞాతా స్స్వయంభువా"

త్రయీమంత్రముల మహత్త్వ మపారము. వాటిని నిరంతరము పఠించు పూర్వమహర్షుల చర్య లత్యద్భుతములు మంత్రశక్తిచే వారా యుష్యవృద్ధి గాంచెడివారు. ఆపదలు తరించెడివారు. ఇష్టార్థము లొందెడివారు. అంతమునం దుత్తమలోకములకుం బోయెడివారు. అందలి కొన్ని మంత్రము లుచ్చరించుచుం గావించెడి హోమము లా యజ్ఞకర్తల కోరికలు తీర్చెడివి. పూజ్యులు సంసిద్ధిసాధనమని చెప్పిన కర్మకు మూలము మంత్రమేకదా! ఇంక నుపాసనార్థములైన యందలి మంత్రములందుమా, వాని మహిమ యూహింపరానిది. వానిలో నగ్రిమము గాయత్రీ మంత్రము "నగాయత్ర్యాః పరోమంత్రః" అని యార్యోక్తి, బహునిష్ఠాగరిష్ఠులై గాయత్రి జపించిన వశిష్ఠ విశ్వా మిత్రాదు లొనర్చిన యద్భుత కృత్యములు సుప్రసిద్ధములు. నేటి నవ నాగరికులు కొందఱివి కట్టుకథ లనవచ్చునుగాని. యందొకటియు సత్యేతరము కాదని మంత్రశక్తిని స్థిరబుద్ధితోం బరిశీలించువారికిం దెలియకపోదు.

నేఁటి మంత్రవేత్తలలో నొకరొక బాణాకఱ్ఱ చేతితో నిమిరిం క్రిందం

బెట్టినంతనే యది రెండు బద్ధలైనది. ఇది నిజముగా జరిగిన విషయము. ఇంకొక మంత్రవేత్త తనదగ్గఱకు వచ్చినవారినే కాక, దూరదేశ మందున్న సర్పదష్టులనుగూడా యీ వార్త చెవిని బడినంతనే మంత్రించి వారిని బ్రతికించుచున్నాఁడు. ఏఱ్ఱుచు వచ్చిన వారిని నవ్వుచుఁ బోవునట్లు మంత్రించెడి వృశ్చిక మంత్రవేత్త లెందరో యున్నారు. ఇట్టివారు వేదశాస్త్రములు చదివినవారు కారు. నియమ వంతులుకారు. అయినా వారొక్క విషయమున లక్ష్యముంచి తన్మం త్రము జపించి సిద్ధిగాంచి యద్భుతముగావిష బాధలు తొలఁగించుచుండ, త్రయీమూర్తులు తపోనిష్ఠా గరిష్ఠులు వశీకృత మనస్కులు జితేంద్రి యులునైన ప్రాచీన మహర్షులు వైదిక మంత్రశక్తి నపూర్వమహిమ మార్జించి యట్టి యద్భుతకృత్యము లొనర్చిరన్న నాశ్చర్యమేమి?

ఆథర్వణమంత్రవేత్తలు జ్వరబాధలు పిశాచపీడలు వదలించుటయే కాక, రాజ్యరక్షణకై శత్రుస్తంభనము శత్రుసంహారము మొదలగు కార్యము లొనరించినారన్న నాశ్చర్యమేమి?

మంత్రశక్తి మఱుఁగుపడిపోవుచున్న యీ కాలమునఁ గొందఱికి గౌతమాది మహర్షులు తాము తలఁచినచోట జల మావిర్భవింపజేసి రన్నమాట కల్లగాఁ గనబడవచ్చునుగాని, నేఁడు కూడా అవగ్రహ దోషము వచ్చినపుడు వేదపాఠకులు ఋశ్యశృంగు నాహ్వానచేసి గొంతుక లోఁతు నీళ్ళలో నిలచి వారుణానువాకములు జపించుచుండ, మఱికొందఱు రుద్రునికి సహస్రఘటాభిషేకము చేయుచుండ నాశ్చర్య కరముగా నప్పటికప్పుడు మబ్బుపట్టి వాన కురియుటలేదా? మనము కన్నులారఁ జూచుచున్న యీవిషయము చూడనివాఁడును దీని యందు నమ్మకము లేనివాఁడును నిజము కాదన్నంతనే యిది నిజము కాకపోవునా? తన్మయచిత్తులై నియమపూర్వకముగా ఋశ్యశృంగు నారాధించి తన్మంత్రములు జపించినంతనే యీ కాలమునగూడ వాన కురియుచుండగా నిఁక రోమపాదుడను మహారాజు ఋష్యశృంగుని దస

దేశమునకు రప్పించుకొని యనావృష్టిదోషము తొలగించుకొనెనన్న యితిహాసము విశ్వసనీయము కాకపోవునా?

రామాయణ మహాభారతాదులందు గనవచ్చు నితిహాసములు వాల్మీకి పారాశర్యాదులు కల్పించినవి కావు. ఏనాఁడో నిజముగా జరిగిన యవి పురావృత్తము లనబడును.

గురుపరంపరాయత్తమైవచ్చి తమ చెవినిబడిన యా చరిత్రల నితిహాసము లనుపేర నామహాకవులు తమ గ్రంథముల కెక్కించిరి. ఇం దే కాదు, వేదములందు గూడా యిట్టి యితిహాసము లెన్నో యున్నవి. అవియు వైదికర్షుల నాటికిఁ బురావృత్తములే. పురావృత్తమనఁగా నెంతో కాలము ముందు జరిగినదని యర్థము. కావునఁ దొల్లిటి మహార్షులు మంత్రశక్తి నొనరించిన కృత్యము లన్నియు వాస్తవము లనుట ముమ్మాటికి నిజము. అం దసంభావ్య మేమియులేదు. ఇపుడు మనము వినుచున్న ఱెక్కల బాంబు లాకాశ మార్గమున నెగిరి నిర్దిష్ట స్థలమునఁ బడుట వింతయగునుగాని యసత్యమగునా? అట్టియెడ మహామహిమ సంపన్నములైన మంత్రములచే పరిపూతములైన జృంభకాస్త్ర సమ్మోహనాస్త్రాదు లాకాలమునం దద్భుతకృత్యము లొనరించినవన్న మఱింత వింత చెందవచ్చునుగాని యవి యసత్యము లనవచ్చునా? మంత్రశక్తికిని యోగశక్తికిని సాధ్యముకానిది లేదు. నేఁడు ప్రకృతిశాస్త్ర పారంగతులు కనిపెట్టిన దూరశ్రవణ సాధనము వారి ప్రతిభను చాటుచున్నట్లే నాటి మహామునుల దూరదృష్టి దూరశ్రవణములు వారి యోగశక్తిని చాటినవి. యంత్రసహాయ మపేక్షించిన యీనాటి దూరశ్రవణము సర్వజన సాధారణముగా లభించుచున్నదిగాని, కృతకమైన యిది యంత్రము చెడినంతనే నిలచిపోవును. మంత్రయోగబలముల నుదయించిన వారి దూరదృష్టి దూరశ్రవణములు వారికి మాత్రమే చెల్లినను, అవి వారున్నంత కాల మట్లే యుండెడివి. ఆ శక్తులవల్ల దెలుపఁదగిన విషయములను వారుభక్తులకుఁ దెలిపెడివారు. కొంతకాలముక్రిందట

సికిందరాబాదులో నొకయోగి తన యోగదృష్టిని దన భక్తుని యోడ సముద్రములో మునిగిఁపోవుట చూచి యది మునుగకుండ రక్షించెనఁట. అట్టి యద్భుత శక్తి యీనాఁడుకూడ నందందు గోచరించుచుండఁగా ఆ సత్యకాలమునం దుండెననుట కబ్బురమేమి? "మంత్రాలకు చింత కాయలు రాలునా" యన్న లోకోక్తి మంత్రసిద్ధి లేనివారి మనో దౌర్బల్యము హేతువుగా వచ్చినదికాని మంత్ర దౌర్బల్యమున వచ్చినది కాదు. తపశ్శక్తిసంపన్నుడఁగు నొక బ్రాహ్మణుని కోపదృష్టికిఁ జెట్టునుండి కొంగ రాలి క్రిందఁబడఁగాఁ చింతకాయలు రాలుట కబ్బురమా? చింతకాయలు కాదు, తలకాయలు కూడా రాలును. తొల్లిటి మహావీరులలో నొక్కొకఁడు పెక్కండ్ర శిరస్సులఁ గూలఁ గొట్టె ననఁగా నది వారిచేతిలోని బాణముశక్తి కాదు. ఆ బాణమం దావహింపఁజేసిన మంత్రశక్తియే.

మంత్రము సత్యస్వరూపము. దివ్యసత్త్వసంపన్నము. అమోఘము. దానిశక్తి యచింతనీయము. కొన్ని మంత్రముల కొక్కొక్క శక్తియే యుండును. గాయత్రివంటి మహామంత్రముల కన్నిశక్తులును గలవు. ఏ మంత్రమున కెవఁ డధికారియో వానికే యది ఫలించునుగాని, అనధికారి కది ఫలింపదు. పైగా నతనిని పాడుచేయును. గురూప దేశము దానికిఁ బ్రధానము. ఆ గురువుకూడా గురుత్వమున కధికారి కావలెను. ముద్రితగ్రంథము చూచి పఠించిన మంత్రముగాని, అనర్హుఁడైన గురువుపదేశించినది గాని పనిచేయదు. ఏ మంత్ర మే యక్షరక్రమమున నున్నదో దాని నట్లే జపించవలెను గాని క్రమము మార్చరాదు. మంత్రమున కర్థముండునుగాని, తదర్థజ్ఞానము మాత్రమే ఫలదాయకము కాదు. బీజాక్షర రూపములైన కొన్ని మంత్రముల యర్థమే తెలియరాదు. అర్థము తెలియదని యా మంత్రము వ్యర్థమా? కాదు. మంత్రముల శక్తి, ఆయా మంత్రము లను పునశ్చరణచేయుటలో నున్నది. అది తదేక ధ్యానముతోఁ

జేసినప్పుడే సిద్ధించును. విధియుక్తముగా గాయత్రీమంత్ర మిరువది నాలుగు లక్షలు జపించిన వాని కా మంత్రశక్తి చాలావఱకు వశ్య మగుచుండ నిరువది నాలుగు కోట్లు జపించిన వాని కాశక్తి యెంత వఱకు లభించునో యూహింపవలసిన దే.

బ్రాహ్మణుఁడేనాడు వేదపఠనమునకు దూరమయ్యెనో, ఏనాఁడా మహామంత్రమునకు విముఖుఁ డయ్యెనో, ఆనాఁడే యధఃపతితుఁ డైనాఁడు. ఆనాఁడే ప్రజలకు చులుకన యైనాఁడు. ఎంతకాల మతడు వేదపాఠకుఁడై మహామంత్ర జపనిష్ణాతుఁ డయ్యెనో, అంతకాల మతడు రాజమహారాజులకుఁ బురోహితుడై మంత్రియై దేశోపద్రవ ములు తొలగించు నాలోచనము చెప్పుచు రాజును రాజ్యమును గూడ రక్షించెను. శిష్యుల కైహికాముష్మిక మార్గము లుపదేశించెను. వర్ణాశ్రమధర్మములు దేశమున సరిగా నడిపించెను. అందుకే భోజమహారాజంతటి వీరుఁడు విద్వాంసుడు విద్యారహస్యవేత్త, బ్రాహ్మణుడగువా డిట్టివాడు కావలెనన్న భావము సూచించినట్లుగా తన గ్రంథాదిని నమస్కారము గావించి యున్నాడు.

"ఉచ్చైర్గతి ర్జగతి సిధ్యతి ధర్మతశ్చేత్, తస్య ప్రమాచ వచనైః కృత కేతరైశ్చేత్, తేషాం ప్రకాశన దశాపి మహీసురైశ్చేత్, తా నంతరేణ నిపతేత్క్వను మత్పరిణామః ?"

ఇపుడట్టి మహీసురు లున్నారా ? మహీవరు లున్నారా ? లేరు లేరు. అయితేనేమి ? మంత్రములు పోయినవా ? పోవునా ? వానిశక్తి నశించినదా ? నశించునా ? లేదు లేదు. అట్లు జరుగనేరదు. మంత్ర మవినాశి. ఎప్పుడైనా నిష్ఠా నియమములతో శక్తికొలఁది మహామంత్రము జపించువాఁ డైహికాముష్మిక సుఖములు గాంచుననుట సత్యము. మంత్రశక్తి యేనాడు మరల మన కలవడునో, ఆనాఁడు సర్వము సుగమమగును. ఆ కాల మీశ్వరేచ్ఛాధీనము –

"ఓన్నమో మన్త్రకృద్భ్యో మంత్రపతిభ్యః."

# మంత్రములు
# యంత్రములు
# తంత్రములు

"మన్యతే ఇతి మన్త్రః"— దేనిచే నుద్దిష్టార్థము తెలియఁబడునో, దేనిచే నిష్టదేవత స్తుతింపఁబడునో, లేక ధ్యానింపఁబడునో, అది మంత్రము. ఈయర్థమునే "మన్త్రో దేవాదిసాధనః" అన్న యభిజ్ఞ వచనము తెలుపుచున్నది. మంత్రమందలి విషయ మెంత మహనీయమో, ఎంత పావనమో, ఆశబ్దముకూడ నంత పవిత్రము. మంత్ర మన్నమాట చెవిని బడినంతనే యెట్టివాని హృదయమందైన నం దేదో మహత్త్వ మున్న దన్న పవిత్రభావ మేర్పడు ననుట నిజము. అది యట్టిదే. మంత్రము భరతఖండముపాలిటి మహాభాగ్యము; పరమేశ్వరప్రసాదము; ప్రాచీనార్యుల పావనజీవన నిదానము; పూర్వ మహర్షుల జ్ఞాననేత్రమునకు గోచరించిన శబ్దబ్రహ్మము; భారతీయ విద్యల కోంకారము; సకలప్రపంచ సారస్వతములకు శ్రీకారము. అదే ఋగ్యజుస్సామాత్మకము. అదే సన్మార్గవర్తనులు, ఇహాపర చింతనులునైన సనాతనుల శాశ్వతమైన సిరి. ఇందుకుఁ దైత్తిరీయోక్తి.

"అహే బుధ్నియ మన్త్రం మే గోపాయ
య మృషయ స్త్రైవిదా విదుః,
ఋచ స్సామాని యజూగ్ంషి
సా హి శ్రీ రమృతా సతామ్"

ఇది యిట్లు మూఁడుసంహితలకు మొత్తముగా పేరైనను, అందలి యొక్కొక్క ఋక్కును, ఒక్కొక్క వాక్యమును మంత్రశబ్దవాచ్యమే. అట్లే, అథర్వవేదమునకును, బహువిధదేవతోపాసనార్థము లయిన యందలి వాక్యములకును మంత్ర మనెడి సంజ్ఞయే వ్యవహరింపఁ

బడినది. తరువాత గోప్యమును, జప్యమును, వాంఛితార్థసాధకము లైన వర్ణము, లేక వర్ణసముదాయము మంత్రమనెడి యర్థమును, పిదప రహస్యాలోచనాద్యర్థములును సిద్ధము లైనవి.

వేదము యజ్ఞాదికర్మపర మనుట సత్యమే కాని, జ్ఞానసాధనములును, ఉపాసనార్థములు నైన మంత్రము లం దనేకములు కలవు. అందుచేతనే వేదము కర్మకాండము, జ్ఞానకాండము, ఉపాసనాకాండము నని త్రివిధముగా నున్నదని పూజ్యులనిరి. చిత్తశాంతిదాయకములై ముక్తిహేతువులైన గాయత్రీ శివ విష్ణు సూర్యాది దేవతోపాసనమంత్రములు త్రయీప్రసిద్ధములు. ఆనుష్ఠానమంత్రము లెన్ని వేల సంవత్సరములుగా, నెన్ని యుగములుగా భారతీయార్యపరంపరకుఁ గాణాచిగా వచ్చుచున్నవో యూహింపఁ జాలము. ఆ మంత్రములు కేవల మాముష్మికచింతతో నా నా దేవతల యనుగ్రహమునకు జపింపఁదగిన వను మాట సత్యమైనను, తత్తద్దేవతానుగ్రహమున మహిమయు, నైహిక సుఖమును గూడఁ బ్రాచీను లార్జింపకపోలేదు. ఇందుకు వేదములలో నెన్నో యితిహాసములు కలవు.* ఆ నాఁటి మంత్రవేత్తల మహిమ లనంతములు.

మంత్రానుష్ఠానమువల్ల మహామహిమ యార్జించియే యానాఁటి తపోధనులు సర్వవర్ణములవారి గౌరవమునకుఁ బాత్రులైరి. రాజమహారాజులకు గురువులు, పురోహితులు, మంత్రులునై సంఘము సుఖముగాఁ బ్రవర్తించునట్లు చేయఁగలిగిరి. మంత్ర మన నథర్వవేదమని కూడ నర్థ మని యింతకు మున్నే చదివితిమిగదా! ప్రయోగోపసంహారములతో నందలి మంత్రములను వశపఱచుకొన్నవారు మంత్రు లనఁబడిరి. అట్టి యథర్వవేత్తయే రాజునకు ద్వాదశవిధమంత్రులలో నొకఁడై రాజునకును, రాజ్యమునకును శత్రుబాధ కలుగకుండ రక్షించుచుండెడివాఁ డన్నవిషయము సంహితా పురాణ

---

* చూ : మదీయ సంస్కృతవాఙ్మయచరిత్ర, ప్ర. భా. ౩౩–౩౮.

ప్రసిద్ధము. ఇది యాథర్వణము వ్యాప్తికి వచ్చినప్పటిమాట. అంతకు ముందే మహామంత్ర జపః స్నాతులు, తపస్సిద్ధులు, వశ్య వాక్కులు నైన బ్రహ్మర్షులు మహారాజులకు గురువులై, నిజాశ్రమ వాసులై, నిష్కామ్యులై వారి పరిపాలనము నిష్కంటకముగా, నిరుపద్రవముగాఁ గొనసాగునట్లు వేయికన్నులతోఁ జూచుచుండెడివా రనుటకు దశరథ జనకమహారాజాదుల గురువు లగు వసిష్ఠశతానందాదుల చర్యలే నిదర్శనము. కావున మంత్రము, జపము, తపసు, వాని సిద్ధియు నార్యుల కనాది సిద్ధము లనుట వాస్తవము. ప్రభుమంత్రోత్సాహ శక్తులలోని మంత్రశక్తికి రాజ్యస్థానములోని యథర్వవేత్త యగు మంత్రి మంత్రశక్తి యనియే మొదటి యర్థ మనుట నిజము. ఆవైదిక మంత్రములును, మంత్రసిద్ధ గురుపరంపరా సంప్రదాయలబ్ధ లౌకిక మంత్రములు నాధారములుగా, భరతఖండమున వ్యాపించిన మత విద్యలలో నొకటియై వెలసినది తంత్రవిద్య. సంహితాగమయామలాది సంజ్ఞల విలసిల్లిన యా తాంత్రికవిద్యలలో నంతర్భూతమైన దే మంత్రశాస్త్రము.

ఐహికాముష్మికసాధక మైన యుపాయము తంత్రము. దాని నావిష్కరించునది తంత్రవిద్య. వేదాంత శాస్త్రమువలెనే యిది యును జిజ్ఞాసువులకు ముక్తిమార్గ ముపదేశింప నవతరించిన దైనను, షడ్దర్శనములవలెనే తంత్రములును భిన్న మార్గములు త్రొక్కినవి. ఇందు శ్రీమన్నారాయణుఁడే పరమేశ్వరుఁడు - పరమశివుఁడే పరబ్రహ్మము - పరాశక్తియే జగదాధారము అను మూఁడు మతములు ముఖ్యములు. సాంఖ్యాదులు తత్త్వము లిరువదినాలు గనఁగా నివి ముప్పదియా అన్నవి. "షట్త్రింశద్విధ మేతద్వై తత్త్వచక్రం సమీరిత" మ్మని శక్తిత్రయపరీక్షా పరమానందాది తంత్రములు వాటిని నిరూపించినవి. జీవేశ్వరతత్త్వ వివేకమే వీటి పరమావధి యైనను తన్నియమాచరణ మసిధారావ్రతమువంటిది. వేదవిహిత మైన

గాయత్రీహరిహరాదిదేవతారాధన మిందు సవిశేషముగాఁ గనవచ్చు టంబట్టి యీవిద్య వైదికమతసమ్మత మనవలసివచ్చినది గాని, యిందలి దేవతారాధన విధానబాహుళ్యమును బట్టి యిది యొక స్వతంత్రవిద్యయే యని చెప్పవచ్చును. ఇందుకుఁ దంత్రవిద్య శ్రద్ధేయ మనియు, అశ్రద్ధేయ మనియు రెండుమతము లాదిని వెలువడుటయే ప్రమాణము. ఇందుకుఁ బ్రమాణవచనలు కొన్ని :—

వేదమార్గము విడిచి వేఱుత్రోవ పట్టినవాఁడు చేతిలోని పాయ సము పాఱపైచి మోచేయి నాకినవాఁ డగునని సూతసంహిత. వైదిక మార్గము విడిచి తంత్రమంత్రదీక్ష నవలంబించి యీగతిపాలయితి మని నరకవాసులు విచారించినట్లగ్నిపురాణము. పాషండులు, తాంత్రి కులు, నాస్తికు లీతీర్థము సమీపింపఁజాల రని పద్మ పురాణము. ఇట్లీవిద్యను గొన్ని గ్రంథములు నిరసించినను, కొన్ని కొన్ని యెడల స్తుతింపకపోలేదు. దీనిని నిరసించిన సూతసంహితయే మఱియొకచోట వైదికుల కవ్యవధానముగా లభించు నీశ్వరాను గ్రహము తాంత్రికు లకు వ్యవధానముగా లభించు నని యొకవిధమైన సమ్మతి చూపినది. తాంత్రికమార్గము ననుసరించి బ్రాహ్మణ క్షత్రియబాలురకుఁ బ్రదోష పూజ యుపదేశించినది బ్రహ్మోత్తర ఖండము. సర్వేశ్వరుఁడు తంత్రా గమప్రియుఁ డన్నది భాగవతము. భగవంతుఁడు వేదవేదాంతములం బోలెఁ దంత్రాగమముచేతను వేద్యుఁడే యన్నది భారతము. కావు ననే షణ్మతోద్ధారకుఁడు, జగద్గురువు నగు శంకరభగవత్పాదులు వైదికతాంత్రిక మంత్రములకు సమన్వయము కలిగించి తమ మానస పూజలో—

“ మంత్రాం స్తాంత్రికవైదికాన్ పరిపఠన్
సానంద మత్యాదరాత్
స్నానం తే పరికల్పయామి జనని !
స్నేహా త్త్వ మంగీకురు ”

అని తాంత్రికమంత్రముల సమర్థతను బ్రకటించియున్నారు. వేద వేదాంతముల కున్న ప్రాధాన్యము దీనికిఁ దొలుత లేకపోయినను, తరువాత నిది ముక్తిసాధనశాస్త్రములలో నొకటిగాఁ జేరిన దనుటకు శ్రీశంకరాచార్యులు మంత్రశాస్త్రము నాదరించి తదుక్తమైన శ్రీచక్ర పూజ నాచరించి జగదీశ్వరీపీఠములు భరతఖండము నలుగడలఁ బ్రతిష్ఠించుటయే తార్కాణము.

తంత్రము సంహిత మంత్రశాస్త్ర మన్నపేర గ్రంథ ముదయింప నారంభించి సుమారు రెండువేల సంవత్సరము లయియుండును గాని, అందలి ప్రధానవిషయమును, తదాచరణ విధానమును, దానికి సంబంధించిన విజ్ఞానమును బురాతన మైనదే. అది కేదారేశ్వర బదరీ నారాయణ ప్రతిష్ఠలకుఁ బూర్వమే యార్యమహర్షుల హృదయసీమల నంకురించినది. చిత్తశుద్ధికి యజ్ఞాదికర్మలును, ఆత్మజ్ఞానమునకు వేదాంత విచారణయు సాధనము లైనను, అహం బ్రహ్మాస్మీతి విజ్ఞానము జిజ్ఞాసువున కనేకజన్మ పరంపరాసాధ్య మగునన్న విషయ మెఱిఁగిన యా మహానీయులు, మనస్సు నొకచో నిలిపి పరమేశ్వరధ్యానము చేయుటయు, ఇష్టదేవతావిగ్రహారాధనమును తరించుటకు సులభమార్గము లగు నని సంకల్పించిరి. ఉపాసకుల యుపయోగమునకు నిరూపించిన యా భగవద్రూపకల్పనమునెడ నమ్మహాత్ములకు వేదములలోని యీశ్వరరూప వర్ణనములే తోడ్పడిన వనుట నిజము. ఆవాక్యములు కొన్ని :—

"సహస్రశీర్షా పురుషః, సహస్రాక్ష స్సహస్రపాత్"
"సహస్రశీర్షం దేవం విశ్వాక్షం విశ్వశంభువమ్"
"య ఏషో ఽన్త రాదిత్యే హిరణ్మయః పురుషః"
"కృత్తిం వసాన ఆచర పినాకం బిభ్ర దాగహి !"
తా మగ్నివర్ణాం...దుర్గాం దేవీగ్ం శరణమహం ప్రపద్యే"
"హిరణ్యవర్ణాం హరిణీం సువర్ణరజతస్రజామ్"

కావున నీ విద్య ప్రాచీనగురుపరంపరా సంప్రదాయసిద్ధమనుట తెల్లము.

మంత్రము, యంత్రము, తంత్రము నిందు ప్రధానములు. మంత్రములు బీజాక్షరరూపములు. అకారాదిక్షకారాంత వర్ణములును, సంయుక్తాక్షరములును బీజములు. వాని కలయికచే నేర్పడినవి. "సప్తకోటిమహామంత్రా శ్శివవక్త్రా ద్వినిర్గతాః" అను స్కాంద వచనమున నేడుకోట్లని తెలియుచున్నది. కొన్ని మంత్రముల నాయాదేవతల నామము లుండును. కొన్నింటఁ దద్దేవతాకములైన బీజములు మాత్రమే యుండును. ఇఁక మంత్రాధిష్ఠాన దేవతలందునూ, లెక్కలేదు. విష్ణురుద్ర సంజ్ఞలు ఋగ్వేదాదులందున్నవి. వారి మహత్త్వములు నందు వేఱుగానే యున్నవి. తరువాత నిందు విష్ణువు శ్రీమన్నారాయణ వాసుదేవ జగన్నాథ జనార్దన నృసింహాది నామములను, రుద్రుఁ డీశ్వర విశ్వేశ్వర మహాకాళేశ్వర త్ర్యంబకేశ్వరాది సంజ్ఞలను విలసిల్లిరి. పరబ్రహ్మ ప్రతిబింబ మైన మూలప్రకృతి పరాశక్తి. ఆమె శ్రీ లక్ష్మి కాళీ బాలాత్రిపురసుందరీ దుర్గా శ్యామలా రాజేశ్వరీ లలితాదిసంజ్ఞల విలసిల్లినది. అట్లు విలసిల్లిన యొక్కొకసంజ్ఞకొక్కొక మంత్రము వేఱుపడినట్లే తజ్జపహోమార్చనాదులును వేఱయినవి. అందుకుఁ దగినట్లు భక్తుల యభీష్టములును, తత్సిద్ధులును వేఱయినవి.

ఒక్కొక దేవతకు, తన్మహత్త్వప్రతిపాదకము లైన బీజాక్షరములతోడి యంత్రము విహితము. తపోనిష్ఠుఁ డామంత్రమును దదేకదీక్షతో జపించి జపించి యా తపశ్శక్తి నాయంత్రమున నావహింపఁ జేయును. ఆ యంత్రమును తదాగమోక్తవిధానమున నర్చించుటయే తంత్రము. అట్లారాధింపఁబడిన యా దేవత యా భక్తుల కభీష్టమొసఁగును. ఆ యంత్రమునే యొక క్షేత్రమునఁ బ్రతిష్ఠించి దానిపై నభీష్ట దేవతా విగ్రహమును బ్రతిష్ఠించుట యాగమోక్త విగ్రహారాధన తంత్రము. కేదార బదరీ కాశీ కాళహస్తి భీమేశ్వర మహాకాళే

శ్వర శ్రీశైల శ్రీపర్వత జగన్నాథాది క్షేత్రములందు ప్రతిష్ఠింపఁబడిన యాయా దేవతామూర్తులు కొన్ని వేల సంవత్సరములుగా భక్తుల నాకర్షించుచున్నవిగదా! అది యావిగ్రహముల మహిమ కాదు, ఆక్షేత్రముల మహిమ కాదు; అది యంతయు నాయా మంత్ర సిద్ధము లయిన యంత్రముల మహాత్త్వ మనుట నిశ్చయము. మంత్రతపశ్శక్తి నేవస్తువునం దావహింపఁజేసినను, అది యసాధారణ, వమేయము నయిన ప్రభావము చూపుననుట సత్యము. సనాతన తపోధనులు తమ తపశ్శక్తి ధారపోసి కనుఁగొన్న యస్త్రములు సామాన్య మానవబుద్ధి కతీతమైన మహాత్త్వము చూపిన వనుట యితిహాసప్రసిద్ధము గదా! వాని కాశక్తి యెట్లు వచ్చినది? మంత్రశక్తివల్లనే. దానినే భవభూతి యిట్లు స్మరింపఁజేసినాఁడు :

"బ్రహ్మాదయో బ్రహ్మహితాయ తప్త్వా
పరస్సహస్రం శరద స్తపాంసి,
ఏతా న్యదర్శన్ గురవః పురాణాః (అస్త్రాణి)
స్వా న్యేవ తేజాంసి తపోమయాని"

సమరాంగణముల నద్భుతమహిమలు చూపిన బ్రహ్మ నారాయణ పాశుపత సంమోహన జృంభకాస్త్రాదుల యజ్ఞేయశక్తి యంతయుఁ దపశ్శక్తి యనుట విదితము. మంత్రయంత్రమహాత్త్వ మిట్లు రెండు మాటలలోఁ దెలియునది కాదు. ఆ శాస్త్రమునందలి రహస్యము తెలిసినఁగాని తృప్తి కలుగదు.

తంత్రవాఙ్మయము పరిశీలింపఁగాఁ బాంచరాత్రమత శాఖ క్రీ. పూ. పదునాల్గవ శతాబ్దివఱకును, శైవమత శాఖ యంతకంటె నొకటి రెండు శతాబ్దులు వెనుకటివఱకును బోయిన సూచనలు గన వచ్చును. పాద్మసంహితలో ౧౦౮ వైష్ణవతంత్రములు పేర్కొనఁ బడినవి. కాదిమ తంత్రమునుబట్టి శైవతంత్రము లఱువదినాలుగు లెక్కకు వచ్చినవి. అందలి రుద్రయామలమహాతంత్రములో శక్తి గణపత్యాది

పూజావిధులును, వరివస్యారహస్యములును తన్మయత్వము గలిగించు నట్లు వర్ణింపఁ బడినవి. శైవభేదము లయిన గాణాపత్య కాపాలికాది మతములు శైవమహాతంత్రమునందు విశదీకరింపఁబడినవి. ఇట్లు వెలసి లోకమున వ్యాపించిన తాంత్రికమతములలో విశేష వ్యాప్తికి వచ్చి శిష్టులయాదరము గాంచి నేఁటికి నాసేతుహిమాచలము వ్యవహారమున నెక్కువగాఁ గనవచ్చునది శాక్తము.

మూలప్రకృతి పరాశక్తి బ్రహ్మరూప చిదానంద పరబ్రహ్మ రూప. ఆమెనుండి మహత్తత్త్వాదు లావిర్భవించినవి. మూలప్రకృతి యగు దాని వికృతులు మహాకాళీ త్రిపురసుందరీ రక్తవర్ణా బాలభైరవీ విద్య లనువారు. ఆ ప్రకృతి ప్రపంచమూలము; తన్మాయా రూపధారి ప్రపంచాత్ముఁడు శివుఁడు.

"యదా సా పరమాశక్తిః స్వేచ్ఛయా విశ్వరూపిణీ"
"న శివేన వినా దేవీ న దేవ్యా చ వినా శివః"
"శివశక్తిరితి హ్యేకం తత్త్వ మాహు ర్మనీషిణః"

ఇత్యాదిగా శక్తిసంగమతంత్ర కామకలావిలాసాది గ్రంథము లీశక్తిస్వరూపము నెంతయో ప్రశంసించియున్నవి.

శక్త్యారాధనమున కేర్పడిన యంత్రము శ్రీచక్ర మనఁబడును. నవయోన్యాత్మక మైన శ్రీచక్రములోని మధ్యభాగ మైన బిందు తత్త్వము పరాశక్తిస్వరూపము.* వామకేశ్వర మహానిర్వాణాది తంత్రము లీచక్రము పరాశక్తి పరమశివుల యభేదరూపమైన పరబ్రహ్మ మని వర్ణించియున్నవి.

శ్రీ విద్యోపాసన మతిదుష్కరము, మహానియమబద్ధము. మంత్ర తంత్రోక్తమైన పరిపూర్ణ విధానముతో నాశక్తి నారాధించిన దీక్షా సిద్ధులకు ముక్తి కరతలామలక మనుట సత్యమే. కాని నిష్కామ

---

* చూ : సంస్కృత వాఙ్మయ చరిత్ర, ద్వితీయభాగము, పుట ౨౪-౫౦.

బుద్ధితో, నిరంతరదీక్షతోఁ జేయవలసిన తదారాధన విధానము చూచినచో నొడలు జలదరించును. అయినను మనోనిగ్రహముతో దేవి నారాధించి కృతార్థు లయిన మహనీయులు పూర్వము లేకపో లేదు. ఇపుడుకూడ శ్రీవిద్యోపాసనము, శ్రీచక్రపూజయు నందందు దేశమునఁ గలవు.

సర్ జాన్ వుడ్రాఫ్ అనెడి యాంగ్ల విద్వాంసు, డీశాస్త్రము చక్కఁగా నభ్యసించి శక్తి - శాక్తము, వర్ణమాల అను గ్రంథ ములు రచియించియు, తంత్రరాజ మహాతంత్ర నిర్వాణాదికృతు లనువ దించియు ప్రకటించి యీ శాస్త్రమునకు ఖండాతరములందు వ్యాప్తి కలిగించియున్నాఁడు.

ఆస్తికతంత్ర మంత్రశాస్త్రము ననుకరించి యర్వాచీన బౌద్ధులు కూడ దేవతారాధనమున నభీష్టసిద్ధిగాంచుచు వ్రజయాన సహజ యాన కాలచక్రయాన రూపమైన సారస్వతము నావిష్కరించి యున్నారు. వాని టిబెటన్ భాషానువాదము లింకను సజీవములై యున్నవని సాధనమాలా ప్రకాశకులు వ్రాసియున్నారు.

మంత్రశాస్త్రము ముక్తిమార్గములలో నొకటి యనుట నిరాక్షే పము. మంత్రానుష్ఠాన మిష్టార్థప్రద మనుట యంతకంటెను నిరాక్షే పము. అట్టి నిష్ఠాపరులు కోటి కొకరైన నిపు డున్నారో లేరో కాని పురాతనమైన యొక విద్వదభిప్రాయము మాత్ర మిట్లున్నది :

"దైవాధీనం జగత్సర్వం, మంత్రాధీనం తు దైవతమ్,
తన్మంత్రో బ్రాహ్మణాధీనః. బ్రాహ్మణో మమ దైవతమ్"

# వాల్మీకి - రామరాజ్యము

త్రేతాయుగమహాపురుషుఁడై లోకైక వీరుఁడై యవతరించిన శ్రీరాముఁ డేనాడు రాజ్యముచేసెనో నాటినుండియు నీమాట యఖిలభారతీయులనోట వచ్చుచున్నదిగాని నేడు పుట్టినది కాదు. వాల్మీకి రామాయణ ముదయించిన పిదప బుట్టినదికాదు. ఆయాద్యకవి నాటికే రామేతిహాస మార్యజాతి కస్థిగతమై యున్నది. అదే, ఆ మహర్షి వాక్కునబడి గ్రంథరూపము దాల్చినది. భక్తులకు తరుణోపాయమును సంస్కృత భాషకు మూలాధారమునైన యదే జీవత్కావ్యరూపమున నిత్యమై నిఖిలజగ మావరించియున్నది. అది యటుండ, వీతరాగుడును లోకానుగ్రహ కాంక్షియునైన గాంధి మహాత్ముడేనాడు భరతఖండమున మరల రామరాజ్యము స్థాపింప వలెనని సంకల్పించెనో నాటినుండియు మరియు నీమాట హిందూదేశ మంతట నాబాలగోపాలము వాడుకలోనికి వచ్చినది. ఆ సత్యసంకల్పుని కోరిక నెరవేఱి హైందవులకు స్వారాజ్యమును వచ్చినది. గాని అది రామరాజ్యము గాకుండగానే, ఆ మహాత్ముడు పరమాత్మైక్య మందెను. అయినా, అత డభిలషించిన రామరాజ్యము లోకప్రసిద్ధమైన రామరాజ్యముకంటె భిన్నము కాదనుకొని దాని స్వరూపస్వభావ ముల నొకింత స్మరింతము.

ఆ కాలమున ప్రకృతిరంజకమైన యుత్తమ క్షత్రవంశములోని జ్యేష్ఠ పురుషుడు క్రమముగా సింహాసన మధిష్ఠించుట యాచారమైనా, అతడు యథోక్త రాజలక్షణములు కలవాడై ప్రజాసమ్మతిని గాంచియే మూర్ధాభిషిక్తుడగుచుండెడివాడని రామాయణ భారతాదులు వక్కాణించుచున్నవి. దానంజేసి యానాడీనాటి యెన్నికలు లేకపోయినా, ప్రజల యేకవాక్యమునకు గుఱియగువాడే రాజగుచుండెడివాడని విశ్వసింపవలసినదే.

శ్రీరాముని యువరాజు గావింపగోరిన దశరథుడు సకల సామంత పౌర జానపదులను పిలిపించి పరిషత్తు గావించి విన్నవించిన విన్నపములో నొకింత [1]:—

"నా పూర్వులైన యిక్ష్వాకు వంశరాజులు సుభిక్షముగా సుఖప్రదముగా పరిపాలించుచు వచ్చిన యీ రాజ్యమును వారి మార్గమునే యనుసరించి యేలుచువచ్చుచున్నానని మీ కెల్లరకు విదితము. వార్ధకమున జీర్ణించిన నాశరీరము విశ్రాంతి నభిలషించుచున్నది. నా పెద్ద కొడుకు రాముడు సకల రాజధర్మము లెఱిగిన సుశీలుడు. అతనికి యౌవరాజ్య మర్పింప మీ రనుమతించి నాకు విశ్రాంతి కలిగింతురు గాక."

పై విజ్ఞప్తి నాలకించిన పరిషత్తువారి మాటలు కొన్ని :— [2]

"శ్రీరాముడు సకలసద్గుణసంపన్నుడు. అతనిని యువరాజు గావించుట మా కభిమతము. విద్యావంతుడు, సర్వధర్మములు తెలిసిన సత్యసంధుడు, ప్రజల మేలు కోరువాడు, సర్వసమబుద్ధివ్యసనదూరుడు, శూరుడు, ధీరోదారుడు, ప్రజాపాలన తత్వజ్ఞుడైన శ్రీరాము నభిషేకింపుము."

పై వాక్యములనుబట్టి యానాడు ప్రజలకె ట్లనువర్తనుడై ప్రభువు ప్రభుత్వము నెఱపుచుండెడివాడో, ఎట్టి ప్రభుని ప్రభుత్వమును ప్రజలు కోరుచుండెడివారో, ఆదరించుచుండెడివారో తెల్లమగుచున్నదికదా! ఈసందర్భమం దొక్క మాట — ఈకాలమున బరిపాలకుడైన రాజనువాడు లేడు గావున నయ్యా రాష్ట్రములయం దెన్నుకొనబడుచున్న ప్రతి ప్రధానమంత్రియు ముఖ్యపాలకుడనని భావించి, ఆ యా ప్రభుత్వమునకును, పాలనీయ ప్రజలకును, వలసిన ధర్మములు పరిశీలించుట సముచితము — వేదముల తరువాత వెలసిన నూతనచ్ఛందోఽవతారమైన రామాయణమున నెడనెడ సందర్భోచితముగా పాల్యపాలక

1. 2. రామా. అయో. 2. సర్గ.

ధర్మములు కనవచ్చుచునేయుండును గాని, అయోధ్యాకాండలోని కచ్చిత్సర్గ యనబడెడి నూఱవసర్గ వాటికి నిధి యనవచ్చును. చిత్రకూటాశ్రమమందున్న తన్ను జూడవచ్చిన భరతుని రాము డడిగిన యందలి ప్రశ్నలలో కొన్ని :— అందు మంత్రి నియోజనమును గూర్చి — (రుచికొక్క శ్లోకముతో)

"కచ్చిదాత్మ సమాశ్శూరా
శ్శ్రుతవన్తో జితేన్ద్రియాః,
కులీనా శ్చేఙ్గితజ్ఞాశ్చ
కృతా స్తే తాత! మన్త్రిణః॥"

నీతో సమానులు శూరులు చక్కగా జదువుకొన్నవారు పరేంగిత జ్ఞానము కలవారు సత్కులమున జన్మించినవారు నగు పురుషశ్రేష్ఠులు మంత్రులుగా నియోగింపబడినారుకదా! మూర్ఖులు వెయ్యిమందిని కాదు, పదివేలమందిని చేరదీసినా లాభము లేదు. మేధావియు దక్షుడు పండితుడు విచక్షణుడునైన యమాత్యుడొక్కడు చాలును. అతడు రాజునకు రాష్ట్రమునకు గూడా మహోపకారము చేయగలడు. ఈ విషయ మెఱిగి మంత్రులను నిర్ణయించుచున్నావుకదా!

ఈవిధముగా రాజ్యతంత్రప్రవర్తకులను యుద్ధతంత్ర నిపుణులను ప్రజాక్షేమంకర కార్యనిర్వాహకులను ఉత్తమ మధ్యమాధమ రాజ పురుషులను భృత్యులను నిర్ణయించువిషయమున నడిగిన ప్రశ్నము లన్నియు సర్వకాల సర్వావస్థలయందును రాజునకు లేక ప్రభుత్వము నకును ప్రజలకును హితోపదేశకములై మనోహరములగు నవి యనుట నిజము.

"తక్కువ వ్యయముతో ప్రజల కెక్కువ ప్రయోజనము లభించు కార్యములు తలపెట్టి వెంటనే చేయించుచున్నావా?"

"సత్యవాది, ప్రతిభాశాలి, విద్యావంతుడు, జానపదుడునగు

పండితుని దూతగా నియమించుచున్నావా? కృషిగోరక్షణ జీవుల నాదరించుచున్నావా?"

రాష్ట్రములోని మంచి చెడ్డలు కష్టసుఖములు ప్రజలెఱుంగుటకు వార్త నడపుట యావశ్యకము. అది యున్నదున్నట్లును జరిగినది జరిగినట్లును నడచుచున్నదా?

అపాత్రులకై ధనము వ్యర్థము కాకున్నది కదా! నిర్దోషులను శిక్షించుటగాని దుష్టులను విడుచుటగాని లేదుగదా! ధర్మార్థకామములు పరస్పర విరుద్ధములుగాక ప్రజలలో యథోక్తముగా నడచునట్లు పరిశీలించుచున్నావా? నాస్తిక్య మనృతము ప్రమాదము మొదలగు పదునాల్గు దోషములు లేకుండ ప్రభుత్వము చేయుచున్నావుగదా! ఇత్యాదులెన్నో! ఇట్టి ప్రభుధర్మములతోడి ప్రభుత్వముకంటె రామరాజ్యమనుచు వేఱుగా నుండునా? ఇంక శ్రీరాముడు రాజ్యము చేయుచున్నప్పటి దేశస్థితి యొకింత :—

రాముడు రాజ్యముచేయు కాలమున దొంగతనములు బందిపోట్లు అకాలమరణములు బాల్యవైధవ్యములు ప్రాణాంతకమైన రోగములు లేవట. ఈమాటలు నేటి నాగరికుల కత్యుక్తులుగా దోచవచ్చును. గాని, యది సరికాదు. సర్వవర్ణములవారును స్వధర్మము తప్పక తమ తమ వృత్తు లాచరించుకొనుచు నిత్యసంతుష్టులై పరహింసా పరాయణులుగాక పరస్పర కలహములు లేక సుఖజీవనము చేయుచుండునట్లు ప్రభుత్వము వేయికన్నులతో చూచుచుండగా దేశీయుల కకాలమరణాదు లేల సంభవించును? ఎప్పుడో త్రేతాయుగములోనేకాదు, తన నాడుగూడ ధర్మపరిపాలనమును ప్రజల సుఖజీవనమును యథోక్తముగా నుండుట యెఱిగియే వాల్మీకి యట్లు వర్ణించె ననుకొన్నచో విప్రతిపత్తి కలుగదుగదా! ఇంతకును ధర్మపరిపాలనమున ప్రజలు కీడుకంటె మేలే యెక్కువగాంచుచు సుఖింతురన్న పై బహూక్తిని విమర్శింపనేల? ఆమాట త్రికాలములయందు సత్యమే.

లోకారాధనమే ప్రజారంజకమగు ప్రభుత్వము విధి. దానియెడ భయభక్తులతోను నీతి ధర్మనిష్ఠతోను ప్రవర్తించుటయే ప్రజల విధి. అట్లు పాల్యపాలక ధర్మములు పరస్పరానుకూలములై యథోక్తముగా నడచెనేని యది ధర్మరాజ్యమగును. అదే రామరాజ్యము. వాల్మీకి గ్రంథాంతమునందు చెప్పిన యీ క్రిందిమాటలు కూడా ధర్మనిరతినే యుపదేశించుచున్నవి.

"బ్రాహ్మణాః క్షత్త్రియా వైశ్యాశ్శూద్రా లోభవివర్జితాః,
స్వకర్మసు ప్రవర్తన్తే తుష్టాః స్వైరేవ కర్మభిః,
అస్యప్రజా ధర్మరతా రామేశాసతి నానృతా
సర్వే లక్షణ సమ్పన్నా స్సర్వే ధర్మపరాయణాః.

# ఆంధ్రరాజుల అభినందనములు

విజయనగర సంస్థానపాలకుడగు పూసపాటి విజయరామగజపతి మహారాజును, పెద్దాపుర సంస్థాన ప్రభువగు వత్సవాయి తిమ్మజగపతి మహారాజును సమకాలమువారు, క్షత్రియ ప్రభువులు, బంధువులు, ఉభయులును, విద్యాపోషకులు, విద్వత్ప్రియులు, విద్వాంసులు. కవితాప్రియులు, కవులు.

ఒకమాఱు గోదావరీ పుష్కర స్నానమునకని రాజమహేంద్ర వరమునకు బయలుదేరిన విజయరామరాజుగారు తమ రాకను తిమ్మ రాజుగారికి ముందుగా తెలిపిరి. రాజకులోచిత సత్కారమున కను గుణముగా ఎదురుగా వెళ్ళి ఆయనను తోడ్కొనివచ్చుటకై ఈయన వాహనమెక్కి యెదురేగిరి. ఇరువురి పల్లకీలు పిఠాపురము చెంత తారసిల్లినవి. అపుడు పల్లకీలు దిగి యొకరి చేతు లొకరు గ్రహించి సంతోషముతో కుశల ప్రశ్నపూర్వకముగా నించుక ముచ్చటించు కొన్నంత, నొకరి నొక రభినందించుకొన్నట్లుగా నీ క్రింది శ్లోకములు రెండును పెద్దల వాడుకలో వినవచ్చినవి. ఇవి తత్కాలమందాశు వుగా చెప్పినవి కాకపోయినా, కలసికొన్నపుడు ప్రశంసించుటకై యంతకుముందే వారిద్దఱు రచియించుకొని యుందురని భావించ వచ్చును. అందు ముందు తిమ్మరాజుగారి శ్లోకము :

> " నాళీకభంగకృ దతీవ న దీనబంధుః
> నక్షత్రపో నవసుధా విభవైక హేతుః,
> రాజా కిమిందురపి నార్యభిమానహారీ
> రాజాపరం విజయరాఘువ సార్వభౌమః "

ఈ క్రిందిది విజయరామరాజుగారి శ్లోకము :

> " అంభోజం కలయన్ సదృక్షమవనే
> సాహిత్య రీత్యాం దృశోః,

మాంధాతార మపార సంపది మహా
భావేయశో రాశిషు,
శత్రూణాంపుర భంజనే ధృతిగుణే
కించోరగేంద్రం మతి
ప్రాగల్భ్యే ప్రతిభాతి తిమ్మ
నృపతిః పాకాహిత ప్రాభవః"

కూడబలుకుకొని రచియించినట్లుగా రెంటిలోను సభంగ శ్లేషాలంకారమే ప్రధానముగా గనవచ్చుచున్నది. వీని వివరణము క్రమముగా నొకింత రాజశబ్ద మిద్దఱికిని వర్తించుచున్నను, చంద్రుడు రాజన దగడు. విజయరామరాజే రాజనదగును. ఏమనగా — ఇందలి నైదు విశేషణములలోను, ఒక్కొకటి, శ్లేషవశమున చంద్రునికి రెండు విధములుగాను, విజయరామరాజున కొకవిధముగాను సమన్వయించును——

అతడు, నాళీక = పద్మములకు, భంగకృత్ = చెఱుపు చేయువాడేకాని, అళీక = అప్రియములకు, భంగము కలిగించువాడు, న = కాడు. ఇతడో. అళీక భంగకృత్ = అప్రియ కార్యముల నణచి వేయువాడు - అతడు, నదీన = సముద్రునికి, బంధుః = చుట్టమే కాని, దీనబంధుః = దీనులకు చుట్టము, న = కాడు; ఇతడో, దీనబంధువు. అతడు, నక్షత్రపః = నక్షత్రములకు ప్రభువేకాని, క్షత్రపః = క్షత్త్ర జాతిని పాలించువాడు, న = కాడు; ఇతడో క్షత్రియజాతివారిని రక్షించువాడు. అతడు, నవసుధా విభవైక హేతుః = క్రొత్తదైన అమృత సంపదకు ముఖ్య కారణమే కాని, వసుధా = భూమండల వైభవమునకు హేతువు, న = కాడు. ఇతడో, భూమి సర్వసంపత్సమృద్ధముగా పాలన మొనర్చువాడు. అతడు, నార్యభిమానహారీ = స్త్రీల యభిమానమును హరించువాడు కాని, అర్యభి...శత్రువుల గర్వమణచువాడు, న = కాడు. ఇతడో

అరిజాతి దుర్గర్వ మణగఁద్రొక్కునాఁడు. కావున విజయరామరాజు రాజుగాని, చంద్రుఁడు రాజు కాఁడని భావము — ఇందు తక్కిన వన్నియు సముచితము లనవచ్చును గాని, చంద్రుఁడు వసుధా విభవ హేతువు కాఁడనుటమాత్ర ముచితము కాదు. సమస్తమైన యోషధు లకు (సకల సస్యాదులకు) సోముఁడు రాజని వేదము తెల్పుచున్నది, చంద్రకిరణముల సంపర్కమున సస్యాదులు ఫలించుట యనుభవ సిద్ధము — ఇక రెండవ శ్లోకము.

ఇందు, తిమ్మరా జుపమేయము. అంభోజాదులు మూఁడు నుపమా నములు. అం దొక్కొక్కటి మూఁడువిధములుగా సమన్వయించును. ఎట్లనగా ? - తిమ్మనృపతి. అవనే = రక్షణమునందు, అం = విష్ణు వును, సాహిత్యరీత్యాం = సాహిత్య విద్యావిషయమున, భోజం = భోజమహారాజును, దృశోః = కన్నుఁగవయెడ, అంభోజం = పద్మ మును, సదృక్షంకలయన్ = సాటిని గావించుకొనుచును, అపార సంపది = అనంతమైన సంపదయెడ, మాం = లక్ష్మిని, మహాభావే= ఉదారస్వభావమునెడ, ధాతారం = బ్రహ్మను, యశోరాశిషు = ఘన మైన కీర్తి విషయమై, మాంధాతారం = మాంధాతను, సాటిగావించు కొనుచును, శత్రూణాంపుర భంజనే = శత్రుపురములను భంగపెట్టుట యందు, ( ఉః ) ఉమ్ = మహేశ్వరుని, ధృతిగుణే = ధైర్యమునందు, అగేంద్రం = మేరువును, మతిప్రాగల్భ్యే = బుద్ధిప్రౌఢిమయెడ, ఉర గేంద్రం = ఆదిశేషువును సరిగావించుకొనుచును, పాకాహిత ప్రాభవః = మహేంద్రుని యైశ్వర్యమువంటి యైశ్వర్యముకలవాఁడై, ప్రతిభాతి = ప్రకాశించుచున్నాఁడు. అనగా తిమ్మనృపాలుఁడు సకల సద్గుణసంపన్నుఁడైన భూమీంద్రుఁడని భావము.

ఈ శ్లోకము లేనాఁడు పుట్టినవో కాని, నాటినుండియు నివి యారా జుల మాటలుగానే తెలుగుదేశమున వ్యాపించుచు వచ్చుచున్నవి. ఇవి వ్యక్తి ప్రశంసాపరములైనను శ్రుతిరంజకములైన యితర చాటు

శ్లోకములవలెనే జీవించియున్నవి. కాని, యిందు, నాళీకేత్యాది మొదటి శ్లోకము, 'రాజాపరం విజయరాఘువ సార్వభౌమః' అనుటకు బదులుగా, "రాజాపరం విజయతే భువిరామవర్మా" అను పాఠముతో, తిరువాన్కూరు పాలకుడయిన రామవర్మ ప్రశంసగా, ఎడవెట్టికట్ట నంబూద్రితమ్ముడు రచియించిన రుక్మిణీ పరిణయ కావ్యము నవతారికలో నున్నట్లు తెలియుచున్నదని కృష్ణమాచార్యులుగారి సంస్కృత సారస్వత చరిత్ర 804 పుటలో నొకమాట కనవచ్చినది. ఆ కావ్య మముద్రితము. అది, యెంతవఱకుగియున్నదో! అదియు మన చాటు శ్లోకములును కొంచె మెచ్చుతక్కువగా సమకాలము లనవచ్చును. ఆ కావ్యము కొంచెము ముందైనను కావచ్చును, కాని ఆ కాలమున, నందలి శ్లోకము తన కెట్లో లభింపగా, తిమ్మరాజు దాని నుపయోగించుకొనె ననుటగాని, లేక యితని యీ చాటు వా మలబారులోని రుక్మిణీపరిణయ కావ్యమున కెక్కె ననుటగాని చెప్పుటకును నమ్ముటకును గూడ వలనుపడకున్నది. నిజముగా నీ శ్లోకమా రుక్మిణీపరిణయావతారికలో నున్నదన్నమాట ధ్రువపడినచో నప్పుడీ విషయము పరామర్శింపదగును గాని, యంతదనుక నిది తిమ్మనృపతి శ్లోకమనియే విశ్వసింతము.

# వివాహాచార విచారము

ఆహారనిద్రాదులవలె సర్వజంతుసామాన్యములైన సహజధర్మములలో స్త్రీపురుష సమాగమ మొకటి. ఇది బంధుసమ్మతమగుట కేర్పడిన విధానమును పాణిగ్రహణ వివాహ పరిణయాది సంజ్ఞలతో వ్యవహరించుచు వచ్చిరి గాని, పరస్పరేచ్ఛ గల స్త్రీ పురుషుల కలయికయే వివాహ మని యాంతరార్థము. తొలుదొల్త నిది యనియతమై, వివేకరహితమై విచిత్రగతుల విహరించుట కనిపెట్టి జ్ఞానవృద్ధులగువా రానాడు దీనికి నియమము లేర్పరచుచు వచ్చిరి. వాటి ననుసరించి పవిత్రమైన వధూవరసంబంధ మేర్పడినది. ఆ వివాహవిధియే మంత్రరూపము తాల్చి లోకమునకు ప్రమాణ మైనది.

వేదము ధర్మమూల మని పూజ్యు లన్నమాట వాస్తవము. అది వివిధములైన సనాతనవిషయములను ప్రతిఫలింపఁజేయు దివ్యమణిదర్పణము. ధర్మాధర్మములను తెలియఁజేసిన యాద్యగురువు. అట్లని సాంఘికములైన సకలధర్మాధర్మములను వేదములు సాంగోపాంగముగా విశదీకరించిన వనుకోరాదు. తరువాత వెలసిన సూత్రస్మృతీతిహాసపురాణములు గావించిన వివిధధర్మ పరిష్కారములకు వానియందలి చిన్న చిన్న యితిహాసములును, బహువిధములైన సంవాదములును, ధర్మ సూచనలును ప్రధానాధారము గావున సర్వమునకు వేదమే ప్రమాణ మని శాస్త్రకర్తలు వక్కాణించి యున్నారు.

ధర్మబద్ధమైన తొల్లిటి వివాహాచారమును మనకు గోచరింపఁజేసినది ఋగ్వేదము. దానికంటె పూర్వగ్రంథము ప్రపంచమందే లేదు గనుక, దానిమాట పరమ ప్రమాణ మనుట నిర్వివాదము. అందలి కొన్ని ఋక్కుల (౧౦-౮౫) భావ మిది :

"ప్రౌఢలై వరసమాగమ మభిలషించు వధువులు మాత్రమే వివాహయోగ్యలు. స్త్రీచిహ్నము లంకురింపక రజోవతులు గాక

యుండు బాలికలు పుట్టింట నుండ నర్హాలు. వరుని మిత్రులు వధువు తండ్రివద్దకు వెళ్లి కన్య నర్థింతురు. వరుని సుగుణములు తెలుసుకొని యతనికి కన్నె నీయ నతఁడు వాగ్దానము చేయును. బంధుమిత్రాదులతో నిండిన పందిటిలో వివాహవేదిక చెంత నగ్నిసాక్షిగా వరుఁడు వధువు చేయి పట్టుకొని "కల్యాణీ! నీకు సౌభాగ్యమును, నాకు గార్హపత్యమును సిద్ధించుటకును, నీవు నాతో వార్ధకదశ గడచువఱకు నుండుటకును నీపాణి గ్రహించుచున్నాను."

అని పలికి సమంత్రకముగా నగ్నిలో నాజ్యాది హోమములు గావించును. పిదప వధూవరులను పెద్ద లాశీర్వదింతురు. వివాహానంతరము కన్యాదాత కూఁతురిని రెండెడ్లను పూన్చిన రథము (బండి) మీఁదఁ గూర్చుండఁబెట్టి యరణముగా నిచ్చు గోవులను, తక్కిన వస్తువులను సిద్ధముచేయును. అపుడు వధూబంధువులు "కుమారీ! నీవు పతిగృహమున స్వామినివై, ప్రజావతివై, భర్తకనుకూలురాలవై వర్థిల్లు"మని దీవింతురు. పెండ్లికూఁతు ర త్తవారియింటికి చేరినపిదప గృహప్రవేశాంగహోమములు చేయఁబడును అపుడు భర్త భార్యతో "అర్ధాంగీ! మంచినడవడి కలిగి మెలఁగుము. కోపదృష్టితో నుండకుము. మనస్సును, రూపమును శుచిగా నుంచుకొని నాకు మేలు కోరుచుండుము. ఎట్టి సమయమందును కీడు తలఁపకుము. వీరులైన కొడుకులను కనుము. అత్తమామలపరిచర్య చేయుము. మఱఁదుల నాదరింపుము. ఆఁడుబిడ్డలను ప్రేమింపుము. మన పశువులహితము కోరుచుండుము" అని సానురాగముగా హితముపదేశించును.

ఈవివాహాచార మెంతో సముచితమై, "బంధుసమ్మతమైన వధూవరుల యావజ్జీవ ప్రేమబంధము వివాహ" మనెడి సత్యమును వెల్లడించుచున్నది. వరుని మిత్రులు కన్య లున్నవారి యిండ్ల కేగి సంబంధము కుదుర్చుటయనెడి యీకన్యావరణాచారము మొన్నమొన్నటివఱకు దేశమున నన్నివర్ణములవారిలో నుండెడిది. విదేశవిద్యాభ్యా

సము హెచ్చుటయు, కులధర్మములు క్షీణించుటయుఁ వరశుల్కము వ్యాపించుటయు కారణములుగా కన్యావరణస్థానమును వరవరణ మాక్రమించినది.

వేదోక్తమైన పై వివాహవిధానముకూడ అట్లే నిలిచియుండలేదు. కొన్ని మార్పులు గాంచి బ్రాహ్మము, ప్రాజాపత్యము, ఆర్షము, దైవము అనుపేళ్లతో నాలుగువిధము లైనది. ఆమార్పులలో ముందు గణింపఁదగినది నగ్నికావివాహాచారము*.

వేదము ప్రౌఢావివాహమే యాచరణీయ మని గొంతెత్తి చెప్పినది. అది చాలాకాల మాచరణలో నున్నది. అయితే నేమి? కాలగతినిబట్టి యందు దోషములు కనవచ్చుటచే నది సంఘశ్రేయోదాయకము కాదని తలంచి శిష్టులు ఋతుపూర్వవివాహమే యాచరింపఁజొచ్చిరి. అది మనుస్మృతికి సుమారు వేయి సంవత్సరముల పూర్వపుమాట యనవచ్చును. మనువు వేదవాక్యమందలి గౌరవము చేతను, క్వాచిత్కముగా కనవచ్చుటచేతను ఋతుమతీపరిణయ మాపత్కల్ప మని యొకవిధముగా సంగీకారము చూపినా, సంఘమందు మిక్కిలి వ్యాపించిన బాలికా వివాహమునే యెక్కువగా ప్రశంసించెను. కన్యవయస్సు నొకింత పెంచిన నేమి దించిన నేమి? తరువాతి స్మృతికర్త లంరఱు నతనినే యనుకరించిరి. దీనినిబట్టి కడపటి హిమప్రలయానంతరము మరల నార్య నాగరికత వికసింపక పూర్వమును, వికసింప నారంభించినపుడును, అనఁగా నేఁటికి సుమారు పదివేలసంవత్సరముల ముందటినుండి, యది వికసించిన విదప నేఁటికి సుమారు నాలుగువేల సంవత్సరముల క్రిందటిదాఁకా పెక్కువేలేండ్లు యువతీ పరిణయమే సంఘమున వేళ్లునాటుకొని యుండెడిదనియు, ఇప్పటికి సుమారు నాలుగువేలేళ్లుగా దానిస్థానమును నగ్నికావివాహ మాక్రమించుకొనియున్నదనియు విదిత మగును. ఇప్పటిరీతినిబట్టి యిది బ్రాహ్మణవైశ్యజాతులను మాత్రమే లోఁబఱచుకొన్నది గాని క్షత్ర

* ఋతుమతి కాని కన్య నగ్నిక.

శూద్రజాతులజోలికి పో లేదని తోఁచవచ్చును గాని, ఆ వర్ణములు కూడ మొదట దీని నవలంబించి పిదప యువతీ వివాహమునకు దిగిన వని చెప్పుట కవకాశము లేకపోలేదు. ఆవిషయ మెట్లున్నా, శ్రుతి ప్రశంసించిన దానిని నిరసించి, అది కూడ దన్న దాని నవలంబించిన సంఘముతీర్పే తరువాత శాస్త్రమగుటనుబట్టి యానాఁడు శాస్త్రము కంటె నాచారమే బలవత్తరముగా నుండెడి దని మాత్రము నమ్మక తప్పదు. "ఆచారమునకు దూరమైనను శాస్త్రమే హేతువు. దేనికి వేదము ప్రమాణమో, దేనికి దేశకాలముల నిరంతరవ్యాప్తి కలదో, దేనిని వేదజ్ఞులైన శిష్టు లాచరించుచున్నారో అది యాచారము" అని చెప్పుచు నేవో మంత్రలింగము లతుకు పెట్టి దీనిని సమర్థింపఁజూతు రేమో కాని బహుసహస్రసంవత్సరము లాచరణలో నున్న సనాతనాచారమును పరిత్యజించి సంఘము నూతనాచారము నవలంబించలే దని చెప్ప లేరు. అది మన్వాదిస్మృతుల కాధారము కాలే దని చెప్పలేరు. అందుచే వేదవేత్తలగు నాఁటి శిష్టులు సంఘాభ్యుదయ మభిలషించియే యీయాచారమును ప్రవర్తింపఁజేసి రనియు, కావుననే యిది భరతఖండ మంతట నాలుగువేలేళ్లు వేళ్లు పాఱి నిలిచి యున్న దనియు భావింపఁ దగును. పూజ్యు లాచరించిన ధర్మము లోకమునకు ప్రమాణమని వేదవ్యాసులే యిట్లు సెలవిచ్చియున్నారు: "యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్త దే వేతరో జనః, స యత్ప్రమాణం కురుతే లోక స్త దనువర్తతే."

పోనిండు. ఈశిష్టాచారము వేదసమ్మతమే యని యంగీకరింతము. శాస్త్రము గ్రహించి వివరించిన యీ క్రింది దుష్టాచారములమాట యేమి?

మన్వాదులు బ్రాహ్మాదులను గాక ఆసుర గాంధర్వ రాక్షస పైశాచము లను మఱినాల్గింటెని వర్ణించినారు. వేద మీావర్తనముల నను మతించిన దని యెవ్వరును చెప్పఁజాలరు. కాని, అక్కడక్కడ వీటిప్ర

సక్తిమాత్రము కనవచ్చును. అందుకు కారణము నాదిగా నిట్టివర్తనములు సంఘమున నుండుటగాక మఱేమి? ఈ విశృంఖలాచారములు సంఘసమ్మతములైన వనుటకు విధిలేక స్మృతులు వీనిని గ్రహించి యిది యీ వర్ణమున కిది యీ జాతికి తగునని చెప్పుటయే నిదర్శనము. ఈవివాహవిభాగ మొకవిధమా? వీటి విధానము లోకరీతివా? స్మృతులలోని వీటి వివరణములు చూచిన రోతపుట్టునుగదా! ఇందు మఱియు ఘోరములైన రాక్షస పైశాచము లధర్మ్యము లనబడుచునే వివాహసంజ్ఞతో స్మృతుల కెక్కుటకు నాఁటి సాంఘికాచారము కాక యింకేది కారణము? ఆచారమునకు వేదము ప్రమాణము కావలెనన్నారు గాని తల్లిదండ్రులను కొట్టి వారికూఁతురి నపహరింపవచ్చుననియు, నిద్రపోవు యువతిని చెరుపవచ్చుననియు వేదము చెప్పినదా? చెప్పిన దనగలరా? కావున నేఁటి కొన్ని సదాచారములను మరల శాస్త్రము గ్రహించు పద్ధతి కాలకర్మవశమున పోయినదే యని విచారింపవలెనుగాని, నాఁటి సాంఘికాచారములను బట్టియే శాస్త్రము పుట్టిన దనుటకు వివాదపడ నక్కఱలేదు. పోనీ; శాస్త్రోక్తములయినవి గదా యని పూర్వోక్తవివాహాచారము లన్నియు నట్లే నిలిచినవా? లేదు. కొన్ని రూపుమాసినవి. కొన్ని మాఱినవి. కొన్ని బహిష్కారమునొందినవి. దీనికంతకును కారణము లోకవర్తనము కాదా?

తమలో నడుమ నంకురించిన చిన్నభేదములను గణింపక తమ విశేషణములను విడిచి బ్రాహ్మాదులు నాలుగు నేకమైనవి. దీనివల్ల వచ్చిన ముఖ్యమైన యనర్థ మొకటి. వధూవరుల యావజ్జీవ ప్రేమానుబంధము వివాహమన్న వేదమతమునకు విరుద్ధముగా పురుషుఁడు ప్రథమ కళత్రము జీవించియుండఁగా నింకొక తెను పెండ్లాడుచున్న దురాచారమును తొలఁగించుటకు ప్రాజాపత్య వివాహము పుట్టినది. దాని పేరణఁగినంతనే యాదురాచారము మరల తలయెత్తినది.

కన్యాశుల్కముతోడి వివాహమాసురము. దారిద్ర్యము ముఖ్య

కారణముగా పుట్టిన యీ యాచారము సంఘములో తిట్లు తిని
తుదకు సవర్ణముగా వైశ్యశూద్రవర్ణములకు విహితమై మరల నన్ని
జాతులకు వచ్చినది. ప్రాచీనులు నిందించినా, అర్వాచీనులు సవర్ణ
మైనది ధర్మ్యమన్నారు. ఎట్లయిన నిది క్రూరాచారముకాదా? దీనిని
శాస్త్రమంగీకరించలేదా? ముప్పది నలువది యేండ్లుగా దీని హెచ్చణ
గినది కాని పూర్తిగా నిర్మూలము కాలేదు. ఎంతో నిందపాలై
యెంతో కాలమున కిది శాస్త్రసమ్మతి గాంచియు నాఁటి నుండి నేఁటి
కిని సిగ్గుపడుచునే యున్నది గాని, దీనికంటెను ఘోరమై లోకమును
పీల్చిపిప్పిచేయుచున్న వరశుల్క మనెడి నూతనాచార మింత విజృంభ
ణముగా తలయెత్తుకొని తిరుగుట కేశాస్త్రము సమ్మతించినది?
ఆంగ్లవిద్యాప్రభావము తెచ్చిపెట్టిన దురాచారములలో నొకటియగు
నిది వరకట్నమను పేరు పెట్టుకొంటే మాత్రము శుల్కముగాదా?
ఆర్షవివాహమందు వరుఁడు కన్యాదాతకు గోమిథునము నిచ్చుటయు,
దైవ వివాహమందు కన్యాదాత వరునికి నంగుళీయక మిచ్చుటయు
శుల్కములు కావు; సత్కారము లన్నారు. శుల్కముతోడి పెండ్లి
యాసురమన్నారు. అది కన్యాశుల్కమైతేనేమి, వరశుల్కమైతేనేమి?
ఎట్లయినా ఆసురమే.

కొంతకాలము క్రిందట వేదశాస్త్రములు చదువుకొన్న వేదవా
డున్న మాన్యము కొంచెమును తాకట్టుపెట్టి కన్యాశుల్కము సమ
ర్పించి పెండ్లాడేవాఁడు. ఇపు డాంగ్లవిద్య నేర్చుచున్న దరిద్రులకు
కూడా వరశుల్కము లర్పించి సాధారణ గృహస్థులున్న మాన్యమమ్ము
కొనుచున్నారు. ఈపెనుభూతము పెట్టు పీడ తెలిసిన పేదయువతులు
కొంద ఱాత్మహత్య చేసుకొనుట పత్రికాపాఠకు లెఱుఁగనిదికాదు.
రజోఽనంతర వివాహశాసనమున కుల్లాసపడుచున్నారు గాని, దాని
వల్ల గణింపరాని మేలుకన్న వచింపరాని కీడే హెచ్చినది. ఈశాస
నము కావలెననుటకు చెప్పిన కారణములలో బాల్యవైధవ్యములు

తప్పుననుట యొకటి. కాని, నాఁటి వితంతుబాలికల సంఖ్యకన్న నేఁటి యతంతు ప్రౌఢలసంఖ్యయే హెచ్చగుచున్నది. ఇపుడు మూఁడవ దశకము గడపుచున్న యవివాహితయువతులు ప్రతి పురములోను త్రిద శాంగనలమాడ్కి గోచరించుచున్నారు సత్కులీనలు, శీలవతులు నైన యాకన్నెలను చూచి చూచి దారిని పోవువారి కివ్వలేరు. కట్నా లిచ్చి తగిన వరులను తేలేరు. ఇపుడీశాసన మోరగంట చూచుచున్నా, వరులు కట్నాలు దొరికే కన్నెల మీఁదనే కన్ను వేయుచున్నారు గాని, శుష్కహస్తములు చూపు శోభనాంగులను చూడకున్నారు. వరశుల్క నిరోధశాసనము కూడా పుట్టినచో నీశాసన మేమైన లాభ కారి యగునేమో కాని, అంతవఱకు దీనిగతి యింతే.

పరస్పరానురక్తులగు యువతీయువకుల సమాగమము గాంధర్వము. ఈయాచార మనాదిగా సంఘమున నున్నదే. తొలుత నిది వర్ణనియ మము లేక సర్వజాతి సామాన్య మగుట నింద్యమై పిదప వర్ణనియ మము పాటించి ధర్మ్య మనఁబడి తరువాత క్షత్రియజాతికి మాత్రము వర్తించి యనంతర మెపుడో యణఁగిపోయినది. నాఁటినుండి గాంధర్వ వివాహము స్మృతులలోనే కాని సంఘములలో నున్నట్లు కనఁ బడలేదు.

నేఁడు దేశములో సర్వత్ర యప్రతిహతముగా జరుగుచున్న చిత్ర విచిత్ర గాంధర్వములకు పైస్మృత్యుక్తవిధానము ప్రమాణమంటే చెప్పవలసిన దేమీలేదు. కాని, ఒక్కటిమాత్రము చెప్పకతప్పదు. నాఁటి గాంధర్వములోనిది యవివాహితయువతి. అది యామరణమా వరుని భార్య. నేటి గాంధర్వములోని స్త్రీ పురుషు లెట్టివారో లోక మెఱిఁగినదే. విదేశ నాగరికతా వ్యామోహము కారణముగా సంఘము నలముకొనుచున్న యనేకాచారములలో నీ విచిత్ర వివాహా చారము ప్రబలమైనది. ఇది యిట్లు కొనసాగుచున్నచో నింకొక యర్ధ శతాబ్దిలో సంఘమున వివాహమన్న మాటయే యుండ దనవచ్చును. ఈశ్వరేచ్ఛ యెట్లున్నదో!

ముందు బంధుసమ్మతి నపేక్షింపని రహస్య నిధియైన గాంధర్వ మును సంఘానుగుణమైన మార్పుతో వివాహముగా నంగీకరించిన మన్వాదులు వేదానుమతమై క్షత్రియజాతి విహితమై పదుగురిలో జరుగు బాహిరవిధియైన స్వయంవరమును వర్ణింపక పోవుటకు కారణము వారినాఁటి కా యాచార మంతరించుటయే యని తోఁచు చున్నది. ఋగ్వేదములోని స్వయంవర వర్ణనమిది:

"భద్రా వధూర్భవతి య త్సుపేశాః స్వయం మిత్రం వనుతే జనే చిత్." (౧౦-౨౭-౧౨)

కల్యాణియు, సౌందర్యవతియునగు వధువు జనమధ్యమందు కూర్చున్నట్టియు, తన కిష్టుఁడైనట్టియు నొక పురుషుని స్వయముగా వరించు చున్న దని యర్థము. వేదము చూపిన యీ యాచార మెపుడో రాజజాతిని విడిచి యంతరించినది. వేదము చూపని గాంధర్వ మాచరణలోనికి వచ్చి పిదప నదియు విడిచినది. శాస్త్ర మున్నదని యాచారము నిలచినదా? శాస్త్రము లేదని యాచారము పుట్టక మానినదా?

రాక్షస, పైశాచము లతిఘోరము లని మున్నే చదివితిమి. స్మృతికర్తలు వానిని పేర్కొనుట సంఘములో నున్న దురాచారములను తెల్పుటకుఁగాని, యవి యాచరణీయము లని బోధించుటకు కాదు. దుష్టకాము లట్టి దుష్కృత్యము లాచరించుట యేకాలమందునే దేశమునందూ నుండునదే. ఇపుడుమాత్ర మట్టివి లేవా? అయితే ఒక భేద మున్నది. పెండ్లి కానిదానినే కాని పెండ్లియైనదాని నాకాలమున ముట్టుకొనేవారు కారు. నేఁటి దుష్టకాలములకా వివక్ష లేదు. నాఁడు వివాహితయువతి నట్లు చేసిన అల్పబుద్ధులకు మరణమే దండనము. పెండ్లికాని యువతి నట్లుచేసినను శిక్ష లేదు. అందుచే నప్పటి యల్పబుద్ధు లందుకు సిద్ధపడుచు వచ్చిరి. గృహమేధుల కెంతో దుఃఖదాయకమైన యాదుష్టబాధను తొలగించుటకే శిష్టులు యువతీ

వివాహము నణంచి నగ్నికావివాహము నాచరింపఁజొచ్చి సంఘము నకు సుఖమార్గదర్శకులైరి. అదే రజః పూర్వ వివాహాచారమునకు మొదలు.

అనులోమ విలోమములని మరి రెండు వివాహ సంజ్ఞలు స్మృతులలో కనవచ్చును. రాజర్షులు బ్రహ్మర్షులకు తమ కన్యల నిచ్చి పెండ్లి చేయు నాచారము పురాణప్రసిద్ధము. అంతే కాదు. వేదప్రసిద్ధమును. రథనీతి యను రాజర్షి శ్యావాశ్వుఁడను బ్రహ్మర్షికి తన కూఁతురి నిచ్చి పరిణయ మొనర్చుట మొదలుగా ననేకోదాహరణములు కలవు. విలోమమునకు యయాతి దేవయానిని పెండ్లాడుట యుదాహారణ మగును గాని, అది భారతసంహితలోనిది. అయిన నిది ప్రాచితమముగా నుండెడిది. తరువాత నివి రెండును శుల్కమూలములై సంఘమున విస్తరించినవి గాని వీటి నేశాస్త్రకర్తయు గౌరవింపలేదు. ఆసురభేదములుగా గణించి ధర్మవిరుద్ధము లన్నారు. అయినా అనులోమము మాత్రము చాలాకాలము దేశమున నందం దాచరణలో నుండెడి దనుటకు క్రీ. శ. ౬౩౦ ప్రాంతమున కాన్యకుబ్జమం దున్న భట్టబాణుఁడు పారశవులైన తన భ్రాతలను పేర్కొనుటయే నిదర్శనము. (చూ: హర్ష చరిత్ర)

ఇట్లు పుట్టిన యనులోమ విలోమ మూలక సంతానములను అవాంతర వర్ణములుగా విభజించు సందర్భమున స్మర్తలు వీటి పేరెత్తుట వీటిని సమ్మతించుట కాదు. అయితే నేమి? ఇవి సంఘమున లేక పోయినవా? తరువాత వ్యభిచారముగా నిరసింపఁబడిన యీ రెండు నిపుడు సంఘములో ప్రవేశించిన విచిత్రగాంధర్వాచారములో నంతర్భూతములై స్తుతిపాత్రము లగుచున్నవి. ఇట్లు ప్రాచీన వివాహాచారములను పరిశీలించుటలో నవీనాచారము లొకటిరెండు మాత్రమే అగతగిలినవి. ఇఁక తక్కినవాని నించుక పరామర్శింతము.

సంఘము పెరుగుచున్న కొలఁదిని నడుమనడుమ నందందు దేశ

కాల పాత్రముల స్థితిగతులను బట్టి దురాచారమో అత్యాచారమో సంభవించుచునే యుండును. అయినా దేశపాలకుల సంరక్షణాభిలాషయు, వేదశాస్త్రవేత్తల ధర్మచింతయు అట్టిదోషములు సర్దుకొనుచు భరతఖండ మంతట వివిధ వర్ణములవారి వివాహాచారములను సక్రమముగా, శాస్త్రసమ్మతముగా చిరకాలము నడిపించుచు వచ్చినమాట నిజము. ఇపుడో, రాజావలంబనము లేక వైదిక మతము నిరాలంబ మగుటయు, వేదశాస్త్రాభ్యాసము నడుగంటి త్రొక్కి యాంగ్ల విద్యాభ్యాసము మితిమీఱుటయు కారణములుగా నన్ని యాచారములు మాఱిపోవు చున్నవి. అందులో వివాహాచారము మఱియు తప్పుదారి త్రొక్కుచున్నది. ఇందుకు గుడిలోని పెండ్లి, ఒక రాత్రి పెళ్లి, మంత్రము లేని పెళ్ళి, మంగళసూత్రములేని పెండ్లి మొదలయిన వుదాహరణములు. నాల్గవనాటి రాత్రి జరుగు శేషహోమముతోఁ గాని సిద్ధింపని వివాహ మొక్కగంటలో గతార్థ మగుచున్నది గదా! ఇంక వేదశాస్త్రము లెక్కడ, ఆచారమున కడ్డ మెక్కడ?

ఊఢా పునరుద్వాహమును స్మృతులు నిషేధించుటను బట్టి మను స్మృతికి పూర్వ మా యాచార మున్నదని తెలియవచ్చును. లేకున్న నిషేధ మెందుకు పుట్టును? "ప్రాప్తిపూర్వకో హి నిషేధః" అని శాస్త్రము. అది యుగాంతర విషయము - కలియుగ మందది కూడ దన్నారు. పోనిండు. ఐదువేల సంవత్సరముల క్రిందటనే యున్న దందము. అది రెండు విధములు. పెండ్లియైన పిదప వరుఁడు రోగదూషితుఁడని కాని, కులశీలాది దోషభాజనుఁ డని కాని తెలిసినచో ఆ వివాహమును రద్దుచేసి యా కన్యను మఱియొకని కిచ్చి పెండ్లి చేయవచ్చును; అతఁడు చనిపోయినను చేయవచ్చునని కొందఱును, ఆపిల్ల అక్షతయోనియై యుండవలె నని కొందఱును నిర్ణయించిరి. ఆ యాచారము మరల నేఁటికి వితంతు వివాహరూపమున దేశమున వెలసి తొలుత బహిష్కరింపఁబడియు నిపుడు సంఘమున స్థానము

సంపాదించు కొన్నది. వద్దన్నను వదలునది కాదు. కాని యిపుడు ప్రవర్తించుచున్నట్లిది నియమహీనము కాక; పూర్వులు చెప్పినట్లు పతిసమాగమ మెఱుఁగని వితంతుబాలికను సవర్ణ పురుషున కిచ్చి చేయునదైనచో సముచితమై యుండునుగదా! ఈయాచారము నిపు డెవరు సవరింపఁగలరు?

తొల్లి వరదోషములు హేతువుగా వివాహవిచ్ఛేదముతో ఊఢా పునరుద్వాహము జరిగినది. శాస్త్రము చూపిన యీ వరదోషము లలో నొకటియు లేకపోయినను ఇపుడు వివాహవిచ్ఛేదములతో పునః పునరుద్వాహములు జరుగుచున్నవి. శాస్త్రముమాట యెత్తవద్దు. కాని, యీదురాచారమును సంఘము ముఖప్రీతికైనను హర్షించు చున్నదికదా! ఈ ఘోరాచారమునకు విదేశనాగరికతానుకరణము కంటె వేఱుకారణ మున్నదా? ఇట్టివి క్షణక్షణము వర్ధిల్లుచున్నవి గాని కొందఱవలంబించిన సదాచారములు కొన్ని సంఘమున విస్త రిల్లకున్నవిగదా!

బ్రాహ్మణాదిచతుర్వర్ణములలోను నాడుభేదమువంటి యవాంతర భేదములు లేకుండ సవర్ణవివాహములు జరుగుచున్నచో, ఆయా జాతులు బలపడుటయేకాదు, కన్యలకు పెండ్లిచేయువిషయమున సాధా రణ గృహస్థులు పడే కష్టములు కూడా చాలావఱకు తగ్గిపోవును. జాతులయం దైకమత్యమును హెచ్చును. నిరర్థకములును, వివేక హీనములునైన యీర్ష్యాసూయలు నణఁగిపోవును. వేదము నాలుగు వర్ణములనే పేర్కొన్నది. ధర్మశాస్త్రము నాలుగువర్ణములకే వివా హాచారములను చూపినది. అంతే కాని, ఒక్కొకజాతిలోను మన మిపుడు పాటించుచున్న యవాంతరభేదముల మాటయైన లేదు. అందుచే బ్రాహ్మణశబ్దవాచ్యు లందఱును వెలనాడు వేగినాడు తెలుఁగునాడు కోసలనాడు నియోగి వైదికుఁడన్న గణింపరాని భేదములను విడిచిపెట్టి పరస్పరసంబంధబాంధవ్యములు చేసికొనుట

సర్వోత్తమము, శాస్త్రావిరోధము, సదాచారము నగును. తెలుఁగు దేశములో నాడుభేదము పాటింపని వివాహములు పూర్వము జరిగినవి. ఇపుడు జరుగుచున్నవి. వాటిని చూచి నైనా యీ యాచారము విస్తరించుట జాతిశ్రేయోదాయకము. అట్లే క్షత్రియాదివర్ణముల వారు నొనరించుట శ్రేయస్కరము. వివాహాచారమున మంచి మార్పు కోరు జాత్యభ్యుదయకాము లీయాచారమును విస్తరింపఁ జేయుదురు గాక.

ఇట్లు సంఘమునందు దృష్టినిలిపి శాస్త్రములోని మాటలు ప్రమాణముగా నాఁటినుండి నేఁటిదనుక మాఱుచువచ్చిన, మాఱుచున్న వివాహవిషయకాచారములను సంగ్రహముగా పరామర్శించుట పాఠకులు వాటి మంచిచెడ్డలు తెలుసుకొనుటకే కాని, యిది సంఘమును మరమ్మతుచేయఁ గల దన్న దురాశచే కాదు; నేఁటి వివాహవిధానములను నిరసించుటకును కాదు. ఈ వ్యాసము నాఁడు నేడు నున్న సాంఘికాచారములను స్పృశించి విడిచినది. కాని సాకల్యముగా విమర్శించలేదు. దేశమంతయు నెఱిఁగిన వివాహాచారముల తత్త్వమే యిందు ప్రతిఫలించినది. ఇందేదేని దోషమున్నచో పెద్దలు మన్నింతురుగాక.

స్త్రీ శీలమే సంఘశ్రేయమునకు మూలము.
సదాచారమే యార్యజాతికి మూలాధారము.

# కాలము - కాలకాలము

ఎందఱో మహానుభావులు జగత్తత్త్వము పరామర్శించి యెన్నో మతము లావిష్కరించి యున్నారు. వాటి మార్గములు వేఱయినా, ఆ సిద్ధాంతములు వేఱుపడినా, అవి యన్నియు మొట్టమొదట వేదమును పురస్కరించుకొని బయలుదేఱినవే యని యంగీకరింపక తప్పదు. వేదప్రామాణ్యము నంగీకరించినా, అంగీకరింపకపోయినా, తాత్త్విక దృష్టిలో తుదకు గమ్యస్థాన మొక్కటియే యని ప్రాచీనవేదాంతు లన్నారు. అట్టివారిలో మంత్రద్రష్టలు కొందఱు సూర్యప్రశంసాపూర్వకముగా కాలమును, తత్ప్రేరకమైనకాలమును పరామర్శించి నిర్ణయించిన విధ మించుక పరిశీలింతము.

పృథివ్యంతరిక్షద్యుస్థానదేవతలలో అగ్నీంద్రసూర్యులు ప్రధానులని కొన్ని ఋక్కులు ప్రతిపాదించినా, సూర్యుఁ డొక్కఁడే ప్రధాన దేవత; అతఁడే కార్యదృష్టిలో నింద్రాదిబహుదేవతారూపముల గణింపఁ బడుచున్నాఁ డనియే యందలి ముఖ్యభావము. "ఏకైవ మహానాత్మా దేవతా స సూర్య ఆచక్షతే" ఇత్యాది శ్రుతులను బట్టి దివ్యతేజోమయుఁడైన పరమేశ్వరుఁ డాదిత్యరూపమున వెలయుచున్నాఁ డనియు, సూర్యుఁడు పరమాత్మకంటె వేఱుకాఁడు గావున నతనికి సర్వాత్మత్వము సిద్ధ మనియు సౌరతత్త్వజ్ఞుల సిద్ధాంతము.

ఈ బ్రహ్మాండమునం దీభూమండలమువంటి భూమండలములు వేలున్నవి. మనకు కనవచ్చు సూర్యునివంటి సూర్యులును వేలకొలఁదిగ నున్నారు. వారిలో పంచకర్ణ ప్రాణత్రాతాదులు గుర్తించినవా రెనమండుగురు. ఆ సూర్యులలో మనకు గోచరించు సూర్యుఁ డారోగ నామకుఁడు. భ్రాజపటరపతంగులు మేరు (ఉత్తర ధ్రువము) మార్గమునకు క్రిందుగాను, స్వర్ణరజ్యోతిష్మద్విభాసులు దానికి మీఁదుగాను తత్తత్ప్రదేశములందు కదలక యుండి ఖగోళభూగోళములను ప్రకా

శింపఁ జేయుచున్నారు. ఈ యాఱుగురును మిక్కిలి దూరస్థులగుటచే మనకు గోచరింపకున్నారు. ఈ పేర్కొన్న సూర్యు లేడుగురును తమంతట తాము ప్రకాశించువారు కారు. వీరిని ప్రకాశింపఁజేయుచున్న ప్రధానసూర్యుఁడు కశ్యపుఁడు. అతఁ డెన్నఁడును మేరువును విషువక యందే యుండి, ఆరోగాదులకు తన దివ్యజ్యోతిస్సు నందించుచు నిరంతరము జగమంతయు నిరీక్షించుచున్నాఁడు. ఈ కశ్యపుని యీ విధికి సోమనామకమైన పరమేశ్వరసంకల్పప్రభావము మూలకారణము. ఇందు కీ శ్రుతి ప్రమాణము.

> " తే అస్మై సర్వే కశ్యపా జ్జ్యోతి ర్లభంతే,
> తాన్ త్సోమః కశ్యపా దధి నిర్ధమతి. "

దీనినిబట్టి సృష్టిస్థితిలయకారుఁడైన యీశ్వరుని సంకల్పమున జగత్ప్రవృత్తి నివృత్తులను జరుపుచున్న సూర్యుఁ డతనికంటె వేఱు కాఁడు కావున, సూర్యునికి సర్వాత్మత్వము సిద్ధమని వారి పరమసిద్ధాంతము. ఆ తత్త్వజ్ఞులు వివిధప్రమాణములనుబట్టి పరిశోధించి చరాచరభూతజాతము ననుగ్రహించునది సూర్యరశ్మి యని నిరూపించిన విధమం దిది యేకాంశమైన కాలస్వరూపము.

ఒక బీజ మంకురించుట, మొదలేర్పడుట, పెరిగి పెద్దదై పూచి కాచి ఫలించుట— ఇత్యాద్యవస్థలకు పట్టునట్టి వ్యవధులు కాలవిశేషములని నిర్ణయించి, ఆకాలము నిమేషముహూర్తదినపక్షమాససంవత్సరాది విభాగాత్మకమని గణించి, ఆ సంవత్సరములను శతము, సహస్రము అయుతము ఇత్యాదిగా పరార్ధమువఱకు లెక్కించి, తుద కీ కాలము ద్విపరార్ధ మని సిద్ధాంతీకరించియున్నారు. ఇదంతా లౌకికవ్యవహారమున కేర్పఱచుకొన్న కాలపరిమాణము. ఇది యనుభవసిద్ధమైనను, అపరిమేయమైన కాలము పరిమాణసాధ్యము కాదనుటయే నిజము

లౌకికమైన సంవత్సరాత్మకకాలముకంటె, నధికమును, దానికి మూలమును, నిత్యమును, నిరవయవమునైన కాలము పారమార్థికము.

అదే 'అధిసత్త్వ' మనఁబడు కాలము. పరమాత్మరూపమైన యీ యధిసత్త్వమే 'కాలకాల' మని 'జ్ఞః కాలకాలః' అను శ్రుతి వక్కాణించుచున్నది. దీనినిబట్టి సర్వజ్ఞము, చైతన్యాత్మకమునైన కాలకాలము పరమాత్మరూప మని విశద మగుచున్నది. అది జ్ఞానదృష్టికి తప్ప వేఱుగా గోచరింపరానిది, ఇంతయని గణింపరానిది, ఇట్టిదని నిరూపించరానిది.

కాలకాలము సకలజగదధిష్ఠానము; సర్వాంతర్యామి. మహాభూతప్రేరకము, సర్వజగత్పరిపూర్ణము, సర్వప్రపంచవినాశకము. అదే పరమేశ్వరుఁ డన్న భావ మేనాఁడో విజ్ఞాతలు వెలయింపఁ జేసిరి. ఆ భావముతోనే కాలనాథుఁడు, కాలప్రియానాథుఁడు, మహాకాలుఁడు, కాలేశ్వరుఁడు మొదలగు సంజ్ఞలతో భరతఖండము నలుగడల నీశ్వరు నారాధించుచున్నారు. ఎంతటి లౌకికప్రజ్ఞాధురీణులైనను దానిని కనుగొనలేరు. అతిక్రమింపలేరు, అడ్డగింపలేరు. అది త్రికాలాబాధ్యము. అనఁగా లౌకికవ్యవహారములోని భూతభవిష్యద్వర్తమానములు దాని దరి చేర వనుట. లోకములోని సకల పదార్థ ప్రవృత్తినివృత్తులు దాని యధీనములు. "కాలస్సర్వస్య కారణ" మ్మను సూక్తిభావ మదే. వాడుకలో దైవము దైవ మనఁబడున దదే దాని శక్తి యజ్ఞేయము; దాని తంత్ర మత్యద్భుతము, అప్రతిహతము. సృష్టితో లయమును, లయముతో సృష్టిని జోడించు దాని లీల మానవబుద్ధి కతీతము. ప్రపంచప్రవృత్తి సాగుటకును, మాఱుటకును, తాఱుమాఱు అగుటకును హేతుభూతమైన పంచమహాభూతములు తదధీనములై యుండ చిద్రూపమైన దాని లీల కడ్డమేమి? మహాయోగుల జ్ఞాననేత్రముగాక దానిని చూడఁగలిగినది వేఱేమి? కాలకాలము పరమేశ్వరాత్మకము. పరమేశ్వరుఁడు కాలకాలాత్ముఁడు. లౌకికమైన కాలమునకు మూలము కాలకాలము.

# వైదిక సౌరవిజ్ఞానము

ధ్యాయామి జ్ఞాననేత్రైక
గోచరం సన్మయం మహః,
అనేకకోటి బ్రహ్మాండ
భాండాంతర్గోళ భాసకమ్.

వేద శాస్త్రములలోని వివిధములైన సూర్యవర్ణనములలో కొన్నిటిని చరిత్రదృష్టితో నారచియించిన 'సంస్కృత వాఙ్మయచరిత్రము' రెండు సంపుటములలో ఆయా సందర్భములం దుదాహరించి యున్నాను. ఇపుడు వేదద్రష్టలును, శాస్త్ర కర్తలును కావించిన యా బహువిధవర్ణనములలోని సారాంశమును తత్తన్మంత్రశాస్త్ర వాక్య పరిశోధనపూర్వకముగా 'వైదిక సౌరవిజ్ఞాన' మనుపేర నావిష్కరింపఁబూని దాని కుపోద్ఘాతముగా నీ వ్యాస మారంభించితిని.

మహర్షి దృష్టములైన వేదములతోనే ఖగోళవిజ్ఞానము భరత వర్షమునం దంకురించి క్రమక్రమముగా చక్రనళికా ఘటికాది యంత్ర సాధనములతో జ్యోతిర్వేత్తలు చేయుచువచ్చిన పరిశోధనదోహదముల శాఖోపశాఖలుగా పెరిగి భాస్కరాచార్యులనాఁటికి పెద్ద వృక్షమైనది. కావున సర్వ ప్రపంచ వాఙ్మయములకు మొట్టమొదటి గ్రంథము ఋగాదివేద మైనట్లే ఖగోళ పరిశోధనమునకును. తద్విజ్ఞానమునకును మొట్టమొదటి యాధారము వేదమే యనుట స్పష్టము. అందలి సూర్యమండల పరిశోధనమును ముందు తెలియుదము.

వేదములలోని సూర్యవర్ణన లన్నియు నొకనాఁటివి కావు. ఒక చోట లేవు. ఒక్కొకమహర్షి యొక్కొక సమయమున స్వానుభవమునుబట్టి యొక్కొక యుద్దేశముతో గానముచేసిన యా మంత్రములు వివిధ ప్రయోజనములు. అయినను వాటి కన్నిటికిని సమన్వయము

సులభమే. వేదము కర్మోపయోగి యను మతమున నట్టివాని కర్వా చీన భాష్యకర్తలు స్తుతిప్రార్థనాదిపరముగా నర్థములు వ్రాసినను వాటి వాస్తవార్థమునుగూడ వారు స్మరింపకపోలేదు. జ్యోతిర్విషయ జిజ్ఞాసువులు పరిశోధనసమయముల వాటి భావము గ్రహింపకపోలేదు. ఇందు కొక దృష్టాంతము.

కాలపరిమాణకారణము, పృథివ్యంతరిక్షద్యులోక ప్రకాశకము, సకల జంతు జీవనాధారము నై సర్వమానవసాధారణముగా ఖగోళ మున ప్రత్యక్షమగుచున్న దివ్యతేజః పుంజ మగు సూర్యుఁ డొకఁడే యనుట సర్వసాధారణము. ఖగోళపరిశోధకులు సూర్యమండలము లనేకము లున్నవని లెక్కవేసి చూపి చెప్పినమాట విశ్వసించినను, అవి యప్రత్యక్షము లగుటచే గ్రహగణనసమయమం దొక్క సూర్యునే గణింతురు. అట్లే ఋగ్వేదములోని కొన్ని మంత్రములు సూర్యనానాత్వమును సూచించుచున్నను, పెక్కు మంత్రము లేక సూర్యునే బోధించుచున్నవి. అంతమాత్రమున నీ మంత్రద్రష్టలు సూర్యబహుత్వ మంగీకరించినవారు కారని భావింపరాదు.

"ఉద్వేతి సుభగో విశ్వచక్షాః సాధారణః సూర్యో మానుషా ణామ్" ఇత్యాదిగా వసిష్ఠమహర్షి దివ్యతేజశ్శాలియు, సర్వమానవ సాధారణుఁడును, సకలలోకద్రష్టయు నైన సూర్యుఁడు పైకివచ్చు చున్నాఁడని ప్రత్యక్షసూర్యు నొక్కని వర్ణించినను, అతఁడు బహు సూర్యసంప్రదాయ మెఱుఁగనివాఁడు కాఁడు. ప్రాచీనపరిశోధనలు కొన్ని కాలగర్భమున నణఁగిపోవుటయు, అర్వాచీనబుద్ధిమంతులు మరల వానిని లేవనెత్తుటయు తొలుతటినుండి వచ్చుచున్నదే. "సచాగమో మహతా కాలేన నష్టః" – ఆ శాస్త్ర సంప్రదాయము చాలకాలముక్రిందటనే పోయిన దనుచు వచ్చిన యార్యభటభాస్క రాదుల వాక్యములే యిందుకు ప్రమాణము. ఆ భావము దీర్ఘతమో మహర్షి మాటలఁగూడ నించుక గోచరించుచున్నది. అతనినాఁటికి

"ఇంద్ర మిత్ర వరుణాగ్ని సువర్ణ యమ మాతరిశ్వు లనువారు వేఱు వేఱు సూర్యు లనెడి ప్రతీతి యున్నను, ఆ యాగమ మడుగంటుటచేఁ గాఁబోలు, పైని పేర్కొనఁబడినవారు వేఱు పేళ్ళతో విభిన్న ప్రయోజనము లొనర్చు సూర్యుని రూపాంతరము లనెడి భావము నీ క్రింది ఋక్కున సూచించియున్నాఁడు :

> "ఇంద్రం మిత్రం వరుణ మగ్ని మాహు
> రథో దివ్య స్ససుపర్ణో గరుత్మాన్,
> ఏకం స ద్విప్రా బహుధా వదం
> త్యగ్నిం యమం మాతరిశ్వాన మాహుః"

సూర్యబహుత్వము స్మరించియు మేధావు లొక్క సూర్యునే బహుధా చెప్పుచున్నా రనుచు సూర్యుని బహురూపత్వ మావిష్కరించిన యీ మంత్రమున కర్థము వ్రాయుచు, భాష్యకర్తలు "పర బ్రహ్మ స్వరూపుఁడైన సూర్యునికి సర్వాత్మకత్వము సముచితమే" యను భావము తెలిపిరి. ఈ విధముగా సూచితమైన బహుసూర్య సంప్రదాయమును కంఠోక్తిగా స్థిరపఱిచిన మహర్షుల మాట లింకఁ జూతము.

తైత్తిరీయారణ్యక ప్రథమ ప్రశ్నములోని సప్తమానువాక మంతయు బహుసూర్యప్రతిపాదకము. దాని నంత నిందు చూపక దాని భావ మావిష్కరించుచున్నాను. ఆరోగుఁడు, భ్రాజుఁడు, పటరుఁడు, పతంగుఁడు, స్వర్ణరుఁడు జ్యోతిషీమంతుఁడు, విభాసుఁడు ననెడి యేడుగురు సూర్యులును గగనతల మంతటిని ప్రకాశింపఁ జేయుచున్నారు. కశ్యపుఁ డనెడి యెనిమిదవ సూర్యుఁ డెపుడును మేరువును (ఉత్తరధ్రువమును) విడువక దానినే సర్వదా ప్రకాశింపఁ జేయుచుండును. అతని జగత్ప్రకాశకలక్షణమైన చిత్రకర్మ మహాశక్తి సంపన్నము, సంపూర్ణము, వివిధరశ్మిజాల సమేతము. కమ్మరవాఁడు

తిత్తి నొక్కి దానివల్లఁ బుట్టిన గాలిచే కొలిమిలో నున్న లోహము లెఱ్ఱగా కాలునట్లు చేసి వాటిని నిర్మలము గావించి ప్రకాశింపఁ జేయునట్లే, సోముఁ డను దేవుఁ డారోగాదులైన యేడ్వురు సూర్యులను కశ్యపసన్నిధికిఁ జేర్చి యతని యనుగ్రహమున వారిని విశేష దీప్తియుక్తులనుగాఁ జేయుచున్నాఁడు. (ఇక్కడ సోమశబ్దము ప్రకరణమును బట్టియు, దృష్టాంతమునుబట్టియు విశేషార్థవాచకముగాఁ గనఁబడుచున్నది. కాని, సాయణులు దానిని విశదీకరించలేదు. పరిశోధకు లాయర్థమును స్పష్టీకరింతురుగాక).

"ఆరోగాదిసప్తసూర్యులను మేము చూచినాముకాని మహామేరువు చెంతకు వెళ్లలేకపోవుటచే కశ్యపసూర్యునిమాత్రము చూడలేకపోయినాము" అని పంచకర్ణసప్తకర్ణమహర్షులు పలుకఁగా, ప్రాణత్రాత మహర్షి "మహామేరు గతుఁడైన యాకశ్యపసూర్యుని నేను కన్నులార గాంచితిని. మీరు మేరువు చెంతకుఁ బోవచ్చును. అతనిఁ జూడవచ్చును ఆరోగుఁ డను సూర్యుఁడు మన కన్నులకు గోచరించుచున్నవాఁడేకదా! ఇంక భ్రాజ పటర పతంగు లను సూర్యులు ముగ్గురును మేరుమార్గమునకు క్రిందనుండి అధోముఖమైన తమ రశ్మిజాలముచే క్రిందనున్న సర్వప్రాణిజాతమును ప్రకాశింపఁజేయుచున్నారు. తక్కిన స్వర్ణరజ్యోతిషీమద్విభాసులు ముప్పురును మేరుమార్గమునకు పైభాగమున నుండి యూర్ధ్వముఖమైన తమ రశ్మిజాలమున నూర్ధ్వలోకమును ప్రకాశింపఁజేయుచున్నారు. అందుచే వారికిని వీరికిని మధ్య నున్న మార్గ మధిక తాపబాధ లేకుండ నుండును. ఆ మార్గమున మీరు పొండు." అని మేరుమార్గ ముపదేశించెను. మఱియును—

తూర్పుదిక్కున నొక సూర్యుఁ డున్నాఁడనుట సర్వప్రాణిప్రసిద్ధము తక్కిన యాగ్నేయాది దిక్కులఁగూడ సూర్యులు కలరనుట శాఖాంతరప్రసిద్ధము. అందు కా యాదిక్కుల వసంతాది ఋతుధర్మములు సక్రమముగాఁ గలుగుచుండుటయే నిదర్శనము. ఈ ప్రకారముగా

పరిశీలించినచో సూర్యులు సహస్రమువఱకు నుందురని వైశంపాయన మహర్షి వక్కాణించి యున్నాఁడు. ఇక్కడ సహస్రశబ్దముపలక్షణము అనఁగా అనంతసూర్యు లున్నా రనుటకు బదులుగా చెప్పఁబడినది. ఇట్లే ద్యులోకములు. భూమండలములును అసంఖ్యాకములుగా నున్న వని గోచరించుచుండ సూర్యులు గణనాతీతముగా నున్నా రనుట కాశ్చర్యమేమి? అయితే మొదట సూర్యు లెనమండుగురే యని చెప్పుట యెట్లు పొసఁగును? సత్యమే. కాని, యది సవిశేషోక్తి పంచకర్ణ సప్తకర్ణులు సప్తసూర్యులను, ప్రాణత్రాతు డష్టసూర్యులను ప్రత్యక్షముగా చూచినామనుటచే వారి మాట ప్రమాణముగా అష్ట విధసూర్యు లున్నా రనుట తొలుతనిశ్చిత మైనది. వారి యథార్థ వాక్కు ప్రమాణముగా ఆకాశమున నెనమండుగురు సూర్యు లున్నారని మన కంటికి గోచరింపకపోయినను తప్పక విశ్వసింపనగును. దగ్గఱగా నుండుటచే మనకొక్కఁడే కనబడుచున్నాఁడు. తక్కిన యేడు గురు నీసూర్యునికంటెమిక్కిలి దూరముగా నుండుటచే మనకు గోచరించుటలేదు.

జ్ఞాననేత్రముచేతనో, చర్మనేత్రముచేతనో యంత్రసాధనసాహా య్యంబుననో యెనమండుగురు సూర్యులను చూచినామన్న ఋషుల ప్రమాణవచనమును బట్టియు ఋతులింగాదులనుబట్టియు సూర్యమండ లము లసంఖ్యాకముగానున్న వని విశదీకరించెడి యీప్రసంగముకంటె బహుసూర్యత్వనిరూపణమునకు వేఱేమి కావలెను? ఇది నేఁటి మాట కాదు. నాలుగువేల సంవత్సరముల క్రిందటి మాట. వేదవాక్కు.

# ఏనమండుగురు సూర్యులు

వేదాధిష్ఠానము, కర్మసాక్షి, జగచ్చక్షువు, ప్రత్యక్షదైవతము నని వేదములు విశదీకరించిన సూర్యదేవుని స్వరూపస్వభావములను, మహిమను సంగ్రహముగా నిందు కనుఁగొందము.

పరమేశ్వరుని యిచ్ఛామాత్రమును, జంగమస్థావరాత్మకము నైన యీ ప్రపంచము నుదయస్థితిలయములకు ప్రధానసాధనము సూర్యుఁడన్న పరమార్థము నేనాఁడో వేదము విదితము కావించినది. అట్టి సూర్యుఁ డిపుడు సర్వసాధారణముగా కనిపించుచున్న యొక్కఁడే కాఁడు. సూర్యు లసంఖ్యాకముగా నున్నారు. సూర్యులే కాదు, ద్యులోకము లనంతములు, భూమండలములు వేలకొలఁది అనియు వేదములు సృష్టితత్త్వము నావిష్కరించినవి.

"సప్తదిశో నానాసూర్యాః.

"ఏతస్మై వావృతా౽౽సహస్రసూర్యతాయా ఇతి వైశంపాయనః.

"యద్ద్యావ ఇంద్ర తే శతగ్ శతం భూమీః ఉతస్యుః.

"న త్వా వజ్రిన్ త్సహస్రగ్ సూర్యాః"

ఇత్యాది వాక్యముల యర్థము వివరించు భాష్యకర్తలు వేద ప్రతిపాదితమైన బహుసూర్యత్వమును సోపపత్తికముగా స్పష్టీకరించి యున్నారు. కావున సూర్యమండలము లనంతము లనెడి సత్యవిషయ మతిప్రాచీనమహర్షులైన వేదద్రష్టల దివ్యజ్ఞాననేత్రమునకు గోచరించినదే కాని నేఁడు మనవారు క్రొత్తగా కనుఁగొన్నది కాదని ముందు విశ్వసింతము.

సనాతనమహర్షులు ఖగోళ పరిశోధనమున కేవేని యితరసాధనము లుపయోగించినారేమో చెప్పజాలము. కాని వారికి వారి దివ్య

జ్ఞానమే పరమసాధనమై యుండునని మన మిపుడు భావింతము. ఆ పరిశోధన మప్రతిహతము, సర్వతోముఖము, సర్వంకషము, యథావస్తు సందర్శనచణము. కావుననే వారిమాటలు తిరుగులేని సిద్ధాంతములై యర్వాచీనమహర్షుల జగత్తత్త్వపరిశీలనమున కవలంబనములైనవి; వేదమే ప్రమాణమన్న విశ్వజనీన విశ్వాసమును స్థాపించినవి.

వేదము పెక్కండ్రు సూర్యు లున్నారని నిర్దేశించి యం దేనమండ్రు గురిని పేర్కొన్నది. ఆరోగుడు, భ్రాజుడు, పటరుడు, పతంగుడు, స్వర్ణరుడు, జ్యోతిష్మంతుడు, విభాసుడు, కశ్యపుడు ననునవి వారి పేళ్లు. వారిలో కశ్యపుడు ప్రధానుడగ్రిముడు. అతడు జగదుత్పత్తి హేతుభూతమైన పరమేశ్వరుని తేజోఽంశము. సోమనామకమైన యీశ్వరుని సంకల్పప్రభావవిశేష మాకశ్యపుని జగత్ప్రకాశనసమర్థమైన తేజస్సునకు ప్రేరకము. స్వర్ణకారుడు కొలిమితిత్తి నూది నిప్పు మండించి దానిచే సువర్ణమును నిర్మలినముగావించి ప్రకాశింపజేయునట్లు సోముడు కశ్యపసూర్యుని తేజస్సును ప్రజ్వలింపజేసి తత్ప్రేషణముచే ఆరోగాది సప్తసూర్యులను ప్రకాశింపజేయుచున్నాడు. కావున తక్కిన సూర్యుల నిరంతర దీప్తికిని తన్మూలకమైన జగత్ప్రకాశమునకును పరమాధారమైనట్లు గోచరించువాడు కశ్యపసూర్యుడని విదితమగును. అతడే పరమాత్మాధిష్ఠాన మని వేదము.

"కశ్యపా దుదితా స్సూర్యాః
తే అస్మిన్ సర్వే కశ్యపా జ్జ్యోతి ర్లభంతే"

ఇత్యాది శ్రుతివాక్యముల భావమునుబట్టి యీశ్వరప్రేరణమున కశ్యపుడు తన తేజఃకణములను ఖగోళమునలుగడల విరియజిమ్మి వాటి నందందు నిలిపి తేజోమండలాకృతుల నిచ్చి యామండలము ననవరత ప్రకాశింపజేయుచున్నాడనియు, వేదోక్త బహువిధ సూర్యులకు ప్రత్యక్షాధార మతడనియు, అతడు పరమేశ్వర సంకల్ప

మున సృష్ట్యాదిని సృష్టిసాధనముగా వెలసినవాఁడనియు తెలియు చున్నది.

కశ్యపనామక సూర్యుని శిల్ప మతివిచిత్రము, అనిర్వాచనీయ మహిమాన్వితము, సర్వేంద్రియ సామర్థ్య సంపన్నము, సకలప్రభావ సంపూర్ణము. మఱియు——

" పృథి వ్యన్తరిక్షం ద్యౌర్దిశోఽవాంతరదిశః
అగ్ని ర్వాయు రాదిత్య శ్చంద్రమా నక్షత్రాణి
ఆప ఓషధ యో వనస్పతయ ఆకాశ ఆత్మా "

ఇత్యాది తైత్తిరీయవాక్య ప్రతిపాదితమైన పృథివ్యాదిలోకపాంక్త మును, అగ్న్యాదిదేవతా పాంక్తమును అబాదిభూత పాంక్తమును ఆవిర్భవింప హేతుభూతమైన సర్వేశ్వరుని దివ్యసాధనము. ఇంద్ర మిత్రాగ్ని యమవరుణాది దేవతానామ రూపముల బహువిధజగ త్కార్యములు నిర్వహించు సర్వదేవతా స్వరూపుఁడు, సకలభువన వ్యాపనశీల తేజోనిలయుఁడు, బ్రహ్మాండగోళ ద్రష్ట సంవిద్రూపుఁడు. అట్టి కశ్యపసూర్యుఁడు సర్వకాలసర్వావస్థలయందును మేరువు నాశ్ర యించి కదలకయుండును ఉత్తరధ్రువమునకు మేరువని నామాంత రము. అనఁగా, ఆ మేరువునకు సరిగా నెత్తిమీఁద నున్న గగనభాగ మున నతఁడు నిశ్చలుఁడై వెలుఁగుచుండునని " స మహామేరుం న జహాతి " అను మంత్రము తెల్పుచున్నది.

కశ్యపానుగ్రహమున రోదసీకుహరమున నందందు నిలిచియున్న యసంఖ్యాకసూర్యులలో, అందును మున్ను పేర్కొన్న సప్తసూర్యు లలో, భూభ్రమణమునుబట్టి నిత్య ముదయించి యస్తమించుచున్నట్లు సర్వమానవసాధారణముగా కనవచ్చుచున్న సూర్యుఁ డారోగనామ కుఁడు. ఇత, డీభూమండలమునకు సన్నిహితుఁడగుటచే జనసామాన్యము నకు గోచరించుచున్నాఁడనియు, ఇతరసూర్యులు మిక్కిలి దూరమం దుండుటచే నట్లు కనరాకున్నారనియు సప్తసూర్యులను సందర్శించిన

మహర్షులు వచించియున్నారు. వారి మాటలనుబట్టి భ్రాజపటరపతంగులను మువ్వురును మేరుమార్గమున కధోభాగమందును, స్వర్ణరజ్యోతిమ్మద్విభాసులు ముగ్గురును మేరుమార్గమున కూర్ధ్వభాగమునందు నందందు కదలకయుండి ప్రకాశించుచున్నారని తెలియుచున్నది. ఆ చూచినవారు పంచకర్ణ సప్తకర్ణ మహర్షులు. వారు కశ్యపసూర్యుని మేము చూడలేదన్నపుడు ప్రాణత్రాతమహర్షి "నేనాకశ్యపుని జూచితి" నని చెప్పి వారికి మేరుమార్గముపదేశించినట్లును తైత్తిరీయారణ్యకము చెప్పుచున్నది.

ఇట్లష్ట సూర్యులు కనవచ్చిరనుట యతిశయోక్తి యనువా రుండబోరుగాని, ద్యులోకభూలోకములు లెక్కకు మిక్కిలిగా నున్న వన్న మాటలనుబట్టి కనవచ్చుచున్న యారోగసూర్యుడుగాక తక్కినవారితరరోదసీకుహరముల నున్న వారేమో యని కొందఱు సంశయింపక పోరు. అగోచరమైన విషయమున నట్టి సందేహము కలుగుట సహజమే కాని ఆ యాఖ్యానములోని తరువాతి కథనమునుబట్టి పూర్వోక్త సూర్యు లీరోదసికి చెందినవారే యని విదితమగుచున్నది. పూర్వ మహర్షులు ఖగోళమును పరిశోధించి యా యా సూర్యుల యునికిని కనిపెట్టిరనియు నవగత మగుచున్నది. ఆకాశమున వెలుఁగుచున్న నక్షత్రములలో నెన్ని సూర్యమండలములో, వాటిలో ఋషులు పేర్కొన్న భ్రాజాదిసూర్యమండలము లేవో పరిశోధింపఁగలిగినచో సత్యము తెల్లముకాకపోదు. ఇపుడు పాశ్చాత్యులుకొందఱు నక్షత్రములను పరిశోధించి యందనేకములు సూర్యమండలము లనుట వినుచున్నాముగదా! నిన్నగాక మొన్న "అమెరికా పరిశోధకుఁడొకఁడు భూమికి డెబ్బదికోట్ల మైళ్లదూరమున నొక నక్షత్ర మిపుడు కనవచ్చినదని చెప్పిన మాట ప్రసిద్ధముగదా! ఇఁక మన పూర్వమహర్షులు కనిపెట్టి పేర్కొన్న సూర్యమండలములనుగూర్చి సంశయింపనేల? వేదప్రతిపాదితమైన వారి ఖగోళవిజ్ఞాన మమోఘము, సుస్థిరము ననుట

విశ్వాసనీయము. ఇంతకుమున్ను పేర్కొన్న సూర్యు లెనమండుగురు నీకోదనీకుమారములోనివారే యనుటయు విశ్వాస్యము. ప్రాణత్రాత మహర్షి కశ్యపసూర్యసందర్శనాభిలాషులైన ఋషులకు చేసిన యుపదేశ మిది: భ్రాజాది సూర్యులు ముగ్గురును మేరుమార్గము నకు క్రిందిభాగమునం దధోముఖులై ప్రకాశించుచుందురు. అందుచే వారి కిరణముల వేఁడిమి పైకి సోఁకదు. స్వర్ణరాదులు మువ్వురు నా మార్గమునకు పైభాగమునం దూర్ధ్వముఖులై వెలుఁగు చుందురు. అందుచే వారి కిరణముల వేఁడిమి క్రిందికి రాదు. కావున తన్మధ్య మార్గము చల్లగానుండును. ఆ మార్గమున వెళ్ళి యెన్నఁడును మేరువును విడువని కశ్యపసూర్యుని మీరు చూడవచ్చును. ఆవాక్యములివి:

"అపశ్య మహ మేత త్సూర్యమండలం పరివర్తమానమ్,
గార్గ్యః ప్రాణత్రాతః గచ్ఛన్త మహామేరుమ్,
ఏకం చాజహాతిమ్.

భ్రాజపటరపతంగా నిహానే తిష్ఠ న్నాతపంతి,
తస్మా దిహ తప్తిత్రతపాః, అముత్రేతే తరే,
తస్మా దిహాతప్తిత్రి తపాః"

దీనినిబట్టి యానాఁటి ఖగోళవిజ్ఞాతల పరిశోధన పరిశీలనవిజ్ఞానము తెలియకపోదు. ఉత్తరధ్రువ ప్రాంతదేశమం దార్యులు నివసించిన కాలమందే యీ యష్టసూర్యుల యునికి వారు కనిపెట్టి యున్నా రనుట నిజము. అది సుమారెనిమిదివేల సంవత్సరముల క్రిందటిమాట. అష్టసూర్య వివేకము రమారమి నాలుగువేల సంవత్సరములక్రిందట గ్రంథస్థమైనది. ప్రాచీనఋషి పరంపరాగతమైన సూర్యవృత్తాంతము విన్న ప్రాణత్రాతుఁ డుత్తరధ్రువమునకు వెళ్ళి సూర్యమండల పరి శోధనము కావించి వచ్చినవాఁడనుటకు పైవాక్యములే ప్రమాణము. మహామేరువుచెంతకు వెళ్ళకుండఁగానే పంచకర్ణాది ఋషులు సప్త

సూర్యులను చూచిరనుటకు "అపశ్య మహా మేతాన్ త్సప్త సూర్యానితి" ఇత్యాది వాక్యములు ప్రమాణము. కాని వారి సూర్య సందర్శన విధానము మాత్రము గ్రంథస్థము కాలేదు. అది యోగ దృష్టిమూలకమే యైనచో ఆర్యావర్తమందుండి సప్తసూర్యుల నట్లు సందర్శించినవారు మహామేరుగత కశ్యపసూర్యునిమాత్ర మెందుకు చూడలేరు? కావున మహాప్రతిభాశాలురైన యీ ఋషు లపూర్వము లైన ఖగోళపరిశోధనసాధనము లుపయోగించి యుందురని యూహింప వలసి యున్నది. ఆసాధనములు, ఆశక్తియు పిదప మఱుఁగుపడి పోయినంతమాత్రమున గ్రంథస్థమైన పై యష్టసూర్యవిషయము కేవలము కల్పితమనిమాత్రము కలలోనైన స్మరింపరాదు. నిష్కాములైన యీ మహర్షులు లోకప్రతారకులా? బహువిధోపాయముల నేఁడు ఖగోళము పరిశోధించుచున్న బుద్ధిమంతులు భ్రాజాదిసూర్యులని పూర్వులు పేర్కొన్న సూర్యమండలము లివే యని కనిపెట్టి చెప్పఁగలిగినచో వైదికర్షుల మాట లప్రమాణములు కావని మన వారు భావింతురుగదా! దైవవశమున నట్టిమాట పుట్టుఁగాక.

# ధర్మతత్త్వము

ధర్మ మను మాట తఱచుగా వాడుకలో వినిపించును. దీనియర్థ మిచ్చు శబ్దము లన్ని భాషలలోను కలవు. మన వేదశాస్త్రములే కాదు. ఇతర జాతుల మతగ్రంథములును దీనిని ప్రశంసించియున్నవి. నాగరిక జాతులందే కాదు, అనాగరికజాతులందు నిది గోచరించును. మానవులందే కాదు. పశుపక్ష్యాదులందు నిది కనిపించును. విశ్వ మును నడుపునది, విశ్వమును నిలుపునది ధర్మమని దీని స్వరూపస్వభా వములను పూజ్యులగు ప్రాచీన మహర్షు లావిష్కరించియున్నారు. ఇది జాత్యేకవచనము. ధర్మము లసంఖ్యేయములు.

తినుట నిద్రించుట కాంక్షించుట భయపడుట మొదలయినవి మనుష్యులకును పశుపక్ష్యాదులకును సమానములు సహజములు. తిర్యక్కులకంటె నరులకు జ్ఞాన మను నది హెచ్చు. ఇట్లగుటచే మృగా దులకు తెలివియే లేదనుకోరాదు. వాటికి తగిన తెలివి వాటికి కలదు. కాని, అది పెరుగదు. మానవులు తమ తెలివిని పెంచఁగలరు. ఋజుమార్గమున నడపఁగలరు. పెడదారికి త్రిప్పఁగలరు. వాటి కాశక్తి లేదు. కాని, వాటిలోకూడా ఒక విశేషము కనిపించును. మనుజులు సులభముగా స్వధర్మము పరిత్యజించి పరధర్మ మాచ రించునట్లు పశ్వాదు లాచరింపలేవు. కేవల శాకాహార జాతిని పుట్టినవాడు స్వేచ్ఛగా మాంసము తిన మరుగును గాని, తృణపర్ణ భక్షకము లగు గో మహిష హరిణాదు లెంత నిర్బంధించినా మాంసము తినవు — "అట్లు తినకుండుటకూడా సహజమే. అందు తెలివి యే మున్న" దనరాదు. పసికట్టి యిది తినదగిన వస్తువు కా దని విడుడుటయే తెలివి. అది మనుష్యులు మచ్చికచేసి నేర్పినపనులు చేయుటలో నిసుమంత పెరిగినట్లు కనబడును. నేర్పినట్లు చిలుకలు పలుకుటయు పావురములు లేఖ లందించుటయు తననోటిలో పెట్టిన

పోషకుని మెడ పెద్దపులి కొఱికకుండుటయు మావటీనిమాట విని యేనుగు వంగుటయు గంగిరెద్దుతల యూడించుటయు మొదలయిన ఖగమృగములచేష్ట లిందుకు నిదర్శనము. అది యభ్యాసమని త్రోసి వేయరాదు. దానికి కూడా తెలివి యొకింత కావలెను. కాని, అది యంతగా గణింప దగినది కాదు. కావున వాటికంటె నరునికి జ్ఞానము హెచ్చనుట సముచితమే, యుక్తాయుక్తవివేకరూప మైనయది ధర్మ వర్తనమున కావశ్యక మనుటయు యుక్తమే.

ధర్మము ధర్మత్వమును నేకాకారమే కాని, తత్ప్రవర్తనమును, తదాచరణవిధానమును సృష్ట్యాదినుండియు బహువిధములఁ బ్రసరించుచు, పెక్కురీతుల మాఱుచు వచ్చుచున్నదని ప్రపంచానుభవమును బట్టి తెలియుచునేయున్నది.

బ్రాహ్మణాది వర్ణ భేదము సృష్ట్యాదినుండి యున్న దని యార్య మతము, 'చాతుర్వర్ణ్యం మయాసృష్టం' అను భగవద్గీతా వచనము, "బ్రాహ్మణోఽస్య ముఖమాసీ" దిత్యాది శ్రుత్యనుగతమే. కాని, అది నడుమ గల్పింపబడిన దని యితర మతములు. భగవంతుఁడే యేర్పరచిననో భరతఖండమందున్న యిది యితర ఖండముల కెందు కుండదు? అతనికి పక్షపాతమా? ఇది వేదశాస్త్రకర్తలు కల్పించి నది గాని వేఱు కాదని గొందరు విమర్శకులు. ఆపేళ్లు లేకపోవచ్చును గాని, సత్వరజస్తమోగుణ కర్మ విభాగమును బట్టి వచ్చిన యా భేద మన్ని ఖండములందు నున్నదే యని తత్త్వజ్ఞులు. దీని కింత చర్చయేల? ఖండాంతర వాసులలో బ్రాహ్మణాది వర్ణసంజ్ఞలు లేవు గాని; ఆ గుణ కర్మలు లేకపోయినవా? చాతుర్వర్ణ్యము మానుష లోక విహిత మని శాస్త్రమే చెప్పినది. కావున వర్ణసంజ్ఞలు లేక పోయినా గుణకర్మ విభాగముతోడి భేదము భూమండలమంతయు కల దనుట వాస్తవము. ఖండాంతరములందలి యొక్కొక్క జాతిలోను హెచ్చుతగ్గు లున్న వనుట విదితము కదా! అయితే యొకటి,

ఆభేద మిచ్చట వేళ్లు పాఱినది. అచ్చట నిలకడలేక మాఱుచున్నది. ఇంతే తేడా. ఇందుకూడా, అట్టిమార్పు తలచూపుకాల మాసన్నము కానున్నది. అపుడీ విచారమే యుండదు. కాని, ఒక విశేషము:—

అయితే, ఈశ్వరానుగ్రహాలబ్ధమైన వేదము విధించిన ధర్మములు భరతఖండమందే కాక యితరఖండములం దెందుకు వ్యాపించలేదు? ఇందలి యార్యులేనా యీశ్వర పుత్రులు? వారు మాత్రముకారా? నిజమే కాని, భరతఖండమందు మాత్ర మన్ని జాతులలోను తదుక్తము లయిన యన్ని ధర్మములును వ్యాపించినవా? లేదు. అది యధికారితారతమ్యమునుబట్టి యుండును. ఆయధికారము దేశకాల పాత్రములనుబట్టి యుండును. ధర్మములను విధించిన వేదమే తత్తదధికారులను నిర్ణయించినది. ఆ యధికారము లభించినవా రాయాధర్మము లాచరింప నర్హులగుచుందురు. ఆలభించుట పూర్వజన్మ సంస్కారమునుబట్టి యుండును. ఈరహస్య మెఱుగక వేదోక్తవిధులు సర్వమానవ సామాన్యములు కావని యాగ్రహింపనేల? వేదమును నిందింపనేల? ఇంతకును, ఐహికాముష్మిక సుఖప్రాప్తికి వేదోక్తధర్మాచరణము పరమావధి యని యెవ్వరు నిర్ణయించినారో, ధర్మరహస్యజ్ఞులైన యా పెద్దలే జ్ఞానమును ధర్మచింతయు కలిగి చేసిన యేసత్కర్మమైనను తరణోపాయమే యని చాటి యున్నారు. అర్హత కలవారికైనను యాగాదులైచ్ఛికము లన్నారు.

ఈశ్వరుడు లేడన్నవారును, వేదము ప్రమాణము కాదన్నవారును, నాస్తికు లనబడిరి. భరతఖండమందలి యీరెండు తెగలవారును వేదము చెప్పిన యెల్ల ధర్మములు స్వయముగా నెఱిగినవారు. ఖండాంతరములం దున్నవా రార్యులనుంచి విడిపోయిన పారసీకుల సంబంధము వల్ల క్రమక్రమముగా విన్నవారు. ఇం దసంగత మేమీలేదు. మంత్రములు లేకపోనీ! ఆచరణ విధానము వేఱుపడనీ! పుణ్యపాపములు లేవన్నచార్వాకులతో వీ రందఱును వివాహము మొదలుగా నంత్య

క్రియల దాకా సాంఘికధర్మము లాచరించు చున్నవారే. వీరే యననేల? ఆటవికులు కూడా యాచరించుచున్నా రనుట నిజము. ఈధర్మములను తొలుదొల్త మానవజాతిని ప్రవేశపెట్టిన దేది? వేదము కాదా? ఆచరించనీ! ఆచరింపకపోనీ! సత్యము దయ పరోపకారము దానము అహింస మొదలయినవి పరమ ధర్మములని యెల్ల మానవ జాతులు భావించు చున్నవిగదా! శ్రేయోదాయకములైన వీటిని మొట్టమొదట నుపదేశించిన దేది? వేదము కాదా? అది యుపదేశించిన వ్యక్తి ధర్మములు జాతిధర్మములు ప్రపంచ మంతట వ్యాపించి యుండగా నది ప్రమాణమన్న నేమి కాదన్న నేమి? కావలసిన దదే. కావున నింతకును చెప్పవలసిన దేమనగా, అవి యాచరణలో నుండనీ మాననీ అట్లే యుండనీ తలక్రిందు కానీ! ఏమయినా, మొట్టమొదట ధర్మాధర్మములను మానవజాతికి తెలియజెప్పిన దార్య వేదమనుటయే.

వేదోక్తములైన వివిధ యాగములు మాత్రమే ధర్మములుకావు. ప్రాణులు తమ యభ్యుదయము కోరి చేయు కామ్యకర్మలును నిశ్శ్రేయసము కోరిచేయు నిష్కామకర్మలును భక్తిజ్ఞాన వైరాగ్యములును ఉపనయన వివాహాది గృహ్యకర్మలును శమదమ తేజశ్శౌర్య కృషి గోరక్షణ పరిచర్యాదులగు వర్ణవిహిత కర్మలును రాజనీతి రాజభక్తి ప్రజానురంజనములును ఇంకను వివిధములైన సాంఘిక వ్యవస్థలును ధర్మశబ్ద వాచ్యములే. ఇది ధర్మ మిది యధర్మమని సూచించిన వేదమును దాని ననుగమించి వాటిని విస్పష్టము గావించిన స్మృతి సూత్రాత్మకమైన శాస్త్రమును లోకమునకు ప్రమాణమని పూర్వుల నిర్ణయము,. కాని—,

ఆనిర్ణయ మట్లే యాగలేదు. నాటి ధర్మము నేడధర్మమైనది. నాటి యధర్మము నేడు ధర్మమైనది. ఇతర మానవజాతు లందట్లు తాఱుమారగుట కేమి? ఆర్యజాతియందే తలక్రిందైనది. అహింస పరమధర్మమని చెప్పని మతము లేదు. ఆ సూత్రము ననుసరించిన మత

మంత కంటెనులేదు. హింస కూడదన్న వైదికార్యులు తొలుత హారిణ వృషభమహిషాది మృగములను హింసించి మాంసభక్షణము కావించిన వారే. ఇంక దక్కినవారిని గూర్చి చెప్పనేల? తరువాత గొంత కాలమున కార్యులు రక్షణార్థము జీవహింస తగదని నిషేధించి యాగ పశ్వాలంభము మాత్రము సముచిత మనిరి. పిదప యజ్ఞములందును తగదని వైదిక మతావలంబులగు కొందఱు పశుహింసను నిషేధించి పిష్టపశ్వాలంభ మాచరింప జొచ్చిరి. చూచితిరా! ధర్మనిర్ణయమెట్లు మాఱుచువచ్చినదో!

జైన బౌద్ధమతములు వేదప్రామాణ్యమును నిరసించి యేవిధమైన హింసయైనా పాపభూయిష్టమే యని గొంతెత్తి ఘోషించినవి. ఆమతము లుపదేశించిన యాముష్మికమును గూర్చి విచారించుట కిది యదనుకాదు. కాని, యవి చిరకాలము దేశము నలుగడల నల్లుకొని యలజడి పెట్టి హైందవ సంఘమును నిర్వీర్యము గావించినమాట మాత్రము నిజము. తుద కా మతము లిందు నిలునజాలక దేశాంతరముల పాలయిన నేమి? ఆ వాసన మాత్రము పూర్తిగా వదలలేదు. పోనీ! ఆ మత ధర్మము లితరత్ర మాత్ర మట్లు నిలచినవా? లేదు. బౌద్ధ మతావలంబనములయిన చైనా, జపాను దేశము లహింసా ధర్మమునకు దూరములై హింసా మార్గము తుదముట్టిన వనుట స్పష్టము కదా! ఇక తక్కిన దేశముల మాట చెప్పనేల? ఇపుడు ప్రపంచములో "అహింసా పరమో ధర్మః" అను మాటకు చోటులేదనుట జగద్విదితము. ఇది నిజమైనా, రాజకీయముగా హింసామార్గము త్రొక్కగూడదన్న గాంధీమహాత్ముని శాసనమును భారతీయులు శిరసా వహించుచున్నారు. గాని, టాల్‌స్టాయి వంటి మహనీయులు గావించిన యహింసా వ్రతోపదేశము పాశ్చాత్య ఖండములం దణుమాత్రము ఫలింపలేదనుటకు నిరపరాధులగు స్త్రీ బాల వృద్ధులు కూడా నిరంతరము నికృష్ట మగు మరణము పాలగుచుండుటయే నిదర్శనము. ఇంక సత్యము. —

ఉత్తమోత్తమమైన దీని తత్త్వ మెవరికో కోటి కొక్కరికి గాని యెల్లరికి గోచరించునది కాదు. వ్యవహారములో లేని మాట చెప్ప గూడదన్న దీని యర్థ మొకటి యందఱికిని తెలియును గాని, అది యాచరణలో నామమాత్రావశిష్టమై యున్నది. ధర్మరా జంతటి సత్యవ్రతశీలుడు విరటునితో —

> "ఉన్న రూప పలుకు నన్నరు లెక్కడగలరు ?
> తోచినట్లు పలుకు పలుకనైన చందమయ్యె;
> నిక్కం బేనరునకు జెల్లింపంగానగు ?
> సత్యంబు నడపు క్రమ మట్లుండెన్"

అని పలుకుటం బట్టి యానాడే సందిగ్ధావస్థకు వచ్చిన దీని స్థితి యిప్పు డెట్లు ఉన్న దో వేఱుగా జెప్పనక్కరలేదు. అసత్యమైన జగత్తులో నిప్పు డసత్యమే రాజ్యము చేయుచున్నది. ప్రతి మానవునికి ధన మావశ్యకము. తదార్జనమున కసత్య మొక పరమసాధనము. అధికార మున కసత్యము జీవగఱ్ఱ. అది యిపుడు రాజనీతి లక్షణముగా విజృం భించుచున్నది. న్యాయరక్షణమున కేర్పడిన న్యాయస్థానమందే సత్యము తాఱుమాఱు అగుచుండ నిక దీనికి తా వెక్కడ? దయాశౌచ ములతో నిది యెక్కడనో యణగిపోయినది. దీనిపేరు మాత్రము కోశములలో నిలచియున్నది చూచితిరా? ఐహికాముష్మిక సాధన మని ప్రాచీన మహర్షులు ప్రశంసించిన సత్యధర్మమున కెట్టిగతి పట్టి నదో! విద్య సత్ప్రవర్తనమునకు సాధనమగునన్న మాట యెపుడో పుట్టినదిగాని, అది యిపుడు కలలోని మాట, నూటికి తొంబదిపాళ్లు విద్యావంతులలోనే యధర్మవర్తన మెక్కువగా గోచరించుచున్నది. పరపీడన మధర్మమని యెఱుగని చదువరి లేడు. అయిన నేమి? దాని నొనరింపనివాడును లేడు. ప్రకృతిరంజనమే రాజధర్మ మని తెలుపని రాజనీతి లేదుకాని, దానిని యథోక్తముగా నాచరించు రాజు లేడు.

ఇట్లే ధర్మము దారి వేఱు, గాని నాచరించు దారి వేఱుగా నుత్తమ మానవధర్మము లన్నియు భ్రష్టములైనవని ప్రపంచములోని సకల మానవజాతులకును తెలిసినదే. ఆబాలగోపాలమున కిపుడు స్వార్థచింత తప్ప వేఱొకటి కనరాదు. ఎక్కడ తళుకెక్కువగానున్నదో అధర్మ మక్కడ గడ్డకట్టినదనుట నిజము. ఎల్ల మతగ్రంథములు నిది మంచి యిది చెడ్డ యని బోధించును గాని చెయ్యిపట్టుకొని దానిని చేయింప లేవు. దీనిని మాన్పించలేవు. ఇపుడు వాటిమాట యెవరికి కావలెను? ప్రపంచ మెక్కడికో పరుగెత్తుచున్నది. అది దానికే తెలియదు. దానిని మతధర్మము లాపునా? ధర్మమును తోసి రాజన్నవాడు పైకి వచ్చుచున్నాడు. ధర్మము ధర్మమని మొఱ్ఱపెట్టుచున్నవాడు మూల నణగుచున్నాడు. ఇంక మత మేమిటి? ధర్మ మెక్కడ? నీతులెందుకు? ఎవరిమతము వారిదే, ఎవరిధర్మము వారిదే. ఎవరి లాభము వారిదే. 'సర్వే స్వార్థపరాయణాః' అన్న నీతి వచనము సార్థకమైనది.

సేవ శ్వవృత్తి. అది నీచధర్మములలో మొదటిదని పూర్వులు. ఇపుడది గౌరవపాత్రమై యుత్తమధర్మములలో నగ్రగణ్యమైనది. 'ఉద్యోగినం పురుషసింహ ముపైతి లక్ష్మీః' అన్న నీతి వాక్యములోని యుద్యోగశబ్దమునర్థ మిపుడు సేవాపరమయినది. స్వభాషా స్వవేష ములు మున్ను గౌరవ చిహ్నములు. ఇపుడు పరభాషా పరవేషములు పూజా స్థానములు. వర్ణసాంకర్యము నరక హేతువని పూర్వమతము. ఇపుడదే సంఘశ్రేయమని యాధునిక మతము. వివాహము దంప తుల యావజ్జీవబంధమని నాటి నిర్ణయము. అది యైచ్ఛికము విచ్ఛేద యోగ్యమని నేటివాదము. నాటి గురుజన సత్కారము నేడు ధిక్కా రముగా బరిణమించిది. ఇంక ధర్మము గతి విచారింపనేల? ఎపుడో కలితుద సంభవించుననుకొనుచున్న ధర్మగ్లాని నేడే ప్రత్యక్ష మగు చున్నది. ఇంక ముందు ముందు దీని చర్య యెట్లుండునో? అందుకే 'గత కాలము మేలు వచ్చుకాలము కంటెన్' అన్నారు పెద్దలు. దీని

కంతకును కారణము కాలము. అది దురతిక్రమము. దాని కుటిల గతియే ధర్మగ్లానికి మూలము. పరమేశ్వరుని యిచ్ఛ యెట్లున్నదో! విశ్వమెట్లు నడవ నున్నదో! ధర్మమేమికానున్నదో!! ఇపు డొకటే దారి. అది యిది.

"శ్రుతిశ్చభిన్నా, స్మృతయశ్చ భిన్నాః
మహామునీనాం మతయశ్చ భిన్నాః
ధర్మస్య తత్త్వం నిహితం గుహాయాం
మహాజనో యేన గత స్సపంథాః"

# హిందూ ధర్మశాస్త్ర సంస్కరణ

దేశకాలపాత్రముల స్థితిగతులనుబట్టి సాంఘికధర్మములు కొన్ని మాఱిపోవుచుండుట నైజము. ఆమార్పుల యౌచిత్యానౌచిత్యములు పరిశీలించి, ఇది యుక్తము ఇది యుక్తము కాదనుచు స్మృతికర్తలు విధినిషేధరూపముగా వాటి ననుశాసించుచు వచ్చుటయు కలదు. దేశీయు లందఱి గౌరవమునకు పాత్రులైన యట్టి శాస్త్రకర్తల మాటలే పరమప్రమాణముగా ప్రజలు తమ యాచారవ్యవహారముల యెడ ప్రవర్తించుచు వచ్చుచున్నారనుటయు విదితము. ప్రజలేకాదు, వా రేర్పఱచిన రాజధర్మముల ననుసరించియే కాలక్రమమున దేశ పాలకులును పరిపాలనము గావించుచు వచ్చి రనుటకూడా స్పష్టము. ఈధర్మశాస్త్ర సంప్రదాయమును బట్టి ధర్మవేత్తలును ప్రజాహిత కాములు నయిన యేలోకజ్ఞులు దేశీయుల భక్తివిశ్వాసములకు గుఱి యగుదురో, వారు దేశకాలపాత్రముల తత్త్వ మెఱిగి సంఘము మేలు కోరి ధర్మశాస్త్రము సంస్కరింప నర్హులనియు, ఆసంస్కరణమును దేశపాలకు డనుమతించి రాజ్యవర్తనము కావింపదగుననియు తెలియ వచ్చును.

భరతఖండము కొంతయైన నేమి? అంతాయై తేనేమి? విదేశ ప్రభువుల పరిపాలనకు లోఁబడి సుమారు నాలుగు వందల సంవత్సరము లైనా, నాటినుండియు భారతీయుల వర్ణాశ్రమాచార వ్యవహారము లన్నియు కొంచె మెచ్చుతక్కువగా (శిక్షావిధులు, తప్ప) నాఁటి ధర్మశాస్త్రముల ననుసరించియే జరుగుచున్న వనుట నిజము. మన ధర్మశాస్త్ర మాంగ్లమున కనువదింపఁబడి నపుడు ప్రధానముగా నను వాదకులు గ్రహించినది వ్యవహారకాండమే. మూలానుసరణమైన యానువాదము మూలముగానే భూధనాదులకు సంబంధించిన హక్కులు మొదలగునవి జరుగుచుండఁగా, అపుడపుడందలి కొన్ని

యిబ్బందులు పరిశీలించి కొన్ని మార్పులు సముచితరీతిని కావించుచు వచ్చిరిగాని, మతసంబంధములైన వర్ణాశ్రమాచారమున మార్పులు గావించలేదు. రజో ఽనంతర వివాహము శాసనబద్ధము కావించుట మొదలుగా నవికూడా బయలుదేఱుచున్నవి. అయితే, ఈచేయు చున్న చేయనెంచిన మార్పులు మన సంఘములోని వారును శాసన సభలలో సభ్యులైన వారునగు పెద్దలు తెచ్చిపెట్టుచున్నవిగాని, ప్రభుత్వము తనంతతాను నిర్బంధించి తెచ్చిపెట్టుచున్నవి కావనుట మాత్రము సత్యము.

"ఇపుడు, ఈనాముల హక్కునుగూర్చి చేయఁబోవుచట్టము ప్రజా సామాన్యమునకు తెలియదు. చిత్తుచట్టమును దేశభాషలలోనికి మార్చి ప్రకటించి తగిన వ్యవధి యిచ్చి ప్రజాభిప్రాయము తెలిసి కొనుట యావశ్యక" మని యెందఱో పత్రికలకు వ్రాయుచున్నారు. ఇట్లే మఱికొన్ని మార్పులు ధర్మశాస్త్రమునందు చేయఁబోవు చున్నారు గదా! అట్టి మార్పులు ముందుగా ప్రజలకు తెలుపుట ముఖ్యమని వేఱే చెప్పనక్కఱలేదు. పత్రికలలో నట్టి చట్టముల సంగ్రహరూపము తెలిసినంతమాత్రమున ప్రజలందఱు వాటిని తెలుసు కొని సమ్మతించినా రనుకోరాదు. పెద్దనగరములలోను పట్టణముల లోను జరిగిన కొన్ని సభలలోని తీర్మానములు ప్రజలందఱును సమ్మ తించినవికావు. ఏడులక్షల గ్రామములలోని ప్రజానీకముతో పోల్చి నచో పురములలోని ప్రజాసముదాయ మెంత? వారిలో చదువురాని వారు నూటికి తొంబదిమంది. అట్టివారు విద్యాహీనులైనా చట్టముల వల్ల వచ్చే లాభనష్టము లనుభవింపక తప్పదు గదా! కావున నేచట్టములోని విషయమునైనా సంగ్రహముగా దేశభాషలలోనికి మార్చి యచ్చొత్తించి, ఆపత్రములు ప్రతిగ్రామములోని మునసబు కరణముల కార్యాలయములకు పంపించి వెల్లడి కావించి, ఆయాగ్రామ ములలోని ప్రజల యభిప్రాయములు తెలుసుకొని, అపుడు బహుజన

సమ్మతమైన దానిని శాసనము గావించుట ధర్మము. నగరములలోని నాగరికులు పల్లెటూళ్ల ప్రజలకు మతవర్ణాచార వ్యవహారాదులయెడ ప్రతినిధులు కారు. వారి తీర్మానములు ప్రజాసంఘము మాటలు కావు. ఇఁక వివాహవిషయమున కావింపఁబోవు సంస్కరణములోని రెండు సూచనలను గూర్చి యొకింత :—

సగోత్రవివాహము - విడాకులు పుచ్చుకోవడ మనఁగా వివాహ విచ్ఛేదము - అను నీ రెంటును మిక్కిలి విరుద్ధములు. వీటిని ప్రతిపా దించువారును శాసనము గావింపఁగోరు వారును ధర్మశాస్త్రము తెలియని వారు కారు. హిందూమతసంప్రదాయము తెలియని వారు కారు. అయినా, యెందుకు వీటి నపేక్షించుచున్నారో! అదే యాశ్చర్యమును విచారమును కలిగించుచున్నది.

యేదేని యొక యాచారము మార్పో లేక, క్రొత్తయాచారమో సంఘములో నెక్కువగా వ్యాపించుచున్నపుడు దాని మంచి చెడ్డలు పరామర్శించి తగిన రీతిని శాసనము గావించుట ధర్మశాస్త్ర సంస్కరణ మగును గాని, అది మంచిదో చెడ్డదో లోకము విమర్శించకుండా ఆచరణలో నున్నట్లు ప్రజాసముదాయ మెఱుఁగకుండా, శాసనమై సిద్ధమగుట సంస్కరణ మనిపించుకోదు. ఇపుడీరెంటి విషయమట్టిదే. కాలక్రమమున వెలసిన స్మృతిసూత్రగ్రంథము లన్నియు నీ రెంటి నేకగ్రీవముగా నిషేధించి యున్నవి. వర్ణాశ్రమధర్మము లేనా డేర్ప డెనో, నాడు మొదలుగా నాచారములో లేని యీ రెండును ధర్మ విరుద్ధము లనుటకు శాస్త్రవచనములు క్రోడీకరింప నక్కఱలేదు. పోనీ నేఁడాచారమున నివి విస్తరించి యున్నవా? అదియును లేదు.

ఈనడుమనే సగోత్రవివాహము లొకటి రెండు జరిగినట్లు పత్రికల వల్ల తెలియవచ్చినదిగాని, దీనిని పెద్దలయినవారు సమ్మతించ లేదు. ఆస్తి యన్యాక్రాంతము కాకుండుట మొదలుగా కొన్ని హేతువులను బట్టి యిద్దఱు ముగ్గురు చేసినంత మాత్రమున సగోత్ర వివాహము

దేశాచార మగునా? గోత్రమున్న మాట తెలిసిన వర్ణములవా రెవ్వరును సగోత్ర వివాహమున కిష్టపడ రనుమాట యటుండనిండు, ఆ మాట యెఱుఁగని హరిజనులు మొదలగు వారుకూడ తమ కులముల లోని కట్టుబాట్ల ననుసరించి పెండ్లి చేయుదురుగాని యథేచ్ఛముగా చేయరుగదా! అట్టియెడ వంశవృద్ధి ప్రతిబంధకమైన యీ క్రొత్త యాచారము తెచ్చి వర్ణధర్మములకు కలంక మాపాదించుట సము చిత మగునా? ఇంక—

విడాకుల పద్ధతి హిందూదేశము నలుగడలఁ గొన్ని క్రింది జాతు లలో నున్నదిగాని పై వర్ణములం దెచ్చటను కొన్ని వేల సంవత్సరము లుగా నున్నట్లు కనరాదు. కొన్ని సందర్భములందు వివాహవిచ్ఛేదము యుగాంతర విషయముగాఁ కర్తవ్యమని దమ పూర్వ స్మృతులు చెప్పినమాట సత్యమే కాని, అవి సూచించిన యావిధానము వాడు కలో నేనాఁడో పోయినది. అదిగాక, అవి చెప్పిన సందర్భములు వేఱు; ఆ విచ్ఛేదవిధానము వేఱు. దానికిని నేఁడు తలఁచుచున్న విడాకుల విధానమునకును పోలికయే లేదు. వాగ్దానము మొదలుగా సప్తపది యగుటకు పూర్వము వరుని కీ క్రింది దోషములలో నేది యున్నదని తెలిసినను, ఆ సంబంధము రద్దుచేసి ఆ కన్యను మంచివరుని కిచ్చి పెండ్లి చేయవచ్చును. ఆదోషము లివి:-- వెఱ్ఱి, కులహీనత, కుష్ఠు, నపుంసకత్వము, సగోత్రత్వము, గ్రుడ్డి, పెద్ద చెవుడు, మూర్ఛ, అన్యజాతిత్వము, మఱియు దేశాంతరమునకు లేచిపోవుట, సన్యసిం చుట, మృతుఁడగుట, సంభవించినను ఆ పిల్లను మఱియొకని కివ్వ వచ్చును.

అట్లే వధువున కీ క్రింది దోషములలో నేది పట్టినను, దానిని విడిచి వరుఁడింకొక కన్యను పెండ్లాడవచ్చును. ఆ దోషము లివి:— దీర్ఘరోగము, కుత్సిత రోగము – సంసార సౌఖ్యమునకు పనికిరాక పోవుట – పరపురుషునియందు మనస్సు నిలుపుట – నీచకృత్యచింత—

ఇట్లు చెప్పి, యిదయినా, యుగాంతర విషయమన్న యాశాస్త్రకర్తలే, సప్తపాదములు త్రొక్కించుటకు పూర్వమే యీ వివాహ విచ్ఛేదమునకు సమ్మతి చూపినారు గాని, సప్తపద్యభిక్రమణముతో పాణిగ్రహణము పూర్తియైన తరువాత నిట్లు చేయవచ్చు నన లేదు.

పైని చూపిన వధూవర దోషము లేవియు లేకయే, ఇష్టము లేనపుడు వారు విడాకులు పుచ్చుకొనుట శాసనమయ్యెనేని, దేశములో నిఁక దాంపత్యసుఖ మనుమాటయే లేకపోవును. ఎపుడు తన్ను విడిచి పోవునోయని భార్యాభర్త లిద్దఱు మనస్సులో జంకుచునే యుందురు. రూపమోహమును సంపదభిలాషము హేతువులుగా తఱుచు వివాహవిచ్ఛేదములు సంభవించుటయు, తన్మూలముగా వర్ణ సాంకర్యాది దోషములు సిద్ధ మగుటయు తప్పదు. కావున పావనమై పెక్కువేల సంవత్సరములుగా స్థిరపడియున్న భార్యాభర్త సంబంధమునకు హాని కలిగించు వివాహ విచ్ఛేద శాసనము హైందవజాతికి తగినది కాదని ప్రజాసముదాయము తమ యభిప్రాయమును శాసన సభ్యులకు తెలియజేయునుగాక.

# కుమారిలభట్టు మతసేవ

భరతఖండమందు అనాదిసిద్ధమైన మత మార్యమతము. అదే వైదికమతము, హిందూమతము. దీనికున్న పుట్టదిట్ట మే మతానికిని లేదు. ఇది దుర్భేద్యము లైన వేదపర్వతములు పునాదులుగా నిలిచి యున్నది. పరమత ఝంఝూవాతములకు కదలదు, కరగదు. దీనిని ప్రతిష్ఠించిన మహర్షులు సిద్ధసంకల్పులు, స్థిరహృదయులు. కావున దీని కెన్నటికిని మోసమురాదు. సుమారు రెండువేల సంవత్సరములు హోరాహోరిగా నాస్తికమతముతో పోరాడి వాటిని దిగద్రొక్కి నిలుచుటయే యిందుకు నిదర్శనము. ఆ పోరాటము సామాన్యమైనది కాదు. గృహకలహము, పరదేశమతములతో వచ్చినదైతే అంత క్లేశపడనక్కరలేదు. ఆర్యజాతిలోనే పుట్టిన చిచ్చు గావున దానిని చల్లార్చుటకు బహుకాలము పట్టినది.

## షడ్దర్శనాలు

వాల్మీకిమహర్షి కొకటిరెండు శతాబ్దులు ముందే ముందుగా **'లోకాయతము'** బయలుదేఱినది. వేదాలపై దండెత్తుటకు మొదట దారితీసినదదే. అదిచేసిన వేదనిందావాక్యములనే నేటి వేదనిందకులు పారాయణ చేయుచున్నారు. గాని వేదమంటే యేమిటో తెలిసి కాదు. దానికంటె కొత్తదారి త్రొక్కి వేదము ప్రమాణము కాదనుచునే యది యుపదేశించిన సత్యదయాహింసాది పరమధర్మములను స్వీకరించిన నాస్తికములు, జైన, బౌద్ధములు. ఈ మూడింటి నణగద్రొక్కుటకే షడ్దర్శనము లవతరించినవి. వానిలో మొదటిది పూర్వమీమాంస. లోకాయత మేది ప్రమాణము కాదని తెగనాడినదో, ఆ వేదమే పరమ ప్రమాణమన్న సిద్ధాంతమును నెలకొల్పిన మొదటి శాస్త్ర మిదే. మొదట దానిని, తరువాత జైన బౌద్ధము

లను నిర్మూలము చేయుటకు సమర్థములైన విదియును, దీనితరువాతి దగు నుత్తర మీమాంసయును. అందు పూర్వ మీమాంసా మత మును వ్యాపింపజేయుచు వచ్చినవారిలో నర్వాచీనుఁడును, పూర్వ మీమాంసకులలో నగ్రగణ్యుఁడనదగినవాఁడును మన కుమారిలభట్టు.

## లోకైకపండితుడు

ఇతఁ డాంధ్రుఁడు, గంజాంజిల్లాలో జయమంగళ మను గ్రామ మందు చంద్రగుణా యజ్ఞేశ్వరుల గర్భమున జన్మించినవాఁడు. ఆసేతు హిమాచలము భరతఖండ మంతటను పరమత విదళనము గావించిన వాఁడు. భవభూతిమహాకవికి గురువని చెప్పఁబడుతున్నవాఁడు. బౌద్ధమత ఖండన విషయమున శంకరాచార్యులకు మార్గదర్శియైన వాఁడు. ప్రాభాకరమతము లేవనెత్తిన ప్రభాకరునికి గురువని కొందఱు తలంచినవాఁడు. జగదేకమాన్యుఁడు. తంత్ర వార్తిక కర్త. భాట్ట మత మూలపురుషుఁడు. వేదప్రామాణ్యవాదమును గెలుపొందించిన మహాశూరుఁడు. తరువాత వెలసిన వందలకొలఁది శాస్త్రగ్రంథము లకు ప్రథమాచార్యుఁడు. ద్రవిడ కర్ణాట దేశములందును, ఉత్తర హిందూదేశమందును ఆంధ్ర విద్వాంసుఁ డంటే పెద్ద గౌరవము కలుగు నట్లందఱికిని మొదట భక్తిపుట్టించిన లోకైకపండితుఁడు. ఈమహనీయుఁడు పరమతములమీఁద దండయాత్ర చేయుటతో జైన బౌద్ధములు రెండు నడుగంటఁజొచ్చిన వనుటకంటె నితఁడు వైదిక మతమునకు చేసినసేవను వేఱుగా కొనియాడనక్కఱలేదు.

జైమినిసూత్రములును, శాబరభాష్యమును వేదముకంటె వేఱే ప్రమాణము లేదని నిరూపించి, అది ప్రమాణము కాదన్న నాస్తిక వాదమును ఖండించినవి గాని, ఈశ్వరుఁ డున్నాఁ డని నిరూపించలేదు. దానిచే జైమినిమతము కూడా (భర్తృమిత్రాదుల మూలముగా) నాస్తికమతమే యనెడి యపవాదము పుట్టినది. దానిని తొలగించి యీశ్వరాస్తిత్వము నిరూపించి లోకమును విశ్వసింపజేసినవాఁడును

ప్రాచీనమహర్షి మతమును పునరుద్ధరణము కావించినవాఁడు నై వైదిక మత వేదాంతమతములు రెండింటికిని బహుళవ్యాప్తి కలిగించిన యితనిమతసేవయే యార్య హిందూమతమునకు పునరవలంబన మైన దనుట నిశ్చయము. ఇందు కితని మొదటి శ్లోకమే ప్రమాణము.

" ప్రాయేణైవహి మీమాంసా
లోకే లోకాయతీ కృతా,
తా మాస్తికపథే కర్తు
మయం యత్నః కృతో మయా."

క్రీ. పూ. ౬౫౦-౭౩౦ నడుమ నున్న యీ మహనీయుఁడు శ్లోకవార్తిక, తంత్రవార్తిక, టుప్టీక లన మూఁడు తెలుఁగుల మహాగ్రంథములు రచియించునాఁటికి నలందలో బౌద్ధమతవిద్యాపీఠము వర్ధమాన దశలో నున్నది. బౌద్ధాచార్యుల ప్రచారము హెచ్చుగా నున్నది.

## వారి మాటలతోనే వారి మతాన్ని ఖండించడం

తన్మత గ్రంథకర్తలగు ధర్మకీర్తి మొదలగువారి నితఁ డెఱుఁగును. అందుచే బౌద్ధమతరహస్యము లన్నియు సంగ్రహించి వారిమాటలతో వారి మతమును ఖండించినట్లుగా శ్లోకవార్తికములో నెన్నో నిదర్శనములు కనవచ్చును. ఇందలి విశేష విషయములన్నియు నా రచించిన సంస్కృతవాఙ్మయచరిత్ర ద్వితీయ సంపుటమున విశదీకరింపఁబడినవి. ఈవిషయము నిట్లు సంగ్రహముగా తెల్పుచు నిపుడు చెప్పవలసిన మాట యొకటియే.

ఆంధ్ర మహాపురుషుఁడైన కుమారిలభట్టు నాఁటి నాస్తికమతములను రూపుమాపి దేశమంతటను హిందూమతము మరల సర్వతోముఖముగా వ్యాపింపఁజేసిన యశస్సు నార్జించినాఁడు. నేటి యాంధ్రులు కొందఱు విదేశనాగరికతావ్యామోహమున విదేశాచారము లవలంబించుచు దానికి కలంక మాపాదించుచున్నారు. ఈవిషయ మెఱిఁగి యాంధ్రసోదరులు స్వమతరక్షణము గావింతురుగాక. జాతికి మతమే ప్రాణము.

# ధర్మకీర్తి

ఇతడు గొప్పపండితుడు. మంచికవి. మహావక్త, బౌద్ధమతప్రచార మెక్కువగా కావించినవాడు. నవనవోన్మేష వైదుష్యమున బౌద్ధమత ఖండనమునకు దేశసంచారము చేయుచున్న కుమారిలభట్టును తన వార్ధకదశలో చూచి యతనితో స్వమతస్థాపనకు వాదించిన మనీషి. శా. శ. 570 ప్రాంతమున జీవించియున్నవాడు.

అది జైనబౌద్ధమతములు దేశమంతట వ్యాపించుచున్న సమయము. పూర్వమీమాంసామతము నిరీశ్వర మని నాస్తికమతములవారు తెగ నాడుచున్న కాలము. వైదికమతమునకు హాని సంభవించు నేమో యని వేదప్రామాణ్యవాదులు భయపడుచున్న కాలము. నలందలో వర్ధమానదశలో నున్న బౌద్ధమత విద్యామఠమున మతవిషయక చర్చలలో నారితేఱిన బౌద్ధాచార్యు లెందఱో ఉత్తర దక్షిణహిందూ దేశములందు వైదికమత మణగింప ధ్వజమెత్తి తిరుగుచున్న మత విప్లవ సమయము. అటు కాలుద్రమ్ముకొని వచ్చుచున్న పరమత మేఘములను తుత్తునియలుచేసి దిగంతముల కెగురగొట్టినది కుమారిల భట్టు పూర్వ మీమాంసామత ప్రచార ఝంఝామారుతము. ఆదెబ్బతో పరమతములం దాదరము చూపినవా రెందరో మరల వైదిక మతమున ప్రవేశించిరి. అందు కిష్టపడని కొందఱు పూర్వము ద్వీపాంతరముల కేగినవారిని కలియ చీనా జపాను మంగోలియా సైబీరియా సయాం జావా సుమత్రా మొదలగు ద్వీపములు కంట జూచిరి. మఱికొంద ఱటు, నిటు గాక దేశమున నందందు తలదాచు కొని యుండిరి. అట్టితఱి తక్కిన బౌద్ధమత ప్రచారకులవలె వెలవెల బోక కుమారిలభట్టుతో వాదింప నుత్సహించి ఉజ్జయినీ ప్రాంతమం దతని నెదుర్కొన్న వృద్ధధీరు డీధర్మకీర్తి. పరమ సిద్ధాంత విషయమం దిత డాతని గెలువలేకపోయెగాక! కాని, అతని మనస్సున కెక్కునట్లు

యుక్తివాదము చేయకపోలేదు. స్వమతమందలి సారాంశమును హృదయరంజకముగా నుపన్యసింపక పోలేదు. కావుననే కుమారిలుడును, శంకరాచార్యులును కూడా తమ గ్రంథములందెన్నో చోట్ల బౌద్ధవాదములను ఖండించి స్వమతములను స్థాపింపవలసివచ్చినది.

ఇతనికి ముందెందరో మతగ్రంథములు నిర్మించినా, దిఙ్నాగాచార్యుడు నిర్మించిన ప్రమాణసముచ్చయ మనే గ్రంథ మితని నెక్కువగా నాకర్షించినది. అందుచే ముందు దానికి వ్యాఖ్య వ్రాసి పిదప బౌద్ధనిర్వాణ స్తోత్రము మొదలగు కృతులు రచియించెను. సుబంధుడు వాసవదత్తలో "బౌద్ధసంగతి మి వాలంకార శోభితామ్" అని యితని కృతిని పేర్కొనెను. ఆనందవర్ధను డితని పేరెత్తి రెండు శ్లోకములను ధ్వన్యాలోకమున నుదహరించెను. అంతేకాని, యీపండితునికృతు లేవియు సజీవములు కావు. ఈసందర్భమున ప్రసక్తానుప్రసక్తిగా పూర్వము మతవైషమ్యము లెట్లుండెడివో మఱికొంత పరిశీలింతము.

ఆ కాలమున మతవిషయమం దభిప్రాయభేదమున్నా, ఎవరి మతము వారెక్కువగా విస్తరింప యత్నము చేయుచున్నా, లౌకిక వ్యవహారమున మాత్రము వారువారు కలసిమెలసి యుండేవారు గాని, మత భేదమే కారణముగా పగ పట్టి యొకరినొకరు పొడుచుకొని చచ్చేవారు కారు. ఇందు కానాటి వేఱువేఱు మతములవా రందఱు నొక దేశమాతకడుపున జన్మించి యొకచోటనే పెరిగినవారగుటయే కారణము. నేటికి సుమారు మూడువేలేళ్ళ క్రిందట ననగా వాల్మీకి మహర్షికి పూర్వమే చార్వాకమత ముత్తుగా లేచి వైదికమతముపై దండెత్తజొచ్చినది. వేదములను తదుక్తకర్మలను ఘోరముగా నిందించిన యాలోకాయతమతమువారి నోటికడ్డము లేకపోయినది. నాటి రాజులు వేదోక్తకర్మ లాచరించువారే యైనను, నాటి వేదశాస్త్ర పండితు లతిసమర్థులైనను ఆ చార్వాకులు మంచిచెడ్డలు తెలియని మూఢు లనుకొని, వారు పేక్షించిరి గాని, ఆ మతద్వేషులను హింసించు

టకు పూనుకొనలేదు. ఈవిషయము శ్రీరాముడు భరతుని ప్రశ్నించి నట్లు రామాయణము నయోధ్యాకాండమున నున్న "కచ్చిన్న లోకాయతికాన్ బ్రాహ్మణాం స్తాత సేవసే?" ఇత్యాది శ్లోకములవల్ల విదితమగును. "తమ్ముడూ! లోకాయతమత మవలంబించినబ్రాహ్మణు లను నీవు చేరనిచ్చి గౌరవించుట లేదుగదా! ఆ తెలివిమాలిన వాళ్లు మేమే పండితుల మనుకొని చెడ్డదారిని పోవుచున్నారు. వాళ్లు చెప్పు నది తలచునది సర్వము నిరర్థకము" ఇత్యాది వాక్యములను బట్టి వైదికమతము వారా చార్వాకుల యెడ నిరసన భావముతో తటస్థులై యుండేవారుగాని తమ్ము దూషించిన వారుగదా యని వారిని బాధించుటకు పూనుకొన్నవారు కారన్నమాట స్పష్టము. ఆ మతము నశ్లె యంతరించినది.

తర్వాత తలయెత్తిన రెండవ నాస్తిక మత మార్హతము. అదే జైనము. అది పాణిన్యాచార్యులకు పూర్వమే యించుక వ్యాప్తికి వచ్చినది. పాణినీయమునకు మార్గదర్శకుడైన మహావైయాకరణుడు శాకటాయనుడు జైనుడే. ఆనాటి వైదికులును తర్వాతివారును కూడా అట్టి జైనపండితుల విద్వత్త్వమున కానందించుచు వచ్చిరి గాని, వారిని దూషింపలేదు, బాధింపలేదు. అనంతర ముదయించినది బౌద్ధమతము. ఈ రెండు మతములవారును తమ మతములు వ్యాపింప యత్నించు చుండ వైదికమతమువారు వాటికి వ్యాప్తి కలుగకుండ ప్రతిప్రచారము గావించుచు వచ్చిరి గాని వారికి ప్రత్యక్షముగా గాని, పరోక్షముగా గాని, హానికలిగించినవారు కారు. బౌద్ధమత కర్తయగు గౌతమ బుద్ధుని శంకరాచార్యాది మత ప్రవర్తకులు 'భగవాన్ బుద్ధః' అనుచు భూషించిరిగాని దూషించలేదు. ఇదంతా సత్యమైనా కుమారిల భట్టు శంకరాచార్యాదులు నాటి రాజులను వశపఱుచుకొని జైనులను బౌద్ధులను చంపించిరన్న కట్టుకథలు మాత్రమెట్లో పుట్టినవి. అవి విశ్వాస్యములు కావు.

ఆ కాలమున వైదిక జైన బౌద్ధమతములవారు కొంచె మెచ్చు తక్కువగా ప్రతిగ్రామమందు నివసించినారు. మతాంతరులైన బ్రాహ్మణాదులు నాడు మతభ్రష్టులేకాని, వర్ణభ్రష్టులు కారు. జైన బ్రాహ్మణులు జైన వైశ్యులు నేటికి నుత్తరదేశమందు న్నారు. రాను రాను ఆ పరమతావలంబులు వర్ణభ్రష్టులై రనవచ్చును. గాని, భోజ మహారాజు నాడుకూడా జైనబ్రాహ్మణులను వైదిక బ్రాహ్మణుల వలెనే గౌరవించుట కలదు. ఆతేని పెత్తండ్రియైన వాక్పతిరాజు సరస్వతీ బిరుదమిచ్చి సత్కరించిన ధనపాలుఁడను జైనబ్రాహ్మణకవి రచియించిన తిలకమంజరీ కావ్యము చూచి యానందించి భోజరాజొని నెంతో సత్కరించి యున్నాడు. బౌద్ధులును జైనులును నిర్మించిన పాఠ్యకావ్యము లెన్నో యానాడు కాళిదాసాదుల కావ్యముల మాడ్కి వైదికమతమువారి యాదరమునకు పాత్రములైనవి. మత ముల పరస్పరసహిష్ణుతకు సంస్కృత సారస్వతమున నిట్టి యుదాహర ణము లెన్నేని చూపవచ్చును గాని, యిది యదను కాదు. మతావేశ మున నొళ్లు తెలియని యప్రాజ్ఞు లెవరో యెక్కడనో దౌర్జన్యము చేసి యుందురని యొకటి రెండుదాహరణములు చూపవచ్చునుగాని, ఆనాడు మతముకోసము ప్రజల ప్రాణములు బలికాలేదు. ఒకమతమవలం బించిన రాజైనను పరమతమువారిని హింసింప తనవారిని పురిగొల్ప లేదు. ఒక్కమాటలో చెప్పవలెనంటే కేవలము మతముకోసము యుద్ధములే యానాడులేవు. ఈ దుస్సహ దురాచారము విదేశీయ విమతు లీదేశమునకు తెచ్చిపెట్టినది. హైందవులను బానిసలను జేసి కొని భరతఖండమున తమ ప్రభుత్వము నెలకొల్ప బూనిన ముస్లిము జాతివారి మతద్వేషము ప్రజలప్రాణముల నపహరింప నారంభించినది. నాటికి నాడు నేటికి నేడు నోరులేని నిరపరాధులగు తనబిడ్డలు దురా శాపరులగు మతద్వేషుల దౌర్జన్యముపాలై యంతరించుటకు భరత ఖండము చేసిన పాపమేమో! ఈయవస్థ దీనికెందుకు వచ్చెనో!

ఆపరమేశ్వరునికే యెఱుక. ఈ దౌర్జన్యమున కైనా కేవల మత ద్వేషము కారణముకాదు. దీనికి మూలకారణము దురాశామూలక మైన దురధికారకాంక్ష. శాంతం పాపం.

భరతఖండమం దెన్నో మతము లావిర్భవించినా, అవి యన్నియు తమదారిని తాము పోయినవి కాని, పరస్పర హింసకములు కాలే దనుట కీమాత్రము పూర్వమత ప్రసంగము చాలును. మతద్వేష మానాడు ప్రాణాంతకమే యైతే భరతఖండమం దే ప్రఖ్యాతి కెక్కిన కుమారిలభట్టానాడు బౌద్ధమతవ్యాప్తి కెక్కువపాటు పడుచున్న యీ ధర్మకీర్తిని, ఇతని యనుయాయులను క్షణములో చంపించలేక పోవునా? ఎన్నో మాయోపాయము లెఱిగిన నాటి బౌద్ధులు కుమారిల శంకరాదుల ప్రాణములు తీయించకుందురా? "అహింసా పరమో ధర్మః" అన్నమాట యానాటి భారతీయులందఱికిని తారకమంత్రము. "హింసా పరమోధర్మః" అన్న మంత్ర మీనాడు విదేశ విమతు లుప దేశించుచున్నది. ఈశ్వరుడు ధర్మగ్లాని సహించునా? ఇక ప్రకృతము.

ఈ క్రింది శ్లోకములు చదివినవారికి ధర్మకీర్తి కావ్యము లంతరించి నందుకు సంతాపము కలుగకపోదు. ఇందు మొదటిదానిలో ఈలావణ్యమూర్తిని నిర్మించిన బ్రహ్మదేవుని మనస్సులోని యభిప్రాయ మేమో కదా! యని యొక సర్వాంగ సుందరి యగు కన్యను చూచిన యొక పురుషుని పరిదేవనము చిత్రముగా వర్ణింపబడినది. రెండవదానిలో పూర్ణ చంద్రోదయ సమయమందలి ప్రకృతిశోభ సరసముగా వర్ణింప బడినది :—

"లావణ్యద్రవిణవ్యయో నగణితః క్లేశో మహా నార్జితః స్వచ్ఛందం చరతో జనస్యహృదయే చింతాజ్వరో నిర్మితః, ఏషాపి స్వయమేవతుల్య రమణాభావా ద్వరాకీ హతా, కోఽర్థ శ్చేతసి వేధసా వినిహిత స్తన్వా స్తమంతన్వతా" "శశిన మసూత ప్రాచీ, నృత్యతి మదనో హసన్తి కకుభోఽసి, కుముదరజఃపటవాసం, వికిరతి గగనాంగణేపవనః."

# మనుష్యులు – తద్భేదములు

పరిశోధకులను కలత పెట్టుచున్న బహుపురాతన విషయములలో నిదియొకటని తత్త్వజిజ్ఞాసులైన మహానుభావులెందరో తమజ్ఞాననేత్రమున వెనుకకు చూచి చూచి సృష్టిమొదలు గోచరింపకపోవుటచే "అనాదిస్సంసారః అనాదిత్వేసతి నాంతత్వం జగతోలక్షణం" అన్నారు. మన మేపురాతన విషయమును పరిశీలింపగోరినా అందుకాధారము వేదముతప్ప మరొకటిలేదు. నమ్మినా నమ్మకపోయినా అదేగతి. సకల ప్రపంచ భాషావాఙ్మయములకు శ్రీకారమైన దానినే విడిచినచో మనకు వేరుమార్గ మేమున్నది? యుగాంతమం దంతర్హితమై తరువాతి యుగమున బ్రహ్మనిష్ఠు లగు ఋషులకు ప్రత్యక్షమగుచున్న దాని మొదలు కూడా గోచరింపక పోవుటచేతనే ప్రాచీన మహర్షులు వేద మనాదియన్నారు. మరియు శ్రుతి స్మృతి ఇతిహాస పురాణాదికము శిష్ట సంప్రదాయము నను నాల్గును విషయ నిర్ణయమునకు ప్రమాణములని యర్వాచీన తత్త్వవేత్తలన్నారు. ఇప్పుడు బహువిధ యంత్ర సహాయమున తెలిసికొన్నట్లు ప్రకటింపబడుచున్న విషయములెన్నో తమ యోగదృష్టిని కనుగొన్న యామహర్షుల మాటలలోని సత్యము గ్రహింపఁజాలక వేదాదులను నిరసించు నాస్తికులకు తృప్తి కలిగించుట మనతరముకాదు. కావున, వేదాదిక ప్రమాణము ననుసరించి యాస్తిక చింతతో మనమీ విషయమును యథాశక్తి పరిశీలించి సంగ్రహముగా తెలియ యత్నింతము.

ఈభూమండలమువంటి భూమండలములు వేలున్నవి. ఈసూర్యుని వంటి సూర్యులు వేలున్నారు. అన్నిమండలములలోను ప్రాణివర్గమున్నది. కాని యేదేని యొక జంతుమిథున మొక భూమండలమందొక చోటనే జన్మించిన దనుటకు దాని సంతతి క్రమక్రమముగా నందలి ఖండాంతరములందు నితర భూమండలములందు వ్యాపించిన

దనుటకును ప్రమాణము లభింపకపోవుట యటుండ నూహించుటకైన నవకాశమున్నదా?

"బహుస్యాంప్రజాయేయేతి అనేన జీవేనాత్మనాను ప్రవిశ్యనామ రూపే వ్యాకరవాణి" ఇత్యాది శ్రుతులనుబట్టి బహువిధ నామ రూపాత్మకమైన యీచేతనాచేతన సృష్టి పరమేశ్వర సంకల్పమున నావిర్భవించినదని విశ్వసింపవలసినదే కాని, యిచ్చట తర్కవాదమును పరిణామ వాదమును పనికివచ్చునా? ప్రపంచములోని యనంత నామ రూపభేదములతోడి యనేకకోటి జీవరాసుల యుత్పత్తికా పరమాత్ము నిచ్ఛారూపులు జీవవిశేషులునైన వహ్నివాయువ్వాదిత్యుల కృత్య విశేషము గాక వేఱేమి కారణమున్నదని మనమూహింపఁ గలము? సకల జగద్వ్యాప్తమైనవారి కృత్యవిశేష మహిమ సంకుచితమై తొలుత నాకొకచోటనే పొడచూపియుండుననుట సంభావ్యమా? సమంజసమా? కావున స్త్రీ పురుషాత్మకమైన మానవసృష్టి యొక భూమండలము నందొకచోటనే కాక భిన్నస్థలములందు తొలుత సంభవించి యుండుననియే మనము విశ్వసింపవలసియున్నది.

నేఁటికి పదివేల సంవత్సరములనాఁడు భరతఖండమం దార్యజాతి తలయెత్తుచున్నపుడు వారికి విభిన్న స్వరూపము స్వభావములుగల యాటవిక మనుష్యజాతి యొకటి యుండెననుటకు ఋగ్వేదమున నెన్నెని ప్రమాణములు లభించును. దాని దస్యుక్రవ్యాద చోరమార కాది సంజ్ఞలతో మనవారు పిలుచుచు వచ్చినవారే యనార్యు లనఁ బడిరి. ఈ యార్యానార్యులకు సుమారు రెండు మూఁడు వేల సంవత్స రములు తఱచుగా పోరాటములు జరుగుచునేవచ్చినవి. ఆర్యులలోని దుష్టులే యీ యనార్యులని కొందరు భావించిరిగాని వేదములలోని వర్ణనలు చక్కఁగా పరిశీలించిన వారందఱును ఆ కాలమునం దార్య జాతికి వేఱయిన యింకొక యాటవికజాతి యున్నదనియే నిశ్చయిం చిరి. ప్రపంచమంతటిమాట యిపుడెందుకు? ఈ భరతఖండమునఁ

దొలుదొల్త మానవోత్పత్తికి మూలమైనదొక్క దాంపత్యమే కాదనుట కిదిచాలును.

ఆర్యజాతి విస్తరించుచున్నకొలఁదిని అభివృద్ధి గాంచుచున్న కొలఁది నిందలివారు కొందరు దురాచారులయి క్రూరులై సంఘము నుండి బహిష్కృతులైనమాటయు వేదమే చెప్పుచున్నది. అట్టి వారు ననార్యులుగానే పరిగణింపఁబడిరి. ఇంక నార్యులలో బ్రాహ్మణాది వర్ణభేదము లెపు డారంభమయ్యెనో నిర్ణయించుటకు నిశ్చిత ప్రమాణము లభింపదు గాని ఎనిమిదివేల సంవత్సరముల క్రిందటనే యీ భేదమున్నట్లూహింపవచ్చును. నిషాదజాతిని పంచమ వర్ణముగా గణించి వర్ణము లైదని ఋషులు గావించిన వర్ణనలు ఋగ్వేదమునఁ గలవు. ఈ నిషాదులు నార్యజాతిలోనివారే గాని యార్యులకు లొంగి క్రమముగా వారికి సేవకులయి జనపదముల నివసించువా రయిరి. ఈ నిషాదజాతిలో మరల నెన్నో భేదాలు క్రమ క్రమముగా బయలుదేరినవి. ఇవైదును ప్రాచీనవర్గము లనుకొన వచ్చును గాని అనులోమ విలోమ వివాహభేదముల వెలసిన యుప వర్ణము లెన్నో యున్నవి.

అట్టివి పదునెనిమిది యని తరువాత లెక్కించిరి గాని, యిపుడు భరతఖండ మంతటఁగల యుపజాతు లెన్నో లెక్కింపఁదరము గాకుండ గానే యున్నవి. ఒక యాంధ్రదేశమందలి బ్రాహ్మణులలోనే భోజన ప్రతిభోజనములు లేని శాఖలును సంబంధ బాంధవ్యములులేని శాఖ లును సుమా రిరువది కనబడుచుండగా, ఖండమంతటనున్న యుప జాతు లిన్ని యని యిపుడు గణింపనేల? భారతీయార్యజాతి యిన్ని వర్గములుగా విడిపోయినా వర్ణభేదనిమిత్తకమైన వైరము మాత్రము దేశము నెన్నఁడు నెక్కువగా కలతపెట్టలేదనవచ్చును. తొలుత నుండియు దేశమున కనర్థమైనది మతద్వేషముగాని వర్ణద్వేషము కాదు. ప్రతి గ్రామమందెన్నో వర్ణములవారు నివసించుచువచ్చినను,

వారందఱు సోదర భావముతో మెలఁగుచు పరస్పర సహాయ్యము నందుచు ననార్యులైన క్రూరులతో పోరాడవలసినప్పు డైకమత్యముతో నెదుర్కొనుచు నెంతో స్నేహార్ద్రముతో ప్రవర్తించుచుండెడి వారనుటకును వేదాదులం దెన్నో యితిహాసము లున్నవి. కావున వర్ణభేద వైషమ్య మిటీవల కల్పింపఁబడినది గాని ఒక శతాబ్దికి మున్నిది దేశమున లేదనియే విశ్వసింపవచ్చును.

భరతఖండమంతట మొదటినుండియు వ్యాపించినది వైదికమతము. దానికి ప్రతిస్పర్థిగా సుమారు మూడువేల సంవత్సరముల క్రిందట లోకాయతమతము తలయెత్తినది. తరువాత జైన బౌద్ధములు బయలు దేఱినవి. ఈ మతములు సంఘమును చీల్చి కొంత యలజడి కలిగించిన మాట నిజమే కాని, ఈ మతద్వేషము విశేషించి జననాశనమును కలిగింపలేదు. వీరశైవము వైదికమతము నణచుట కెక్కువగా త్వరపడి యందుండు చిన్నచిన్న పోరాటములు సాగించినా, ఆ శత్రుత్వ మంతటితోనే యణగిపోయినది. ఇంతకును చెప్పవలసిన దేమంటే, రాజకీయ హేతువులనుబట్టియు కేవల స్వార్థపరత్వమునుబట్టియు నేడు ప్రత్యక్షమగుచున్న మత వైరముతోడి ప్రజానాశనము మున్ను లేదనుటయే పరస్పర జిగీషతో దేశపాలకులైన రాజులు పోరాడుట చిరకాలమునుండి యున్నదే గాని, తన్నిమిత్తముగా జనపదము లందలి ప్రజలు కలహించుకొని మృత్యువుపాలగుట లేదు. ఇంత యేల? మతద్వేషముతోడి ప్రజాహింసకు మహమ్మదీయ పాలనము మొదలు ప్రజాసామరస్యమునకు భంగకరమైన వర్ణ ద్వేషముతోడి పాలనమునకు దారితీసిన దాంగ్లప్రభుత్వము ఏమయిననేమి? ఇపుడు భరతఖండ మట్టుడికినట్లుడికిపోవుచు, ఇపుడు దేశమును క్షోభపెట్టుచున్న పరస్పర ద్వేషములు విభేదములు లెక్కకు మించినవి. ఇన్నిటివల్లను ప్రధానముగా హింసలపా లగుచున్నా వా రమాయికులైన హిందూప్రజలు, దేశాభ్యుదయము ప్రజాసౌఖ్యము కోరెడి హిందూజాతినాయకులును

తమ సోదరప్రజల శాంతి సుఖములు కోరు సంఘ ప్రముఖులును, అనర్థదాయకములైన కులద్వేషములకును దేశమును మాఱుత్రోవకు త్రిప్పుచున్న రాజకీయ కక్షులకును స్వస్తిచెప్పి, స్వార్థపరత్వము విడిచి సంఘ సంరక్షణకు పూనుకొన్నచో హైందవజాతి కేగతిపట్టునో యూహింపజాలము. మనమందఱము భరతమాత కన్నబిడ్డలము. వర్ణ కులములా తల్లి యవయవములు. మనలోమనము భేదములు పాటించుకొనుట మనహానికే మూలము. దేశమాతకు శాంతిచేకూర్చుట పుత్రుల విధి అని, మనసార భావించి యిపుడు దేశమును కలవరపెట్టుచున్న యెల్లవిషయములందు జాగరూకులై ప్రవర్తించుట యత్యంతావశ్యకము. సర్వేశ్వరుండు భారతీయార్యజాతి తొల్లిటి విజ్ఞానమును నేటి హైందవులకు ప్రసాదించుం గాక! దేశము కష్టము గడచి గట్టెక్కుం గాక!

# జాతక రాజీయము
(ఇది భారతిలోఁ బ్రకటితము)

ఇది యొక జ్యోతిషగ్రంథము. జాతకఫల బోధకమగు నిది జైమినిసూత్రభాష్య మను పేర సంస్కృత పద్యాత్మక వ్యాఖ్యగా నున్నది. ఇది జైమినిసూత్రములకు సరియైన వ్యాఖ్యాన మనఁదగి లేదు గాని, యందలి భావము మాత్ర మిందలి శ్లోకముల స్ఫురించు చుండును. దీని వ్రాఁతప్రతి యొకటి నాయొద్దఁ గలదు.* కాని గ్రంథము సంపూర్ణము కాదు. మొదటినుండి మూఁడవ యధ్యాయములోఁ గొంతవఱకు మాత్రమే యున్నది, ఉన్నంతవఱకైనను గ్రంథము నిర్దుష్టము కాదు. పైగా నందందు కొన్ని పదములు, వాక్యములుగూడ లోపించినవి. అయినను, ఈకృతి జాతక భాగమున నుత్తమముగాఁ గనవచ్చుటంజేసి పూర్వోత్తర సందర్భములనుబట్టియు, గ్రంథాంతర సాహాయ్యమును బట్టియుఁ గొన్ని దోషములను సవరించి, కొన్నిలోపములను బూరించితిని గాని సంపూర్ణ గ్రంథము లభింపమి నట్టివి చాలవఱకు మిగిలియున్నవి.♦

"శ్రీకాశ్యపకులీనేన సింగరార్యేణ ధీమతా,
నామ్నా జాతకరాజీయం బాలబోధాయ తన్యతే"
"ఇత్యనఘసింగరార్యకృతౌ"

అను వాక్యములనుబట్టి, అనఘ (అళఘు?) సింగరార్యుఁ డాంధ్రుఁడని తెలియవచ్చెనుగాని యితఁ డెక్కడివాఁడో, యెప్పటివాఁడో విచారణీయము.

*ఇది. అమలాపురం తాలూకా భట్నవిల్లిలోనున్న యొక ప్రాఁత వ్రాత పుస్తకమునకు నకలు.

♦ఈగ్రంథము సంపూర్ణ ప్రతి యెవరివద్దనైన నున్నయెడల దయచేసి దానిని బంపినచో శిష్టభాగము వ్రాసికొని వారిపుస్తకము వారికిఁ బంపెదను.

## గ్రంథవిషయము

జాతకఫల వివరణ విషయమునందు పరాశరమతమువలెనే జైమిని మతమును సుప్రసిద్ధమై యున్నది. ప్రాచీన మునియగు జైమిని జ్యోతిశ్శాస్త్రనిష్ణాతుఁడై జాతకభాగమును నాలుగధ్యాయములుగా సూత్రములు నిర్మించెనని ప్రతీతి కలదు గాని, రెండధ్యాయములు మాత్రమే లభించినట్లు ముద్రిత గ్రంథములవలనఁ దెలియును. పూర్వమీమాంసాసూత్రకర్తయగు జైమినియు, నితఁడు నొకఁడే యని పెక్కుండ్రు తలంచుచున్నారు.

ఈ జైమిని సూత్రములకుఁ బూర్వులు కొందఱు వ్యాఖ్యానములు, వృత్తులు, కారికలు రచియించినట్లు కొందఱి వ్రాతలవలనఁ దెలియ వచ్చునుగాని యవియన్నియు లభ్యములుగా లేవు. జయపురమహా రాజాశ్రితులు, మహామహోపాధ్యాయ బిరుదాంకితులు నగు దుర్గా ప్రసాద ద్వివేద పండితులు జైమినిపద్యామృత మనుపేర శ్లోకరూప వ్యాఖ్య వ్రాసి, దానికి మూలకందళి యనుపేర వృత్తి వ్రాసిరి. ఇట్టి వ్యాఖ్యావృత్తులతోడి సూత్రములు బొంబాయి నిర్ణయసాగర ముద్రా లయమున ముద్రితములైనవి.

మన యుద్దిష్టమైన యీ జాతకరాజీయ మనెడి జైమిని సూత్ర శ్లోకరూప వ్యాఖ్య పూర్వోక్త జైమిని పద్యామృతముకంటె మిక్కిలి పూర్వమైన దనుట నిరాక్షేపము. అంతేకాదు, దానికంటె నిది సుఖ బోధకముకూడ నగును. ఆంధ్రదేశ దైవజ్ఞశిఖామణియగు సింగ రార్యుఁడు రచియించిన యీ జాతకరాజీయము ముద్రితమైనట్లు కనఁబడదు.

ఇందు మొదటి యధ్యాయమునఁ బెక్కువిశేష విషయములు తెలుపఁబడినవి. అందు దృష్టిఫలములలో—

"శనేర్దశమదృష్టేశ్చ తృతీయా ప్రబలా మతా,
నవమ్యాః పంచమీ దృష్టిర్గురోః ప్రబలతాంగతా."

గ్రహస్థితిఫలములలో—

"ఆరూఢతత్పంచమయో రవిశుక్రౌ స్థితౌయది,
నాటకాలంకృతిప్రాజ్ఞో వాచాలః కావ్యవిద్భవేత్.
గురుణా తత్రసంబంధే సర్వవిద్గ్రాంథికోభవేత్"

"కారకాంశస్య దశమే నసూర్యే గురువీక్షితే,
సభవే ద్ధరణీపాలో నాత్ర కార్యా విచారణా"

ఇట్లు దారపదాంతము ఫలములను దెలుపుచున్న యీప్రథమా ధ్యాయమున 33-౨ శ్లోకము లున్నవి. ద్వితీయాధ్యాయము మిక్కిలి చిన్నది. ఇందు సుమారు ౭౫ శ్లోకములు మాత్రమే యున్నవి. ఇందు, ఆయుర్విషయము విచారింపఁబడినది. మూఁడవదానిలో భాగ్యాదివ్యయాంతస్థానముల ఫలములు కనవచ్చునుగాని యొకదానిని గూర్చియు సవిస్తరముగాఁ గనరాదు. కడపటిశ్లోక మకస్మాత్తుగా ఆఁగినట్లుండుటచే మఱికొంతగ్రంథ ముండి యుండవలెనని తోఁచు చున్నది గాని, యెట్లయిన నిదియే కడపటియధ్యాయ మనిమాత్రము చెప్పవచ్చును. మూఁడవదానిలో ౪౮ శ్లోకములుమాత్ర మున్నవి. శిష్టగ్రంథ మెంతయుండునో! ఇపు డచ్చుపడియున్న జాతకఫలబోధక గ్రంథములలో లేని కొన్నిఫలము లిందు కనవచ్చుననుటయే యీ వ్యాసము నుద్దేశము. ఈ గ్రంథము ముద్రణభాగ్యము గాంచుఁగాక.

# నిరఙ్కుశాః కవయః

౧

ఇది యీనాఁటి మాటకాదు, ఏనాఁటిదో! ప్రతిభాశాలులగు విద్వన్మహాకవులకు నిరంకుశత్వ మలంకారముకాని దోషముకాదు. సుశ్లోకులైన యుత్తమ కవులందఱును నిరంకుశులే. శ్రావ్యములైన యెవరి మాటలు తరువాతి కవులకుఁ బాటలో, హృద్యములైన యెవరి ప్రయోగములు కావ్యభాషాయోషకు భూషణములో, అట్టి మహనీయుల యెడనే పైసూక్తిని గవిత్వ రసజ్ఞులు వాడుట విదితము. అదియే మహాకవులకు నిరంకుశత్వము భూషణ మనుటకు నిదర్శనము.

నిరంకుశత్వ మన నేమి? ధీరులగు కవులు తమనాఁటికిఁ బ్రమాణములుగాఁ బ్రచారణలోనున్న ఛందో వ్యాకరణాది లక్షణము లొక్కొక్కతఱి నుల్లంఘించి తమ కభీష్టములైన శబ్దములు ప్రయోగించుట. అట్లా లక్షణము లెఱిఁగి యతిక్రమించినవారే నిరంకుశులు. శబ్దార్థముల యౌచిత్య మెఱిఁగి యట్లతిక్రమించుట వారి ధైర్యలోకజ్ఞతలకు గుర్తగునుగాని వారి వైదుష్యమునకు లోపముకాదు. కావుననే సహృదయులగు విమర్శకు లట్టివారిని నిరంకుశులని గౌరవించుచు వచ్చిరి. అట్టివారి ప్రయోగములు కొన్ని మనము వివేకించుట వారి స్వాతంత్ర్య ప్రియత్వముతోడి శబ్దార్థముల మార్పు లెఱుంగుట యగునుగాని వారి నాక్షేపించుట కాఁజాలదు.

అష్టాధ్యాయి నిర్మించి జగదేకవంద్యుఁడైన భగవత్పాణిని పాతాళవిజయ జాంబవతీవిజయములను కావ్యములు రచియించినట్లు క్షేమేంద్ర రాజశేఖరాదుల మాటలవల్ల సూచితమైనది. అవి యతనివో మఱియొక పాణినివో, సందిగ్ధముగా నున్నది. ఎట్లయిన నవి క్రీ. పూ. చిరకాలము క్రిందటివే. అందు పాతాళ విజయములోని —

గృహ్యా — అపశ్యతీ — అనునవి వ్యాకరణ విరుద్ధములని రుద్రటా లంకార వ్యాఖ్యాత నమిసాధువు తెలిపి యున్నాఁడు.

లౌకిక భాషా కవులలో నగ్రగణ్యులగువారు భాస కాళిదాసా దులు కొందఱు. వారెఱుఁగని శాస్త్రము లేదు, ఔచిత్యము లేదు. అయినను హస్త్యశ్వరథపదాతీని — భ్రశ్యతే — పీజన్తః — ఇత్యాది భాసప్రయోగములును; త్రియంబకమ్ — అన్వైహి — విశ్రామహేతోః— ఇత్యాది కాళిదాస ప్రయోగములును ; భట్టిమురారుల— హేసుభ్రు— సంశృణు మహే — ఇత్యాదులును ప్రామాదికము లపాణినీయములని పూర్వులన్నారు. అంటే నేమి ? " భ్రశ్యతే స్వర్గాల్లోకాత్ — త్రియం బకం యజామహే " ఇత్యాది వైదిక వాక్యములనుండి గ్రహింపఁబడిన ప్రయోగముల మాట యటుండ నిండు. తక్కినవి మాత్రము శ్రావ్యములు కావా ? నిజ మరసినచో మహాకవు లుపయోగించిన యొక్కొక శబ్దము పాణినీయ విరుద్ధమయ్యుఁ బాణినీయము వలె నాదరణపాత్ర మైనదనుట కెన్నేని యుదాహరణములు కలవు. అందొక విశ్రామ శబ్దము గ్రహింతము.

ఉపధావృద్ధి నిషిద్ధమగుటచే 'విశ్రామ' రూప మపాణినీయము. [1] ఇది తెలిసి మల్లినాథసూరి చంద్రగోమి వ్యాకరణములోని "విశ్రా మోవా" అను సూత్రమునుబట్టి పైప్రయోగమును సమర్థించెను. దానిని బట్టి చాంద్రవ్యాకరణములోని యాసూత్రము చూచి కాళిదాసీ శబ్దము ప్రయోగించెనని భ్రాంతి పడరాదు. ఏమనఁగా, మతభేదము లనేకము లున్నను, కాళిదాసు క్రీ. నాల్గవశతాబ్ది కీవలి వాఁడు కాఁడు. చంద్రగోమి క్రీ. 480 ప్రాంతమువాఁడు గాని యంతకుఁ బూర్వుఁడు కాఁడు. [2] పోనీ! కాళిదాసు చాంద్రవ్యాకరణ మెఱుఁగు నని వాదమున కంగీకరింతమన్నను, విశ్రామశబ్దమపాణినీయము కాక

1. చూ. అష్టా, 7-3-34.

2. చూ. సం. వా. చ. ద్వితీయ సంపుటము.

పోదుగదా! ఇంతకు నిపుడు తేలిన దేమనఁగా, కాళిదాసు మేఘసందేశములోని విశ్రామశబ్దము ప్రమాణముగాఁ జంద్రవ్యాకరణమున 'విశ్రామోవా' అను సూత్రము పుట్టినదనుటయే. ఈ శబ్దము పాణినీయమువలెఁ బ్రమాణమై వైయాకరణులను గ్రంథకర్తలను గూడ నెట్లాకర్షించెనో చూచితిరా? ఈవిధముగా స్వతంత్రించి శబ్దములు ప్రయోగించిన భాస కాళిదాసాదులు సంస్కృతభాష కెట్టి ప్రామాణికులో, మన నన్నయ తిక్కన శ్రీనాథాది మహాకవులు మనభాషకు నట్టివారేయనుట కీయుపోద్ఘాతము చాలును.

నన్నయాదుల ప్రయోగ విశేషము లెన్నో గ్రహించి ప్రయోగశరణం వ్యాకరణమ్మని, ఆంధ్రభాషానుశాసనము రచియించిన నేను వారియపాణినీయ ప్రయోగములను నిరసింపఁ బూనితినని యెవరో యొకరిద్దఱన్న నేమి? వారి ప్రయోగములు నాకభిమతములేయని నా వ్యాకరణమే తెలుపును. నా మాటయేల? పూర్వమహాకవి ప్రయోగములుత్తర మహాకవుల కాదరణీయములయ్యెనని విద్వల్లోక మెఱుఁగదా? నన్నయార్యుని - ఒకళ్ళు - కావలెను - ఇత్యాది ప్రయోగములను దిక్కనార్యుఁడు స్వీకరించినాఁడు. అతని కూఁతుంద్రు ప్రయోగము చూచి శ్రీనాథుఁడల్లుంద్రు రూప ముపయోగించినాఁడు. అతని చేతురు - ప్రయోగముచూచి తరువాతి వారెందరో, కోతురు, తీతురు వంటివానిని బ్రయోగించినారు. చింతామణ్యాదులలోఁ బై శబ్దములకు గతి కనరాదు. అయిన నేమి? ఒకరి ప్రయోగము లింకొకరికి వ్యాకరణము కంటెఁగూడ నెక్కువగా నెట్లు ప్రమాణములైనవో చిత్తగించితిరా? అది నిజమైనను మన యిప్పటి కొందఱు వానిని వ్యాకర విరుద్ధము లనక మానలేదు. అనేకులు వాటిని శిరసావహించుట మానలేదు. కావున మహాకవుల ప్రయోగములు కొన్ని శాస్త్ర విరుద్ధములని చూపుట వారు శాస్త్రమునుగూడ లెక్కచేయరని చెప్పుటకుఁగాని, ఆప్రయోగములను నిరసించుటకుఁ గాదని ప్రాజ్ఞులు భావింతురుగాక!

## ముష్టాముష్టి

నన్నయార్యుని యీప్రయోగ మపాణినీయమని తొలుతఁ బరిశోధించి చూపినది నేను. ఇది నిరంకుశము నపాణినీయముఁ గాదని యిపు డొక రిద్దఱు వెఱ్ఱి మొఱ్ఱి సమర్థనము గావించిరి గాని దానితో నాకుఁ బనిలేదు. "తత్ర తేనేద మితి సరూపే" అను సూత్రమును బట్టి పాణిని పతంజలులకు ముష్టాముష్టి రూప మిష్టము కాదనుట స్పష్టము. ప్రదీపకార కైయటుఁడు, ఆకార ప్రశ్లేష చేసినచో ముష్టాముష్టి యయ్యెడి నన్నాఁడు. కాని ప్రౌఢమనోరమాకారుఁడు "ఆత్వం వానచీతి- తత్రాత్వం వేత్యపాణినీయమ్ - అత ఏవ ముష్టాముష్టి - బాహాబాహవి - ఇత్యాద్యుదాహరణ మప్రామాణికమేవ-భాష్యాది విసంవాదాత్" అనుచు నీరూపమును నిరసించి యున్నాఁడు. తత్త్వబోధినీ కారుఁడిది యప్రామాణికమే యన్నాఁడు. ఆకార ప్రశ్లేషకుఁ బ్రమాణము లేదని శివదత్తశర్మ తెలిపియున్నాఁడు. ఇది యిట్లుండ నిండు—

ముష్టాముష్టి రూపసిద్ధి సూచించిన కైయటుఁడు క్రీ. 1070—1140 మధ్య-నున్న వాఁడగుటచే [1] క్రీ. 1040 ప్రాంతములోని మన నన్నయార్యుఁ డతని సూచనయే యెఱుఁగఁడని విదితమగుచుండ, నొకానొకరు "వోపదేవుఁడు ముగ్ధబోధ వ్యాకరణమున దీనిని సాధించినాఁడు, కేశిరాజు శబ్దమణి దర్పణమున దీని నుదాహరించినాఁడు, ఇది సంప్రదాయ సిద్ధమే" అని తలక్రిందు చర్చచేసిన యవివేకపు వ్రాఁత నెవ్వరైన గణింతురా? దేవగిరి రాజగు రామరాజు మంత్రియైన హేమాద్రికి మిత్రుఁడగు - వోపదేవుఁడు క్రీ. 1300 ప్రాంతమువాఁడు. [2] శబ్దమణిదర్పణ కారుఁడగు కేశిరాజు క్రీ. 1260 ప్రాంతమువాఁడు. వీరిమాటలు 1040 ప్రాంతములోని నన్నయకు సంప్రదాయ సిద్ధములా? సెబాసు!!

1-2 చూ. సం. వా. చ. ద్వితీయ సంపుటము 69, 143 పుటలు.

అయితే, ఇది యెక్కడిది ? — "అర్వాచీనాస్తు ఆత్వమాహుః తథాచ పఞ్చికాయాంత్రి లోచన దాసేనోక్తమ్" అనుచు మనోరమాకారుఁడు గావించిన చర్చనుబట్టి యాలోచింపఁగా, కైయటునికిఁ బూర్వులైన మహావైయాకరణులలో నర్వాచీను లెవరో, ఆత్వమంగీకరించి ముష్టాముష్టిరూపము సాధింప నష్టపడినట్లును, అది తెలిసి నన్నయార్యుఁడు దీనిని బ్రయోగించినట్లును, ఇప్పటికిఁ దోఁచుచున్నది. అది యెట్టిదైనను, 'ముష్టాముష్టి' పాణినీయము నిరంకుశము కాకపోదు. అయితే నన్నయ దీనిని బ్రయోగించుట తప్పా? ఎన్నఁటికిని గాదు. అతని స్వాతంత్ర్యము కవి లోకమునకు హితోపదేశమే. పాణినీయము మాట మఱచి యతని యీప్రయోగమును దరువాతివా రాదరించుటయే యందుకు నిదర్శనము.

చ. తెలుఁగు కవిత్వ కన్యకను దీరిచి దిద్ది యలంకరించి యా
ర్యుల మది కింపు నింపఁ జవులూరెడు పల్కుల భారతంబు నాఁ
డొలుఁ బలుకులే వచించె దయతో నతఁ డాకవి భారతీశు వి
ద్యల నిధి నన్నపార్యుఁ గొనియాడెద సత్కవి లోకవందితున్.

౨

తత్త్వము తెలిసియు నభిరుచియు నౌచిత్యమును గారణముగా నొక్కొకచోట లక్షణ మతిక్రమించిన సర్వసమర్థులగు మహాకవుల కీమాట చెల్లినదిగాని, ఏమియుఁ దెలియక నోటికి వచ్చినట్లు వ్రాసిన వారికిది చెల్లలేదు. చెల్లఁబోదు. పాణినీయులును మల్లినాథసూరి వంటి గొప్ప వ్యాఖ్యాతలును, ఆయా ప్రయోగము లెత్తి ప్రమాదమనుటయు, ఆయా కవులను నిరంకుశులనుటయు, వారి కవిత్వమహత్త్వము లక్షణమును లెక్కచేయదనుట యగునుగాని వారిని నిందించుట యగునా ?

మహాకవి కాళిదాసు వందలకొలఁదిగా 'ప్రస్తాపయామాస -

నివేశయామాస' ఇత్యాదులు ప్రయోగించియు నొకటి రెండు చోట్ల ఛందోనిరోధమున 'తంపాతయాం ప్రథమ మాస పపాత పశ్చాత్' (రఘు. 9-61) అనురీతిని బ్రయోగించెను. పాతయా మాస, అనకుండఁగాఁ బ్రథమశబ్దమును నడుమఁజేర్చుట యపాణి నీయము. మల్లినాథుఁడు తదనుగుణముగా 'అపప్రయోగ ఇతి పాణి నీయాః' అన్నాఁడు. తత్త్వబోధనీకారుఁడు దీని నెత్తుకొని 'ప్రమాద ఏవాయం వార్తిక నిరోధాత్' అని వ్రాసెను.

మాఘాది మహాకవు లెన్నిచోట్లనో సుగన్ధి శబ్దమును లక్షణాను గుణముగా వాడియు నొక్కొకచోట నీక్రింది విధముగాఁ బ్రయో గించిరి.

కస్తూరికా మృగ విమర్ద సుగన్ధిరేతి. మాఘ. 4-62.
స్వాదుస్సుగన్ధి స్స్వదతే తుషారా. నైష. 3-93.
కిరతా సుగన్ధి మభితః పవనమ్. భారవి. 6-25.

మల్లినాథసూరి పైమూఁడుచోట్లను గూడ — "గన్ధస్యేత్వే తదే కాన్తగ్రహణ మిత్యుక్తమ్ - తథాపి నిరఙ్కుశాః కవయః - కవీనాం నిరఙ్కుశత్వాత్, నియమానాదరః" అనుచు వ్రాసెను. దీనినిబట్టి లక్షణ విరుద్ధశబ్దములను బ్రయోగించిన మహాకవులయెడ మల్లినా థాదు లెట్టి గౌరవము చూపిరో తెలియకపోదు. మన నన్నయాది మహాకవుల విషయము నట్టిదే -

సంస్కృతమున సఖిశబ్దము తక్కిన యికారాంతములైన హర్యాది శబ్దముల వంటిదికాదు. వేదమందలి దీని రూపవిశేషములనే లోకము గ్రహించి యనుశాసనము చేసికొన్నది. వేదములో -

అత్రాసఖా యస్సఖ్యా నిజానతే
అనుద్యూతో వరుణ ఇంద్రసఖా
అగ్నేయాహి మరుత్సఖా
తీవ్రం సోమం పిబతి గోసఖాయమ్.

ఇత్యాది రూపములు గనవచ్చును గాని, సఖిః – సఖీ – – సఖయః – వంటి రూపములు కనరావు, నిరుక్తకారు లిట్టి రూపము లెత్తలేదు. దీని వైదికరూపములు గ్రహించియే శాకటాయనాదులు సూత్రములు కల్పించియున్నారు ఋక్సఖిత్యాది సూత్రములను బట్టి – శాక – 1-2-119. 129, – సఖా – ప్రియసఖా – హేసఖే – సఖాయా – ఇత్యాది రూపములు సిద్ధించినవి. 2-1-168 సూత్రము క్రింది ‘ రాజన్ సఖేః ’ అనువార్త్తికము, అత్ప్రత్యయ విధానమందా రెండుశబ్దముల సహజరూపములను దెల్పునది యనియు, అందలి ‘ సఖేః ’ అనునది ప్రయోగార్హమైన షష్ఠీవిభక్తి రూపజ్ఞాపకము కాదనియు, ఆ ప్రకరణమే తెలుపఁగలదు. మహారాజః మహాసఖః – అను రూపముల సిద్ధికిఁ దరువాతఁ బైవార్త్తికము పుట్టెఁ ది.

పాణిన్యాచార్యులు ‘ శేషోఘ్యసఖి ’ అను సూత్రమున సఖిశబ్దముఘి సంజ్ఞకము కాదని నిషేధించి [1] అనఙ్ సౌవిత్యాది సూత్రముల సఖా – సఖాయమ్ – సఖ్యుః – ఇత్యాది రూపనిష్పత్తి గావించి యున్నారు. వ్యాఖ్యాతలు, సముదాయమునకు సఖి రూపత్వము లేదు గావున నది, ఘిసంజ్ఞక మగునని చెప్పుచు, సుసఖినా – సుసఖయే – ఇత్యాది తత్పురుష సమాసరూపములను సమర్థించి, బహుబ్రీహిలో, పరమసఖా – పరమసఖాయా – ఇత్యాది రూపము లగునని వక్కాణించియున్నారు. బహుబ్రీహిలో సమాసాంత ప్రత్యయము వచ్చునన్నవారి మతమును నిరసించియున్నారు.

ద్వితీయాశ్రితేత్యాది సూత్రమునకు, 2– –24 భాష్యము వ్రాయుచు భగవత్పతంజలి రాజ్ఞస్సఖా రాజసఖః, సంబన్ధా దేతద్గన్తవ్యమ్ – నూనంరాజాప్యస్యసఖేతి, ఉభయం ఖల్వపీష్యతే, స్వస్తి సోమసఖా పునరేహి గవాం సఖ ఇతి – అనుచు సఖి శబ్ద ప్రయోగ విశేషమును దెల్పెను. ప్రదీపకారకైయటుఁడు “ సోమసఖేతి బహు

---

[1] అష్టా — 7-1-93, 1-1-65, 6-4-8, 7-1-92, 7-2-115.

వ్రీహి త్వాత్సమాసాన్తాభావః గవాం సఖ ఇతి తత్పురుష త్వాత్స మాసాన్తః - షష్ఠ్యా అలుక్," అనుచు భాష్య భావము విశదీక రించెను. ప్రౌఢ మనోరమాకారుఁడు బహువ్రీహిలో సమాసాంత ప్రత్యయము రాదను మతము ననుసరించి, వరుణ ఇంద్రసఖా - మరుత్సఖా - గోసఖాయమ్ - ఇత్యాది బహువ్రీహి సమాస రూప ములు సరిపడుచున్నవని చెప్పుచు 'శోభనస్సఖా యస్యసుసఖః' అని యుదాహరించిన హరదత్తన్యాసకారులును, తదనుయాయు లును, ఉపేక్ష్యులని యభిప్రాయము తెలిపియున్నాఁడు. దీనినిబట్టి ప్రత్యేకముగా 'సఖః' అను రూపము పాణినీయ సమ్మతము కాదని స్పష్టమగుటయే కాదు, సుసఖః, పరమసఖః, అను బహువ్రీహి సమాసరూపములు కూడ బహుపాణినీయ సమ్మతములు కావని విదితమగుచున్నది. సఖి శబ్దవిషయ మిట్లుండ నన్నయార్యుఁడు -

"కొలఁది యెఱుంగ కిట్టి పలుకుల్ పలుకందగుఁ గాదు నాకనన్
బలుఁగుఁ దనంబు నం బలుకఁ బాడియె నీసఖు నంచు" ఆది 5-203.
[యథార్థమాత్వాం ప్రసభం సఖా తే అహమితి ద్విజ - మూలమ్].

అని ద్రుపదుఁడు ద్రోణాచార్యుని నిరసించు సందర్భమునఁ బుంలింగముగా, ఇకారాంతముగా 'సఖి' రూపము వాడియున్నాఁడు. నేను జూచిన ముద్రిత లిఖిత పుస్తకములం దీరూప మిట్లే యున్నది - నీసఖుఁడనంచు - అనుటకు బదులుగా, 'అను' చేర్చకుండఁగా - నీ సఖు డంచు - అని ప్రయోగించెనేమో! ఆవిధముగా - పాండు భూవరు నకుఁ గోడలైతి - నని తిక్కన ప్రయోగించలేదా? అని కొంద ఱన వచ్చును గాని, నాకుఁ దెలిసినంతలో నిట్టిచోట్ల 'అను' చేర్చకుండ నన్నయార్యుఁడు ప్రయోగించి యుండలేదనియు, సఖుఁడంచు - అని సవరించినవారు లేరనియుఁ జెప్పఁగలను. సఖి శబ్ద మకారాంత ప్రాతి పదికముగానే తెలుఁగునకు వచ్చెననెడి యభిప్రాయ మొకటి యీా పట్టున లేవవచ్చునుగాని యది నిరాధారము. సంప్రదాయ విరుద్ధము.

'సఖా' యనెడి సంస్కృత రూపమునకుఁ దత్సమరూపము సఖుఁ డగుననియు, సఖః అను రూపము సంస్కృతమున లేదనియు నన్నయాచార్యుఁడెఱుఁగఁడా? ఎన్నిచోట్లనో సఖుఁడను రూపము ప్రయోగింప లేదా? మఱెక్కడనైన 'సఖ' యను పుంలింగ రూపము ప్రయోగించెనా? అందుచే నిది ప్రామాదికము కాదనియు, తెలిసియే యిట్లు ప్రయోగించెననియుఁ జెప్పవచ్చును. ఎట్లు?—

భారత రామాయణములలో వేదమందున్నట్లే సఖశబ్దరూపములు సఖా - సఖాయమ్ - సఖ్యుః - సర్వత్ర కనవచ్చును. అయినను భారతములో - కృష్ణస్య సఖ రర్జునః - అనియు, రామాయణములో - సఖినా వానరేన్ద్రేణ - అనియుఁ బ్రయోగము లున్నట్లు పాణినీయు లుద్ఘాటించియున్నారు. మనోరమాకారుఁడు 'పతిస్సమాస ఏవ' అను సూత్రము నర్థము వివరించుచు -

"అథకథమ్ సీతాయాః పతయే నమః - పతితే పతౌ - ఉచ్యతే. పతిరి త్యాఖ్యాతః పతిః ణౌటిలోపే, అచఇః - ఇత్యౌణాదికః. అయం పతిశబ్దః, పతిస్సమాస ఏవేత్యత్రన గృహ్యాతే లాక్షణిక త్వాత్, ఏతేన, కృష్ణస్య సఖ రర్జునః, ఇతి భారతమ్, సఖినా వానరేన్ద్రేణేతి రామాయణంచ వ్యాఖ్యాతమ్."

అనుచు నీ రెండు రూపములును, రామాయణములోని లాక్షణికమైన 'పతయే' వంటివని వ్రాసినైచెను. తత్త్వబోధినీ కారుఁడు నిట్లే వీనినిగూర్చి చెప్పెను. ఇంక — వోపదేవుని ముగ్ధబోధ - సఖాహేసఖే- ఇత్యాదిపాణినీయసమ్మత రూపములకే నిష్పత్తి నిరూపించుచు - కృష్ణస్య సఖరర్జునః ఆర్షమేతత్ - అని తెలిసియున్నది. దాని వ్యాఖ్యానము "క్వచిద్విశేషేణ సామాన్యో న బాధ్యతే, తేన సఖినా వానరేన్ద్రేణ - పతినా - పతయే - ఇత్యాది సిద్ధమ్ అని చెప్పి, ఏతచ్ఛాందసమితి కేచిత్" అన్నది. దీనినిబట్టి సఖః అను రూపమపాణినీయమనియు నార్షమనియుఁ దెలియవచ్చినది. మఱియు,

నన్నయకు ముందు వెనుకలఁబుట్టిన నామలింగాను శాసనాదులలోఁ గాని, కావ్యములలోఁ గాని, ఉణాదులలోఁ గాని, యెందును, సఖిః - సఖీ - సఖయః, సఖీ - సఖినౌ - సఖినః, అను రూపములలో నొక టియు నాకంటికిఁ గనఁబడలేదు. దీనినిబట్టి కూడ 'సఖి' అను పుంలింగ రూప మప్రాణినీయమని బలపడినది. ఇది యిట్లుండ, నిన్న మొన్నటి శబ్దరత్నాకరమును కన్నడ నిఘంటువును, "సఖి - నకారాంత పుంలింగము, స్నేహితుఁడు, సహాయుఁడు" అని చూపుచున్నవి గాని, ప్రమాణము చూపలేదు, ప్రయోగ మీయలేదు. అవి యెందుకిట్లు చూపెనో గోచరింపకున్నది. కావున నిది నకారాంతముగాఁ గూడ నున్నదని నిశ్చయముగాఁ దెలియువఱకును వీనిమాట విశ్వసనీయము కాఁజాలదు ఇట్లింతదనుక వివరించినదానినిబట్టి నన్నయార్యుఁడు ఇకారాంత పుంలింగరూప సఖి శబ్ద మపాణి నీయమని తెలిసియే, వెనుకఁ జూపిన రామాయణ భారతముల లోని క్వాచిత్క ప్రయోగములను బట్టి యీయొకచోటనే యీ రూపము వాడి తన స్వాతంత్ర్యము వెల్లడించెనని తెలియ నయ్యెడి. దీనికిఁ బై యార్ష ప్రయోగములే ప్రమాణమని యంగీక రింపక తప్పదు. కావున నిది యపాణినీయము నిరంకుశము నగును.

లౌకికభాషలో వాల్మీకి మహర్షి వలెనే యాంధ్రభాషలో నన్నయా ర్యుఁడు మొదటి కవి. ఇతనికి ముందు పుట్టినవిగా నేవో నాలుగు శాసన పద్యములు కనవచ్చిన నేమి ? ఆంధ్రలోకమున కితఁడు పెట్టిన దే సత్కవిత్వ భిక్ష. తరువాతి నన్నెచోడ తిక్కనార్యాదుల కవితారీతుల కితని భారతమే మార్గదర్శకము. సుప్రసిద్ధమైన యీ విషయము కాదనువారుండఁబోరు.

కాని, "ఆంధ్ర భారత కవితా విమర్శనము" నన్నయ కవిత్వము తిక్కన కవిత్వమునకే కాదు, ఎఱ్ఱన కవితకుఁగూడఁ దీసిపోవునని స్వాభిప్రాయము తెల్పినఁ దెల్పుఁగాక, ఇతని భారతమునుగూర్చి

యేమేమో వ్రాసి వ్రాసి, (పుటలు ౧౧౪-౧౪౭) ఆకాశమున మేడలు కట్టి, తిక్కన మహాభారతము మొదటి నుండి తెనిగింపకపోవుటకును, నన్నయ మూఁడు కృతులు వదలి తక్కిన పర్వములు తెలిఁగించుటకును గారణము "చాళుక్య ప్రభువు లొనర్చిన మహత్కార్యమందలి గౌరవ" మని చెప్పినఁ జెప్పెఁగాక, (ఆయభిప్రాయము లేమేని కానిండు) "తిక్కనకాలము వఱకు నన్నయ భారతము చూచినవారు లేరు, చదివినవారులేరు" అనుచును, తిక్కనార్యుఁడు "నన్నయ రచించిన భాగము సంపాదించి చూచి చదివి యానందించి .....మిగిలిన భాగము పూరించినట్లు తోఁచదు" అనుచు నిచ్చిన యభిప్రాయములు మాత్రమాశ్చర్యజనకములును హాస్యాస్పదములును గాకపోవు. తిక్కన తన గ్రంథావతారికలో నన్నయనుగూర్చి వ్రాసిన మాటలను వానికిఁ బైవిమర్శనము చేసిన వ్యాఖ్యానమును బరామర్శించుట యిప్పటి మనపనికాదు కాని, తిక్కన నన్నయ భారతము చక్కఁగా శ్రద్ధగా నెన్నోసార్లు చదివినవాఁడని బహుప్రయోగముల యేకీభావమును బట్టియుఁ గొన్ని పద్యరచనల పోలికను బట్టియుఁ గొన్ని ముఖ్య పాత్ర ప్రవృత్తుల సామ్యమును బట్టియు నాంధ్రీకరణ పద్ధతుల సమతనుబట్టియు నిద్దఱి రచనలు చక్కఁగాఁ జదివిన వారికిని, లేక సభాపర్వ ద్వితీయాశ్వాసోద్యోగపర్వ ప్రథమభాగములైనను సవిమర్శముగాఁ జదివిన వారికిని దెలిసియున్నదని మాత్ర మిచ్చటఁ దెలుపఁదగియున్నది.

అట్టి తిక్కనవంటి మహాకవి గౌరవమునకు నన్నయ గుఱి యగుటకుఁ గారణ మితఁడు మిక్కిలి పూర్వుఁడగుట కాదు. ఇతని భారతమే యతనికట్టి గౌరవబుద్ధిని బుట్టించినది. పుట్టినది మొదలుగా నేటిదనుక దేశమునఁ బ్రమాణమై పఠనపాఠన వ్యవహారమం దెక్కువగాఁ బ్రసిద్ధి గాంచినది పాణినీయ మనుట నిర్వివాదము. దానికి సమ్మతములైన సంస్కృత శబ్దములను తెలుఁగునకుఁ దెచ్చుటలో

నితఁడు చూపిన నేర్పు నిరుపమానము. ఇది యిట్లుండ, నితనినాఁడు తెలుగునకు వ్యాకరణము లేదు. ఛందోలక్షణము లేదు. అట్టియెడ శిష్టసంప్రదాయమును బురస్కరించుకొని దానికి దగ్గఱగాఁ బద్యరచన కనుకూలముగా నాచ్ఛికశబ్దముల రూపము లేర్పఱుచుకొనియున్నాఁడు. ఇట్లు స్వప్రతిభా నిర్ణీతరూపములతోడి యుభయభాషా శబ్దములతోఁ దన వాగ్జాలమే తెలుఁగునకు లక్షణము లక్ష్యము నగునట్లు చక్కని మృదుమధుర ఫణితిని భారతము సృజించినాఁడు. అదియే తరువాతి వారి కన్ని విధములఁ బ్రమాణమైనది. తిక్కనకు నన్నయయెడఁ గలిగిన గౌరవబుద్ధి కిదియే మొదటికారణము. తిక్కన యెట్టినలు శబ్దప్రయోగ విషయమున నన్నయ నెక్కువగా ననుసరించుటయే యిందుకుఁ దార్కాణము. అందుకే కవిత్రయ భారతమే యాంధ్ర మునకుఁ బ్రమాణమని కవి రాక్షసుఁడు గొంతెత్తి ఘోషించినాఁడు. కావున నటు కావ్యరచనకును, ఇటు లక్షణగ్రంథ రచనకును మూలాధార మితని భారతమే యనుట మఱువరాని విషయము. ఇంతటి మహత్త్వము కలదు గావుననే యాత్మవిశ్వాసముతో నితఁడు "విపుల శబ్దశాసనుఁ" డను విశేషణము వేసికొన్నాఁడు తిక్కనాదులు 'విద్యా దయితుండు మహితాత్ముఁడు' నని స్తుతించినారు.

అట్టియితని తొంటిశబ్దశాసనమును మొదటి కావ్యమునైన భారతము తొలుతటి ప్రమాణముగాఁ దరువాత వెలసిన కావ్యములందును వ్యాకరణము లందును ఛందోలక్షణము లందును, ఆయానాఁటి మార్పుల ననుసరించిన శబ్దములును లక్షణములును గనవచ్చినవి.

కాని, యెవరో భాషానుశాసకులు చెప్పినట్లుగా నిన్న క్రొత్తగాఁ దలయెత్తిన నన్నెచోడ 'కుమారసంభవ విమర్శనము' వక్కాణించిన యీక్రింది సూత్రమువంటి సూత్రమును (౧౭౧ పుట) ఇందుకుఁ దగిన యుదాహరణమును మున్ను గనఁబడలేదు. ముందు కనఁబడఁబోదు. అది యిది:— "తద్భవముగాని, దేశ్యముగాని సంస్కృత సమాసముతో

సమసింపరాదు అనియు నట్లు సమసించినవి వైరిసమానము లనియు భాషానుశాసకులు చెప్పుదురు." ఆహా! ఏమి సూత్రము!!

అట్లు లోకోత్తరమైన భారతము రచియించి మహాకవులకును వ్యాసకర్తలకును వ్యాఖ్యాతయైన మన నన్నయార్యుఁడు లోకజ్ఞుఁడు, వాక్ స్వతంత్రుఁడు, గ్రాంథిక భాషాజనకుఁడు, ఉభయ భాషాకోవిదుఁడు. అట్టి మహానీయుఁడు శిష్టవ్యవహారమునఁ గాంచియో, శ్రుతిరమ్యత నాదరించియో లెక్కకు మూఁడు నాలుగు మాటలఁ బాణినీయ మతిక్రమించిన నేమి? ఇతఁడు వాల్మీకివలె మనకు మహర్షియే. ఇతని ప్రయోగములు మన కార్షములే. ఇందుకు మఱియొక ప్రయోగము.

"వ. అని నియోగించినఁ గుంతియు......మహాముని యిచ్చిన మంత్రంబు విధివ తంబుఁ జేసి"[1] —ఆది ౫-౯౩.

వ. వసిష్ఠుండు విధివంతంబుగా సంవరణునకుం దపతి వివాహంబు సేయించె — ఆది ౭-౮౮.

ఇట్లు మూఁడు నాలుగుచోట్ల "విధివంతంబు" అని ప్రయోగించి యున్నాఁడు మన నన్నయార్యుఁడు. నేను జూచిన యచ్చుపుస్తకము లోను, తాటాకు పుస్తకములలోను గూడ నీప్రయోగ మిట్లేయున్నది. కాని, వావిళ్లవారి ముద్రణమందు—౧౯౧౪—౧౭౮ పుట క్రిందను ఆనందముద్రణమందు—౧౯౩౦-౧౭౪ పుటక్రిందను సరిగా నొక్కచోట విధివత్తుగా, అను పాఠాంతరము చూపఁబడినది. దీనినిబట్టి యీ రెండు నొక తాటాకుల ప్రతిని జూచి యీ పాఠాంతరము చూపినవనుట విదితము. ఇందు కీ రెండు ముద్రణములుగూడఁ దక్కిన చోట్ల నీపాఠాంతరము చూపకుండుటయే తార్కాణము. ఇంక పాఠాంతరము మాట.

ఒక పూర్వలిఖిత పుస్తకము చూచి ప్రతి వ్రాసికొన్న పాణినీ

1. జజాప విధివజ్జాప్యం దత్తం మ వ్యాససా పురా—ఆది. ౧౨౩ అధ్యా—

యజ్ఞుఁడైన యొక లేఖకుఁడు, దానిలోనున్న విధివంతంబు; అనుదానిని 'విధివత్తు'గా సవరించుకొని వ్రాసికొన్నట్లును, తరువాత మరల నన్నె కనఁబడగా నిది కవి ప్రయుక్తమేకాని పూర్వలేఖకుని ప్రమాదము కాదని గ్రహించి తక్కినచోట్ల సవరింపక మానుకొన్నట్లును, ఒక్క ప్రతిలో నొక్కస్థలమందేయున్న దానినిబట్టి యూహింపనయ్యెడి. కావున సార్వత్రికముగానున్న "విధివంతంబు" ప్రయోగము, నన్న యార్యుఁడు తెలిసిచేసినదే యని చెప్పవచ్చును. అందుచే "ఇది వచనములోనున్నది పద్యములో లేదు. యతిప్రాసస్థానముల లేదు. పూర్వలేఖకు లందఱు తప్పు వ్రాసిరి, పరిష్కర్తలందఱు పొరపడిరి" అనెడి మాటలు యుక్తియుక్తములు కాఁజాలవు.

విధివంతము, మతుబంత మందమన్న విధిమంతము కావలెను గాని, వకారాదేశము రామింజేసి విధివంతము కాఁజాలదు. అదిగాక యిచ్చో మతుబర్థము సముచితమును గాదు. 'తదర్హమ్' (౧–౧–౧౧౭) అను పాణిని సూత్రమునుబట్టి 'విధి మర్హతి' యను నర్థమున 'విధివత్' అను రూప మేర్పడును. దీని తత్సమరూపము విధివత్తగును గానివిధివంతము కాదు. నన్నయార్యుఁ డీ విషయ మెఱిఁగియు, విధివత్తుకంటె విధి వంతము శ్రుతి రమ్యమగునని యో ఆనాఁటి శిష్టుల వాడుకలో నీరూప ముండుట తెలిసియో యిట్లు ప్రయోగించియుండును. ఎట్లైనను దీనికి శాస్త్రమునకుఁ దగినట్లుగా యథాశాస్త్రముగా ననెడి యర్థమే ప్రకర ణోచితము. ఇట్లు ప్రయోగించు స్వాతంత్ర్య ముభయ భాషాకోవిదుఁడు లోకజ్ఞుఁడునైన యితనికిఁ జెల్లునుగదా! ఇఁక నొక్క విషయము. చిరకాలము క్రిందట నేను ప్రకటింపఁజేసిన సవిమర్శ మహాభారత పీఠికలో 'అనుగుణ భార్యావంతుఁ' డను ప్రయోగ మపాణినీయమే కాని, పెక్కండ్రు కవు లిట్టివానిని బ్రయోగించి యున్నారని వ్రాసి యున్నాను. దానినిగూర్చి యిప్పటి యభిప్రాయ మొకింత.

"న కర్మధారయా న్మత్వర్థీయః బహువ్రీహిశ్చే త్తదర్థప్రతిపత్తి

కరః" అను వచనమును వైయాకరణులును నైయాయికులును గూడ నందం దుదాహరించి యున్నారు. అనఁగా, కర్మధారయ సమాసము కంటె మత్వర్థీయ ప్రత్యయము రాదు. బహువ్రీహి చేసినచో నట్టి యర్థము సిద్ధించునని భావము. అనఁగా నీలోత్పల మను కర్మధారయముమీఁద మతుప్ప్రత్యయము చేర్చి నీలోత్పలవంతము సరస్సని చెప్పరాదు. నీలములైన యుత్పలములుకలది 'నీలోత్పలము' సరస్సని బహువ్రీహి చేసినయెడల సరిపడుననుట.

పాణిన్యాచార్యులు కర్మధారయము మీఁద మత్వర్థీయమును విధించలేదు, నిషేధించలేదు. కాని, మహాభాష్యమునం దీప్రసంగము వచ్చినది. భగవత్పతంజలి "వర్ణోవర్ణేన (౨-౧-౬౯.) భాష్యములోఁ బైవిషయమున గౌరఖరవదరణ్యమ్—సర్వధనీ—కృష్ణసర్పవాన్ వల్మీకః-ఇత్యాదు లుదాహరించుచు, మత్వర్థీయము కర్మధారయ ప్రకృతి యగునా కాదా యని చర్చించుచు, ఆయాప్రయోగముల యందలి విశేషములు విశదీకరించుచు,

"కృష్ణసర్పోనామ సర్పజాతిః సాస్మిన్వల్మీకేఽస్తీతి కృష్ణసర్పవాన్ వల్మీకః, యథాహ్యాన్తరేణ జాతిం తద్వతాభిసంబన్ధః క్రియతే కృష్ణసర్పో వల్మీక ఇత్యేవ భవతి."

అనుచుఁ గర్మధారయముపై మత్వర్థీయము చేయునప్పటి విశేషమును బహువ్రీహి చేయునప్పటి విశేషమును దెలుపుచు సవిస్తరముగా నీ విషయమునఁ బ్రసంగించి యుండెను. ప్రదీపకారకైయటుఁడీ సందర్భమునందు 'కర్మధారయస్తు మత్వర్థీయసహిత ఇతి శబ్దగౌరవ ప్రసఙ్గః' అని వ్రాసియుండెను. ఇట్లే మఱికొందఱు వ్యాఖ్యాతలు నీ విషయమును బరామర్శించి యున్నారు. మొత్తముమీఁదఁ బరిశీలింపఁగా సుందరమైన దేహము సుందర దేహము, అది కలవాఁడు సుందరదేహి-అని, సమాసవృత్తియు తద్ధితవృత్తియు నొక ప్రయోగమునఁ జేయుట గౌరవమనియు, సుందరమైన దేహము కలవాఁడు

సుందర దేహుఁడని యిచ్చట బహువ్రీహి చేసినచో నొక్క సమాన వృత్తిచేసిన లాఘవము సిద్ధించుననియుఁ దేలినది. అయినను, కర్మ ధారయముకంటె మత్వర్థీయము చేయుట పెక్కండ్రు పాణినీయుల కిష్టముకాదు. పూర్వసంస్కృత మహాకవుల కృతులలో నెక్కడైన నట్టి ప్రయోగము దొరకునో లేదో యున్నంత క్వాచిత్కము. అందుచేఁ గర్మధారయముమీఁద మత్వర్థీయము కేవల మపాణినీయము గాకు న్నను, పాణినివిహితము కాదనియు, సర్వసమ్మతము గాదనియుఁ జెప్పవచ్చును. మన నన్నయార్యుఁడు—

క. సంతతగృహ మేధి ఫలం ।
బంతయుఁ బడయంగనోపు ననుగుణ
భార్యా, వంతుం ।
డగు వాఁడు........... ఆది. ౪-౮౮.

క. సుతవంతు లయి విశుద్ధ ।
శ్రుతనయవంతులయి పాండుసుతులు
......... ఆది. ౮-౨౨౯.

క. సమశీల శ్రుతయుతులకు, ।
సమ ధనవంతులకు ........... ఆది. ౫-౨౦౫.

అనుచుఁ బ్రయోగించెను. ఇవి తరువాతి వారికిఁ బ్రమాణము లైనవి. ఇఁక నొకటి రెండు ప్రయోగ విశేషములు—

"తరుణియ లొప్పనాడిరి ముదంబునఁ దమ్మ జనాళి మెచ్చఁగన్."
ఆది. ౮-౧౭౫.

తరుణియలు = స్త్రీలు. తత్సమమైన తరుణి కిట్టి బహువచన రూపము కలుగదు. ఈతరుణియ శబ్దము పెక్కు వ్రాఁతప్రతులలో నున్నట్లు ముద్రణములు చెప్పుచున్నవి. నేను జూచిన రెండు వ్రాఁత ప్రతులలో నీరూపమిట్లే యున్నది. కావున, "తరుణులు నొప్పనాడి"

రనియో, మఱియొక విధముగానో దీని నెవ్వరును దిద్దనందుకు సంతో
షింపవలెను.

సఖికి, సకియ తద్భవము. దీనిని బూర్వకవు లందఱును వాడిరి. తరుణికి, తరుణియ తద్భవమనందగును. దీనిని తద్భవమన్న లాక్షణికులు లేరుగాని, అట్లనుట కక్షతాది విరోధములులేవు. ఇతరులు దీనిని వాడినట్లు కనంబడకున్నను, ఇది ప్రయోగార్హము కాకపోదు కావున "తరుణియ" అపూర్వమైన తద్భవ ప్రయోగ విశేష మనదగును. లేదా తత్సమమున కియ చేర్చిన నిరంకుశ ప్రయోగ మనందగును.

విశేషణములను విశేష్యములుగా వాడుటకు దారితీసినవాఁడు నన్నయార్యుఁడు. అందుకు గారణ మాకాలమున వాడుకలోఁ గొన్ని శబ్దములట్లు మాఱుటయే. ఇందుకు ప్రయోగ మొకటి.

"కమలాక్షి నీవు, దిరముగా నిష్టంబు దీర్చితే నిందుధృతిఁ బతి యిష్టంబు దీర్పనకాన" ఆది ౫-౧౮౫.

"అస్త్రవిద్యలు గఱచి నాకైన యిష్ట, మొగినఁ దీర్పంగ నిందెవ్వఁ డోపు ననిన" ఆది ౫-౨౨౮.

ఇష్టశబ్ద మిట్లు నన్నయ భారతములో విశేష్యముగాఁ బెక్కుచోట్లఁ గనవచ్చును. ఇట్టి స్థలములందు, ఇష్టమైనట్టి యని విశేషణపరముగా నర్థముచెప్పి విశేష్య మధ్యాహార్యమనుట సముచితము గానేరదు. ఇంక నొక రిద్దఱు నన్నర్థము తెలియనడిగిన యొక ప్రయోగము.

'కాంచనపీట' ఇదికాంచన కందుకమను నర్థమున నన్నయార్యుఁడు ప్రయోగించెను.

"ధృతరాష్ట్ర పాండునందను లందఱుఁ గందుక క్రీడాపరులై వేడుకతో నాడుచున్నంత నక్కాంచన కందుకం బొక్కనూఁతంబడి..

ఆది. ౫-౨౦౬

ద్రోణుఁడు—"ఇట్టి మీకు దుష్కరముగ నూతిలోఁ బడిన కాంచన పీటఁ గొనంగ నేరకొండొరుల మొగంబు చూచి నగుచుండఁగఁ జన్నె

యుపాయ హీనతన్" (మూలమ్) క్రీడన్త్యపీటయా, తత్ర వీరాః పర్యచర న్మ్రదా, పపాతకూపేసా వీటా తేషాం వైక్రీడతాంసతామ్, భరత స్యాన్వయే.

పూర్వకవుల ప్రయోగములే శరణముగా నేను రచియించిన ఆంధ్ర భాషాను శాసనములోని ప్రయోగవిశేష ప్రకరణములో న్యాచిత్కములగుటచే చేర్చని నన్న యార్యుని సాహసిక ప్రయోగము లైదా రింతకు మున్ను చూపియున్నాను. ఇం దట్టివే తిక్కనాదులవి కొన్ని చూపి, భాషాసాంప్రదాయ సిద్ధములైన మఱికొన్ని విచిత్రప్రయోగములను కూడ వక్కాణింతును.

౧. తిక్కనార్యుఁ డుత్తమపురుషక్రియా విభక్తిలోని ద్రుతమును లోపింపఁజేసి "సైరించితిని + ఈవు = సైరించితీవు ; పల్కితిని + ఇటు = పల్కితిటు" అని సంధి చేసి ప్రయోగించెను.

గీ. "అనినఁ గటకటఁబడి, యిట్టు లాడు టెల్ల
నతని విజయంబు సందియం బనుట గాదె?
ఇంతవట్టును సైరించి తీవు గాన
నింక నీమాట లుడుగుము కంకభట్ట!"

(విరా. ౫-౨౫౦)

ఉ. "గాండివి నొవ్వఁ బల్కితిటు
'కర్ణునిఁ జంపక వచ్చి తేని త
మ్ముండవు గావు నాకు' నని..."

(శాం. ౧-౧౮)

ఈమహాకవినాఁటి కాంధ్రమునకు వ్యాకరణమంటూ ఒక గ్రంథము లేదు గాని, యితని యుత్తమకవితకు మార్గదర్శకమును, కావ్యభాషకు లక్ష్యలక్షణరూపము నైన నన్నయపర్యత్రయి లేదా? అం దట్టి ప్రయోగ మున్నదా? లేదు. ఇతని మహాగ్రంథములో మాత్ర మీ

రెండును తప్ప మఱియొక ప్రయోగ మిట్టిది కలదా ? లేదు. అయితే, ఎందు కితఁ డిట్లు ప్రయోగించెను ? నా కిట్లు తోఁచుచున్నది. ఉత్తర మండలములవారు "ఇచ్చా – చూచా – వస్తా" అని వాడునట్లు దక్షిణ పశ్చిమమండలములవారు "ఇస్తి - చూస్తి -" అని పలుకుట ప్రసిద్ధము. "ఇస్తంటివిగాదయ్యా !" అని యామండలముల విన వచ్చును. వాడుకలోని యా ద్రుతలోపమునకు జ్ఞాపకముగా మన తిక్కన యీరెండు రూపములు ప్రయోగించి యుండును. అంతే కాకున్న, కావ్యమునం దిట్టివి రుచింప వని తెలియనివాఁడా భాషామర్మజ్ఞుఁ డగు తిక్కనాఖ్యుఁడు ? అందుచే నీప్రయోగమము నిరంకుశమో, సాహసికమో యనఁదగును కాని, ప్రామాదిక మనిమాత్ర మనరాదు.

ఎఱ్ఱనార్యుఁ డిది చూచియే కాఁబోలును, 'అగుదును' లోని ద్రుతమును పోఁగొట్టి యిట్లు సంధిచేసి ప్రయోగించియున్నాఁడు :

క. "విను నాభక్తుల కాపద
లును శోకంబులును లేవు లోకంబున నెం
దును నేను బ్రసన్నుఁడ నగు
దనుపమసర్వార్థదాయి యంచితచరితా !"

(హరి. ఉ. ౮–౨౪౪)

౨. 'తేజః, యశః' వంటి సకారాంత శబ్దములకు ఏయర్థమందును 'ఇష్ఠన్' ప్రత్యయము పాణినివిహితము కాదు. తేజిష్ఠరూపము సంస్కృతకావ్యములందును నాకు కనఁబడలేదు. తిక్కన శాంతి. ౩–౧౪౧ లో నిట్లు ప్రయోగించి యున్నాఁడు. ఇది ప్రామాదికమే. ( తేజస్వీ – అను విన్ప్రత్యయాంత మే సుప్రసిద్ధము.)

గీ. "పడసి యింద్రుండు శీలసంపన్నుఁ డగుచుఁ
జనియెఁ దదనంతరంబ యద్దనుజవరుని

తనువునం దుండి తేజిష్ఠతనువిలాసుఁ
డైన పురుషుండు వెడలిన నతఁడు చూచి."

౩. కర్మధారయముమీఁద మత్వర్థీయము చేరుట పాణినిమతము గాకున్నా, కేవల మపాణినీయము కాదని, వెనుక నన్నయ ప్రయోగ వివరణసందర్భమున విశదీకరించియున్నాను. అతనిమాడ్కి తిక్కనయు ప్రయోగించెను. అందొకటి — "సంతతోత్సాహ వంతుఁడై శత్రు కోటి" (శాం. ౨-౧౯౪.)

౪. కేలుశబ్దము నిత్యైకవచన మని ప్రసిద్ధిగదా! దీని బహు వచనరూప మెందును కనఁబడదు, వినఁబడదు. కాని, ఎఱ్ఱనార్యుఁడు కాళ్లతో సరితూఁగుటకు కేళ్లుప్రయోగించినాఁడు.

"మూఁడుకాళ్లును రెండుమూఁడు కేళ్లు."

(హరి. ఉ. ౮-౧౦౭)

౫. దోయిశబ్దము నిత్యైకవచన మన్నవారూ లేరు; దీని బహువచనరూపమును వాడినవారూ లేరు. కాని, లాక్షణికుఁడైన విన్నకోట పెద్దన్న కావ్యాలంకార చూడామణిలో (౫-౯౮ 'దోలు' అని బహువచనరూప ముపయోగించెను. అప్రసిద్ధ మప్రయుక్త మగుటచే కాఁబోలు నిది శ్రుతికటువుగానే యున్నది.

"వేలుపుటిల్లు విల్లు... రెండుచే, దోలవెలుంగు"

ఇఁక నొక్క ప్రయోగవిశేషమును గూర్చి ముచ్చటింతము.

౬. ఎఱ్ఱనార్యుఁడు అరణ్యపర్వసప్తమాశ్వాసములో (౪౧-౨ ప.) 'వెన్నడికొని' అని ప్రయోగించియున్నాఁడు. ఇది ధర్మజుని మాట—

"పుడమియు సర్వసంపదలుఁ
బొల్పర వైరులపాలు చేసి యీ
యడవికి వచ్చి భీకరమ్ము
గావళిపొత్తున నున్న వీరి వె

న్నడికొని యిట్లు చేసెనె య
నాథులఁ బోలె విధాత్రుఁ డింక నె
క్కుడఁ జనువాఁడ నేది గడ
గాఁదరియింతు దురంతదుఃఖముల్ ?"

ఈ కవీంద్రుఁడే హరివంశపూర్వభాగము మూఁడవ యాశ్వాసములో నిట్లు ప్రయోగించియున్నాఁడు :

ఉ. "...శౌరియు సహాగ్రజుఁడై
రథ మెక్కి యయ్యప
క్రాంతుని వెన్నడిం దగులఁగా—"

గీ. "విఱిగి పాఱినఁ బోనీక వెన్నడించు
హలధరునిఁ జూచి—"

ఈ మూఁడును 'వెన్నడు' ధాతువునుండి వచ్చిన రూపములు. 'వెన్నాడు' ధాతువు వాడుకలో 'వెన్నడు'గా మాఱినదనుట విదితము. వెంబడించ నెడి యర్థ మట్లే నిలచినది. వెన్నడుధాతువు క్త్వార్థకరూపము -'వెన్నడి' యని గోచరించుచుండ, పై మూఁడు రూపములను, మూడు ప్రయోగములను పరిశీలించిన శబ్దరత్నాకరము 'వెన్నడి' దేశ్య విశేష్య మనుటమాత్రము సరి కాదనవలసి వచ్చినది. ఇది లాక్షణికావ్యయము, లేదా 'వెంబడి' వంటి నిపాతావ్యయము.

'ఆడు' ధాతు విచ్చుట 'అడు'గా మాఱినది. సర్వనామ మైన "వాఁడు — వాఁడుగో; ఆఁడుగో - అఁడుగో; పిల్లవాఁడు, పిల్లఁడు" అని మాఱలేదా ? కుఱ్ఱడు, గుంటఁడు మొదలయిన విట్టివే. "భాషేయ మమితా దేశ్యా తత్ర చిత్రస్వభావయుక్" అన్నారు పెద్దలు. ఆ వైచిత్రిలో నిది యొక యంశము.

కాలము గడిచినకొలఁదిని, సంఘము విస్తరించినకొలఁదిని, వృత్తులు పెరిగిన కొలఁదిని, నూతనభావము లావిర్భవించుచున్న కొలఁదిని దేశభాషకూడ పలుతెఱఁగుల పెరుగుచుచే యుండును. మార్పు చెందుచునే యుండును. కాని, ఎప్పటికప్పుడు శిష్ట వ్యవహారమున స్థిరపడిన శబ్దజాలమునే కవులు గ్రహించుట భాషాసాంప్రదాయ మన్న మాట మాత్రము మఱవరాదు. పూర్వమహాకవులు స్వతంత్రించి సాహసించి ప్రయోగించినవాటిలో కూడా కొన్ని సుశబ్దములుగా గణన కెక్కి తరువాతివారికి గ్రాహ్యములైన వనెడి పరమార్థమును విస్మరింపరాదు.

# వృత్రుఁ డెవఁడు?

ఈ విషయమును గూర్చి ఋగ్వేద మేమిచెప్పుచున్నదో చూతము. ఋగ్వేద ప్రథమ మండల ప్రథమాష్టక ద్వితీయాధ్యాయ సప్తమానువాకములోని రెండవ సూక్తమంతయు కొంచె మించుమించుగా ఇంద్రవృత్ర వ్యాపారమునే వర్ణించుచున్నది. అందు కొన్ని ఋక్కుల భావ మిట్లున్నది.

౧. ఇంద్రుఁడు అహిని (అనఁగా మేఘుని బద్దలు చేసెను. వానిలోనుండి వచ్చిన జలమును భూమిమీఁద పడునట్లు కొట్టెను. కొండలమీఁద పడి ప్రవహించు స్వభావముగల యా నీటిని పర్వత ప్రదేశములు భేదించుకొని నదులుగా ప్రవహించునట్లు చేసెను.

౨. ఇంద్రుఁడు త్వష్ట యిచ్చిన వజ్రముతో పర్వతము నాశ్రయించియున్న యహిని (మేఘుని భేదించెను.

౩. గాఢాంధకారము గలిగించిన వృత్రుని (మేఘుని) ఇంద్రుఁడు వజ్రముతో కొట్టఁగానే, వాఁడు మొదలు నఱికిన చెట్టువలె నేలపై కూలెను.

౪. వర్షము లేకపోవుటచే భిన్నములైన జనముల మనస్సులు సంతోషించునట్లుగా, జలములు ప్రవాహవేగమున గట్లు తెగిన సింధునదము నతిక్రమించి పోవునట్లుగా భూమిమీఁదపడిన వృత్రుని (మేఘుని) దాఁటిపోవుచున్నవి. ఏవృత్రుఁడు జీవనదశయందు ఏ జలములను నిరోధించెనో, ఆ మేఘరూపుఁడైన వృత్రుఁడు ఆ జలముల కాళ్ళక్రిందఁ బడినవాఁ డయ్యెను.

౫. ఉదకముల ప్రవాహద్వారమును మూసివేసిన వృత్రునిఁ జంపి యింద్రుఁ డాద్వారము తెఱచెను.

ఇట్లు, అహి వృత్ర శబ్దములు రెండును మేఘపరములుగా నుపయుక్తములైనవి. అహిని కొట్టినప్పుడు జలములు పర్వతముల

మీఁదను, భూమిమీఁదను పడినవని వర్ణించినట్లే, వృత్రునిఁ గొట్టి నపు డావృత్రుఁడు నేలపై కూలెననియు, వాని పతనముచే నదీకూల పాషాణములు భిన్నములైనవనియు వర్ణించుట చూడఁగా, జల ప్రవాహావేగము స్ఫురించుచున్నది. మఱియు వృత్రుని మాయచేతను, మేఘావరణముచేతను అంధకారము కలుగుచున్నదని సమానముగా వర్ణింపఁబడినది. ఇదియునుగాక, ఆఙ్పూర్వకమైన హానధాతువునుండి పుట్టిన అహిశబ్దమునకు అంతట వ్యాపించునది యనే యర్థమున్నట్లే, వృతుధాతువునుండి పుట్టిన వృత్రశబ్దమునకును ఆవరించునది యనే యర్థమున్నది. కావున, అర్థసామ్యము, వ్యాపారసామ్యము, ఫల సామ్యము నొందుచున్న అహివృత్ర శబ్దములు రెండును ఏకార్థక ములై, మేఘ పరము లగుచున్నవని తెలియుచున్నది. ఈ యభిప్రా యము మనస్సున నుంచుకొనియే సాయణాచార్యులవారు — అహిః = వృత్రః, మేఘః — అని వ్యాఖ్యానము వ్రాసినట్లు కనఁబడుచున్నది. వారు వృత్రశబ్దమునకు మేఘమనే యర్థము స్పష్టముగా వ్రాయలేదు గాని, ప్రకరణార్థమునుబట్టి అది యవగత మగుచున్నది. ఇఁకనో, వృత్రుఁ డనఁగా మేఘుఁడేయని యిం దర్థమనియు, మేఘత్వమును ప్రచ్ఛన్నము గావించి వృత్రున కసురత్వము గల్పించుట చమత్కార కారిణియైన ప్రాచీన మహర్షుల శైలియనియు గ్రహింపదగియున్నది. ఈవిషయమున యాస్కుఁ డుపదేశించిన తత్త్వమిది—

"తత్కో వృత్రః ? మేఘ ఇతి నైరుక్తాః ; త్వాష్ట్రోఽసుర ఇత్యైతి హాసికాః. అపాంచ జ్యోతిష్చ మిశ్రీభావకర్మణః వర్ష కర్మ జాయతే. తత్ర ఉపమార్థేన యుద్ధవర్ణా భవంతి.

"అయితే, వృత్రుఁ డెవఁడు ? మేఘుఁడని నైరుక్తు లందురు. త్వష్ట కొడుకైన యసురుఁడని యైతిహాసికులందురు, నీళ్ళను, జ్యోతిస్సును కలియుటచే వర్షము పుట్టుచున్నది. వాటికి రూపకల్పనచేయుటచే యుద్ధవర్ణనలు సంభవించినవి."

అనఁగా జలమయుఁడైన మేఘునకు వృత్రాసుర రూపమును, జ్యోతిస్సునకు ఇంద్రరూపమును కల్పించుటచే వారిద్దఱికి యుద్ధము జరిగినట్లు వర్ణింపబడుచున్నది. దీనినిబట్టి ఋజ్వర్థవ్యాఖ్యలో — "మూరు తావేష్టితమైన యింద్రాఖ్యమైన వైద్యుత జ్యోతిస్సుచే వృత్రాఖ్యుఁడైన మేఘుని యుదరగతములైన జలములు తాడ్యమానములై వర్ష భావమును పొందుచున్నవి. ఇక్కడ నిజమైనయుద్ధ మనునది లేదు" అని భగవద్దుర్గాచార్యులు వ్రాసిరి. మఱియు యాస్కుఁడు వృత్రశబ్దము నిట్లు నిర్వచించెను: వృ, వృధ్, వృత్, ధాతువులనుండి వృత్రశబ్దము నిష్పన్నమగుచున్నది. దానికి క్రమముగా ఆకాశము నావరించునది, అందు పెరుగునది, జలమును ప్రవర్తింపఁ జేయునది అని యర్థము. (వృత్రః = మేఘః.) కావున మేఘుఁడే వృత్రుఁడనియు, దానికి రూపకల్పన చేసి ఐతిహాసికులు వృత్రాసురుఁడని పురాణముల వర్ణించిరనియు, జ్యోతిరూపుఁడైన యింద్రుని సంఘర్షణచే వాన కలుగుచున్నదనియు తెలియుచున్నది. అందుచే మేఘుఁడే వృత్రుఁడు.

# ఇంద్రశబ్ద నిర్వచనము

ఇంద్రశబ్దము అనేక విశేషార్థములు కలది. ఋగ్వేదమందలి యీ శబ్దమునకు యాస్కుఁడు మొదలగు పూజ్యులు నిరుక్తాదులందు చూపిన యనేక నిర్వచనములను సాయణాచార్యులవారు ఋగ్వేదభాష్యమునఁ దెలిపి యున్నారు. భారతీపాఠకు లానిర్వచనముల విశేష మరయుదురు గాక.

(1) ఇరాం=అన్నమును, దదాతి=వృష్టినిష్పాదనముచే నిచ్చు వాఁడు ఇంద్రుఁడు. (2) ఇరాం=తృప్తికారణమైన సస్యమును, దదాతి=జలప్రదానముచేఁ బోషించువాఁ డింద్రుఁడు. (3) ఇరాం= అన్నము నిమిత్తము, విదారయతి=కర్షకముఖమున భూమిని దున్ను వాఁడు. (4) ఇరాం=అన్నమును, ధారయతి = నాశరహితముగా నిలుపువాఁడు. (5) ఇందుం=సోమవల్లీరసమునుగూర్చి, ద్రవతి=యజ్ఞ భూమికిఁ బరుగెత్తువాఁడు. (6) ఇందౌ=సోమరసమందు, రమతే = క్రీడించువాఁడు. (7) ఇంధ ఇతీంద్రః, అనఁగా, ప్రాణిదేహములందు చైతన్యరూపమునఁ జొచ్చి వానిని ప్రకాశింపఁ జేయువాఁడు.

పైవానిలోఁ గడపటి నిర్వచనమును వాజసనేయులు గూడఁ జెప్పుచు, సర్వేంద్రియాధిష్ఠాన పురుషరూపుఁడై జంతుదేహములను ప్రకాశింపఁ జేయువాఁడగుటచే నితఁడు, ఇంధుఁడయ్యె ననియు, ఇతనినే ఇంద్రుఁ డనుచున్నారనియు వివరించిరి.

మఱికొన్ని బ్రాహ్మణాంతరములలో నిట్లున్నది : పరమాత్మ రూపుఁడైన యీ దేవుని బ్రాణములతోను, వాగాదీంద్రియములతోను, గూడిన వానినిగా నుపాసకులు ధ్యానించుచు బ్రకాశింపఁ జేయు చున్నారు గావున నితని కింద్రనామము సంపన్నమైనది—ఈపక్షమున (8) ఇధ్యతే=దీప్యతే, అని కర్మార్థక వ్యుత్పత్తి చెప్పనలెను.

ఆగ్రయణనామక మునీంద్రుఁడు (9) ఇదం కరణా దింద్రః—అని చెప్పెను. అనఁగా, పరమాత్మరూపుఁ డయిన యితఁడీ జగత్తును

జేయుటచే నింద్రుఁడయ్యె ననుట. ఔపమన్యవముని (10) ఇదందర్శనా దింద్రః—అని నిర్వచించెను. అనఁగా వివేకముచే, ఈ యపరోక్షమైన పరబ్రహ్మమును జూచుచున్న వాఁ డనుట. దీనినిగూర్చి, ఆరణ్యకమున నిట్లున్నది. (11) ఇదమదర్శమ్. సమస్తజగద్రూపమున వ్యాపించిన యీ పరమాత్మను నేను జూచితిని. అందుచే నితఁ డిదంద్రుఁడను పేరుగలవాఁడయ్యెను. ఇతనినే ఇంద్రుఁ డనుచున్నారు—

మఱికొందఱు (12) ఇది పరమైశ్వర్యే — ఇది ధాతువునుబట్టి, స్వమాయచే జగద్రూపమైన పరమైశ్వర్యముగలవాఁ డింద్రుఁ డనిరి. ఇఁక గొందఱు, ఈశ్వరవాచకమైన (13) 'ఇన' శబ్దములోని అకారము లోపింపఁజేసి, దానికి దృధాతువును—ద్రుధాతువునుగూడఁ జేర్చి, ఇంద్రశబ్దనిష్పత్తి గావించిరి. అపుడు శత్రువులను భయపెట్టువాఁ డనియు, శత్రువులను బరుగెత్తించువాఁ డనియుఁ గ్రమముగా నర్థములగును. ఇట్లే ఇంద్రశబ్దమున కింకను అనేక నిర్వచనములు కనఁబడుచున్నవి.

పై వానిలో 12-13—సంఖ్యలుగల వ్యుత్పత్తులు మాత్రము లౌకికములు. తక్కినవన్నియు వైదికములు. అందును, మొదటి నాల్గును, ఇంద్రుఁ డాహారపదార్థముల కాధారభూతుఁడైన వర్షాధిష్ఠాన దేవతయనియు, కృష్యధిష్ఠాన దేవతయనియు, దెలుపుచున్నవి. 5 - 6 - వ్యుత్పత్తులతనిని యాగమునకుఁ బ్రధాన దేవతఁగా నిరూపించుచున్నవి. 7—8—9—వ్యుత్పత్తులు సకలజంతు సంతతియందును జైతన్యరూపమున బ్రవేశించిన పరమాత్మయే యింద్రుఁడను భావమును సూచించుచున్నవి. 10-11-నిర్వచనములు, సకలజగత్కారణమైన పరబ్రహ్మము వేఱనియుఁ ఆపరబ్రహ్మమును దొలుతఁ జూచినవాఁ డింద్రుఁడనియు జెప్పుచున్నవి.

కాలక్రమమున మాఱుచువచ్చిన పై వ్యుత్పత్తుల యర్థములను బరిశీలింపఁగా, సత్యాన్వేషణ తత్పరులును, ఆధ్యాత్మిక జ్ఞానపారంగతులు నగు నార్యుల విజ్ఞానము క్రమక్రమముగా నెట్లు వెల్లివిరిసినదో దెలియఁగలదు.

# పండితరాయల సూక్తులు

( నా తెనిగించినవి కొన్ని )

సిరిగలవారి నాసపడి
        చేరవు వారిముఖంబు చూడ వా
గరువపుమాటలున్ వినవు
        కల్లప్రియంబులు వల్కవు వల్లనం
దరుణము చూచి మేయుదువు
        త్రాగుదు హాయిగ నిద్రవోదు వో
హరిణమ ! నాకు జెప్పు మహా
        హా ! యెచ టేమితపంబు చేసితో ?

పెద్దవారిశిక్షఁ బెరిగిన మనుజుఁడు
గొప్పతనము గాంచి మెప్పువడయు,
సానపట్టుకున్న జాతిరత్నంబైన
భూమినాథు మౌళిఁ బొందునొక్కొ !

కుండ తగుపాటినీటినిఁ గ్రోలుచుండ
దానికొడుకు సముద్రమంతయును జుఱ్ఱె
ధన్యమగు జన్మమెత్తిన తనయుఁ డెందుఁ
దండ్రి మించునుగాదె యుత్తమచరిత్ర.

మానియున నొక్కచాతకమే నిజంబు
వసుధఁ గలకాల మయ్యది బ్రతుకుఁగాక
దాహమైనంత విడుచును దేహమైన
నోరు తెఱచి యాచించు బలారినైన.

మంచివారి హితము మాటిమాటికి భంగ
పఱుప నేర్పు గాఁడు పాపజాతి,
నిరపరాధులైన నరుః ప్రాణంబులు
పాప నేర్పు కలది పాఁపజాతి.

మంచివారను దూది రక్షించునట్టి
యగ్ని హోత్రుఁడు పరుల దుఃఖాగ్ని శిఖల
నల్లఁ జల్లార్చునట్టి మహానిలుండు
నైన దుష్టుని వర్ణించు నతఁడు కలఁడె?

దుర్జనుం డొనరించును దుష్కృతంబు
తత్ఫలము మంచివాని మూర్ధమునఁ బడును,
రావణుఁడు దొంగిలించె భూదేవితనయ
నంబుధికి బంధనంబు సంప్రాప్తమయ్యె.

కొంతవడి కష్టపడి నేర్చుకొన్న వారు
చిత్తరువునందు పూలు వ్రాసెదరుగాక
అవ్వి యేమైన ఘుమఘుమ లాడునొక్కొ?
భృంగముల కందు రసము లభించునొక్కొ?

ఎన్ని వేదాన్తములు పఠియించెనేని
దుర్జనుఁడు గాంచఁబోఁడు సాధుత్వగుణము,
అన్ని వేలేండ్లుగా నబ్ధియందు మునిఁగి
మిడుకు మైనాకుఁ డింతైన మెత్తబడెనె?

పరిమళము కలదటంచును
గరువము పడఁబోకు మీవు కస్తురి! కనుమీ
పరిమళశైత్యశుచిత్వా
కరమై సుకుమారమైన ఘనసారంబున్.

వాన కాలంబు నిత్యమా ? వఱద సతము ?
నీటిసంపద నీ కిల్లె నిలువఁబోదు
కాని, తటినీ ! నిజంబుగ గట్లమీఁది
చెట్లు కూల్చిన పాపంబు స్థిరమె సుమ్మి !

రేరాజుఁ జూడ నోఁచని
నీరేజము జన్మ మెట్లు నిష్ఫలమగునో,
సారసము సొంపుచూడని
కైరవవిభుజన్మ మట్లు కడు నిష్ఫలమా.

వెండికొండ పైఁడికొండలు కొండలా ?
ఆశ్రయించు చెట్టు లట్టియుండు,
పరుగు వేపఁగూడఁ జందనంబును జేయు
కొండ మలయ మొకటె కుధరరాజు.

మంచినేర్పరి వగుదువు చంచరీక !
నీకు సరివారు లేరు భూలోకమందు,
పండువెన్నెలఁ జెలఁగె దుత్పలినిగూడి
పద్మినింగూడి చెలఁగెదు పగటివేళ.

# హనుమత్సందేశము

పైఁడి లేడెందైనఁ గలదా? పాప
మట్టులు పండె నప్పుడు
తన్ను నంపితిఁ దగనిమాటని
తమ్ము నంపితి నాఁటిమాటలు

మఱచిపొమ్మని చెప్పుమా,
రఘునాయకునితో
తరలి రమ్మని చెప్పుమా!

భీతి విరహము నింద దుస్థితి
పిల్చి పిలిచి పిప్పిచేయఁగ
శోక మొక్కటె తోడు గాఁగ న
శోకవృక్షము క్రింద నుంటిని

వేగపడు మని చెప్పుమా,
కరుణాకరునితో
సాగి రమ్మని చెప్పుమా!

తిండికిని నిద్రకును దూరయి
దిక్కుమాలిన యీఘటంబునఁ
గదలఁ జూచిన ప్రాణముల నుం
గరము గని నిలఁబెట్టు నాదెస

తప్పు లేదని చెప్పుమా,
నా ప్రాణ విభుతో
తత్త్వమంతయుఁజెప్పుమా!

శివునివి ల్లవలీలగాఁగొని
చిటికలోపల విఱిచివేచిన
వీరు నాఱవప్రాణమై యడ
విం జరించిన వీరమానిని

శోకమూర్తిని చూడుమా,
ఆశౌర్యనిధితో
చూచినట్టులు చెప్పుమా!

లేడి కావలె నన్నయంతనె
లేచి వెడలెడు ప్రాణనాయకు
నాఁటి నవ్వుమొగంబు మనమున
నాటియున్నది జీవితాశకు

మూలమైయని చెప్పుమా,
ఆప్రేమనిధితో
ముందరేయిది చెప్పుమా!

కొంగు మెడ కురిపోసుకొని యొక
గుక్కఁడైతే విడుతునైనను
ప్రాణహానికి సాహసింపక
బ్రతికితిని పదినెల్లు నినుఁగను

నాసతోనని చెప్పుమా,
దుఃఖానలంబున
కాఁగలేనని చెప్పుమా!

# జీవ ప్రబోధము

బ్రహ్మమీవు నీవ బ్రహ్మంబు సత్య మీ
తత్త్వ మెఱుఁగలేక దారితప్పి
తిరిగితిరిగి డస్సి తెలివి తప్పితివయ్య!
మేలుకొనుము జీవ! మేలుకొనుము.

తల్లిదండ్రు లన్నదమ్ములు బిడ్డలు
నిల్లు భార్య ధనము నెల్లకల్ల
మమత మధువు కొలుపు మైకాన జెడదేల?
మేలుకొనుము జీవ! మేలుకొనుము.

తెలియకుండఁ బుట్టి తెలిసి కర్మ మొనర్చి
దానిఫలము కుడువఁ దనువు దాల్చి
జననమరణదుఃఖజలధి మున్గెద వేల?
మేలుకొనుము జీవ! మేలుకొనుము.

పుట్టినప్పు డొంటిఁ బుట్టినయట్టులే
చచ్చునప్పు డొంటిఁ జత్తువుగద!
నీకు నెవ్వరైరి? నీ వేరికైతివి?
మేలుకొనుము జీవ! మేలుకొనుము.

ఒకరికొఱకు నొక్క రుర్విపైఁ బుట్టరు
చావ రొక్క రొకరి చావు కొఱకు
పతికళత్రపుత్రపరమార్థ మిది సుమ్మ
మేలుకొనుము జీవ! మేలుకొనుము.

ధనము కలిగినన్ని దినములు కూర్మితోఁ
జూచినట్టి దారసుతులు నిన్ను

ధనములేనినాఁడు దరిఁజేరనీయరు
మేలుకొనుము జీవ! మేలుకొనుము.

కండపుష్టి గలిగి కాలాడి గడియించి
తెచ్చునాఁడు నిన్ను మెచ్చునాలి
గడన యుడిగినంతఁ గనరును దయమాలి
మేలుకొనుము జీవ! మేలుకొనుము.

మాయ కాంద్రు క్రోధ మాత్సర్య మదలోభ
కామమోహు లనెడి కన్నగాంద్రు
కొంపదూటి రిఁక గుట్టుపట్టెద వేల?
మేలుకొనుము జీవ! మేలుకొనుము.

ప్రతిదినంబు నీదు ప్రజ్ఞాధనమును
దోఁచఁజూచు నింటి దొంగవాఁడు
నిదురపోతివేని యది నీకు దక్కదు
మేలుకొనుము జీవ! మేలుకొనుము.

ఐదుపాళ్ళకొంప నద్దెకుంటివి మేను
నీదుగాదు మేను నీవుగావు,
దహనయోగ్యమైన తనువేడ నీ వేడ?
మేలుకొనుము జీవ! మేలుకొనుము.

పూర్వపుణ్యపాపమూలమ మీ జన్మంబు
సుఖము దుఃఖమోలి జూచుననెడి
శాస్త్ర ముండెఁగాని సౌఖ్యంబు సున్నరా!
మేలుకొనుము జీవ! మేలుకొనుము.

కాంచనంబునందు కాంతలయందును
భ్రాంతిగొల్పి నిన్నుఁ బాడుచేసి
కన్నుగాననీఁడు కాముండు చెలరేఁగి
మేలుకొనుము జీవ ! మేలుకొనుము.

కాలుసేతులెల్ల గజగజలాడంగఁ
గంది మొగము కందగడ్డగాఁగఁ
బెదవు లదర నిన్నుఁ బీడించుఁ గ్రోధుండు
మేలుకొనుము జీవ ! మేలుకొనుము.

పిల్లికైన నింత బిచ్చంబు నిడనీక
నిన్నుఁ గుడువనీక నీతివిడిచి
పరులధనము లాగఁ బురికొల్పు లోభుండు
మేలుకొనుము జీవ ! మేలుకొనుము.

ఎవఁడు లోకమెల్ల నేడ్తెఱ దిగఁద్రొక్కు
నట్టిమోహుపొత్తు నాశ్రయించి
యొడలు తెలియకుండఁ బడియుంటివే యిట్లు ?
మేలుకొనుము జీవ ! మేలుకొనుము.

చెప్పరానియట్టి చేయఁగూడనియట్టి
పనులుచేయ నిన్నుఁ బాలుపఱచి
యొళ్ళుమఱవఁజేయుచున్నాఁడు మదపాపి
మేలుకొనుము జీవ ! మేలుకొనుము.

మంచిచెడ్డలనెడి మాట యక్కఱలేని
మచ్చరంబు నీదు మనసు చొచ్చి
తెలివియెల్ల నల్ల దిగఁద్రొక్కుచుండెరా !
మేలుకొనుము జీవ ! మేలుకొనుము.

పాడుపొట్టకొఱకుఁ బడరాని పాట్లెల్లఁ
బడుచుఁ గుడువరాని కుడుపుగుడిచి,
ఆత్మవంచకుండ వయ్యెద వేలరా !
మేలుకొనుము. జీవ ! మేలుకొనుము.

నిన్ను నీవు తెలిసికొన్నయంత నె నీకుఁ
గానఁబడున దెల్ల కల్లయగును
కలనుగన్న దంత కల్లయౌనట్టులు
మేలుకొనుము జీవ ! మేలుకొనుము.

బోధకుఁడవు నీవ బోధ్యుఁడవును నీవ
బోధ నీవ, యిరుగుపొరుగు లేదు
మోహనిద్రవిడిచి సోఽ హమ్మటంచును
మేలుకొనుము జీవ ! మేలుకొనుము.

# వేసవికాలపు గౌతమి

ఉ. దప్పికలేనివానతఱి దగ్గరఁజేరి జలంబు లానఁడం
చొప్పుగ నోరువెట్టి మము నూర్మికరంబులు చాఁచి కోరి యీ
దప్పిక హెచ్చు వేసవిని దవ్వులకుం జని మోము ద్రిప్పి బల్
ద్రిప్పలఁ బెట్టి ద్రిప్పెదు బళీ యిది యెక్కడి యావి గౌతమీ!

ఉ. నీయెడఁ దీరవాసులు వినీతులు గారని కోపగించితో
వేయి వెలుంగువేల్పు నిను వేఁపఁగ నాతని కప్పులిచ్చితో
తోయధిఁ జేరు నిన్ను నడుమ్రోవ నలంచుట నీరసించితో
యేయదియైన నేమిపుడు హీనతఁ జెందితివమ్మ గౌతమీ!

ఉ. వేలకువేలు లక్షలక్ష వేపదిలక్షలు జీవరాసు లే
నీళల నిండునందనక వేసవి వేఁడికిఁ దాళలేక నీ
నీళులు ద్రాగి జీవనము నిల్పుకొనం జనుదెంచు నుస్సురం
చేలొకొ యింక దూరముగ నేగెదు జీవనదాయి గౌతమీ!

ఉ. చేలకుఁ జెల్లకున్ జలము చేఁదుచుఁ బోయఁగలేక కర్షకుల్
కాలువ లెండిపోయెనని గ్రామనివాసులు కుందుచుండి రి
క్కాలము దుస్సహంబగుటఁ గంఠము లెండఁగ బాటసారులు!
దూలుచు సోలుచుండి రిఁక దూరము పోయెదవమ్మ గౌతమీం

చ. హితమును జెప్పి రాదిమమునీంద్రులు వేఱొకచోట శర్కరా
యుతమగు పాయసంబయిన నొల్లక నీదరిఁ జేరి నీజలా
మృతమును గ్రోలి యుండుటయె మేలని, యొడ్డులనుండు
మమ్ము నీ
గతి నెడఁబాసిపోవుటకుఁ గారణమేమగు నమ్మ గౌతమీ!

గీ. కలియుగంబున జనులు దుష్కర్ములగుచు,
దయయు సత్యంబు శౌచంబు దప్పియుండు
రప్పుడు నదు లింకునని చెప్పి రాతపసులె,
గౌతమీ! యదియేమయిన హేతువమ్మ?

---